# శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహా పురాణము

## గణపతి[illegible]ము






"కాయేన మనసా వాచా పరంభక్త్యా దివానిశమ్ ।
భజ సత్యం పరంబ్రహ్మ, రాధేశం త్రిగుణాత్పరమ్ ॥"

ర చ యి త :

"పౌరాణిక రత్న"

"మహాపురాణాంధ్రీకరణచణ"

**శ్రీ వట్టుపల్లి శివసుబ్బరాయ గుప్త**

మూల్యము **రూ : 120-00**

ద్వితీయ ముద్రణము
యువ ఆషాఢ పూర్ణమి
గురుపూర్ణమి 12-6-95

# SREE MADANDHRA BRAHMAVYVARTHA MAHAPURANAMU

## GANAPATHI KHANDAMU

By
'Pouranika Ratna'
'Mahapuranandhrikaranachana'
**Sri Mattupalli Siva Subbaraya Gupta**


పుస్తకములు లభించు ప్రదేశములు :

1. శివా ఇంజనీరింగ్ కంపెనీ
స్టేషన్‌రోడ్, గుంటూరు-522 001
ఫోన్ : 220827

2. శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త,
మట్టుపల్లివారివీధి కొత్తపేట,
గుంటూరు-522 001.
ఫోన్ : 223327



శ్రీరస్తు　　　　ఓం నమః　　　　శుభమస్తు

# గణపతిఖండ దర్శనము

శ్లో॥ పరంధామ పరంబ్రహ్మ పరేశం పరమీశ్వరమ్ ।
విఘ్ననిఘ్నకరం శాన్తం పుష్టం కాన్తమనన్తకమ్ ॥
సురాసురేన్ద్రైః సిద్ధేన్ద్రైః స్తుతం స్తౌమి పరాత్పరమ్ ।
సురపద్మదినేశం చ గణేశం మఙ్గలాయనమ్ ॥
(శ్రీమద్బ్రహ్మవైవర్త మహాపురాణము – శ్రీకృష్ణజన్మఖణ్డము 121-103-4)

"పరంధాముడు, పరబ్రహ్మము, పరేశుడు, పరమేశ్వరుడు, విఘ్నవినాశకుడు, శాంతుడు, పుష్టస్వరూపుడు, మనోహరుడు, అనంతుడు, సురాసుర సిద్ధేంద్రాదులచే స్తుతింపబడువాడు, పరాత్పరుడు, దేవరూపకమలములకు సూర్యుడైనవాడు, మంగళముల కాశ్రయస్థానమైనవాడు నగు శ్రీగణేశ్వరుని నేను స్తుతించుచున్నాను".

సర్వజగముల కాదికారణము, సంపూర్ణమునైనపరతత్వమే శ్రీగణపతి తత్వము. "గణానాం పతిః గణపతిః" గణ - శబ్దము సామూహికవాచకము (గణశబ్దః సమూహస్య వాచకః పరికీర్తితః) సమూహములను పాలించు పరమాత్మనే గణపతి యందురు లేదా "మహత్తత్వగణానాం పతిః గణపతిః" లేదా "నిర్గుణసగుణబ్రహ్మగణానాం పతిః గణపతిః" సర్వగుణములకు సత్తాస్ఫూర్తులను ప్రసాదించు పరమాత్మనే గణపతి యందురు.

"ఓం నమస్తే గణపతయే త్వమేవ కేవలం కర్తాసి, త్వమేవ కేవలం హర్తాసి, త్వమేవ సర్వం ఖల్విదం బ్రహ్మాసి" మొదలగు గణపత్యథర్వశీర్ష శ్రుతివాక్యములద్వారమున గణపతిశబ్దముతో బ్రహ్మమే నిర్దేశింపబడుచున్నది.

అదియే చిద్రూపము, నిర్వికారము, అద్వితీయము, ఆ సద్రూప గణేశ్వరుడే ఆనందరూపము.

"ఆనందో భవతి, స నిత్యో భవతి, స శుద్ధో భవతి, స ముక్తో భవతి, స్వప్రకాశో భవతి, సఈశ్వరో భవతి, స ముఖ్యో భవతి, స వైశ్వానరో భవతి, స తేజసో భవతి, స ప్రాజ్ఞో భవతి, స సాక్షీ భవతి, స ఏవ భవతి, స సర్వో భవతి, స సర్వో భవతీతి".

(గణేశోత్తరతాపిన్యుపనిషత్ 6)

ఆ సద్రూపగణేశ్వరుడే ఆనందరూపుడు, నిత్యుడు, శుద్ధుడు, ముక్తుడు, స్వయంప్రకాశుడు, ఈశ్వరుడు, ప్రముఖుడు నై యున్నాడు. ఆతడే వైశ్వానరుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు నై యున్నాడు, ఆతడే సర్వసాక్షి, ఆతడే అతడు, అతడు సర్వము, సర్వము నతడే.

అట్టి శ్రీగణపతిపరబ్రహ్మము యొక్క దివ్యపావనచరితమే శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్తమహాపురాణాంతర్గత మగు శ్రీగణపతిఖండము. ఈశ్వరుడు, పరుడు, సచ్చిదానందవిగ్రహుడు, అనాది, ఆది, గోవిందుడు, సర్వకారణ కారణుడునగు శ్రీకృష్ణపరమాత్మయొక్క పరిపూర్ణావతారమే శ్రీగణపతియని ఈ సుధామయమైనఖండము నిరూపించును. వేదవాఙ్మయములో పకు దైనపార్వతీ నందనునకు ఎనిమిది నామములు కలవు.

గణేశమేకదన్తం చ హేరమ్బం విఘ్ననాయకం ।
లమ్బోదరం శూర్పకర్ణం గజవక్త్రం గుహాగ్రజమ్ ॥

(శ్రీగణపతిఖండము 44-85)

1. గణేశుడు 2. ఏకదన్తుడు 3. హేరంబుడు 4. విఘ్ననాయకుడు 5. లంబోదరుడు 6. శూర్పకర్ణుడు 7. గజవక్త్రుడు 8. గుహాగ్రజుడు.

'గ' జ్ఞానార్థవాచకము, 'ణ' నిర్వాణవాచకము, 'ఈశ' శబ్దము స్వామి వాచకము. జ్ఞానమునకు, నిర్వాణమునకు స్వామి కావున గణేశ్వరుడు బ్రహ్మము, పరమాత్మ, పరమేశ్వరుడు, పరమతత్త్వము నని చెప్పబడుచున్నాడు.

ఏకశబ్దము ప్రధానార్థకము, దన్త శబ్దము బలవాచకము, 'ఏకదన్త' శబ్దమునకు సర్వోత్కృష్టమైనబలశాలి యనియర్థము.

రామాద్యవతారము లన్నియు నంశావతారము లనబడినవి. కాని శ్రీకృష్ణుడు సంపూర్ణషోడశకళాపరిపూర్ణు డగుపరబ్రహ్మము, పరమాత్మ, పరమతత్త్వము. 'కృష్ణస్తు భగవాన్ స్వయమ్'.

విష్ణుమూర్తియే గణేశ్వరున కిట్లువరముల నొసంగెను.

పూజ్యశ్చ సరదేవానామస్మాకం జగతాం విభుః ।
సర్వాగ్రే పూజనం తస్య భవితా మద్వరేణ వై ॥
పూజాసు సర్వదేవానామగ్రే సంపూజితం జనః ।
పూజాఫలమవాప్నోతి నిర్విఘ్నేన వృథాఽన్యథా ॥

(౪వ అధ్యాయము 97-98)

"నావరములవలన నితడు సర్వదేవతలకు బూజ్యుడు, జగత్తులకు విభుడు, కాగలడు. సర్వాగ్రపూజ గూడ వీనికి లభించును.

సకలదేవతలపూజాసమయమున ప్రప్రథమమున శ్రీగణేశ్వరుని పూజించియే మనుష్యుడు నిర్విఘ్నతాపూర్వకముగ పూజాఫలప్రాప్తి నొందగలడు, లేనిచో వానిపూజ వ్యర్థమగును".

శ్రీమహావిష్ణువు దేవమునులతో గూడి సర్వశ్రేష్ఠోపచారము లచే గణపతిని పూజించి యిట్లుపల్కెను.

"సర్వాగ్రే తవ పూజా చ మయా దత్తా సురోత్తమ ।
సర్వపూజ్యశ్చ యోగీన్ద్రో భవ వత్సేత్యువాచ తమ్ ॥

సర్వశ్రేష్ఠా! నేనే ప్రప్రథమమున నీపూజ నొనరించితిని. కావున వత్సా! నీవు సర్వశ్రేష్ఠుడవు, సర్వపూజ్యుడవు. యోగీంద్రుడవు నయ్యెదవుగాక!

విచారించిన శ్రీగణేశ్వరుని దర్శనము సగుణనిర్గుణరూపములలో వ్యక్తమగును. సగుణాత్మకశక్తికూడ ఆయనలో నలౌకికముగ గోచరించును. శ్రీగణేశ్వరుడు తన తుండముతో బరశురాముని బంధించి యోగప్రభావముచే వానికి సర్వబ్రహ్మాండదర్శన మొనరింపజేసెను. గణపతి పరశురామునకు వైకుంఠాదిదివ్యలోకములను జూపించి గోలోకమునందు సాక్షాత్తుగ శ్రీకృష్ణ పరమాత్మను దర్శింపజేసెను. నిర్గుణాత్మకతత్త్వదృష్టితో గాంచినను ఆయన బ్రహ్మాభిన్నస్వరూపుడే, సాక్షాత్తుగ శ్రీకృష్ణుడే. ఆ పరమాత్మయే తన సంపూర్ణకళలతో పార్వతీపుత్రునిగ నావిర్భవించెను.

'హేరమ్బ' శబ్దమునందు గల మొదటి అక్షరము 'హే'. ఇది దైన్యమునకు అభావమునకు వాచకము; 'రమ్బ' శబ్దము పాలనార్థకము, దీనులైన భక్తజనులను సదా పాలించు దైవము 'రమ్బ' డని కీర్తింపబడెను. విఘ్ననాయక శబ్దమందు గల విఘ్న శబ్దమునకు విపత్తి లేదా అమంగళ మనియర్థము. నాయక శబ్దము ఖండనార్థకము లేదా అపహరణార్థకము. కావున ఆశేషవిపత్తులను, విఘ్నాదిబాధలను దొలగించువాడు నగు ఆభగవంతుడే విఘ్ననాయకు డని కీర్తించిరి. పూర్వకాలములో విష్ణువు మొదలగు దేవతలు సమర్పించిన నైవేద్యములను, శంకరునిచే సమర్పింపబడిన వివిధమృష్టాన్నములను స్వీకరింపగా గణపతి యుదరము పెద్దది యయ్యెను. కావున ఆయన 'లమ్బోదరు' డని కీర్తింపబడెను. సర్వవిశ్వములను దనకుక్షియందు ధరించియున్నాడు కావున గణపతి లమ్బోదరు డయ్యెను. 'శూర్పకర్ణ' శబ్దమునకు చేటలవంటి పెద్దపెద్ద చెవులు కలిగిన వాడనియర్థము. ధాన్యమునుండి దూషితపదార్థములను బహిర్గత మొనర్చి వాటిని పరిష్కృత మొనరించు చేటలవలె శ్రీగణపతి తనశూర్ప కర్ణములచే (చేటలవంటి చెవులచే) భక్తుల సకలవిఘ్నములను నివారించి వారిని బరిశుద్ధులునుగా నొనరించును.

శిరమున మునిప్రదత్తము, విష్ణుప్రసాదము నైనపుష్పమును ధరించినవాడు, గజేంద్రముఖయుక్తుడు నగు నాగణపతిని గజానను డని కీర్తించిరి. 'జిహ్వ' సర్వవిఘ్నములకు మూలము, అది బహిర్ముఖముగా నుండుటవలన పరదోష గణనమందు విశేషముగురుచి కలిగియుండును. కాని మన స్సనెడు జిహ్వయొక్క అగ్రభాగమును ఇతరులవైపునుండి మరల్చి తనవైపునకు ద్రిప్పినచో అనగా తనదోషములను పరిగణన మొనరించుకొనినచో అనేక విఘ్నములనుండి మానవుడు ముక్తి పొందగలడు. ప్రకృతిలో గల యన్యప్రాణులకంటె విపరీతముగ గజముయొక్క జిహ్వాగ్రము కంఠము వైపునకుండును. ఇట్టి నిర్విఘ్నవిధాయకత్వము గజానను డైనగణపతియం దున్నది.

శ్రీగణేశ్వరుని ప్రథమపూజ పంచదేవతారాధనలోనే గాక త్రింశత్కోటి దేవతలయర్చనలందుగూడ గలదు. బ్రహ్మవిష్ణ్వాదులకు దైవము, సాక్షాద్గోలోకనాథుడు నగు శ్రీకృష్ణపరమాత్మ, పార్వతీదేవియొక్క పుణ్యకవ్రతాచరణప్రభావముచే నామెకు బుత్రునిగ ఆవిర్భవించెను. కావున శ్రీకృష్ణ గణేశ్వరు లభిన్నులు, ఏకస్వరూపులు. పురాణానుసారముగా వామననృసింహ

రామాద్యవతారము లన్నియు నంశావతారము లనబడినవి. కాని శ్రీకృష్ణుడు సంపూర్ణషోడశకళాపరిపూర్ణు డగుపరబ్రహ్మము, పరమాత్మ, పరమతత్త్వము. 'కృష్ణస్తు భగవాన్ స్వయమ్'.

విష్ణుమూర్తియే గణేశ్వరున కిట్లువరముల నొసంగెను.

> పూజ్యశ్చ సరదేవానామస్మాకం జగతాం విభుః ।
> సర్వాగ్రే పూజనం తస్య భవితా మద్వరేణ వై ॥
>
> పూజాసు సర్వదేవానామగ్రే సంపూజితం జనః ।
> పూజాఫలమవాప్నోతి నిర్విఘ్నేన వృథాఽన్యథా ॥

(6వ అధ్యాయము 97-98)

"నావరములవలన నితడు సర్వదేవతలకు బూజ్యుడు, జగత్తులకు విభుడు, కాగలడు. సర్వాగ్రపూజ గూడ వీనికి లభించును.

సకలదేవతలపూజాసమయమున ప్రప్రథమమున శ్రీగణేశ్వరుని పూజించియే మనుష్యుడు నిర్విఘ్నతాపూర్వకముగ పూజాఫలప్రాప్తి నొంద గలడు, లేనిచో వానిపూజ వ్యర్థమగును".

శ్రీమహావిష్ణువు దేవమునులతోగూడి సర్వశ్రేష్ఠోపచారములచే గణపతిని పూజించి యిట్లుపల్కెను.

> "సర్వాగ్రే తవ పూజా చ మయా దత్తా సురోత్తమ ।
> సర్వపూజ్యశ్చ యోగీన్ద్రో భవ వత్సేత్యువాచ తమ్ ॥

సర్వశ్రేష్ఠా ! నేనే ప్రప్రథమమున నీపూజ నొనరించితిని. కావున వత్సా! నీవు సర్వశ్రేష్ఠుడవు, సర్వపూజ్యుడవు. యోగీంద్రుడవు నయ్యెదవుగాక !

విచారించిన శ్రీగణేశ్వరుని దర్శనము సగుణనిర్గుణరూపములలో వ్యక్తమగును. సగుణాత్మకశక్తికూడ ఆయనలో నలౌకికముగ గోచరించును. శ్రీగణేశ్వరుడు తన తుండముతో బరశురాముని బంధించి యోగప్రభావముచే వానికి సర్వబ్రహ్మాండదర్శనమొనరింపజేసెను. గణపతి పరశురామునకు వైకుంఠాదిదివ్యలోకములను జూపించి గోలోకమునందు సాక్షాత్తుగ శ్రీకృష్ణ పరమాత్మను దర్శింపజేసెను. నిర్గుణాత్మకతత్త్వదృష్టితో గాంచినను ఆయన బ్రహ్మాభిన్నస్వరూపుడే, సాక్షాత్తుగ శ్రీకృష్ణుడే. ఆ పరమాత్మయే తన సంపూర్ణకళలతో పార్వతీపుత్రునిగ నావిర్భవించెను.

ఈగణపతిఖండ మంతయు శ్రీగణేశ్వరుని దివ్యచరితముచే నోతప్రోత మైయున్నది. ఇం దనేకపరమాద్భుతస్తోత్రములు, కవచములు, మంత్రములు గలవు. పాఠకులు శ్రీగణేశ్వరుని యథార్థస్వరూపము నెఱుంగుటకై యీ గణపతిఖండమును బఠించి ఆ భగవానుని యుపాసించి భవబంధవిముక్తు లగుదురుగాక !

# సుమాంజలి

కాళయుక్తి వైశాఖ బహుళదశమీ (31-5-78) శుభదినమున అనగా శ్రీ హనుమజ్జయంతినాడు శ్రీ శ్రీ శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ దేవస్థాన (గుంటూరు) ప్రాంగణములో తల్లి సముఖమున శ్రీశ్రీశ్రీ జగద్గురువులు పుష్పగిరి శంకరపీఠాధీశ్వరులు, పరమహంస పరివ్రాజకాచార్యులు నగు శ్రీమదభినవోద్దండ విద్యానృసింహ భారతీస్వామిపాదులు శ్రీమద్బ్రహ్మవైవర్త మహాపురాణ సారసంగ్రహ మను మొదటిగ్రంథము నావిష్కరించిరి. శ్రీమదాంధ్ర బ్రహ్మ వైవర్తమహాపురాణమునకు సంబంధించిన మొదటిభాగమైన బ్రహ్మఖండమును శ్రీ కాళయుక్తి శ్రావణ కృష్ణాష్టమీ (శ్రీకృష్ణజయంతి) శుభదినమున (26-8-78) శ్రీ శ్రీ శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవస్థాన ప్రాంగణములో అంబ దివ్యసముఖమున శ్రీగౌడీయ వైష్ణవమఠ యతీంద్రులైన త్రిదండిస్వామి శ్రీభక్తి విజయ విష్ణుమహారాజుగారు ఆవిష్కరించిరి. శ్రీమదాంధ్ర బ్రహ్మ వైవర్తమహాపురాణములోని రెండవభాగమైనప్రకృతిఖండమును శ్రీసిద్ధార్థి చైత్రశుద్ధపాడ్యమి (29-3-79) అనగా ఉగాది శుభదినమున నాకీ జన్మము నిచ్చిన నాతల్లిదండ్రులగు శ్రీమతి వేంకటమహాలక్ష్మమ్మ శ్రీ జగన్నాథము గార్లు శ్రీ శ్రీ శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ దేవస్థాన ప్రాంగణములో దేవి దివ్యసముఖములో ఆవిష్కరించి నన్ను ధన్యునిగజేసి నాజీవనమును సుజీవనము గావించిరి.

ప్రస్తుతగణపతిఖండము ఆదిశక్తియు, పరదేవతయు వైశ్యకుల దేవతయునగు శ్రీ శ్రీ శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ అమ్మవారి జన్మ దినశుభసందర్భమున (6-5-79) అమ్మవారి దేవస్థానప్రాంగణములోనే యావిష్కరింపబడుట నాపురాకృతసుకృతముగ భావించుచున్నాను. దాన

శీలురు, వైరాగ్యసంపన్నులు, పుణ్యమూర్తులు భగవద్భక్తియుతులు నగు నాతల్లిదండ్రుల యనుగ్రహవిశేషముచే నాకీమహత్కార్య మొనరించు అదృష్టము లభించిన దనిజెప్పుకొనుట కెంతయో గర్వపడుచున్నాను.

త్వరలోనే శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి చతుర్థ ఖండ మైనశ్రీకృష్ణజన్మఖండమును ముద్రించి మీకు సమర్పింపగలము.

అష్టాదశమహాపురాణములలో పదియవది, భగవంతుని పరిపూర్ణబ్రహ్మ స్వరూపమును బ్రతిపాదించునది, శ్రీకృష్ణద్వైపాయన వ్యాసదేవునిచే పదు నెనిమిదివేల శ్లోకములతో బ్రవచింపబడినదియు నైనశ్రీమద్బ్రహ్మవైవర్త మహాపురాణమును భాషాంతరీకరించుట, ముద్రించుటయన్న సామాన్యవిషయ ము కాదు. ఈ విషయమున నావంటి సామాన్యవ్యక్తినిగూర్చి యికచెప్పున దేమి ? ఈ మహాగ్రంథానువాదము కేవలము భగవదనుగ్రహముచేతనే సమకూడినది.

పుత్రికాసంతానరహితుడ నగునాయనేకజన్మములసుకృతఫలమున నేటి కాలమునకు శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణకన్య మాయింట జన్మిం చినది. ఇట్టి యీమెను శేషాచలవాసుడు, విమలరవికోటిసంకాశుడు, సర్వజగన్ని వాసుడు, కలితలక్ష్మీశుడు నగుశ్రీ వేంకటేశ్వరవిభునకు సమర్పించుకొను చున్నాను.

శ్రీమద్భాగవతాంధ్రటీకకర్తలు, బహుగ్రంథకర్తలు, శ్రీమాజేటి గురవ యోన్నతపాఠశాలాంధ్రాధ్యాపకులు, మన్మిత్రులు నగు శ్రీజన్నాభట్ల వాసు దేవశాస్త్రిగారు నే నడిగినంతనె నా యీ గ్రంథమును బరిష్కరించి, ముద్రణాది విషయములలో బహువిధములుగ సాయపడిరి. వారికి నా హృదయపూర్వక ధన్యవాదముల నర్పించుచున్నాను.

ప్రస్తుతకాలమున గోరినను సాహాయ్య మొనరించుట కడుదుర్లభము. కాని కోరకనే భగవత్కార్యమునకు సాహాయ్య మొనరించి తోడ్పడుట అసామాన్యము. ఇట్టికోవకు జెందిన సజ్జను లెందఱో శ్రీమదాంధ్ర బ్రహ్మ వైవర్త మహాపురాణప్రచారోద్యమ సభ్యులుగా జేరి ఆర్థికసాహాయ్య మొన రించిరి. ఈ సభ్యులవివరము బ్రహ్మఖండ ప్రకృతిఖండములలో బ్రచురించుట యైనది.

ఈ సహృదయులకు, వారి కుటుంబములకు, బంధుమిత్రి పరివారములకు, శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణనాయకుడు, అఖిలజగన్నాటకసూత్రధారి, అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు, సర్వాన్తర్యామి, కరుణానిధి, సత్యస్వరూపుడు, శ్రీరాధేశ్వరుడు, పరబ్రహ్మమునైన శ్రీకృష్ణపరమాత్మ ఆయురారోగ్యభోగభాగ్యాదులను, యథార్థమైన సుఖశాంతులను, ఆచంద్రతారార్కమైన సత్కీర్తిని, సత్య ధర్మ దైవకార్యానురక్తిని, భక్తిజ్ఞానవైరాగ్యములను ప్రసాదించి సర్వకాల సర్వావస్థలయందును రక్షించుగాక !

నా యనువాదమును సుందరముగ వ్రాసిన చిరంజీవి యల్లాప్రగడ రంగనాయకులకు, నిర్దుష్టముగ సకాలములో ముద్రించియిచ్చిన రఘు ప్రింటింగ్ వర్క్సు అధినేతలకు, ఈ మహాగ్రంథమును ది 12-11-77 నుండి యవిచ్ఛిన్నముగ ప్రతిదినము సాయంసమయమున 7 గం.ల నుండి 9 గం.ల వఱకు ప్రవచనమొనరించుటకు నా కవకాశ మొసంగిన శ్రీ శ్రీ శ్రీ కన్యాకాపరమేశ్వరీ దేవస్థానముయొక్క ధర్మకర్తలసంఘమునకు, నా ప్రవచనకార్యక్రమములను నిర్వహించుచున్న శ్రీ మద్ది నాగేశ్వరరావుగారికి, అన్నివిధముల సహకరించుచున్న దేవస్థానసేవక బృందమునకు, నిత్యము ప్రవచనమును శ్రద్ధాసక్తులతో శ్రవణముచేయుచున్న యసంఖ్యాక శ్రోతలకు ఆ పరమాత్మ ఆయురారోగ్యైశ్వర్యాదులను, భక్తిజ్ఞానవైరాగ్యాదులను నొసంగి యెల్లప్పుడు రక్షించుగాక !

ఏమైనను "ప్రమాదో ధీమతామపి" యను నార్యోక్తి యనుభవసిద్ధమైనదగుటవలన నిందెన్నియో ప్రమాదములుండితీరునుగాన, సహృదయులగుపాఠకులు దయతో మన్నింప బ్రార్థితుడను.

శేమం శ్రీకృష్ణస్మరణం

గుంటూరు
శ్రీసిద్ధార్థ వైశాఖ శుద్ధ దశమి
శ్రీవాసవీకన్యకాపరమేశ్వరి జయంతి
6—5—1979

భక్తజనదాసానుదాసుడు
సుజనవిధేయుడు
మట్టుపల్లి శివసుబ్బరాయ గుప్త

# విషయసూచిక

—: o :—

## చిత్రసూచిక

# మంత్ర స్తోత్ర కవచ సూచిక

# కృతిపతి

శ్రీ మదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణము

త్వదీయం వస్తు గోవిన్ద
తుభ్యమేవ సమర్పయే !

కృతికర్త

శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయ గుప్త



శ్రీ రస్తు　　　ఓం నమః　　　శుభ మస్తు

శ్రీ గణేశ్వరాయ నమః

# శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణము

## గణపతి ఖండము

### మొదటి అధ్యాయము

**పార్వతీదేవి జననము; శివపార్వతుల సమాగమము భూపతిత శివవీర్యముచే స్కందుడు జన్మించుట.**

మంగళాచరణము

ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే విఘ్నపతయే
ఓం నమః శివాయ ॥

ఓం నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్ ॥

పరమపురుషుడు, అంతర్యామియు నైన శ్రీమన్నారాయణ ఋషీంద్రునకు, నరశ్రేష్ఠు డైన నరునకు, వీరి దివ్యలీలల నెల్లపుడు ప్రకటించు సరస్వతీ

దేవికి, ఆదివ్యలీలలను గానమొనరించు వ్యాసదేవునకు నమస్కరించిన పిమ్మట జయమును బలుకవలెను.

**నారదుడు పలికెను :**

శ్రీమన్నారాయణఋషీంద్రా! సర్వోత్కృష్టమైనదియు, పరమమూఢులకు సైతము జ్ఞానమును బ్రసాదింపగలదియు, అమృతసాగర స్వరూపమైనదియు, అభీష్ట సిద్ధుల నొసంగగలదియు నైన ప్రకృతిఖండమును నీ దివ్య కృపాకటాక్షమువలన శ్రవణమొనరింపగల్గితిని. దేహధారు లైన జీవులకు సంపూర్ణ శుభములను బ్రసాదించునది, బరమమంగళస్వరూపము, అమృతోపమయమునైనది యగు శ్రీగణేశ్వరుని దివ్యజన్మ వృత్తాంతముతో బరిపూర్ణమైన శ్రీగణపతిఖండమును సవిస్తరముగ బ్రవచించి నన్ను జరితార్థునిగ జేయుము. యోగేశ్వరా! ప్రకృతిస్వరూపిణియు, జననియు నగు పార్వతినుండి సురశ్రేష్ఠు డైన శ్రీగణేశ్వరుని ప్రాదుర్భావ మెట్లు సంభవించెను? ఎట్టి దివ్య కర్మాచరణమువలన భవాని యట్టి మహాపురుషుని బుత్రునిగ బడయగల్గెను? శ్రీగణేశ్వరు డేపరమపురుషుని యంశజుడు? ఆయనసంభవమునకు గల కారణ మేమి? ఆయన యయోనిజుడా లేక యోనిసంభవుడా? అప్పరమపురుషుని రూపతేజపరాక్రమతపము లెట్టివి? ఆయన జ్ఞానము, నిర్మలయశము లెట్టివి? ప్రభూ! సృష్టికారకు డైన బ్రహ్మ, జగత్సంరక్షకు డైన శ్రీమన్నారాయణుడు, సర్వలయకారకు డైన పరమేశ్వరుడు మొదలుగాగల దేవత లున్నను విశ్వమంతటిలో శ్రీగణేశ్వరున కెట్లగ్రపూజ లభించెను? శ్రీవిఘ్నేశ్వరుడు గజాననుడు ఏకదంతుడు, మహోదరుడు నెట్లయినాడు? పురాణములలో నిగూఢమును, పరమ మనోహరము నైన ఆయన ప్రాదుర్భావవృత్తాంతము నాకర్ణింపవలె నని నేను పరమకుతూహలముతో నుంటిని. మహాభాగా! ఆమనోహర దివ్యచరితమును విపులముగ బ్రవచించి నన్ననుగ్రహింపుము.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! నీవు ప్రశ్నించిన యీ పరమాద్భుతనిగూఢ చరితముల నన్నింటిని సవిస్తరముగ బ్రవచించెద నవధరింపుము. బ్రహ్మకులైకపావనా! సర్వవిఘ్నవినాశకము, పాపసంతాపహరణము, సర్వమంగళప్రదము, సకలసారము, సర్వశ్రుతిమనోహరము, సుఖప్రదము నైన శ్రీగణేశ్వరుని పవిత్రాఖ్యానము సర్వ కర్మబంధములను ఛేదింపగలదు. నారదా!

ప్రాచీనకాలములో దైత్యులచే బీడింపబడిన సకలదేవతలు జగన్మాతయైన ఆదిశక్తిని శరణువేడిరి. అయ్యాదిశక్తి సమస్తదేవతల తేజఃపుంజములనుండి యావిర్భవించి ప్రచండస్వరూపిణియై సకలదైత్యసముదాయములను సంహరించెను. తదనంతర మాశక్తియే దక్షుని గృహమున సతియనునామముతో నవతరించెను. ఆసతీనామాంకితయైనబరాశక్తి దక్షయజ్ఞములో దనస్వామి నింద నాలకింపగనే యోగముచే దేహమును బరిత్యజించి పర్వతేశ్వరుడైన హిమవంతునకు గారాలపట్టిగ నవతరించెను. పర్వతపతి సకలసద్గుణరాశియైన దనపుత్రికను సకలమంగళకరుడైనశంకరున కర్పించి ధన్యుడయ్యెను. మహాదేవుడు పార్వతి పాణిని గ్రహించి విహారమొనరించుచు నొకనిర్జనవనమును జేరెను. పుష్పచన్దనచర్చితమైనమృదుశయ్యను నిర్మించి నర్మదానదీతీరమున గల నాపుష్పోద్యానములో నాయన సహస్రదివ్యవర్షముల పర్యంత మాభగవతితో దివ్యశృంగారలీలలలో మగ్నుడయ్యెను. శివపార్వతులు జగములను సహితము మరచి దివ్యశృంగారక్రీడలందు సంలగ్నులైయుండిరి. ఆమెఅవయవస్పర్శమాత్రముననే శివుడు మదనతాపమునకు గుఱియై మూర్ఛిల్లెను. పార్వతి శివస్పర్శకు బరవశురాలయ్యెను. ఇట్లు వా రహర్నిశములు దివ్యక్రీడలలో నిమగ్నులైరి. ఉమాశంకరులు గ్రీడించు నాక్రీడాస్థలము హంసకారండవాది జలపక్షులచే భరితమై, పుంస్కోకిలల మధురధ్వనులచే బ్రతిధ్వనించుచు నానాపుష్పవృక్షములచే వ్యాప్తమై, భ్రమరఝుంకారములచే గుంజితమై, సుగంధితకుసుమములను దాకి వీచు వాయువులచే బూర్ణమై, సుఖప్రదమై, యత్యంతరమ్యముగ నుండెను.

మహాదేవుని యాదివ్యశృంగారలీలను గాంచి దేవతలు చింతాగ్రస్తులై బ్రహ్మను దోడ్కొని శ్రీమన్నారాయణుని దివ్యధామమును జేరిరి. బ్రహ్మ శ్రీమన్నారాయణునకు నమస్కరించి యీ వృత్తాంతము నంతయు నివేదించెను.

## బ్రహ్మ పలికెను :

జగదీశ్వరా! శంకరుడు సహస్రదివ్యవర్షముల నుండి దివ్యరతిలో నిమగ్నుడై యారతిని విరమింపకయున్నాడు. ఆ పార్వతీపరమేశ్వరుల కెట్టి సంతానము గల్గునో వచింపుడు.

**భగవానుడు పలికెను :**

జగద్ధాతా! చింతింపకుము, సర్వము భద్రము కాగలదు. విధాతా! నా చరణముల నాశ్రయించినవారి కెట్టి దుఃఖమును గలుగదు. ఉపాయముచే శంకరుని తేజము భూమిపై బడవలె ననినిశ్చయించితిని. నీవు దేవగణము లతో గూడి మహాదేవుని తేజము భూపతనమగుటకు బ్రయత్నింపుము. శంక రుని తేజము పార్వతియందుజొచ్చిన నామెనుండి సురాసురులనందఱిని మర్దింపగల మహాప్రళయమూర్తి జన్మింపగలడు. కావున నుమాశంకరులరతిని ఉపాయముచే నిరోధింపుము.

శ్రీమన్నారాయణుని యాజ్ఞానుసారముగ సకలదేవత లుమాశంకరుల రతి భంగార్థమై నర్మదానదీతీరమును జేరిరి. బ్రహ్మ తనలోకమునకు మఱలిపోయెను. ఇంద్రుడు, కుబేరుడు, వరుణుడు, వాయువు, యముడు, అగ్ని, భాస్కరుడు, చంద్రుడు, ఈశానుడు మొదలగువారు తమలోదాము చర్చించుకొని వార సంభోగభంగ మొనరింపవలె నని నిశ్చయించుకొనిరి. ద్వారముచెంత నిలువ బడి యింద్రుడు వక్రశిరస్కుడై రతిక్రీడామగ్నుడై యున్నమహేశ్వరుని గాంచి "యోగీశ్వరా! నీకు నమస్కారము. మహాదేవా! నీ వేమిచేయు చున్నావు? నీవు జగదీశ్వరుడవు, జగద్బీజుడవు, భక్తులభయములను బాపువా" డవని పల్కి భీతిజెందుచు నాప్రదేశమును వీడెను. అపుడు సూర్యుడు భయముతో ద్వారముచెంత కేగుదెంచి తొంగిచూచుచు నిట్లు పలికెను "సురశ్రేష్ఠా! మహాభాగా! పార్వతీశా! జగత్పరిపాలకా! నీకు నమస్కారము. మహాదేవా! నీ వేమి చేయుచున్నావు." సూర్యుని యనంతరము చంద్రు డాప్రదేశమునకు వచ్చి భయముచెందుచు "స్వాత్మారామా! స్వయంపూర్ణా! పుణ్యశ్రవణకీర్తనా! త్రిలోచనా! నీకు నమస్కారము. త్రిలో కేశ్వరా! నీ వేమిచేయుచున్నా?" వని పల్కి భీతుడై విరమింపగా, వాయు దేవుడు ద్వారముచెంత కేగుదెంచి "ధర్మార్థకామమోక్షములకు బీజరూపు డవైనవాడా! సనాతనా! జగద్బాంధవా! నీకు నమస్కారము. జగన్నాథా! నీ వేమి చేయుచున్నా?" వని సాదరముగ బల్కెను.

దివ్యరతిలో సంలగ్నుడై యున్న యోగజ్ఞానవిశారదుడైన శంకరుడు దేవతల ప్రార్థనల నాలకించి రతిని విరమింపవలె ననిసంకల్పించినను పార్వతి

వలన భయముచే నాక్రీడను ద్యజింపక మిన్నకుండెను. ఇది గాంచి దేవతలు మరల నాపరమేశ్వరుని బ్రార్థించిరి. దేవతల యభ్యర్థనలను మన్నించి శంకరుడు సుఖసంభోగమునుండి విరమించి పార్వతీకంఠాశ్లేషమును వీడెను. ఆసమయములో బరమేశ్వరునినుండి బయల్వెడలిన మహాతేజమ్ము భూపతనముకాగా నద్దానినుండియే స్కందు డుద్భవించెను. తదనంతర మతిమనోహరకథావిషయ మైనకుమారసంభవ ప్రసంగమును బ్రవచించెద నవధరింపుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణసంవాద
మను మొదటి అధ్యాయము
సంపూర్ణము.



# రెండవ అధ్యాయము

## పార్వతి దేవతలను శపించుట, శివుడు పార్వతి నోదార్చుట.

**శ్రీనారాయణఋషి పలికెను:**

మహాదేవుడు దివ్యరతిక్రీడను ద్యజించెను. దేవతలు పార్వతీభయము నకు గుఱియైనారని గ్రహించి దయతో నాయన వారిని బారిపోవలసినదిగ నాదేశించెను. పార్వతి శపించునేమో యని దేవతలు భయముచెంది పారి పోయిరి. సర్వబ్రహ్మాండసంహర్త్రియే పార్వతీ భయమున గంపించెను. తనలో బ్రజ్వరిల్లుచున్న కోపాగ్నిని స్తంభింపజేసి దుర్గాదేవి "నేటినుండి దేవత లందఱు వ్యర్థవీర్యులయ్యెదరు గాక" యని శపించెను. క్రోధముచే నేత్రము లెఱ్ఱబడగా దుఃఖించుచు దలనువంచుకొని ధరణీతలముపై గాలి

వ్రేలితో వ్రాయుచున్న పార్వతిని జూచి, యా దేవేశ్వరు డామెహస్తమును గ్రహించి తనహృదయముపై నుంచుకొని మధురవచనములతో నిట్లు పలికెను.

**శంకరుడు పలికెను :**

గిరిరాజకన్యకా! మనోహారీ! నా సౌభాగ్యస్వరూపిణీ! నాప్రాణాధిష్ఠాతృదేవతా! జగదాంబికా! ఏలకోపించెదవు? నీ యభీష్టమేది? నాతో బల్కుము. నిఖిలబ్రహ్మాండములలో నా కసాధ్య మైనదేదిగలదు? దేవీ! నేను నిరపరాధుడను. సుందరీ! నాకు బ్రసన్నురాలవు గమ్ము. విధివశమున నజ్ఞాతదోషుడ నైన నాపై శాంతింపుము. నీతో గూడియుండుటవలననే నేను శివుడను, సర్వులకు మంగళదాయకుడను నైతిని. నీవు లేని నే నీశ్వరుడను కాను, శివుడనుకాను, శవతుల్యుడనేయగుదును. దేవీ! నీవే ప్రకృతివి, బుద్ధివి, శక్తివి, క్షమవు, దయవు, తుష్టివి, శాంతివి, పుష్టివి, క్షాంతివి, క్షుధవు, ఛాయవు, నిద్రవు, తంద్రవు, శ్రద్ధవు, సర్వాధారస్వరూపిణివి, సర్వబీజస్వరూపిణివి. దేవీ! నాతో మధురవచనముల బల్కుము. నీ కోపాగ్నికీలలలో దగ్ధుడను, మృతప్రాయుడను నైన నన్ను బునర్జీవితునిగ నొనరింపుము.

శంకరుని వచనముల నాలకించి క్షమాయుక్తురాలై పార్వతీదేవి బాధ జెందుచు మధురవచనములతో నిట్లుపలికెను.

**పార్వతి పలికెను :**

దేవా! నీవు సర్వజ్ఞుడవు, స్వాత్మారాముడవు, పూర్ణకాముడవు, సర్వదేహములందు విరాజిల్లువాడవు, నీతో నేమని చెప్పగలను? కామిని తన మనస్సులోనిగోరికను తెలిసికొనలేని తనస్వామికి దెలియజెప్పును. కాని సర్వజనుల హృదయమును గుర్తించినవాడవు, సర్వహృదయములలో విరాజిల్లెడివాడవు నగునీతో నే నేమి చెప్పగలను? గోప్యమైనదియు, సర్వనారీజనముకు లజ్జను గలిగించునదియు, జెప్పరానిదియు నగునావిషయమును నీతో నేమని చెప్పగలను? సురేశ్వరా! వైభవము లెన్నియున్నను, సుఖములెన్నియున్నను స్త్రీలకు నేకాంతములో భర్తృసమాగమము బరమసుఖమును బ్రసాదించును. అట్టి సమాగమము భంగమైనపుడెంతదుఃఖముకలుగునో దానితో సమమైనదుఃఖము స్త్రీలకు మఱియొకటిలేదు. కాంతలకు కాంతుని వియోగము

వలనగలుగు శోకమే పరమదారుణమైనది. కృష్ణపక్షములోజంద్రుడుదినదినము క్షీణించునట్లు కాంతుడులేని కాంత క్షణక్షణము క్షీణించుచుండును. సాధ్వీ మణులకు కాంతునివలన గలుగువియోగము చింతకు, జ్వరమునకు, తాపము నకు గారణము కాగలదు. రతిభంగదుఃఖము మొదటిది. రెండవది వీర్యపత నము. అధికదుఃఖప్రదమైన నపత్యత (సంతానము లేకుండుట) మూడ వది. త్రైలోక్యకాంతుడవైన నీవు నాకు కాంతుడవైనను సంతానము కలుగలేదు.

యా స్త్రీ పుత్రవిహీనా చ జీవనం తన్నిరర్థకమ్ ॥ (24)

"పుత్రవిహీనురా లగుస్త్రీజీవితము నిరర్థకము". జన్మాంతర పుణ్యము వలన తపోదానములవలన గల్గిన సద్వంశజాతు డైనపుత్రు డిహపరములలో సుఖములను బ్రసాదింపగలడు.

సుపుత్రః స్వామినోఽంశశ్చ స్వామితుల్యసుఖప్రదః।
కుపుత్రశ్చ కూలాఙ్గారో మనస్తాపాయ కేవలమ్ ॥ (26)

స్త్రీకి తనస్వామి యంశచే జన్మించినవాడై సుపుత్రుడు స్వామివలె సుఖ ప్రదు డగును. కుపుత్రుడు కులమునకు నంగారమై (నిప్పుకణమై) కేవలము మనస్తాపమును గల్గింపగలడు.

స్వామీ స్వాంశేన స్వస్త్రీణాం గర్భే జన్మ లభేద్ధ్రువమ్ ।
సాధ్వీ స్త్రీ మాతృతుల్యా చ సతతం హితకారిణీ ॥
అసాధ్వీ వైరితుల్యా చ శశ్వత్సంతాపదాయినీ ।
ముఖదుష్టా యోనిదుష్టా చాసాధ్వీతి త్రిధాస్మృతా ॥ (27, 28)

"భర్తయే స్వాంశముతో తనస్త్రీగర్భమునుండి నిశ్చయముగ జన్మిం చును. సాధ్వి యగుస్త్రీ మాతృతుల్య, సతతహితకారిణి.

దుష్టస్త్రీ ముఖదుష్టయని, యోనిదుష్టయని, అసాధ్వియని మూడు విధ ములుగ జెప్పబడినది. అసాధ్వి భర్తకు వైరివంటిది. ఆమె యెల్లపుడు తన పతికి సంతాపమునే కలిగించును".

ఉపాయములకు సాగరుడవంటివాడా! సర్వుల తపస్సులకు ఫలములను బ్రసాదించు దైవమా! యోగీశ్వరేశ్వరా! నాకు సత్పుత్రుడు గల్గునుపాయము నుపదేశింపుము.

ఇట్లు పరమేశ్వరుని బ్రార్థించి పార్వతి తలను వంచుకొని నిలువబడి యుండగా గాంచి శంకరుడు నవ్వుచు నామెతో నిట్లు పలకెను. "దేవీ! సత్పుత్రబీజము, సుఖప్రదము, తాపనాశనకారణము, మితము, స్నిగ్ధము, రుచిరము నగునొక నుపాయము జెప్పెద నాలకింపుము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ
సంవాద మను రెండవ అధ్యాయము
సంపూర్ణము.



## మూడవ అధ్యాయము

### సత్పుత్రప్రాప్తికొఱకు శంకరుడు పార్వతికి శ్రీకృష్ణవ్రతము నుపదేశించి, వ్రతఫలమును బ్రవచించుట.

**మహాదేవుడు పలికెను :**

పార్వతీ! వినుము, (ఉపాయతః కార్యసిద్ధిర్భవత్యేవ జగత్రయే ।।)

మూడులోకములలో నుపాయమువలన గార్యములు సిద్ధించును. సకలలోకములలో నుపాయములవలననే దేహధారుల సర్వకార్యములు సిద్ధింపగలవు. నీ సర్వవాంఛితములు సిద్ధించుటకు సర్వమంగళములకు బీజరూపము, మనస్సునకు బ్రీతిజనకము నగునొకయుపాయము నుపదేశించెద. ఆయుపాయము వలన నీమనోభీష్టములు నెఱవేరగలవు. వరాననా! నీవు శ్రీహరి నారాధించు బవిత్రవ్రతమారంభింపుము, పుణ్యకవ్రత మనునీవ్రతము నొకసంవత్సరకాల పర్యంత మనుష్ఠించిన కల్పవృక్షమువలే నది యభీష్టసిద్ధులను బ్రసాదించును.

దేవీ! ఈపుణ్యకవ్రతము సుఖదాయకము, పుణ్యప్రదము, సకలసారము, సర్వోత్కృష్టము, సత్పుత్రప్రదము, సర్వసౌఖ్యదాయకము నైయున్నది. ప్రియా! పవిత్రనదులయందు గంగ, దేవతలయందు శ్రీహరి, బరమభక్తులైనవైష్ణవులయందు నేను (శివుడు), దైవీశక్తులయందు నీవు (పార్వతి), చాతుర్వర్ణ్యములయందు బ్రాహ్మణుడు, బవిత్రతీర్థములయందు బుష్కరము, పుష్పములలో బారిజాతము, పత్రములయందు దులసీపత్రము, బుణ్యదాయకములైన తిథులయం దేకాదశి, మాసములలో మార్గశీర్షము, వారములలో రవివారము, ఋతువులలో వసంతఋతువు, యుగములలో గృతయుగము, పూజనీయులలో నాధ్యాత్మికవిద్యాప్రదాత యైనయాచార్యుడు, గురుజనులయందు దల్లి, ఆప్తజనులలో సాధ్వియైనపత్ని, ఇంద్రియములయందు మనస్సు, ధనములలోరత్నములు, స్త్రీకిప్రియపాత్రులగువారిలో బతి, బంధుజనములలో బుత్రుడు, వృక్షములలో గల్పవృక్షము, వర్షములలో భారతవర్షము, వనములలో బృందావనము, స్త్రీలలో శతరూప, పురములలో గాశి, తేజస్వులలో సూర్యుడు, సుఖప్రదాతలలో జంద్రుడు, రూపవంతులలో మన్మథుడు, శాస్త్రములలో వేదము, సిద్ధపురుషులలో గపిలమహర్షి, వానరులలో హనుమంతుడు, క్షేత్రములలో సద్బ్రాహ్మణునిముఖము, యశోదాయకములందు విద్య, వ్యాపకవస్తువులయందాకాశము, శరీరాంగములయందు నేత్రములు, వైభవములయందు హరికథాసుధ, సుఖములయందు హరిస్మరణము, స్పర్శలయందు పుత్రస్పర్శ, హింసకులయందు దుష్టుడు, పాపములయం దసత్యభాషణము, పాపాత్ములయందు కులట, పుణ్యకర్మలయందు సత్యభాషణము, తపములయందు శ్రీహరిసేవ, గవ్యములయందు ఘృతము, తాపసులయందు బ్రహ్మ, భక్ష్యపదార్థములం దమృతము, అన్నములయందు ధాన్యము, పవిత్రము లొనర్చువానియందు జలము, శుద్ధపదార్థములయం దగ్ని, ప్రకాశించువస్తువులయందు సువర్ణము, మధురపదార్థములయందు ప్రియభాషణము, విహంగములయందు గరుత్మంతుడు, గజములయం దైరావతము, యోగులయందు సనత్కుమారాదులు, దేవఋషులయందు నారదుడు, గంధర్వులయందు జిత్రరథుడు, బుద్ధిమంతులయందు బృహస్పతి, శ్రేష్ఠకవులయందు శుక్రాచార్యుడు, కావ్యములయందు బురాణము, సరస్సులయందు సాగరము, క్షమాశీలురయందు బృథ్వి, లోభములలో ముక్తి, సంపత్తులయందు హరిభక్తి, పవిత్రులలో వైష్ణవుడు, వర్ణము

లయం దోంకారము, మంత్రములయందు విష్ణుమంత్రము, బీజములయందు ప్రకృతి, విద్వాంసులయందు వాణి, ఛందములందు గాయత్రి, యక్షులయందు గుబేరుడు, సర్పములందు వాసుకి, పర్వతములందు నీతంద్రిడియైన హిమవంతుడు, గోవులయందు సురభి, వేదములందు సామవేదము, తృణములందు గుశము, సుఖప్రదాతలయందు లక్ష్మి, శీఘ్రగాములందు మనస్సు, అక్షరములయం దకారము, హితైషులయందు తండ్రి, యంత్రములయందు సాలగ్రామము, మృగములందు సింహము, ఇంద్రియములందు మనస్సు, దేహధాతులయందు మనుష్యుడు, రోగములందు మందాగ్ని, బలవంతులయందు శక్తి, శక్తివంతుల యం దహంకారము, మహాస్థూలములందు మహావిరాట్పురుషుడు, సూక్ష్మము లందు బరమాణువు, అదితిపుత్రులయం దింద్రుడు, దైత్యులయందు బలి, సాధుభక్తులందు ప్రహ్లాదుడు, దాతలయందు దధీచి, అస్త్రములందు బ్రహ్మాస్త్రము, చక్రములందు సుదర్శనచక్రము, మనుష్యులయందు శ్రీరామచంద్రుడు, దనుర్ధారులయందు లక్ష్మణుడు శ్రేష్ఠులు. అట్లే సంపూర్ణ వ్రతములయం దీపుణ్యకవ్రత మత్యంత శ్రేష్ఠము. శ్రీకృష్ణపరమాత్మ సర్వాధారుడు, సర్వారాధ్యుడు, సమస్తజీవులద్వారా సేవనీయుడు, సర్వబీజస్వరూపుడు, సర్వాభీష్టప్రదాత, సంపూర్ణసారస్వరూపుడు. శ్రీకృష్ణునివలె నీపుణ్యకవ్రతముగూడ సకలవ్రతములలోను శ్రేష్ఠమైన దనిగ్రహింపుము.

అందువలన పార్వతీ! త్రిలోకములయందు దుర్లభమైన పుణ్యకవ్రతమును నీ వనుష్ఠింపుము. ఈవ్రతానుష్ఠానమువలననే నీకు సంపూర్ణవిశ్వసారస్వరూపుడైన బురుషోత్తముడు పుత్రునిగ లభింపగలడు. ఈవ్రతానుష్ఠానము వలన సకలప్రాణుల మనోరథములను సిద్ధింపజేయగల శ్రీకృష్ణభగవానుని ఆరాధన సంపన్న మగును. దేవాదిదేవుని యారాధనవలన మనుష్యుడు తన్ను దాను తరింపజేసికొని, తన పూర్వీకులనుగూడ దరింపజేయగలడు. అతడు విష్ణుమహామంత్రమును గ్రహించి హరిసేవ యొనరించును. అట్టి మానవుని జన్మయే సఫలమైన దని తెలిసికొనుము. హరినాశ్రయించిన భక్తుడు నిశ్చయముగ భవసాగరమును దరించి గోలోకము జేరి శ్రీకృష్ణపార్షదుడు కాగలడు, దేవీ! నీ వీపరమదుర్లభమగు శ్రీహరిమహామంత్రమును గ్రహించి వ్రతానుష్ఠానకాలమందు జపింపు" మని పలికి మహాదేవుడు గిరిజాదేవిని దోడ్కొని గంగాతీరమునకు జని యచట ప్రసన్నతాపూర్వకముగ గవచస్తోత్రసహితముగ

శ్రీమహావిష్ణుమంత్రము నుపదేశించెను. మునీశ్వరా! తదనంతర మాయన వ్రత విధానమును నియమములను పార్వతీదేవికి సవిస్తరముగ వివరించెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
గణపతిఖండములోని శ్రీకృష్ణ
వ్రతోపదేశ మనుమూడవ
అ ధ్యా య ము
సమాప్తము.



# నాలుగవ అధ్యాయము

## శివుడు పార్వతికి బుణ్యకవ్రతసామగ్రిని, విధిని, ఫలమును వివరించుట.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదమునీంద్రా! పుణ్యకవ్రతవిధానమును, సంక్షిప్తముగ భూతనాథుని ముఖారవిందమునుండి శ్రవణమొనరించి పార్వతి యత్యంతప్రసన్నురాలయ్యెను. తదనందర మామె వ్రతవిధానమును సవిస్తరముగ వివరింపవలసినదిగ మహాదేవుని ప్రార్థించెను.

**పార్వతి పలికెను :**

ప్రాణేశ్వరా! నీవు సకలవేదవేత్తలయం దగ్రగణ్యుడవు. కరుణాసాగరుడవు, పరాత్పరుడవు, దీనబాంధవుడవు. ఈపుణ్యకవ్రతవిధానమును నాకు సవిస్తరముగ నుపదేశింపవలసినదిగ ప్రార్థించుచున్నాను. హృదయేశ్వరా! ఏ యే ద్రవ్యములు, ఫలములు, నీ వ్రతమం దుపయోగింపవలయును? ఈవ్రతానుష్ఠానసమయ మేది? వ్రతనుష్ఠానసమయమం దేయే

నియమములను బాలింపవలెను? ఆహారనియమము లెవ్వి? ఈవ్రతాచరణము వలన సిద్ధించు ఫలములెవ్వి మొదలగు విషయముల నన్నింటిని సవిస్తరముగ నుపదేశింపవలసినదిగ బ్రార్థించుచున్నాను. దేవాదిదేవా! నే నీపుణ్యకవ్రత మును నిర్వర్తించుటకొఱ కుత్తమపురోహితుని, వ్రతద్రవ్యసముపార్జనము కొఱకు బ్రాహ్మణులను, వస్తుసేకరణముకొఱకు భృత్యులను నియమింపవలసి నదిగ గోరుచున్నాను. స్వామీ! స్త్రీలకు భర్తయేకదా సర్వస్వము. అతడే కదా సర్వాభీష్టములను బ్రసాదింపగలవాడు.

పితా కౌమారకాలే చ సదా పాలనకారకః ।
భర్తా మధ్యే సుతః శేషే త్రిధాఽవస్థాసు యోషితామ్ ॥ (6)

"స్త్రీని బాల్యావస్థయందు తండ్రి, యౌవనావస్థయందు భర్త, వార్ధక్య మందు బుత్రుడు నన్నివిధముల గౌరవించి పాలింతురు". ప్రాణనాథా! నీవు సర్వాత్ముడవు, పరమైశ్వర్యవంతులలో శ్రేష్ఠుడవు, సర్వసాక్షివి, సర్వజ్ఞుడవు. దేవా! ఆత్మనివృత్తికి కారణభూతు డైనయొకదివ్యపుత్రుని నా కనుగ్ర హింపుము.

పార్వతి ప్రార్థన నాలకించి కృపాసింధు వైనశివు డిట్లు పార్వతితో బలుక నారంభించెను.

## మహాదేవుడు పలికెను :

రాకేందువదనా! నే నీవ్రతవిధానమును, నియమములను, వ్రతోప యోగద్రవ్యములను, వ్రతఫలమును వర్ణించెద నవధరింపుము. ఈపుణ్యకవ్రత నిర్వహణముకొఱకు బురోహితునిగ సంపూర్ణవ్రతవిధాతయు, వేదవేత్తల యందు శ్రేష్ఠుడు, హరిభక్తులయం దున్నతుడు, ఉత్తమోత్తమజ్ఞానియు, సర్వజ్ఞుడు, నాసమానుడు నగుసనత్కుమారుని వినియోగించెదను. ఫలపుష్పా దుల సంగ్రహణము కొఱకు నూర్గురు సద్బ్రాహ్మణులను నియమించెదను. వ్రతసామాగ్రిని సేకరించుటకు నూర్గురు భృత్యులను నియమించెదను. ఇందు వదనా! పవిత్రలగ్నమాసన్న మైనపు డత్యంతనియమపూర్వకముగ నీ పవిత్ర వ్రతము ననుష్ఠాన మొనరింపవలెను. చారుశీలా! మాఘమాసమందు శుక్ల పక్షత్రయోదశీదిన మీ పుణ్యకవ్రతారంభమునకు శుభదినము. ఉత్తమసతి వైనస్త్రీవ్రతమున కొకదినము ముందే యుపవాస మాచరించి, యత్యంతనిర్మ లాంతరంగవై స్వచ్ఛవస్త్రములను ధరింపవలెను. వ్రతమునా డరుణోదయ

కాలమందు నిద్రమేల్కాంచి ముఖమును శుద్ధమొనరించుకొని, పరిశుద్ధజలము లందు స్నానమాచరించి, పవిత్రవస్త్రములను ధరించి, హరిస్మరణపూర్వకముగ నాచమన మొనరించి పవిత్రురాలు కావలెను. తదనంతరము భక్తిసహిత ముగ శ్రీహరికి నర్ఘ్య మర్పింపవలెను. పవిత్రాసనముపై గూర్చుండి తిలక మును ధరించి, యాచమన మొనరించి నిత్యకర్మలను సమాప్తము చేయవలెను. తదనంతరము పౌరోహితు నాహ్వానించి స్వస్తివచనపూర్వకముగ గలశస్థాపన మొనరింపవలెను. వేదవిహిత సంకల్ప మొనరించి యీపుణ్యకవ్రతానుష్ఠాన మారంభింపవలెను.

పిమ్మట శ్రీహరికి షోడశోపచారములను అనగా 1. ఆసనము 2. స్వాగ తము 3. పాద్యము 4. అర్ఘ్యము 5. ఆచమనీయము 6. స్నానము 7. మధు పర్కము 8. వస్త్రము 9. ఆభరణము 10. సుగంధపుష్పము 11. ధూపము 12. దీపము 13. నైవేద్యము 14. చందనము 15. యజ్ఞోపవీతము 16. తాంబూలము నర్పించి సత్పుత్రప్రాప్తికొఱకు కూష్మాండము, నారి కేళము, శ్రీఫలము మొదలగు ఫలముల నర్పింపవలెను. వ్రతకాలమందు కర తాళాదివాద్యములతో నవిచ్ఛిన్నముగ సంకీర్తనము చేసి శ్రీహరిని ప్రసన్నునిగ చేసికొనవలెను. శ్రీహరికి భోగమందు మనోహరము రుచికరము నగుపర మాన్నము, శర్కరాయుక్తమైనఘృతము మొదలగు మధురాతిమధుర పదా ర్థముల నర్పింపవలెను. శ్రీహరి కనేక పుష్పమాలలను, తులసీమాల లను భక్తిపూర్వకముగ నర్పింపవలెను. వ్రతకాలమందు శక్తికొలది భక్తు లకు, బ్రాహ్మణులకు, షడ్రసోపేతమైనసంతర్పణ మొనరింపవలెను. శ్రీవిద్యా! వ్రతసమయమం దాఱుమాసములు హవిష్యాన్నమును భుజింప వలెను. ఐదుమాసములు ఫలములనే యాహారముగ స్వీకరింపవలెను. ఒక పక్షకాలము కేవలము హవ్యమును భుజింపవలెను. చివరి పక్షము కేవ లము జలములను స్వీకరించి యుండవలెను. ప్రతిదిన మగ్ని దేవుని ప్రీత్యర్థమై నూఱురత్నదీపముల నర్పింపవలెను. రాత్రులయందు కుశాసనముపై నిత్యము జాగరణము చేయవలెను. వ్రతకాలమం దష్టవిధ మైథునముల బరిత్యజింపవలెను.

స్మరణం కీర్తనం కేలిః ప్రేక్షణం గుహ్యభాషణం ।
సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిర్వృతిరేవ చ ॥ (73)

అష్టవిధ మైథునములనగ 1. స్మరించుట 2. పాడుట 3. ఆడుట 4. తిరుగుట 5. రహస్యముగ మాట్లాడుట 6. సంకల్పము చేయుట 7. అధ్యావసాయము 8. క్రియానిర్వృతి.

'హ్రీం' కారమంత్రోజ్జ్వలా! నే నుపదేశించిన విధముగ బుణ్యకవ్రత మును సంపూర్ణ మొనరించి పిమ్మట ఉద్యాపనము చేయవలెను. ఆసమయమున మూడువందలయిరువది పళ్ళెరములలో భోజనపదార్థములను, యజ్ఞోపవీత ములను, వస్త్రములను, నుపహారములను నుంచి సద్బ్రాహ్మణులకు దాన మీయవలెను. ఒకవేయిమూడువందలయరువదిమంది యతిథులకు సంతర్పణ మొనరింపవలెను. ఒకవేయిమూడువందలయిరువది తిలాహుతులను యజ్ఞమం దర్పింపవలెను. వ్రతసమాప్తి యైనపిదప పురోహితున కభీష్టదక్షిణల నొసంగవలెను.

పూర్ణేందువక్త్రప్రభా! ఈ పుణ్యకవ్రతఫలస్వరూపముగ శ్రీహరియం దనన్యభక్తి, దాస్యసౌభాగ్యము లభింపగలవు. వ్రతి యైనస్త్రీకి శ్రీహరి సముడు, త్రిభువనవిఖ్యాతుడు నగుమహాపురుషుడు పుత్రునిగ లభింపగలడు. ఈవ్రతమాచరించిన కన్యలకు సకలసద్గుణసంపన్నుడు, సకలైశ్వర్యవంతుడు, హరిభక్తుడు నగుపతి లభింపగలడు. పుణ్యకవ్రతానుష్ఠానమువలన బురుషు లకు సకలైశ్వర్యములు, అనన్యమగు హరిభక్తి, యతులిత లక్ష్మీకటాక్షము లభింపగలదు. శ్రీచక్రాంకితబిందుమధ్యవాసినీ! నీ వీపుణ్యకవ్రతము నవశ్య ముగ ననుష్ఠింపుము. విష్ణుమాయా! నీకు నిశ్చయముగ శ్రీహరియే సత్పుత్రుని రూపమున నుదయింపగలడు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని పుణ్యకవ్రత
విధానమను నాలుగవ
అధ్యాయము
సంపూర్ణము.



# ఐదవ అధ్యాయము

## పుణ్యకవ్రతమాహాత్మ్యమును వివరించి శివుడు తపస్సుచేయ వెడలుట.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదమునీంద్రా! పార్వతిదేవి ఈపుణ్యకవ్రతకథను గుఱించి మహేశ్వరు నిట్లు ప్రశ్నించెను. "నాథా! ఈవ్రతఫలమెంత యద్భుతము? ఎవరు ప్రథమమున నీవ్రత మాచరించిరి? ఆయుత్తమచరితమును వర్ణింపవలనదిగ ప్రార్థించుచున్నాను".

వ్ర త క థ :

**మహాదేవుడు పలికెను :**

ప్రియా! మనువుభార్య యగు శతరూప సంతానహీనయైన కారణమున దుఃఖముతో చింతాక్రాంతయై బ్రహ్మలోకమునకు జని బ్రహ్మదేవు నిట్లు ప్రార్థించెను. "బ్రహ్మదేవా! నీవే ఈజగత్సృష్టికి గారణుడవు. సంతానహీనులైనవారికి సత్పుత్రప్రాప్తి గల్గు నుపాయమును గృపతో నుపదేశింపవలసినదిగ గోరుచున్నాను. పుత్రసంతానములేనిచో జన్మము, ఐశ్వర్యము, ధనము మొదలగునవన్నియు నిష్ప్రయోజనములేకదా! గృహమునకు సంతానమే యత్యంతశోభను గల్గించును. జీవు లాచరించిన తపోపుణ్యములు జన్మాంతరములయందే సౌఖ్యములను జేకూర్చును, కాని సత్పుత్రుడు జననీజనకుల కీజన్మమందే యనంత సుఖములను, మోక్షమును బ్రసాదింపగలడు. నిశ్చయముగ బుత్రుడు జననీజనకులను బున్నామనరకమునుండి రక్షింపగలడు. పుత్రసంతానములేక తపించుచున్న నాకు సత్పుత్రప్రాప్తికొఱకై యుపాయమును నుపదేశింపుము. నీ వట్లుపదేశింపకున్న నేను, నాభర్త యిప్పుడే వానప్రస్థాశ్రమమును స్వీకరించి తపమాచరించుట కరణ్యముల కేగెదము. నీవే యీసకల సామ్రాజ్యమును గ్రహించి పరిపాలింపుము. పుత్రవిహీనుల మైనమాకీ సామ్రాజ్యాది సకలసంపదలవలన నేమిప్రయోజనము?" అని దుఃఖించుచున్న శతరూపను గాంచి బ్రహ్మ కరుణాంతరంగుడై సత్పుత్రోదయమున కేకైక కారణ మైనవ్రతము నుపదేశించెను.

**బ్రహ్మదేవుడు పలికెను:**

"శతరూపా! మాఘమాసమందు శుక్లపక్షత్రయోదశిదినమున శుభ ముహూర్తమందు శ్రీకృష్ణుని యారాధనరూపమైనదివ్యపుణ్యకవ్రతా నుష్ఠానమును ప్రారంభింపుము. వేదమందు కాణ్వశాఖలో నీవ్రతవర్ణనము సవిస్తరముగ గలదు. పుణ్యకవ్రతము నొకసంవత్సరపర్యంత మాచరింపవలెను. శోభనా! నీ వీవ్రత మాచరించి విష్ణుసములు, పరమపరాక్రమవంతులు నగు బుత్రులను బడయుము".

బ్రహ్మదేవు నాదేశానుసారము సాధ్వి యగుశతరూప పుణ్యకవ్రతా నుష్ఠానమొనరించి ఫలస్వరూపముగ ప్రియవ్రతుడు ఉత్తానపాదుడు, ననునిర్వురు కుమారులను గనెను. దేవహూతి యీవ్రతానుష్ఠానఫలరూపముగ గపిలమహ ర్షినే పుత్రునిగ బడసెను. శక్తిపత్ని పరాశరుని బుత్రునిగ బొందెను. అదితి ఈవ్రతానుష్ఠానమువలననే వామనునకు మాతృమూర్తియైనది. శచీదేవి జయం తుని, ఉత్తానపాదునిపత్ని ధృవుని, కుబేరుని యర్ధాంగి నలకూబరుని గుమారు లుగ బడసినారు. సూర్యపత్ని మనువును, అత్రిభార్య చంద్రుని, ఆంగీరసుని యర్ధాంగి బృహస్పతిని, భృగుపత్ని శుక్రాచార్యుని నుత్తమ పుత్రులుగా బడ సిరి. గిరిరాజనందినీ! నీవుకూడ నీపుణ్యకవ్రత మనుష్ఠించిన సంపూర్ణ దేవతలకు నీశ్వరుడు, స్వయముగ గోపేశ్వరుడు, గోలోకనాథుడు నగుశ్రీకృష్ణపర మాత్మనే పుత్రునిగా బడయగలవు. ఇట్లు శంకరుడు పార్వతికి బుణ్యకవ్రత విషయ ముపదేశించె ననినారాయణఋషి నారదునకు వివరించెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
గణపతిఖండములోని పుణ్యకవ్రతమాహాత్మ్య
వివరణమను నైదవ అధ్యాయము
సంపూర్ణము.



# ఆఱవ అధ్యాయము

## పార్వతివ్రతారంభప్రయత్నము, బ్రహ్మాదిదేవతాగమనము, శివుడు పుణ్యకవ్రతమునుగూర్చి విష్ణువునడుగుట, విష్ణువు వ్రతమాహాత్మ్యమును, గణేశోత్పత్తిని వర్ణించుట.

**నారదుడు పలికెను :**

మునిశ్రేష్ఠా! మహాభాగా! పుణ్యకవ్రతావలంబయైనపార్వతికి, గోపేశ్వరేశ్వరుడైనశ్రీకృష్ణు డెట్లు పుత్రుడుగ నావిర్భవించెను?

**శ్రీనారాయణఋషి పలికెను :**

దేవర్షీ ! మహాదేవుడు పార్వతికి వ్రతవిధానము నుపదేశించి వ్రతానుష్ఠానముకొఱకు బురోహితాదులను నియమించి శ్రీకృష్ణుని ధ్యానమందు లగ్నమయ్యెను. శంకరుడు శ్రీహరిస్వరూపమే. శివకేశవాదులకు భేదము లేదు. కావున హరుడు సర్వదా శ్రీహరియారాధనమందే సంలగ్నుడై యుండును. శివలోకమందు బార్వతీదేవి బ్రహ్మమానసపుత్రుడైనసనత్కుమారుని బురోహితునిగ జేసికొని పుణ్యకవ్రత మారంభించెను. బ్రహ్మ విష్ణువులు, వాణీ లక్ష్ములతోగూడి వ్రతసమయమున గైలాసమున కేతెంచిరి. అనంతరము సనకసనందనాదులు, కపిలమహర్షి, ఆసురి, క్రతువు, హంస, ఓఢుడు, పంచశిఖుడు, ఆరుణి, యతి, సుమతి, వశిష్ఠుడు, పులహుడు, పులస్త్యుడు, అత్రి, భృగువు, అంగిరసుడు, అగస్త్యుడు, ప్రచేతసుడు, దూర్వాసుడు చ్యవనుడు, మరీచి, కశ్యపుడు, కణ్వుడు, జరత్కారుడు, గౌతముడు, బృహస్పతి, ఉతథ్యుడు, సంవర్తుడు, సౌభరి, జాబాలి, జమదగ్ని, జైగీషవ్యుడు, దేవలుడు, గోకాముఖుడు, వక్రరథుడు, పారిభద్రుడు, పరాశరుడు, విశ్వామిత్రుడు, వామదేవుడు, ఋష్యశృంగుడు, విభాండకుడు, మార్కండేయుడు, మృకండుడు, పుష్కరుడు, లోమశుడు, కౌత్సుడు, వత్సుడు, దక్షుడు, బాలాగ్ని, అఘమర్షణుడు, కాత్యాయనుడు, కాణాదుడు, పాణిని, శాకటాయనుడు, శంఖుడు, ఆపిశలుడు, శాకల్యుడు, శంఖుడు మున్నగు మహర్షులు

ధర్మసంభవులైన నరనారాయణులు శివలోకమున కరుదెంచిరి. పార్వతి యొనరించు నావ్రతమును దర్శించుటకు దిక్పాలకులు, దేవతలు, యక్షులు, గంధర్వులు, కిన్నరులు సానందముగ గైలాసమున కేగుదెంచిరి. పార్వతిజనకుడైనహిమవంతు డనేకరత్నభూషణములతో నసంఖ్యాకములైనగానుకలతో సపత్నీపరివారముగ కైలాసమున కరుదెంచెను. శివలోకవాసులైనప్రమథులు కైలాసము ననేకవిధముల నలంకరించిరి. రాజమార్గములయందు చందనాదిపరిమళద్రవ్యములను ప్రోక్షణ మొనరించిరి. పద్మరాగమణులతో నిర్మింపబడిన శివమందిరమునకు ఆమ్రపల్లవతోరణముల నలంకరించిరి. సర్వదేవతలు, మహర్షులు మొదలగువారు నేత్రపర్వముగ నావ్రతసంరంభమును వీక్షింపసాగిరి.

మహాదేవుడుకూడ వ్రతసమయమున కైలాసమం దుపస్థితుడై ఆహూతులైనఅతిథులనందఱిని సత్కరించుచుండెను. పార్వతి వ్రతసమయమున నింద్రుని ధనాధ్యక్షునిగ, కుబేరుని కోశాధ్యక్షునిగ, సూర్యుని ఆదేశములనిచ్చువానినిగ, వరుణుని భోజనశాలాధిపతిగ, నియమించెను. భోజనశాలయందు క్షీరములు, దధి, ఘృతము మొదలగు పదార్థములు నదులవలె ప్రవహించుచుండెను. ధాన్యములు, చక్కెర మొదలగునవి పర్వత పరిణామమున గన్పడుచుండెను. వ్రతకాలమం దవిచ్ఛిన్నముగ దానము లొనరించుటకు పార్వతి కైలాసమునంతటిని దివ్యరత్నములతో, మణులతో, మాణిక్యములతో, వజ్రవైడూర్యాదులతో, సువర్ణములతో నింపినది. లక్ష్మి వివిధరకములైన భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య, మధురపదార్థములతో గూడిన భోజనము నాహూతులకొఱకై సిద్ధ మొనరించెను. స్వయముగ శ్రీమన్నారాయణుడే సమస్త దేవర్షిగణములననుమ నాసీనుడై పార్వతిచే నర్పింపబడిన ఆతిథ్యమును స్వీకరించెను. వేలకొలదిగ సద్బ్రాహ్మణులు వడ్డనలు చేసి యతిథులకు సంతుష్టి జేకూర్చిరి. ఆసమయమున క్షీరసాగరశయనుడైనశ్రీమన్నారాయణుడు తనపార్షదులచే బరివేష్టితుడై రత్నసింహాసనాసీనుడై యుండగ సకలదేవ మహర్షి సిద్ధులాయనను స్తుతింపదొడంగిరి. శంకరుడు బ్రహ్మప్రేరితుడై శ్రీమహావిష్ణువును భక్తిపూర్వకముగ నిట్లు ప్రార్థించిరి. "ప్రభూ! నీవు శ్రీనివాసుడవు, సకల తపస్స్వరూపుడవు, సర్వ కర్మఫలప్రదాతవు, సర్వపూజితుడవు, సకలపాపహారివి. వ్రత, జప, తపయజ్ఞాదిదివ్యకర్మలకు బీజస్వరూపుడవు.

సకలాభీష్టములను ప్రసాదింపగల కల్పవృక్షసముడవు. దేవా! నాయర్థాంగి యగుపార్వతి యుత్తమోత్తము డైనకుమారునికొఱ కీవ్రతమును సంకల్పించి నది. నీవు దయతో నామె ననుగ్రహింపు" మని పలికి శివుడు శ్రీమహావిష్ణువు ననేకవిధముల స్తుతించెను. మహాదేవుని ప్రార్థనల నాలకించి శ్రీమహా విష్ణువు సంతుష్టుడై యిట్లు పల్కెను.

## శ్రీ మహావిష్ణువు పలికెను :

పార్వతీపతే! నీయర్థాంగి సత్పుత్రప్రాప్తికొఱ కుత్తమపుణ్యకవ్రతమాచ రించుచున్నది. ఈవ్రతము సకలవ్రత సారతత్త్వము,సౌభాగ్యబీజము, సర్వాభీష్ట ఫలప్రదాయకము నై యున్నది. సర్వులకాత్మయు, సర్వసాక్షిస్వరూపుడు, దివ్య జ్యోతిస్స్వరూపుడు, సనాతనుడు, ఆశ్రయరహితుడు, నిర్లిప్తుడు, ఉపాదిరహితుడు, నిరామయుడు, భక్తప్రాణస్వరూపుడు, భక్తానుగ్రహవిగ్రహుడు, అనన్య భక్తవశీభూతుడు, బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులకు మూలమైనవాడు, మహా విరాట్పురుషుడే షోడశాంశగ గలవాడు, ప్రకృతికతీతుడు, అవినాశియు నగు శ్రీకృష్ణపరమాత్మ అనన్యభక్తియుక్తమైన నీపుణ్యకవ్రతమునకు దక్క అన్యో పాయములచే నెన్నిజన్మలకైనను సాధ్యుడు కాడు. సూర్యుని, శివుని నారా యణీమాయను, కాలాదులను దీర్ఘకాల ముపాసించిన పిమ్మటనే మనుష్యుడు పవిత్రుడై శ్రీకృష్ణభక్తిని బొందగలడు. మహాదేవా! అన్యదేవతారాధన మనుపరిపక్వముగాని భక్తిని బొంది జీవు డనేకజన్మము లెత్తి ననుభారతవర్షమున జన్మించి, శ్రీకృష్ణభక్తులను సేవించి వారి సాంగత్యమువలన తనభక్తిని బరి పక్వ మొనరించుకొనగలడు. ఆసమయముననే యతనికి శ్రీకృష్ణమహా మంత్రము లభింపగలదు. శ్రీకృష్ణమంత్రజపము కృష్ణానుగ్రహమున కధికా రిగ నొనరించి మానవునకు సంపూర్ణ ఫలములను ప్రసాదింపగలదు. చిర కాలము శ్రీకృష్ణు నారాధించిన యనన్యభక్తుడు శ్రీహరితుల్యుడు కాగలడు. మహాప్రళయకాలమందు సమస్తజగములయం దున్న సృష్టియంతయు నశింప గలదు. కాని శ్రీకృష్ణుని యనన్యభక్తులుమాత్రము నాశములేనివారై గోలోక మందు నివసింపగలరు. మహేశ్వరా! నీవు సర్వులకు లయకారుడవే కాని కృష్ణభక్తులకు గావు. మాయ సర్వజీవులను మోహింపజేయగలదు, కాని కృష్ణభక్తుల విషయములో నామెసయిత మశక్తురాలే. హరా! నారాయణీ మహామాయ సమస్తజీవులకు మాతృమూర్తి. ఆమె యనన్యానుగ్రహము

వలననే జీవులకు శ్రీకృష్ణభక్తి లభింపగలదు. అయ్యాద్యశక్తియే మూల ప్రకృతి యగునీశ్వరి, కృష్ణప్రియ, కృష్ణతుల్య, అవినాశిని, యఖండ తేజస్వరూపిణి, స్వేచ్ఛారూపధారిణి. ఆమె దైత్యులను వధించుటకు సకల దేవతా తేజములతో బరిపూర్ణమై యావిర్భవించెను. ఆమూలప్రకృతియే సకల దుష్టరాక్షస సంహార మొనరించి దక్షకన్యగ నవతరించెను. మహేశ్వరా! నిన్ను యజ్ఞసభామధ్యమున దక్షుడు నిందింపగా సాకఠోరనిందాలాపములను వినలేక సతి తనశరీరమును త్యజించి శైలరాజపుత్రికయై మరల జన్మించి నీ యర్ధాంగియైనది. మహేశ్వరా! అట్టి యాద్యాశక్తియైనపార్వతి నిశ్చయముగ నీపుణ్యకవ్రతమును లీలాపూర్వకముగ సంపూర్ణ మొనరింపగలదు. పుణ్యక వ్రతప్రభావమువలన నామెకు సహస్రరాజసూయయజ్ఞఫలము లభింపగలదు. ఆ పుణ్యఫలస్వరూపముగ గోలోకనాథుడు, సర్వేశ్వరేశ్వరుడు నగుశ్రీకృష్ణపర మాత్మపార్వతీదేవికి కుమారునిగ నావిర్భవింప గలడు. పార్వతీదేవికి బుత్రునిగ నావిర్భవించు నాకృపానిధి స్వయముగ సమస్త దేవగణములకు నీశ్వరుడు. అందువలననే యాపార్వతీతనయుడు సకలలోకములలో గణేశ్వరు డను నామమున విఖ్యాతి నొందగలడు. ఆదేవుని స్మరణమాత్రమున నిశ్చయముగ సర్వ విఘ్నములు నశింపగలవు. ఆకారణముననే యావిభుడు విఘ్ననిఘ్నుడగును.

విశ్వములలో నసంఖ్యాకు లగుభక్తు లర్పించిననానావిధము లగునైవేద్యముల నారగించి ఆయన యుదరము వృద్ధికాగలదు. అందువలన గిరిజానందనుని భక్తులు లంబోదరు డనికీర్తింతురు. శనైశ్చరుని దృష్టిపాతము వలన శిరము తెగగా ఆయనకు గజశిరము నమర్చెదరు. అందువలననే ఆయనను గజానను డందురు. పరశురామునివలన ఈయన యొకదంతము ఖండింపబడగలదు, దానివలన గజాననుని యేకదంతు డనిసర్వదేవతలు కీర్తించెదరు, ఐశ్వర్యవంతుడైననేకదంతుడు సమస్త దేవగణములకు సర్వజగములకు బూజ్యుడు కాగలడు. మదనుగ్రహమువలన సర్వదేవతలకంటె ప్రథమమున నీగణేశ్వరు డగ్రపూజ లొందగలడు. సర్వదేవతారాధనలో ప్రథమమున విఘ్నవినాశకుడైనగణేశ్వరుని పూజించినవారు నిర్విఘ్నముగ దైవారాధన సమాప్త మొనరించి నిశ్చయముగ బూజాఫలమును బొందగలరు. గణేశ్వరారాధన మొనరింపనివారి పూజలు వ్యర్థములగును.

ప్రథమమున గణేశ్వరుని, సూర్యుని, విష్ణువును, శంకరుని, అగ్నిని, దుర్గను బూజించిన యనంతరమే యన్యదేవతారాధన మొనరింపవలెను. గణేశ్వరునిపూజ లొనర్చిన సకలవిఘ్నములు నాశనముకాగలవు. సూర్యారాధనవలన దేహధారులు పరిపూర్ణారోగ్యవంతులు కాగలరు. విష్ణుకైంకర్యమువలన జీవులు పవిత్రులు, పాపవిముక్తులు, కీర్తివంతులు, ఐశ్వర్యవంతులునై యంత్యకాలమున మోక్షసామ్రాజ్యమును బొందగలరు. శంకరుని యారాధనము తత్త్వజ్ఞానవిషయలబ్ధికి బీజము, హరిభక్తిప్రదము. అగ్నిదేవుని పూజ జీవునిబుద్ధిని బరిశుద్ధ మొనరించును. పరబ్రహ్మముద్వారమున సంస్కృతమైనయగ్నిని బూజించిన మనుష్యుడంత్యకాలమందు జ్ఞానియై ముక్తిని బొందగలడు. శంకరాగ్నిదేవుల సేవనమువలన నంత్యకాలమందు జీవునకు శ్రీకృష్ణుని దివ్యనామము జ్ఞప్తియందుండగలదు. దుర్గాదేవియొక్క యర్చన హరిభక్తిప్రదాయకము. పరమమంగళదాయకము. ప్రకృతిస్వరూపిణి యైన దుర్గాదేవిని యారాధింపక యన్యదేవతల నారాధించిన యవి ఫలింపవు. గణేశ్వరుడు మొదలగు నీ దేవతలు నిత్యులు సృష్టిపరాయణులు.

అని పలికిన శ్రీమహావిష్ణువుయొక్క దివ్యవచనముల నాలకించి పార్వతీసహితుడైనశంకరుడు, సమస్త దేవతలు, మహర్షులు నత్యంత ప్రసన్నులైరి.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమునందలి
గణపతిఖండములోని నారదనారాయణ
సంవాదమున పుణ్యకవ్రతాజ్ఞగ్రహణ
మను నాఱవ అధ్యాయము
సంపూర్ణము.



# ఏడవ అధ్యాయము

## పార్వతి వ్రతమునారంభించుట, వ్రతసమాప్తమున బురోహితుడు శివుని దక్షిణరూపమున నడుగుట, పార్వతీదేవి విషాదముచెందుట, నారాయణుడు పతికి బదులుగా గోమూల్యమునిచ్చి వ్రతమును బూర్తి చేయవలసినదిగ నాదేశించుట, పురోహితుడంగీకరింపకపోవుట, అద్భుత తేజోరూపమున నావిర్భవించిన శ్రీకృష్ణుని బార్వతీసహితులగు దేవతలందఱు స్తుతించుట.

**శ్రీనారాయణఋషి పలికెను :**

బ్రహ్మపుత్రా! ఒకశుభముహూర్తమున పరిశుద్ధురాలైనపార్వతీదేవి యగ్నిశుద్ధదివ్యాంబరములను ధరించి మణిమయాభూషణములతో విభూషితయై చందనాగరుకస్తూరీకుంకుమానులేపనములతో నలంకరించుకొని, చూత పల్లవములతో, బవిత్రగంగాజలములతో సంయుక్తమైయున్న రత్నకలశమును ధాన్యరాశిపై నుంచెను. రత్నసింహాసనాసీనులైయున్న పురోహితుడగు సనత్కుమారుని, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను భక్తితో నర్చించి గిరిరాజ నందిని స్వస్తివచనపూర్వకముగ బుణ్యకవ్రత మారంభించెను. ఆమె మాంగలికకలశమందు దనయిష్టదైవమైనశ్రీకృష్ణు నావాహనము జేసి షోడశోపచారములతో ననేకములగు నమూల్యద్రవ్యములను గైంకర్య మొనరించెను. తదనంతరము వేదమంత్రోచ్చారణ పూర్వకముగ దిలలతో, ఘృతముతో మూడులక్షల యాహుతులను యజ్ఞకుండమందు హరిప్రీత్యర్థముగ హవనముజేసి బ్రాహ్మణులకు, సకలదేవతలకు నాహూతులైన నతిథులకు దివ్యభోజనము నొసంగి వారిని దృప్తిబరచెను. ఇట్లు పార్వతీదేవి పుణ్యక వ్రతము నొకసంవత్సరపర్యంతము ప్రతిదినము విధిపూర్వకముగ నాచరించి సంపూర్ణ మొనరించెను. వ్రతసమాప్తియైనదినమున బురోహితుడగుసనత్కు-

మారుడు మహాదేవునే పుణ్యకవ్రతదక్షిణగ నొసంగు మనిపార్వతీదేవిని గోరెను. పార్వతి మాయాస్వరూపిణి యైనను శ్రీకృష్ణమాయవలన మోహితయై భర్తనే దక్షిణగా నొసంగు టెట్లని విలపింపదొడంగెను. చింతాక్రాంత యైన పార్వతిని గాంచి మహాదేవు డిట్లుపల్కెను. "చంద్రార్కచూడామణీ! దక్షిణ సమస్తసత్కర్మలకు సారభూతము. దేవీ! దక్షిణరహితముగ నొనర్చిన దైవకార్యములు, పితృకార్యములు నిష్ఫలములు కాగలవు. దక్షిణ నర్పింపని దాత కాలసూత్ర మనునరకమును బొందగలడు". అనంతరము శ్రీమహావిష్ణువు పార్వతితో నిట్లు పల్కెను. "శివభామినీ! ధర్మనిర్వాహణవిషయమున నీవు నీధర్మమును సంరక్షించుకొనుము. స్వధర్మమును బరిపాలించినవా రా ధర్మముచే నిశ్చయముగ రక్షింపబడెదరు. కావున దేవీ! సనత్కుమారున కభీష్టదక్షిణ నొసంగి పుణ్యకవ్రతమును సంపూర్ణ మొనరింపుము." బ్రహ్మ పార్వతి నుద్దేశించి యిట్లనెను. "రాజరాజేశ్వరీ! ధర్మమును రక్షింపనివారు నిశ్చయముగ నశింపగలరు. అందువలన దేవీ! వ్రతధర్మముతప్పక నీవు దక్షిణ నొసంగుము". స్వయముగ ధర్మదేవత యిట్లు పల్కెను. "జననీ! దుర్గా! నీప్రాణేశ్వరుని దక్షిణగ నొసంగి ప్రయత్నపూర్వకముగ నన్ను రక్షింపుము. నేను రక్షింపబడిన నీకు సర్వము శుభప్రదము కాగలదు". పిమ్మట సనత్కుమారు డిట్లు పల్కెను. "శివవామభాగనిలయా! నాకు సదాశివునే దక్షిణగ నొసంగుము లేనిచో నీవు సముపార్జించిన పుణ్యము నంతటిని నా కొసంగుము. దక్షిణరహితముగ గర్మనిర్వర్తించిన పురోహితుడు దాత యొక్క యాదివ్యకర్మ ఫలమును బొందగలడు. కావున నేనుకోరిన దక్షిణ నొసంగి పుణ్యకవ్రతఫలమును నీవే పొందుము". మహాపురుషుల వచనముల నాలకించి మాయామోహిత యైనపార్వతి యిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "ప్రాణేశ్వరునే దక్షిణగా నొసంగు వ్రతమువలన నా కేమిఫలము సిద్ధింపగలదు? దక్షిణ నొసంగినను భర్త లేనిచో పుత్రప్రాప్తివలన, వ్రతఫలప్రాప్తి వలన నా కేమి ప్రయోజనము గలుగును? ప్రాణము లేనిశరీరమున కెన్ని యలంకారము లున్నను నేమి ప్రయోజనము? దృష్టిశక్తి నశించిన నేత్రములవలన బ్రయోజన మేమికల్గును? సురేశ్వరులారా! సాధ్వి యగుస్త్రీకి నసంఖ్యాకు లైనపుత్రులకంటెను భర్తయే యధిక ప్రియతముడు. ఈవ్రత

మందు ప్రాణవల్లభు డైననాథర్తను దక్షిణగా నొసంగి దానివలన లభించు పుత్రునివలన నా కేమి ప్రయోజనముండును?"

ఈ ప్రకారముగ గైలాసమందు దక్షిణ విషయమై వివాదము జరుగుచుండగ వేదికామధ్యమున వైకుంఠేశ్వరు డైన శ్రీమన్నారాయణుడు సాక్షాత్కరించెను. నారాయణుని గాంచి నారాయణి యనేకవిధముల స్తుతించెను. శ్రీమన్నారాయణుడు సర్వజ్ఞుడు కావున విషయమంతయు గ్రహించి సభాసీను లైనసురగణములతో నిట్లు పల్కెను. సురలారా! నేను తక్క పిపీలకాది బ్రహ్మపర్యంతము వ్యాప్తమైయున్న త్రిగుణస్వరూపిణియైనప్రకృతినుండియే జగములన్నియు జనించినవే. ఇది పరమసత్యము. విశ్వమం దున్నసమస్తజీవులు నేశక్తి వలన శక్తివంతు లైయున్నారో ఆశక్తిని నేనే సృష్టించితిని. సృష్ట్యాదియందు శక్తి నాసంకల్పమువలన జన్మించి జగత్సంహారకాలమందు నాయందే లయము కాగలదు. నామాయ యైన ప్రకృతి సర్వవిశ్వములకు జనని. అనంతకాలము సదాశివుడు నన్నారాధించి తత్ఫలస్వరూపముగ మాయా శక్తిస్వరూపిణి యైనప్రకృతిని అర్థాంగిగ బొందెను. జగజ్జనని యైనపార్వతి లోకకళ్యాణము కొఱకే యీపుణ్యకవ్రత మాచరించుచున్నది. సత్యముగ స్వఫలాపేక్షకొఱకు కాదు. ఏలయన, త్రిలోకములయందు జీవులచే నాచరింపబడు సకలవ్రతములకు, తపములకు ఫలము లొసంగుదేవత స్వయముగ నాదేవియే. దుర్గాదేవి మాయవలన సకలప్రాణులు "నేను, నాది" యను మోహముచే వంచితులైయున్నారు. సురశ్రేష్ఠు లైన బ్రహ్మ, విష్ణుమహేశ్వరులు మత్కళాంశసంభూతులే. దేహధారు లైనసర్వప్రాణులు, దేవతలు నా కళాస్వరూపులే. మట్టిలేనిదే కుమ్మరి కుండలు చేయలేనట్లు, సువర్ణము లేనిదే స్వర్ణకారుడు స్వర్ణాభూషణములను నిర్మింపలేనట్లు శక్తియోగము లేనిదే నేను సృష్టిని చేయజాలను.

సృష్టియందు శక్తియే ప్రధాన మైయున్నది. నేను సమస్త దేహధారులలో నాత్మగను, అదృశ్యసాక్షిగను నుండెదను. ప్రకృతివలన నుత్పన్నములు పాంచభౌతికములు, త్రిగుణాత్మకములు నగుజగము లన్నియు నశ్వరములని గ్రహింపుము. కాని యనంతప్రకాశవంతుడ నైన నేనే నిత్యుడ నని తెలిసికొనుడు. జగములలో సర్వులకు ప్రకృతియే యాధార స్వరూపిణి. దేహధారులలో నే నాత్మగను, బ్రహ్మయే మనస్సుగను, మహే

శ్వరుడే జ్ఞానముగను, విష్ణుదేవుడే పంచప్రాణములుగను నుందుము. ఐశ్వర్య శాలిని యైనప్రకృతి బుద్ధినై యుండును, మేధస్సు, జాగ్రత్సుషుప్త్యాదులు నన్నియు ప్రకృతియొక్క కళలే. దేవతలారా! ఆపరాప్రకృతియే యీ పార్వతి, నేనే వైకుంఠమందు శ్రీమహాలక్ష్మీపతినై చతుర్భుజరూపముతో ప్రకాశించెదను. నేనే గోలోకపరంధామమందు శ్రీకృష్ణుడనై, గోపగోపీజన పరివేష్టితుడనై ద్విభుజరూపముతో ననన్యభక్తుల నెల్లపుడు రక్షించుటకు సిద్ధముగ నుండెదను. వైకుంఠలోకముపైన నేబదికోట్లయోజనముల దూరమున గోలోకదివ్యధామము కలదు. ఆ పరంధామమే సచ్చిదానందవిగ్రహుడనైన నాకు నివాసస్థానము. సకలజీవు లాద్విభుజరూపధారి యైనగోలోకనాథునే వ్రత, తపో, జప, పూజలద్వారమున నారాధింతురు. శ్రీకృష్ణపరమాత్మయే సకలవ్రతఫలప్రదాత. ఎవ రే యే రూపములతో నాపరమాత్మను భజింతురో వారికి ఆయన యాయారూపములతో దర్శనమొసంగి యభీష్టఫలములను ప్రసాదించును. పార్వతీదేవి! నాయనుగ్రహమువలన నిన్నావహించిన నాత్మమాయ తొలగెను. నీవు సాక్షాత్తుగ నాద్యాప్రకృతివి. నిస్సంకోచముగ శివుని దక్షిణగ నొసంగి పుణ్యకవ్రతమును బరిసమాప్త మొనరింపుము. జగదీశ్వరీ! గోవులు నారాయణుని స్వరూపములు. శివుడుకూడ నారాయణుడే. అందువలన నీవు సనత్కుమారునకు గోవులను మూల్యముగా నొసంగి నీప్రాణేశ్వరుని దిరిగి పొందుమని పార్వతీదేవి నాదేశించి శ్రీమన్నారాయణు డంతర్ధానమయ్యెను. పార్వతి యజ్ఞమందు పూర్ణాహుతి నిడి పరమశివునే వ్రతదక్షిణగ సనత్కుమారున కొసంగెను. బ్రాహ్మణశ్రేష్ఠుడైనసనత్కుమారుడు స్వస్తివచనముల బలికి మహాదేవుని దక్షిణగ గ్రహించెను. ఒకలక్ష గోవులను మూల్యముగ గ్రహించి పరమేశ్వరుని తిరిగి యిప్పింపమని సనత్కుమారుని బార్వతి ప్రార్థించెను. పార్వతి యభ్యర్థనను విని గోవులకొఱకు జగన్నాథుడైనశంకరుని తిరిగి యీయలే ననిసనత్కుమారుడు ప్రత్యుత్తరమిచ్చెను. తనకు వ్రతఫలము కలుగలే దనియు, శంకరుడు దూరమయ్యె ననియు బార్వతిచింతింపదొడంగెను.

ఏతస్మిన్నన్తరే దేవాః పార్వతీసహితా స్తదా ।
సద్యో దదృశురాకాశే తేజసాం నికరం పరమ్ ॥
కోటిసూర్యప్రభోర్ధ్వం చ ప్రజ్వలన్తం దిశో దశ ।
కైలాసశైలం పురతః సర్వదేవాదిభిర్యుతమ్ ॥

సర్వాన్ కుర్వన్తం ప్రచ్ఛన్నం విస్తీర్ణం మణ్డలాకృతమ్ ।
దృష్ట్వా తం చ భగవతస్తుష్టువుస్తే క్రమేణ చ ॥ (93-95)

ఆసమయమున వ్యోమపథమున బరమోత్కృష్టమగు నఖండ తేజః పుంజము ప్రకాశించుటను బార్వతితోఁ గూడసకల దేవతలు, మహర్షులుఁ గనుగొనిరి. అనంతప్రచండసూర్యప్రకాశమును మించి ప్రకాశించు నాదివ్య తేజస్సు సర్వ జగములను నాచ్ఛాదిత మొనరించెను. ఆపరబ్రహ్మ తేజమును గాంచి సకల దేవతలు మహర్షులు హస్తములను ముకుళించి వినమ్రులై యనేకవిధముల స్తుతింపదొడంగిరి.

విష్ణురువాచ :

బ్రహ్మాణ్డాని చ సర్వాణి యల్లోమవివరేషు చ ।
సోఽయం తే షోడశాంశశ్చ కే వయం యో మహావిరాట్ ॥ 96

విష్ణుదేవుడు పలికెను :

దేవా! రోమకూపములయందు సర్వబ్రహ్మాండములనునిలుపుకొనియున్న యా మహావిరాట్పురుషుడు నీయందు బదునాఱవయంశయే యైయుండగా నిక మేమెంతటివారము?

బ్రహ్మోవాచ :

వేదోపయుక్తం దృశ్యం యత్ ప్రత్యక్షం ద్రష్టుమీశ్వర ।
స్తోతుం తద్ వర్ణితమహం శక్తః కిం స్తౌమి పరాత్పరః ॥ 97

బ్రహ్మదేవుడు పనికెను :

పరమేశ్వరా! వేదములయందుపయుక్తమైనదానిని, ప్రత్యక్షదర్శనీయమైనదానిని వర్ణించుటకు నేను సమర్థుడను కాని వేదాతీతుడవగు నిన్నేమని స్తుతింపగలను?

శ్రీమహాదేవ ఉవాచ :

జ్ఞానాధిష్ఠాతృదేవోఽహం స్తౌమి జ్ఞానపరం చ కిమ్ ।
సర్వానిర్వచనీయం తం త్వాం స్వేచ్ఛామయం విభుమ్ ॥ 98

శ్రీమహాదేవుడు పలికెను:

దేవా! అనిర్వచనీయుడవు, స్వేచ్ఛామయుడవు, సర్వవ్యాపివి, జ్ఞానాతీతుడవు నగునిన్ను కేవలము జ్ఞానాధిష్ఠాతనగు నే నేమని స్తుతింపగలను?

ధ ర్మ ఉ వా చ :

> అదృశ్యమవతారేషు యద్దృశ్యం సర్వజన్తుభిః ।
> కిం స్తౌమి తేజోరూపం తద్ భక్తానుగ్రహవిగ్రహమ్ ॥ 99

ధ ర్మ దే వు డు ప లి కె ను :

దేవా! నీ వదృశ్యుడవైనను నవతారసమయమందు సకలప్రాణులకు దృశ్యుడవయ్యెదవు. నీవు భక్తులకు మూర్తిభవించిన యనుగ్రహస్వరూపుడవై యున్నావు. అఖండ తేజోరూపుడవైనని న్నేమని స్తుతింపగలను?

దే వా ఊ చుః :

> కే వయం త్వత్కలాంశాశ్చ కిం వా త్వాం స్తోతుమీశ్వరాః ।
> స్తోతుం న శక్తా వేదా యం న చ శక్తా సరస్వతీ ॥ 100

దే వ త లు ప లి కి రి :

దేవేశ్వరా! నీగుణములను వర్ణించుటలో వేదములసమర్థములు. స్వయముగ సరస్వతియు నసమర్థయే. అట్టినిన్ను స్తుతించుటలో కేవలము నీకళాంశలమైనమే మెంతటివారము?

ము న య ఊ చుః :

> వేదాన్ పఠిత్వా విద్వాంసో వయం కిం వేదకారణమ్ ।
> స్తోతుమీశా న వాణీ చ త్వాం చ వాఙ్మనసోః పరమ్ ॥ 101

మునీశ్వరులు పలికిరి :

దేవా! వేదముల నభ్యసించి విద్వాంసులమనబడు మేము వేదములకు గారణస్వరూపుడవైనని న్నేమని స్తుతింపగలము? నీవు మనస్సునకు, వాణికిగూడ నతీతుడవు. నిన్ను స్తుతించుటలో సరస్వతీదేవికూడ నసమర్థురాలే యగును.

స ర స్వ త్యు వా చ :

> వాగధిష్ఠాతృదేవీం మాం వదన్తి వేదవాదినః ।
> కించిన్న శక్తా త్వాం స్తోతుమహో వాఙ్మనసోః పరమ్ ॥ 102

సరస్వతీదేవి పలికెను :

వేదవేత్తలైనవారు నన్ను వాణి కధిష్ఠాత్రి యని ప్రశంసింతురు.

ఐనను నిన్ను స్తుతించు వాక్శక్తి నాకు లేదు. ఏలయన నీ వవాఙ్మానస గోచరుడవు.

సావిత్ర్యువాచ :

> వేదప్రసూరహం నాథ సృష్టా త్వత్కలయా పురా ।
> కిం స్తౌమి స్త్రీస్వభావేన సర్వకారణకారణమ్ ॥ 103

సావిత్రీ దేవి పలికెను :

నాథా! వేదజనని నగునా యావిర్భావము ప్రాచీనకాలమందు నీకళ నుండియె సంభవించెను. కేవలము స్త్రీస్వభావయుక్త మైననేను సంపూర్ణ కారణములకు గారణస్వరూపుడ వైనని న్నెట్లు స్తుతింపగలను?

లక్ష్మీరువాచ :

> త్వదంశవిష్ణుకాన్తాహం జగత్పోషణకారిణీ ।
> కిం స్తౌమి త్వత్కలాసృష్టాం జగతాం బీజకారణమ్ ॥ 104

లక్ష్మీ దేవి పలికెను :

దేవా! నేను నీయంశసంభూతు డైనవిష్ణువునకు బత్నిని. జగమును బాలించి పోషించుదాన నగునేను నీకళనుండియే యావిర్భవించితిని. అట్టి నేను సర్వజగముల యుత్పత్తికి గారణస్వరూపుడ వైన ని న్నెట్లు స్తుతింపగలను?

హిమాలయ ఉవాచ :

> హసన్తి సన్తో మాం నాథ కర్మణా స్థావరం పరమ్ ।
> స్తోతుం సముద్యతం క్షుద్రః కిం స్తౌమి స్తోతుమక్షమః ॥

హిమవంతుడు పలికెను :

జగన్నాథా! నేను కర్మచే స్థావరుడను. క్షుద్రుడ నైన నేను నిన్ను స్తుతించుటకు బూర్తిగ నయోగ్యుడ నై యున్నాను. అట్టి నేను నిన్ను స్తుతించుట కుద్యుక్తుడను కాగా సత్పురుషులు నన్నుజూచి పరిహసించు చున్నారు. నిన్ను నే నేమని స్తుతింపగలను?

క్రమేణ సర్వే తం స్తుత్వా దేవా విరరముర్మునే ।
దేవ్యశ్చ మునయః సర్వే పార్వతీ స్తోతుముద్యత ॥
ధౌతవస్త్రా జటాభారం బిభ్రతీ సువ్రతా వ్రతే ।
ప్రేరితా పరమాత్మానం వ్రతారాధ్యం శివేన చ ॥
జ్వలదగ్నిశిఖారూపా తేజోమూర్తిమతీ సతీ ।
తపసాం ఫలదా మాతా జగతాం సర్వకర్మణామ్ ॥

మునీశ్వరా! ఇట్లుసర్వదేవతలు, దేవాంగనలు మునులు క్రమముగ నాయఖండజ్యోతిస్స్వరూపు డైననారాయణుని స్తుతించిరి, ఆసమయమందు వ్రతపరాయణయు, జగన్మాతయు, తాపసులకుసంపూర్ణ ఫలప్రదాత్రియు నగు పార్వతిదేవి శంకరుని ప్రేరణను బొంది పరమాత్మను స్తుతింపదొడంగెను. వ్రతావలంబినైన యాసతి యగ్నిశుద్ధవస్త్రములను ధరించి యగ్నిశిఖలవలె బ్రకాశించుచున్న జటలను శిరమున ధరించి ప్రకాశించుచుండెను. ఆమె స్వరూపము మూర్తీభవించిన తేజోవిగ్రహామువలె గన్పట్టుచుండెను.

పార్వత్యువాచ :

కృష్ణ జానాసి మాం భద్ర నాహం త్వాం జ్ఞాతుమీశ్వరీ ।
కే వా జానన్తి వేదజ్ఞా వేదా వా వేదకారకాః॥
త్వదంశాస్త్వాం న జానన్తి కథం జ్ఞాస్యన్తి త్వత్కలాః
త్వం చాపి తత్త్వం జానాసి కిమన్యే జ్ఞాతుమీశ్వరాః ॥
సూక్ష్మాత్ సూక్ష్మతమోఽవ్యక్తః స్థూలాత్ స్థూలతమో మహాన్ ।
విశ్వస్త్వం విశ్వరూపశ్చ విశ్వబీజం సనాతనః ॥
కార్యం త్వం కారణం త్వం చ కారణానాం చ కారణమ్।
తేజఃస్వరూపో భగవాన్ నిరాకారో నిరాశ్రయః ॥
నిర్లిప్తో నిర్గుణః సాక్షీ స్వాత్మారామః పరాత్పరః ।
ప్రకృతీశో విరాడ్బీజం విరాడ్రూపస్త్వమేవ చ ।
సగుణస్త్వం ప్రాకృతికః కలయా సృష్టిహేతవే ॥
ప్రకృతిస్త్వం పుమాంస్త్వం చ వేదాన్యో న క్వచిద్భవేత్ ।
జీవస్త్వం సాక్షిణో భోగీ స్వాత్మనః ప్రతిబిమ్బకమ్॥
కర్మ త్వం కర్మబీజం త్వం కర్మణాం ఫలదాయకః ।
ధ్యాయన్తి యోగినస్తేజస్త్వదీయమశరీరకమ్ ।
కేచిచ్చతుర్భుజం శాన్తం లక్ష్మీకాన్తం మనోహరమ్॥
వైష్ణవాశ్చైవ సాకారం కమనీయం మనోహరమ్ ।
శంఖచక్రగదాపద్మధరం పీతామ్బరం పరమ్ ॥

ద్విభుజం కమనీయం చ కిశోరం శ్యామసున్దరమ్ ।
శాన్తం గోపాఙ్గనాకాన్తం రత్నభూషణభూషితమ్॥
ఏవం తేజస్వినం భక్తాః సేవన్తే సంతతం ముదా।
ధ్యాయన్తి యోగినో యత్తత్కుతస్తేజస్వినం వినా ॥
తత్తేజో బిభ్రతాం దేవ దేవానాం తేజసా పురా ।
ఆవిర్భూతా సురాణాం చ వధాయ బ్రహ్మణా స్తుతా ॥
నిత్యా తేజఃస్వరూపాహం విధృత్య విగ్రహం విభో ।
స్త్రీరూపం కమనీయం చ విధాయ సముపస్థితా ॥
మాయయా తవ మాయాహం మోహయిత్వాఽసురాన్ఽపురా
నిహత్య సర్వాన్ శైలేన్ద్రమగమం తం హిమాచలమ్॥
తతోఽహం సంస్తుతా దేవైస్తారకాక్షేణ పీడితైః ।
అభవం దక్షజాయాయాం శివస్త్రీ భవజన్మని ॥
త్యక్త్వా దేహం దక్షయజ్ఞే శివాఽహం శివనిన్దయా ।
అభవం శైలజాయాయాం శైలాధీశస్యకర్మణా ॥
అనేకతపసా ప్రాప్తః శివశ్చాత్రాపి జన్మని ।
పాణిం జగ్రాహ మే యోగీ ప్రార్థితో బ్రహ్మణా విభుః ॥
శృఙ్గారజం చ తత్తేజో నాలభం దేవమాయయా ।
స్తౌమి త్వామేవ తేనేశ పుత్రదుఃఖేన దుఃఖితా ॥
వ్రతే భవద్విధం పుత్రం లబ్ధుమిచ్ఛామి సామ్ప్రతమ్ ।
దేవేన విహితా వేదే సాఙ్గే స్వస్వామి దక్షిణా ॥
శ్రుత్వా సర్వం కృపాసిన్ధో కృపాం మాం కర్తుమర్హసి।
ఇత్యుక్త్వా పార్వతీ తత్ర విరరామ చ నారద ॥
భారతే పార్వతీస్తోత్రం యః శృణోతి సుసంయతః ।
సత్పుత్రం లభతే నూనం విష్ణుతుల్యపరాక్రమమ్ ॥
సంవత్సరం హవిష్యాశీ హరిమభ్యర్చ్య భక్తితః ।
సుపుణ్యకవ్రతఫలం లభతే నాత్ర సంశయః ॥
విష్ణుస్తోత్రమిదం బ్రహ్మన్ సర్వసమ్పత్తివర్ధనమ్ ।
సుఖదం మోక్షదం సారం స్వామిసౌభాగ్యవర్ధనమ్ ॥
సర్వసౌన్దర్యబీజం చ యశోరాశివివర్ధనమ్ ।
హరిభక్తిప్రదమ్ తత్త్వజ్ఞానబుద్ధివివర్ధనమ్ ॥

పార్వతీ దేవి పలికెను :

శ్రీకృష్ణా! నీకు నావిషయ మంతయు విదిత మైయున్నది. కాని నేను నిన్ను దెలిసికొనుట కసమర్థురాల నైయున్నాను. భద్రపురుషా! నిన్ను వేదములుగాని, వేదవిదులుగాని తెలిసికొనజాలరైరి. నీయంశలే నిన్ను దెలిసికొనజాలనిచో నీకళామాత్రమైన నే నెట్లు తెలిసికొనగలను? నీదివ్యతత్త్వము నీకే తెలియును. నీవుదక్క నన్యులెవరును నీదివ్యతత్త్వమును దెలిసికొనజాలరు. నీవు సూక్ష్మముకంటె సూక్ష్మతముడవు, అవ్యక్తుడవు, స్థూలముకంటె మహాస్థూలతముడవు, సనాతనుడవు, విశ్వకారణుడవు, విశ్వరూపుడవు. సకలవిశ్వమంతయు నీవే, కార్యకారణములు రెండును నీవే. కారణములకు గారణము నీవే. తేజస్స్వరూపా! షడైశ్వర్యయుక్తుడా! నిరాకారా! నిరాశ్రయా! నిర్లిప్తా! నిర్గుణా! సర్వసాక్షీ! స్వాత్మారామా! పరాత్పరా! ప్రకృతి కధీశ్వరా! నీవే మహావిరాడ్బీజము, విరాట్స్వరూపము. నీవు దివ్యగుణయుక్తుడవు, సృష్టిచేయుటకు నీకళతో బ్రాకృతికరూపమును ధరించెదవు. నీవే ప్రకృతివి, నీవే పురుషుడవు, నీవే వేదస్వరూపుడవు, నీవు లేనిదే సమస్తము నశ్వరమేయగును. నీవే జీవుడవు, సాక్షివి, భోక్తవు. ఆత్మ నీ ప్రతిబింబమే. నీవే కర్మవు, కర్మకు బీజము నీవే. కర్మలకు ఫలప్రదాతవుకూడ నీవే. యోగులైనవారు నీనిరాకారతేజమును ధ్యానింతురు. మఱికొందఱుభక్తులు చతుర్భుజము, శాంతము, మనోహరము నగునీరూపమునే ధ్యానింతురు. నాథా! వైష్ణవభక్తులు తేజోవంతము, సాకారము, శంఖచక్రగదాపద్మశోభితము, పీతాంబరాలంకృతము నగునీకమనీయరూపమునే ధ్యానింతురు. నీయనన్యభక్తులు పరమోత్కృష్టము, సుందరము, కిశోరావస్థాయుక్తము, శ్యామసుందరము, రత్నభూషితము నగునీకమనీయ సచ్చిదానందవిగ్రహస్వరూపమునే నిరంతరము హర్షపూర్వకముగ ధ్యానించి సేవింతురు. యోగులు ధ్యానించు దివ్యతేజస్వరూపము సాకారుడయిన సర్వేశ్వరునదే. దేవా! ప్రాచీనకాలమం దసురులను వధించుటకు బ్రహ్మ నన్ను బ్రార్థించెను. ఆసమయమున నేను నీతేజమును ధరించియున్న సర్వదేవతల సంపూర్ణతేజమునుగ్రహించి యావిర్భవించితిని. ప్రభూ! నే నవినాశిని, తేజస్స్వరూపిణిని. ఆసమయమందు నే నాకారమును ధరించి రమణీయరమణీరూపమున సాక్షాత్కరించితిని. తదనంతరము నీమాయాస్వరూపిణి నైననే నా యసురులనందఱను

మాయచే మోహితులుగ నొనరించి వారిని సంహరించి శైలరాజైన హిమాలయమునకు వెడలితిని. పిమ్మట తారకాక్షునిచే బీడితులయిన దేవతలు తమ్ము రక్షింపవలసినదిగ నన్ను స్తుతించిరి. నేను దక్షుని గృహమున సతియనునామమున నావిర్భవించి మహాదేవుని యర్థాంగినై దేవతలసంకటములను దూరమొనరించితిని. దక్షయజ్ఞమందు దక్షుడు శివుని నిందించిన కారణమున సతీస్వరూపమును త్యజించి శైలరాజైన హిమవంతుని గృహమున మరల పార్వతిగ నావిర్భవించితిని. ఈజన్మములోగూడ ననేకదివ్యతపఃఫలస్వరూపముగ సదాశివుడు మరల నాకు ప్రాణవల్లభుడైనాడు. బ్రహ్మదేవుని ప్రార్థనలనాలకించి సర్వవ్యాపియు మహాయోగియు నగుశంకరుడు నాపాణిని గ్రహించెను. కాని దేవమాయావశమున నాకు మహేశ్వరుని యాదివ్యతేజస్సు లభింపలేదు. పరమేశ్వరా! ఈకారణమువలన బుత్రసంతానమునకై దుఃఖితనై నేను నిన్ను స్తుతించుచున్నాను, నాకు నీవంటి యుత్తమకుమారుడు కలుగవలెనని యభిలషించుచున్నాను. కాని పుణ్యకవ్రతమందు భర్తనే దక్షిణగ నొసంగవలె నని వేదములందు నీవే ప్రవచించితివి. కృపాసింధూ! నావిషయమంతటిని వినిన నీవు దయతో నాకు శ్రేష్ఠుడగుబుత్రుని బ్రసాదింపుము.

నారదా! ఏకాగ్రచిత్తముతో నీపార్వతీకృతస్తోత్రమును శ్రవణమొనరించిన వారికి నిశ్చయముగ విష్ణుసమానుడయిన, మహాపరాక్రమవంతుడైన ఉత్తమపుత్రుడు లభింపగలడు. ఒకసంవత్సరకాలము హవిష్యాన్నమును భుజించుచు భక్తిభావముతో శ్రీహరిని యర్చించి పార్వతీకృతస్తోత్రమును బఠించువారికి పుణ్యకవ్రతఫలము లభింపగలదు. ఇందు లేశమాత్రమైనను సంశయము లేదు. బ్రాహ్మణోత్తమా! ఈవిష్ణుస్తవము సర్వసంపదలను బొందింపగలదు. ఇది సుఖదాయకము, మోక్షప్రదము, సకలసారస్వరూపము, స్త్రీసౌభాగ్యవర్ధకము, సంపూర్ణసౌందర్యబీజము, యశోవృద్ధిసాధనము, హరిభక్తిప్రదాయకము. ఇది తత్త్వజ్ఞానమును, విశిష్టబుద్ధిని దేహధారులకు బ్రసాదింపగలదు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణసంవాదములోని
పుణ్యకవ్రతసమయమున పార్వతియొనరించిన శ్రీకృష్ణ
స్తోత్ర మను నేడవ అధ్యాయము సంపూర్ణము.

---

# ఎనిమిదవ అధ్యాయము

## పార్వతీకృతస్తుతికి ప్రసన్నుడైనశ్రీకృష్ణుడామెకు దర్శన మొసంగుట, బాలకరూపముతో నామె శయ్యపై గ్రీడించుట.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! పార్వతీదేవి చేసిన స్తుతికి గరుణానిధి యైనశ్రీకృష్ణుడు ప్రసన్నుడై యదృశ్యము, పరమదుర్లభము నగుదన దివ్యరూపమును బార్వతికి జూపెను. ఆసమయమున శ్రీకృష్ణునిపై దనమనస్సును లగ్నమొనరించి యున్నపార్వతి యామండలాకారతేజోరాశిమధ్యమున సర్వమోహనుడైన శ్రీకృష్ణుని సచ్చిదానంద దివ్యస్వరూపమును దర్శించెను. శ్రీకృష్ణపరమాత్మ పీతాంబరధారియై కరకమలములయందు వేణువును, గళమందు దులసీమాలను ధరించి, వివిధరత్నమయాభూషణవిభూషితుడై కిశోరరూపముతోను, శ్యామల వర్ణముతోను బ్రకాశించుచు చిరునవ్వులు చిందులుత్రొక్కు మనోహరవదనార విందముతోను, మయూరపిచ్ఛకిరీటధారియై, కస్తూరీకుంకుమాద్యనులేపనము లను శ్రీఅంగములందు ధరించి, దివ్యరత్నసింహాసనాసీనుడై, గోపగోపీజన పరివేష్టితుడై పార్వతి యెదుట సాక్షాత్కరించెను. ఆయన లావణ్యము కోట్ల కొలది మన్మథుల సౌందర్యమును మించి భాసించుచున్నది. శ్రీకృష్ణుడు పరమమనోహరుడు, దివ్యలీలాపరంధాముడు, భక్తుల కత్యంతప్రసన్నుడు, సర్వజీవకోటికి నేకైకప్రేమస్వరూపుడు. పరమాత్మ తన యనన్యభక్తుల ననుగ్రహించుట కొఱకే యీసచ్చిదానందవిగ్రహమును ధరించెను. ఆ దివ్య మంగళస్వరూపమును గాంచి పార్వతి యత్యంత ప్రసన్నురాలై, శ్రీకృష్ణాను రూపుడైనపుత్రుని బ్రసాదింపు మనిపరబ్రహ్మమును వేడుకొనెను. మనో వాంఛాఫలప్రదాయకుడైనశ్రీకృష్ణపరమాత్మ సాక్షాత్కరింపగనే పార్వతి మనో రథము సిద్ధించెను. తదనంతర మామహాతేజఃపుంజ మంతరిక్షమునం దంత ర్ధానమయ్యెను. సనత్కుమారుడు సంతుష్టాంతరంగుడై పార్వతినుండి గోవు లను మూల్యముగ గ్రహించి మహాదేవుని దిరిగి ప్రసాదించెను. విశ్వమునే యానందింపజేయగల దుర్గాదేవి బ్రాహ్మణుల కనేకదివ్యరత్నములను,

యాచకుల కసంఖ్యాకసువర్ణములను దానమొనరించెను. పార్వతి యన్న పూర్ణయై సర్వదేహధారుల నాదరించి దివ్యభోజనములను ప్రసాదించెను. అనంతర మామె ప్రాణవల్లభు డైనశివునితోగూడ శ్రీకృష్ణప్రసాదమును గ్రహించెను. ఇట్లీశ్వరి యైనపార్వతి పుణ్యకవ్రతమును బరిపూర్ణ మొన రించెను. సర్వదేవతలు, మునులు, తమతమ ధామముల కరిగిరి. సంతుష్టాంత రంగయై పార్వతీదేవి సదాశివునితో కైలాసమందు నివసింప దొడంగెను. ఒకదినమున శివగృహమునకు దివ్యతేజస్సంపన్ను డైనవృద్ధబ్రాహ్మణు డొక డన్నార్తుడై యేతెంచి యాహారమును బ్రసాదింపవలసినదిగ నెలుగెత్తి మహాదేవుని యర్థించెను.

## బ్రాహ్మణుడు పలికెను :

"శంకరా! ఏడుదినములనుండి దివ్యవ్రత మాచరించి క్షుద్బాధతో వ్యాకులుడనై భోజనేచ్ఛతో మిమ్ము శరణు వేడుచున్నాను. దేవా! న న్ననుగ్రహించి రక్షింపుము. శివా! నీవు కరుణాసాగరుడవు. అన్నార్తు డైన యీవృద్ధబ్రాహ్మణుని క్షుద్బాధనుండి రక్షింపుము. జననీ! పార్వతీ! ఈ శర ణాగతు డైననీపుత్రుని రక్షింపరావా! మాతా! నీవు జగన్మాతవు. నే నీజగమునం దున్నజీవుడను. కావున శీఘ్రముగ నేతెంచి నాక్షుద్బాధను నివారింపుము".

ఆ బ్రాహ్మణుని యభ్యర్థనము నాలకించి శివపార్వతులు బ్రాహ్మణుని సమ్ముఖమున కేతెంచిరి. అయ్యాదిదంపతులను గాంచి బ్రాహ్మణు డనేక ప్రణామము లాచరించి యనేకవిధముల స్తుతించెను. నీలకంఠు డైనమహా దేవు డత్యంత ప్రసన్నుడై యవ్విప్రవరునితో నిట్లు పల్కెను. "విప్రశ్రేష్ఠా! మాయదృష్టమువలననే దివ్యతేజోవంతుడ వైననీవు కైలాసమున కరుదెంచితివి. అతిథివై మాగృహమును బావన మొనరించితివి. ద్విజశ్రేష్ఠా! అతిథులయందు బ్రహ్మాదిదేవతలు, గురుదేవులు నివసింతురు. అతిథులను సాదరముగసత్కరించు వారు త్రిలోకములయందు బూజ్యులగుదురు. అతిథిపాదములందే సకలతీర్థములు నివసించును. అతిథిచరణప్రక్షాళనజలములను శిరస్సుపై సంప్రోక్షించుకొనిన గృహస్థు నిశ్చయముగ సకలతీర్థస్నానఫలములను బొందగలడు. పవిత్ర భారతవర్షమం దతిథిని గౌరవించి పూజించి యాదరించువారికి యఖండదాన

ఫలము లభింపగలదు. ఏలయన, వేదములయందు ప్రవచింపబడిన నానా విధము లగుపుణ్యములు, తదతిరిక్తము లైనసత్కర్మములు నన్నియు నతిథిసేవా ఫలములో బదునాఱవభాగముమాత్రమే యని శ్రుతివచనము. ఏగృహము నుండి యతిథి నిరాశతో వెడలిపోవునో ఆగృహస్థుని పితృదేవతలు, దైవము, అగ్ని, గురుజనులు తిరస్కరించి వాని గృహమును వీడి యయ్యతిథితో వెడలి పోయెదరు. అతిథి నాదరింపక తిరస్కరించువారు మహాపాపములకు భాగ స్వాములు కాగలరు. కావున నతిథిదేవా! నీ యభీష్టమును దెలియపఱచుము". మహాదేవుని వచనములను విని బ్రాహ్మణుడు శివపార్వతులతో నిట్లు పల్కెను. "ఆదిదంపతులారా! మీరు సకలవేదజ్ఞానసంపన్నులు. మాతా! పార్వతీ! నే నాకలిదప్పులచే బీడింపబడియున్నాను. మనుష్యు డాహారమును స్వీకరింపక యుపవాసవ్రతుడై యుండినచో నతని కిచ్ఛానుసారముగ భోజన మొనరింపవలె నను నభిలాష యుద్భవించును." బ్రాహ్మణుని యభీష్టమును గ్రహించి పార్వతి యిట్లు పలికెను. "విప్రవరా! నీ వేయే దివ్యపదార్థముల నారగింపదలచితివి? త్రిలోకములందు దుర్లభము లైనను నాపదార్థములను నీ కర్పించెదను. నీవు భుజింపగోరు పదార్థములను దెల్పి నా జన్మమును సఫలమొనరింపుము".

## బ్రాహ్మణుడు పలికెను :

సువ్రతా! ఉత్తమవ్రతపరాయణ వైననీవు పుణ్యకవ్రతసమయ మందు నానావిధము లగుమధురపదార్థముల నేకత్రితమొనరించితివి. ఆ మధురపదార్థముల నన్నింటిని దృప్తిగ భుజించుటకే నేను కైలాసమున కరు దెంచితిని. నన్ను మీపుత్రునిగ నెంచి త్రిలోకములందు దుర్లభము లైన మధురాతిమధురపదార్థములను, మృష్టాన్నములను నా కర్పించి నన్నారా ధింపుము. సాధ్వీ! తండ్రు లైదువిధములుగను, తల్లు లనేకవిధములుగను, పుత్రు లైదుభేదములతోను నుందు రనివేదవిదులు చెప్పుదురు.

విద్యాదాతాన్నదాతా చ భయత్రాతా చ జన్మదః।
కన్యాదాతా చ వేదోక్తా నరాణాం పితరః స్మృతాః ॥
గురుపత్నీ గర్భధాత్రీ స్తనధాత్రీ పితుః స్వసా।
స్వసా మాతుః సపత్నీ చ పుత్రభార్యాన్నదాయికా ॥

భృత్యః శిష్యశ్చ పోష్యశ్చ వీర్యజః శరణాగతః ।
ధర్మపుత్రాశ్చ చత్వారో వీర్యజో ధనభాగితి ॥ (47-49)

"విద్యను ప్రసాదించినవాడు (ఆచార్యుడు), అన్నదాత, భయమునుండి రక్షించినవాడు, జన్మను ప్రసాదించినవాడు (తండ్రి), కన్యాదాత (అర్ధాంగి నొసగిన మామ) ఏ రైదుగురు మానవులకు వేదోక్తులైనతండ్రులు.

గురుపత్ని, గర్భధాత్రీ (కన్నతల్లి), స్తనధాత్రీ (పాలిచ్చి పెంచినది), తండ్రియొక్క సహోదరి (మేనత్త), తల్లియొక్క సహోదరి (పినతల్లి), మాత యొక్క సపత్ని (సవతితల్లి), అన్నము పెట్టినస్త్రీ, పుత్రివధువు (కుమారుని భార్య) ఏ రందఱు తల్లు లనబడుదురు.

భృత్యుడు (సేవకుడు), శిష్యుడు, దత్తతచేసికొనబడినవాడు, వీర్యజుడు (కన్నబిడ్డ), శరణాగతుడు–ఈఱైదుగురు పుత్రు లన్యోదరు. వీరిలో వీర్యజుడు దక్క–మిగిలిన నల్వురుపుత్రులు ధర్మపుత్రు లనబడుదురు. వీర్యోత్పన్నుడైనవాడు (ధర్మపత్నివలన జనించినవాడు) తండ్రి సంపదల కర్హుడు కాగలడు".

జననీ! పుత్రహీన వైననీ కనాథనైన నేనే పుత్రుడను. ఆకలి దహించుచుండగ నన్నార్తుడనై నిన్ను శరణు వేడితిని. విశ్వజననీ! శ్రేష్ఠాన్నములను, ఉత్తమ మధురఫలములను, బిండితో జేయబడిన నానారకము లైనభక్ష్యములను, పక్వాన్నములను, ఉండ్రాళ్ళను, వడపప్పును, క్షీరములను, చెఱకు గడలను, బెల్లముతో వండిన పదార్థములను, ఘృతమును, దధిని, నేతితో జేసిన వంటకములను, బెల్లముతో జేసిన నువ్వులడ్లను, అమృతోపమానము లైనవన్యపదార్థములను, చందన కర్పూరసువాసనాయుక్త మైన తాంబూలమును, నిర్మలస్వాదుజలములను నిమ్ము. వీని నన్నింటిని దనివిదీరగ నారగించిన నాకు సుందర మైనలంబోదర మేర్పడగలదు.

సర్వాభీష్టఫలప్రదా! నీ స్వామి యైనమహేశ్వరుడు త్రిలోకనాథుడు సంపూర్ణైశ్వర్యప్రదాత, నీవు సకలసంపత్ప్రదాయినివి మూర్తీభవించిన శ్రీమహాలక్ష్మిస్వరూపిణివి. అందువలన నీవునాకురమణీయ రత్నసింహాసనమును, నమూల్య రత్నాభరణములను, నగ్నిచే శుద్ధమొనరింపబడిన సుందరవస్త్రములను, నత్యంత దుర్లభ మైనశ్రీహరిమహామంత్రమును, శ్రీహరియందు సుదృఢ

మైనభక్తిని, మృత్యుంజయ మనుజ్ఞానమును, సుఖప్రదాయిని యైనదాన
శక్తిని, సకల సిద్ధులను బ్రసాదింపుము. వాణీరమాసేవితా! నీవే శ్రీహరి
కత్యంత ప్రియపాత్రమవు, సర్వస్వమును బ్రసాదింపగల యాద్యాశక్తివి. అందు
వలన నీ పుత్రునకు బ్రసాదించుట కెంతమహత్తర మైనవస్తు వైనను నీ
కదేయముకాదు. నేను నీకుమారుడనై యుత్తమధర్మమందు నఖండతపము
నందు లగ్నుడనై మనస్సును మిగుల నిర్మల మొనరించుకొని సర్వకార్య
ముల నపేక్షారహితుడనై యాచరించెదను. కాని జన్మకు హేతువు లైన
సకామకర్మల నాచరింపను. ఎందువలెననగ, జీవుడు తనకోర్కెలను దీర్చు
కొనుట కేకర్మల నాచరించిన నాకర్మలవలన భోగములు ప్రాప్తించును. ఆ
భోగములు శుభాశుభములని రెండు రకములు. ఆరెండును సుఖదుఃఖము
లకు హేతువులు కాగలవు. నిష్కామకర్మల నొనరింపక దేహధారి యైన
జీవుడు సకామకర్మలచే గర్మబంధముల జిక్కి జననమరణచక్రమందు దగు
ల్కొనగలడు. జగదంబికా! ఎవరివలనగూడ దుఃఖములుగాని, సుఖములుగాని
సంభవింపవు. కేవలము స్వయంకృత మైనగర్మలవలనే జీవునకు సుఖదుఃఖ
ములు సంభవింపగలవు. అందువలన విద్వాంసులు నిష్కామకర్మలనే
యాచరించెదరు. భక్తజను లైన సత్పురుషులు నిరంతర మానందపూర్వక
ముగ హరిని స్మరించుచు, తపమాచరించుచు, సత్సాంగత్యముచే నిర్మలురై
కర్మలను నిర్మూలన మొనరింపగలరు. ఇంద్రియములవలన, నింద్రియములను
విషయములతో సంయోగ మొనరించినందువలన నుత్పన్నము లగుసుఖదుఃఖ
ములు జీవు డనుభవింపనంతవఱకు నశింపవు. కాని హరిదివ్యగుణనామసంకీ
ర్తనరూపసుఖము సర్వకాలములయం దక్షరమై యుండును.

బ్రహ్మవిష్ణుసురేంద్రసేవితపాదములుగలదానా! హరిధ్యానపరాయణు
లైనభక్తుల యాయుర్దాయము నశింపదు. ఎందువలెననగ, కాలము
గాని, మృత్యుంజయుడుగాని, హరిభక్తులపై దమప్రభావమును జూపలేరు,
ఇది నిజము. ఆచిరంజీవు లైనభక్తులు భారతవర్షమున జిరకాలము జీవించి
సంపూర్ణసిద్ధులజ్ఞానమును బొంది స్వచ్ఛందముగ దేహమును వీడి పరంధామ
మును జేరగలరు. హరిభక్తులకు బూర్వజన్మలు స్మరణమునం దుండగలవు.
వా రనేకజన్మల జ్ఞానముకలిగి స్వేచ్ఛానుసారముగ జన్మమును ధరింపగలరు.
వారు స్వయముగ బవిత్రులై తమలీలలతో నితరులను, తీర్థములనుగూడ

బవిత్రి మొనరింపగలరు. నాగు పవిత్రిపుణ్యక్షేత్ర మైన భారతవర్షమందు బరుల కుపకార మొనరించుటకొఱకు, దీనులను సేవించుట కొఱకు, హరివిముఖు లైనమానవులను దరింపజేయుటకొఱకు సంచరించు చుందురు. అట్టి వైష్ణవు లేతీర్థమందైనను గోక్షీరముల బిందు వంతకాలమే నిలచియుండును. వారిపవిత్రచరణముల స్పర్శవలన నాతీర్థములు, వసుంధర తత్కాలమే పవిత్రములు కాగలవు. సౌభాగ్య వంతు లగునేమనుష్యుల కనన్యభక్తుల దర్శనము, స్పర్శ లభించునో వారికి సమస్తయజ్ఞదీక్షాఫలములు, సకలతీర్థపర్యటనఫలములు ననాయాసముగ లభింపగలవు. సర్వభక్షకు డైనయగ్ని, సమస్తపదార్థములను స్పృశించు వాయువు దూషితములు కానట్లు నిరంతరము హరిస్మరణయందే మనస్సును లగ్న మొనరించిన భక్తుడు పాపములయందు లిప్తుడు కాడు. అనేకజన్మముల ననుభవించిన పిమ్మట సౌభాగ్యవశమున గర్మబద్ధు డైనజీవునకుమానవజన్మము లభించును. ఆజీవుడు మనుష్యయోనులందు బెక్కుమారులు జన్మించిన యనంతరము వానికి సత్సాంగత్యము లభింపగలదు.

పార్వతీ! భక్తసాంగత్యమువలన బ్రాణులహృదయక్షేత్రమందు భక్తియనెడు అంకుర ముదయింపగలదు. భక్తిహీను లైనవారిదర్శనము వలన నా యంకుర మెండిపోగలదు. మరల వైష్ణవు లైనభక్తులతో సాంగత్య మేర్పఱచుకొని సంభాషించిన యాయెండిన యంకురము ప్రఫుల్లిత మగును. తదనంతర మక్షరమైన యా భక్త్యంకురము ప్రతిజన్మమందును వృద్ధి పొందును. శ్రీమన్నారాయణుని కృపాకటాక్షమువలన భక్త్యంకుర జనిత మైనవృక్షము హరిదాసత్వ మనుపరిపక్వఫలమును జీవునకు బ్రసాదించును. ఇట్లు భక్తివలన బరిపక్వు లైనజీవులు పాంచభౌతిక దేహమును వీడి దివ్య దేహధారులై శ్రీహరి పార్షదులు కాగలరు. మహాప్రళయకాల మందు బ్రహ్మ, బ్రహ్మలోకము, సంపూర్ణసృష్టి నశించినను హరిభక్తులు మాత్ర మమరులై యుందురు. జగదంబికా! అందువలన నాకెల్లప్పుడు శ్రీమన్నారాయణ చరణారవిందములయందు సుదృఢ మగుభక్తిని బ్రసా దింపుము. విష్ణుమాయా! నీ యనుగ్రహము లేనిదే జీవునకు శ్రీకృష్ణభక్తి లభింపదు. జగన్మాతా! నీ వొనరించు తపము, పుణ్యకవ్రతము కేవలము లోకశిక్ష కొఱకే. ఏలయన, నీవు నిత్యస్వరూపిణివి, సనాతనివి, ఆదిశక్తివి, సమస్తకర్మఫలములను బ్రసాదింపగల మూలప్రకృతివి, ఈశ్వరివి. మాతా!

ల్పమందును సచ్చిదానంద విగ్రహుడైన, పరబ్రహ్మమైన శ్రీకృష్ణపర
క్ష్మయే స్వయముగ నీపుత్రుడై నీ యొడిలో నాడుచు నాదిదంపతులైన
స్మ ఆనందాబుధిలో నోలలాడించగలడు. పరమేశ్వరీ! నీ యాదృష్ట మేమని
యూడగలను?"

ఇట్లు మధురాతిమధుర మైనవాక్కుల బలికి దివ్యజ్యోతిస్సంపన్ను డైన
బ్రాహ్మణు డదృశ్యుడయ్యెను. ఆజగదీశ్వరు డట్లు అంతర్హితుడై దివ్య
పర శిశురూపమును ధరించి శివమందిరాంతర్భాగమున పార్వతీదేవియొక్క
తతూలికాతల్పముపై శయనించి శిశుచేష్టల నొనరింపదొడంగెను. ఆ
బాలుని యవయవశోభ శుద్ధచంపకపుష్పసమానముగ బ్రకాశించు
డెను. ఆప్రకాశము కోట్లకొలది శరత్పూర్ణిమాచంద్రులను మించిన
శముతో నుద్దీప్తమై యుండెను. నేత్రముల జ్యోతిని వృద్ధిచేయగల యా
పును సకలజీవులు సుఖముగ దర్శింపగలరు. కామదేవునే విమోహితునిగ
ంపగల లావణ్యమయ్యద్భుత శిశువునం దుండెను. ఆయన యనుపమ
సౌందర్యము శరత్కాలపూర్ణిమనే పరిహాసించుచుండెను. ఆదివ్యవిగ్ర
నయనములు విచ్చినయరవిందములవలె విశాలములై, ఓష్ఠములు
్వ మైనబింబఫలమువలె నరుణవర్ణములై యుండెను. కపాలము, కపోలము
మనోహరములుగ నుండెను. ఆయన నాసిక కొనదేలిన గరుత్మంతుని
వలె నత్యంతసుందరముగనుండెను. ఆబాలకుని సర్వాంగములు దివ్య
శవంతములై భాసిల్లుచుండెను. సర్వజగములయం దాదివ్యబాలకసము
మటియొక యద్భుతశిశువు లేదు, ఇట్లు ప్రకాశించుచు నాశిశువు పార్వతీ
తల్పముపై బవ్వళించి కరచరణముల నాడించుచు నమాయకు డైన
నివలె నటించుచుండెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణేశఖండములోని గణేశోత్పత్తివర్ణన
మను నెనిమిదవ అధ్యాయము
సంపూర్ణము.



# తొమ్మిదవ అధ్యాయము

## శ్రీహరి యంతర్ధాన మైనపిమ్మట శివపార్వతులు బ్రాహ్మణు నన్వేషించుట, ఆకాశవాణి సూచనానుసారముగ వారు తమ భవనములోనికి వెడలి పుత్రుని జూచి యానందించుట.

**శ్రీనారాయణఋషి పలికెను :**

మహర్షీ! బ్రాహ్మణరూపధారి యైన శ్రీహరి యంతర్ధానముకాగా గిరిజా శంకరులు వ్యాకులచిత్తులై ఆయనను వెదుకదొడంగిరి. ఆసమయమున పార్వతీదేవి చింతాక్రాంతయై యిట్లు పల్కెను. "విప్రవరా! నీవు మిగుల యాకలికల్గియున్నావు. మాయాతిథ్యము స్వీకరింపక యంతర్ధాన మగుటకు గారణమేమి? ప్రాణేశ్వరా! హరా! ఆకలిగొనిన యతిథి గృహస్థుని గృహము నుండి భుజింపక వెడలిపోయినచో నా గృహస్థు జీవితమే వ్యర్థముకదా! అతిథిని నిరాదరించినచో నాగృహస్థుయొక్క పితృదేవత లత డర్పించిన తర్పణములు స్వీకరింపరు. దేవతలుకూడ వారిపూజలను దిరస్కరింతురు". ఆ సమయమున నశరీరవాణి యుమ నుద్దేశించి యిట్లు పలికెను. "జగన్మాతా! శాంతింపుము. శివమందిరమం దున్న నీదివ్యపుత్రుని గాంచుము. అతడు సాక్షాత్తుగ గోలోకాధిపతియు, బరిపూర్ణ పరబ్రహ్మము, పరమాత్మయు నగు శ్రీకృష్ణుడే యని తెలిసికొనుము. నీ వొనరించిన పుణ్యకవ్రతరూప మైనకల్ప వృక్షసనాతనమహాఫలమే యాదివ్యబాలకుడు. పరమ వైష్ణవులు, బ్రహ్మ విష్ణుశివాది సకలదేవతలు, పరమయోగులు సర్వదా యెవనిని ధ్యానించుచుందురో, ఎవనిస్మరణమాత్రమున సమస్తవిఘ్నములు నశించునో, ఏ భగవంతుడు సకలపుణ్యరాశియో యతడే యద్భుతశిశురూపమున నీమందిరమున బ్రకాశించుచున్నాడు. ప్రతికల్పములోను, నావెదంపతు లైనమీ రేసనాతన జ్యోతిస్స్వరూపమును ధ్యానించుచుందురో, ఆసచ్చిదానందస్వరూపుడే యీనాడు మీయనుంగు పుత్రుడై నాడు. ఆయన ముక్తిప్రదాత, భక్తానుగ్రహ విగ్రహుడు. జననీ! నీ వేలచింతించెదవు? పరమసుందరాకారుడైన, జగన్మో

హానుడైన నాకుమారుని దర్శించి పరమానంద మనుభవింపుము. యాచకుడై మి మ్మర్థించిన బ్రాహ్మణుడు సామాన్యుడుకాడు. అతడు సాక్షాత్తుగ జనార్దనుడే".

శుభయుక్తము లైనయశరీరవాణి వాక్కుల నాలకించి యాదిదంపతులు గృహములోనికి జని హంసతూలికాతల్పముపై ననంతకోటిసూర్యప్రకాశ సన్నిభు డైనదివ్యశిశువును గాంచి పరమానందమును బొందిరి. కోటిచంద్రుల కాంతివలె బ్రకాశించు నాశిశువు శయ్యపై నటునిటు కదలుచు పార్వతిని గాంచి 'ఉమ'యని రోదింపదొడంగెను. భక్తుల నానందింపజేయుటకు జగదారాధ్యుడు శిశువై, యమాయకుడై దర్శనమొసంగెను. తనకుమారుని కన్నులార గాంచి పరమసంతుష్టాంతరంగయై రాజరాజేశ్వరి మహాదేవునితో నిట్లు పల్కెను, "ప్రాణేశ్వరా! పుణ్యబీజస్వరూపుడు, మహోత్సవరూపుడు నగు పరమేశ్వరుడు మనల ధన్యమొనరించుటకు మనపుత్రునిగ నుదయించెను. నాథా! సర్వులను దరింపజేయగల మీా పుత్రుని దర్శింపుడు. సమస్తతీర్థ స్నానఫలము, సంపూర్ణయజ్ఞదీక్షాగ్రహణపుణ్యము నీదివ్యపుత్రదర్శనసౌభాగ్యములో బదునారవ యంశమాత్రమే". పార్వతి తనపుత్రుని యత్యంతానురాగముతో నంకమునజేర్చి, హృదయమునకు హత్తుకొని, యాచిన్నారితనయు నుద్దేశించి యిట్లు పల్కెను. "కుమారా! శ్రీహీనుల కఖండధనరాశి లభించునట్లు నీవు మా కమూల్యరత్నముగ లభించితివి. చిరకాలవియోగముచే దపించు ప్రేయసీప్రియులు గలిసికొనిన నెంతటియానందము ననుభవింతురో, యంతటి యానందము నీదర్శనమువలన మాకు నేడు లభించినది. అనావృష్టి సమయమందు వర్షపాతమైనట్లు సంతానహీననైననాకు నీవు పుత్రునిగ నావిర్భవించితివి. మిగుల దప్పికగొన్నజీవుడు శీతలజలములు లభించిన నెంతగ నానందించునో నీవు లభించుటవలన నా కంతటిపరమానందము కల్గినది". దివ్యపుత్రప్రాప్తికారణమున నాదిదంపతు లైనపార్వతిపరమేశ్వరుల యానందమునకు మేరలేకపోయెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ
సంవాదమున బాలగణేశ దర్శన
మను తొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము.

# పదియవ అధ్యాయము

## శివపార్వతులు వివిధము లగుదానము లొనర్చుట, బాలుని దేవత లాశీర్వదించుట, అధ్యాయశ్రవణఫలము.

**శ్రీనారాయణఋషి పలికెను :**

తదనంతర ముమామహేశ్వరులు తమకుమారునిశుభము గోరి హర్ష పూర్వకముగ బ్రాహ్మణులకు, యాచకులకు ననేకదివ్యరత్నములను, మాణిక్య ములను, వజ్రవైడూర్యములను, సువర్ణమును దానమొనరించిరి. పార్వతీ దేవికి జనకుడైనహిమవంతుడు బ్రాహ్మణుల కొకలక్షరత్నములను, లక్ష గోవులను, నైదులక్షల స్వర్ణముద్రలను, వజ్రములను, శ్రేష్ఠమణులను దాన మొనరించెను. బ్రహ్మకూడ బ్రసన్నుడై సృష్టియందు లభించని దుర్లభ వస్తుసముదాయమును దానముచేసెను. విష్ణుమూర్తికూడ నుమామహేశ్వరుల పుత్రోదయసమయమున బరమానందభరితుడై కౌస్తుభదివ్యమణులను భక్తు లకు బ్రసాదించెను. పుత్రోదయసమయమున సకలదేవత లుత్సవములు చేసి కొనిరి. బ్రహ్మవిష్ణ్వాదిదేవతలు కైలాసమున కరుదెంచి యాదివ్యబాలు నాశీర్వదించిరి.

శ్రీమహావిష్ణువు ఆశీర్వచనము :

కుమారా! నీ వజరామరుడవు, దివ్యజ్ఞానమున మహాదేవతుల్యుడవు, పరాక్రమతేజములయందు మత్సముడవు, సంపూర్ణసిద్ధులయందు విధాత తుల్యుడవు, సర్వజగత్తులో నారాధ్యుడవు కాగలవు.

బ్రహ్మ ఆశీర్వచనము :

వత్సా! నీయశస్తేజముతో సర్వజగములు నోతప్రోతము లగుగాక! సకల దేవతారాధనలయందు నీ కగ్రపూజ లభించుగాక!

ధర్మదేవత ఆశీర్వచనము :

గిరిరాజతనయనందనా! నీవు నాతో సమానతేజస్వివై పరమధార్మికు

డవు కాగలవు. వత్సా! నీవు సర్వజ్ఞానసంపన్నుడవు, కరుణాంతరంగము కల్గి శ్రీకృష్ణభక్తుడవు, హరిసమాన తేజోమూర్తివి కాగలవు.

సదాశివుని ఆశీర్వచనము :

ప్రాణాధికప్రియపుత్రా! నీవు నావలెనే మహాదాతవు, హరిభక్తుడవు, బుద్ధిమంతుడవు, శాంతుడవు, జితేంద్రియుడవు కమ్ము.

శ్రీమహాలక్ష్మి ఆశీర్వచనము :

శివకుమారా! నీ దివ్యాంగములయందు, నీధామమందు నేను విరాజిల్లెదను. నా యనుగ్రహమువలన నీవు నావలెనే సర్వసంపత్ప్రదాతవు కాగలవు. మనోహరరూపా! నీకు లావణ్యవతులైన, పతివ్రతలైన, మదంశసంభూతులైన పత్నులు లభింపగలరు.

సరస్వతి ఆశీర్వచనము :

విశ్వతేజస్స్వరూపా! నీవు నాసముడవై, పరమోత్కృష్టకవితాశక్తిని, ధారణాశక్తిని, స్మరణశక్తిని, వివేకశక్తిని బరిపూర్ణముగ బొందగలవు.

సావిత్రిదేవి ఆశీర్వచనము :

కుమారా! నేనే వేదమాత యైనగాయత్రీదేవిని. నీవు నాదివ్యమంత్రము ననుష్ఠాన మొనరించి శీఘ్రముగ సకలవేదజ్ఞులలో నత్యంతశ్రేష్ఠుడవు కాగలవు. నీకు సమస్తతత్త్వజ్ఞానము సిద్ధించుగాక!

హిమవంతుని ఆశీర్వచనము :

ప్రియకుమారా! నీమన స్సెల్లపుడు శ్రీకృష్ణునియందే సంలగ్నమై యుండుగాక! శ్రీకృష్ణునియందు నీ కనన్యభక్తి సమకూరుగాక! వత్సా! నీవు శ్రీకృష్ణునితో సమానదివ్యగుణసంపన్నుడవై, శ్రీకృష్ణపరాయణుడవై నివసింతువుగాక!

మేనక (హిమవంతుని భార్య) ఆశీర్వచనము :

పరమానందదాయకా! నీవు గాంభీర్యమందు సముద్రసమానుడవై,

సౌందర్యమందు మన్మథసదృశుడవై, లక్ష్మీవంతులయందు శ్రీపతితుల్యుడవై, ధర్మాచరణమందు ధర్మసముడవై విరాజిల్లుము.

వసుంధర ఆశీర్వచనము :

గిరిజాశంకరప్రియకుమారా! నీవు నావలెనే క్షమాశీలుడవు, శరణాగత వత్సలుడవు, సంపూర్ణరత్నములతో సంపన్నుడవు, విఘ్నరహితుడవు, విఘ్న వినాశకుడవు, శోభ కాశ్రయస్థానుడవు నై వరిల్లుము.

జనని యగుపార్వతీదేవి యాశీర్వచనము :

సకలవిశ్వములలో బ్రకృతి నైననాకత్యంతప్రియుడ వైనకుమారా! నీవు నీపితృదేవునితో సమానముగ మహాయోగివి, సిద్ధేశ్వరుడవు, సకలసిద్ధి ప్రదాతవు, శుభకారకుడవు, మృత్యుంజయుడవు, సకలైశ్వర్యయుక్తుడవు, సర్వకర్మలయం దత్యంతనిపుణుడవు నగుదువుగాక!

తదనంతరము కైలాసమందు సమావేశమైన సర్వమహర్షులు, మునీశ్వరులు, బ్రాహ్మణులు ననేకవిధముల యాదివ్యబాలకు నాశీర్వదించిరి. వంది మాగధు లనేకవిధములుగ స్వస్తివచనముల బలికిరి.

వత్సా! నారదా! ఈప్రకారముగ నేను సర్వమంగళములకు మంగళ ప్రదము, సమస్తవిఘ్నవినాశకరము నగుశ్రీగణేశ్వర జన్మవృత్తాంతమును వర్ణించి తిని. అత్యంత సమాహితచిత్తుడై యీయధ్యాయమును శ్రవణ మొనరించు మానవుడు సంపూర్ణ మంగళయుతుడై భవసాగరమును దరింపగలడు. శ్రీగణేశ జన్మవృత్తాంతశ్రవణపుణ్యావశమున బుత్రహీనునకు బుత్రుడు, నిర్ధనునకు ధనము, కృపణునకు నిరంతరము దాతృత్వశక్తి, భార్యార్థికిసాధ్వి యైనభార్య, ప్రజా కాముడైనన రేశ్వరునకు సత్ప్రజ, రోగయుక్తుడైనవానికి బరిపూర్ణారోగ్యము లభింపగలవు. భాగ్యహీన యైనస్త్రీకి సౌభాగ్యము, పుత్రభ్రష్టుడైన తండ్రికి బుత్రుడు, పతివియోగయుక్త యైనసాధ్వికి బ్రవాసమందున్న తనభర్త లభింపగలడు. శాపగ్రస్తుడైనవానికి నీయధ్యాయశ్రవణమాత్రమున శాపవిమోచనము సంభవింపగలదు. మునీశ్వరా! గణేశ్వరాఖ్యాన శ్రవణమువలన మనుష్యునకు గలుగు పుణ్యము కేవల మీయధ్యాయశ్రవణమువలననే లభింపగలదు. యాత్రాకాలమందుగాని, పుణ్యపర్వమందుగాని యేకాగ్రచిత్తులై గణేశ్వర

జన్మవృత్తాంతమును శ్రవణమొనరించువారు నిశ్చయముగ శ్రీగణనాథుని కృపకు పాత్రులై సకలమనోరథములను బొందగలరు. శ్రీగణేశ్వర జన్మవృత్తాంతగ్రంథము గౌరవింపబడుగృహ మెల్లపుడు సకలసంపదలతోను సర్వశుభములతోను విలసిల్లును.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ
సంవాదమున గణేశోద్భవమంగళ
మను పదియవ అధ్యాయము
సంపూర్ణము.



## పదునొకండవ అధ్యాయము

### గణేశ్వరుని జూచుటకై శనైశ్చరు డేతెంచుట పార్వతి యడిగినపిమ్మట నతడు తా నితర వస్తువులను జూడకుండుటకు గల కారణమును జెప్పుట.

**శ్రీనారాయణఋషి పలికెను:**

నారదమహర్షీ! సకలదేవతలు పార్వతీనందనుని యనేకవిధముల యాశీర్వదించి, ప్రసన్నాంతరంగులై శ్రీహరిసహితముగ శివసభలో రత్నమయ సింహాసనముల నలంకరించిరి. పార్వతిదేవి తనకుమారు నెత్తుకొని సభనుండి నిష్క్రమించి యంతఃపురమున కేగెను. ఆసమయమున సూర్యతనయు డైన శనైశ్చరుడు పుత్రోత్సాహయుక్తులై నగిరిజాశంకరుల నభినందించుటకు కైలాసమున కేతెంచెను. శనైశ్చరు డత్యంతనమ్రభావసమన్వితుడై నేత్రములను ఘూసికొని మనమున శ్రీకృష్ణునిదివ్యనామమును స్మరించుచుండెను.

సూర్యనందను డత్యంతశ్యామలవర్ణుడు, పీతాంబరధారి, దృష్టిపాతమాత్రి మునసే సకలతపఃఫలములను గ్రహింపగలవాడు, మహాతేజస్వి, అగ్నిశిఖా సదృశప్రకాశవంతుడు, అత్యంతసుందరుడు, శ్రేష్ఠుడు. ఆశనైశ్చరుడు సభలో ప్రవేశించి విష్ణు బ్రహ్మ శివ సూర్య దేవగణములకు, మహర్షిగణములకు బ్రణామము లర్పించెను. అనంతరము మహాదేవుని యాజ్ఞ గైకొని పుత్రి వతి యైనపార్వతిని దర్శించుట కంతఃపురమున కేగి శిరము వంచి పార్వతికి నమస్కరించెను. ఆసమయమున రత్నభూషణవిభూషిత యైనపార్వతీదేవి పుత్రుని యంకమున జేర్చుకొని రత్నసింహాసనాసీన యైయుండెను. తలవంచి నమస్కరించిన సూర్యనందను నాశీర్వదించి యామె యిట్లు ప్రశ్నించెను, "గ్రహేశ్వరా! నీవు శిరము నేలవంచికొనియున్నావు? నన్నుకాని, నాయీదివ్య పుత్రునికాని యేలదర్శింపవు? నీ యీ చర్యకు గారణమేమియో తెలిసికొన గోరుచున్నాను". జగన్మాతవచనముల నాలకించి శనైశ్చరుడు యిట్లు పల్కెను.

## శనైశ్చరుడు పలికెను :

జగజ్జననీ! సర్వజీవులు తమతమకర్మానుసారముగ ఫలము ననుభవింపక తప్పదు. ఎందువలె ననగ, శుభాశుభకర్మము లెన్నికల్పములు గతించినను నశింపవు. వానిని జీవు డనుభవింపక తప్పదు. జీవుడు తనకర్మానుసారముగ సూర్యలోకమును, నిందర్రిలోకమును, బ్రహ్మలోకమును బొందగలడు. కర్మ వలననే జీవుడు మనుష్యుడై, పశువై, క్రిమికీటకమై జన్మించును. దుష్కర్మానుచరణమువలన నాజీవుడే నరకమును బొందగలడు, సత్కర్మసమ్మిళిత మైనభక్తి యోగమువలన వైకుంఠమును బొందగలడు. కర్మానుసార ముగనే చక్రివర్తి, సేవకుడు కాగలడు. మాతా! కర్మవలననే జీవుడు సుందరదేహమును బొందగలడు. రోగగ్రస్తుడునుకాగలడు. రజో గుణయుక్త మైనకర్మ నాచరించి విషయములందు సంలగ్నుడై పతనమొంద గలడు. నిష్కామకర్మవలన జీవుడు విషయములందు లిప్తుడుగాక భవసాగర మును దరింపగలడు. కర్మవలననే ధనవంతుడు దరిద్రుడు, కుటుంబవంతుడు, బంధుజనులకు గంటకసదృశుడు కాగలడు. స్వకర్మవలననే జీవున కుత్తమ పత్ని, ఉత్తమపుత్రుడు, సుఖభోగములు లభింపగలవు. దుష్కర్మవలన

నతడు పుత్రహీనుడు, దుష్టస్వభావయుక్తయైనస్త్రీకి బలియై క్లేశము లనుభవింపగలడు.

శంకరవల్లభా! నేను పరమగోపనీయమైననా యితిహాసమును జననివైననీకు వివరింతును, దయతో వినవలసినదిగ ప్రార్థించుచున్నాను. మాతా! శైశవావస్థనుండి నేను శ్రీకృష్ణభక్తుడను. నామన మెల్లపు డాపరంధాముని ధ్యానమందే సంలగ్నమైయుండును. నాపితృదేవుడు నాకుచిత్రరథుని కుమార్తెతో వివాహ మొనరించెను. ఆమె యత్యంత తేజస్విని, మెల్లపుడు తపమందే యాసక్తి కలిగియుండును. ఒకదినమున నామె ఋతుస్నాతయై నన్ను సమీపించెను. ఆసమయమున నేను భగవంతునిచరణకమలధ్యానమందు నిమగ్నుడనై బాహ్యజ్ఞానశూన్యుడనై నాభార్యకోర్కె దీర్పనైతిని. తన కోరిక నిష్ఫల మగుటగాంచి యామె కోపించి "నీ వెవరిపై దృష్టి సారించెదవో వారు నశించెదరని" నన్ను శపించెను. అనంతరము ధ్యానము భంగముకాగా నే నామెను సంతుష్టిపఱచితిని. కాని యామె తా నిచ్చిన శాపమును మరల్పజాలనిదియై మిగుల పశ్చాత్తాపము నందెను. జననీ! ఈకారణమువలన జీవహింసాభయమున నే నెవరినిగూడ దర్శింపక శిరమును వంచి చరించుచున్నాను." శనైశ్చరుని యీచరిత్రమును విని పార్వతీసహితముగ సకలసఖులు పరిహాసింపదొడంగిరి.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని, నారదనారాయణ
సంవాదములో శనిపార్వతీసంవాదమున
శనియధోదృష్టికి గలకారణమును
జెప్పుట యనుపదునొకండవ
అ ధ్యా య ము
సంపూర్ణము.



# పంద్రెండవ అధ్యాయము

## పార్వతిపలుకు ననుసరించి శనైశ్చరుడు గణపతిని జూచుట, గణేశునితల తెగి గోలోకమునకు వెడలుట, పార్వతి మూర్ఛిల్లుట, శ్రీహరి యేతెంచి గజశిరస్సు నతికించి గణేశ్వరుని బ్రతికించియాశీర్వదించుట పార్వతి శనైశ్చరుని శపించుట.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! శనైశ్చరునివాక్కులను విని దుర్గాదేవి పరమేశ్వరుడైన శ్రీహరిని స్మరించి సమస్తజగము లీశ్వరుని యిచ్ఛకు లోబడియున్నవని భావించి కౌతూహలమున శనైశ్చరునితో నిట్లు పల్కెను. "సూర్యనందనా! నీవు నన్ను నా కుమారుని నిశ్శంకుడవై దర్శింపుము. ఎవ్వరును కర్మఫలభోగమును దప్పింపలేరుగదా?" పార్వతీదేవి యాదేశమును శిరసావహించి శనైశ్చరుడు ప్రకృతిని దర్శింపక కేవలము బాలకునే వీక్షించుటకు నిశ్చయించుకొని ధర్మమునే సాక్షిగ నెంచుకొని పార్వతియంకము నలంకరించియున్న యాదివ్యశిశుముఖమండలమును వీక్షించెను. శనిదృష్టి పడినంతనే బాలకుని మస్తకము శరీరమునుండి విడివడియంతర్ధానమయ్యెను. తత్‌క్షణమే శని తనదృష్టిని మరల్చి శిరమును వంచుకొని పార్వతియెదుట నిలువబడెను. క్షణములో దనకుమారునకు మరణము సంభవించుటగాంచి పార్వతీదేవి బాలకునిశరీరమును హృదయమునకు హత్తుకొని యున్మత్తురాలివలె నుచ్చైస్స్వరముతో రోదింపదొడంగెను. ఆ సమయమున శివలోకములో నుపస్థితులై యున్నసకలదేవతలు గంధర్వులు, ప్రమథగణములు, స్వయముగ శివుడు నీహఠాత్సంఘటనను గాంచి యాశ్చర్యచకితులైరి. ఆసమయమున వారందఱు కింకర్తవ్యతావిమూఢులై చిత్రలిఖితప్రతిమలవలె నిశ్చలముగ నుండిరి. అనంతరము కైలాసమం దున్నవా రందఱత్యంతదుఃఖాతిశయమున మూర్ఛిల్లిరి. పరిస్థితిని గమనించి శ్రీహరి గరుడారూఢుడై యుత్తరదిశయందున్న పుష్పభద్రనదీతటమునకు జేరెను. అచట

ఉత్తరదిశగా దలయుంచుకొని తనపరివారముతో నిందించు గజేంద్రమును శ్రీహరి గాంచి, సుదర్శనచక్రముతో నాగజేంద్రుని శిరమును ఖండించి, ఆ శిరమును గైలాసమునకు దీసికొనిపోవుట కుద్యుక్తుడుకాగా గజేంద్రునిభార్య మేల్కాంచి, తనభర్త మరణించుట చూచి, విలపించుచు తనసమ్ముఖమున నున్న శ్రీమన్నారాయణుని దర్శించి భర్తవియోగదుఃఖితయై ఆయన నిట్లు ప్రార్థింపసాగెను.

**గజపత్ని పలికెను :**

లక్ష్మీపతీ! పరమశాంతస్వరూపా! శంఖచక్రగదాపద్మధారీ! పరాత్పరా! జగన్నాథా! కర్మబంధనఖండనా! సర్వవ్యాపకా! సర్వకారణకారణుడా! గరుడగమనా! సుదర్శనచక్రధారీ! నాకు బతిభిక్ష నొసంగుము".

గజపత్నిప్రార్థనల నాలకించి శ్రీహరి ప్రసన్నుడై గజేంద్రమునకు మఱియొక గజశిరము నమర్చి ప్రాణముల నొసంగెను. తదనంతరము శ్రీహరి కైలాసమునకు జేరి పార్వతి యంకమందు మృతుడైయున్న బాలకునిశరీరమునకు గజేంద్రునిశిరము నమర్చెను. శ్రీహరి తత్సమయముననే యాబాలకుని బునర్జీవితునిగ నొనరించెను. పార్వతికి జైతన్యమును గలుగజేసి గజాననుడైన బాలుని యామె యొడియందు జేర్చి యామె కాధ్యాత్మికజ్ఞానము నిట్లుపదేశించెను.

**విష్ణువు పలికెను :**

గిరిజాదేవీ! జగములకు నీవే బుద్ధిస్వరూపిణివి. బ్రహ్మమొదలు కీటకపర్యంతమువఱకు గలదేహధారులందఱు కర్మానుసారముగ ఫలముల ననుభవింతు రని నీకు దెలియనదికాదు. జీవు డొనరించిన శుభాశుభకర్మము లెన్ని కల్పములు గతించినను సంపూర్ణముగ ననుభవింపనిదే యవి నశింపవు. ఇంద్రుడైనను గర్మవశమున కీటకయోనియందు జన్మింపగలడు. కీటకమైనను పూర్వకర్మఫలానుసారముగ నింద్రునిగ నావిర్భవింపగలదు. పూర్వజన్మార్జితకర్మఫలసహాయము లేనిదే సింహమైనను ఈగనుగూడ సంహరింపజాలదు. ఈగయైనను తనపూర్వకృతకర్మబలమువలన నేనుగనైనను సంహరింపగలశక్తిని బొందగలదు.

సుఖం దుఃఖం భయం శోకమానన్దం కర్మణః ఫలమ్ ।
సుకర్మణః సుఖం హర్షమితరే పాపకర్మణః॥ (27)

"సుఖదుఃఖములు, భయశోకములు, ఆనందము మొదలగునవన్నియు గర్మయొక్క ఫలములే. సుఖము, హర్షము, ఉత్తమకర్మములవలన, భయ శోక దుఃఖాదులు పాపకర్మములవలన గలుగును". కర్మభోగము శుభాశుభ రూపమున నిహలోకమందుగాని, పరలోకమందుగాని లభించును. కాని సత్క-ర్మోపార్జనకు యోగ్యమైనపుణ్యక్షేత్రము పవిత్రభారతవర్షమే. స్వయముగ శ్రీకృష్ణపరమాత్మయే కర్మఫలప్రదాత, ఆయన విధాతలకు విధాత, మృత్యువు నకు మృత్యువు, కాలమునకు గాలము, నిషేకమునకు నిషేకకర్త, సంహర్తలకే సంహారకుడు, పాలకులకు బాలకుడు, పరాత్పరపరబ్రహ్మము, పరిపూర్ణుడైన గోలోకనాథుడు. నేను, బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులు నందఱము నాపురుషోత్త ముని యంశజులమే. దనరోమకూపములయందసంఖ్యాకజగములను ధారణ చేసియున్న మహావిరాట్పురుషుడు శ్రీకృష్ణుని షోడశాంశయే. చరాచరజగ త్తంతయు నాపరబ్రహ్మమందే నిక్షిప్తమై యున్నది. శ్రీకృష్ణునియంశచే నీ కుమారుడైనవినాయకుడుకూడ నున్నాడు. కావున హృదయదౌర్బల్యమును వీడి శోకింపక భయరహితవుకమ్ము."

శ్రీహరి యుపదేశము నాలకించి పార్వతి సంతుష్టిచెందెను. అనంతరము కైలాసమందున్న వారందఱు చేతనత్వమును బొందిరి. తమకుమారుని సజీవు నిగ గాంచి యుమామహేశ్వరు లంజలిఘటించి భక్తిపూర్వకముగ గమలాపతి యైనశ్రీమహావిష్ణువు ననేకవిధముల స్తుతించిరి. విష్ణుమూర్తి శిశువును, శిశువుయొక్క జననీజనకులను నాశీర్వదించి, బాలకుని గళమును దనయమూల్యభూ షణమైనకౌస్తుభమణిహారముతో నలంకరించెను. బ్రహ్మ తనమకుటమును, ధర్మదేవత యమూల్యములైన రత్నాభూషణములను, సకలదేవతాగణములు వివిధములునగు నుపహారములను, శ్రీహరికరుణవలన బునర్జీవితుడైన ఆదిదంప తుల ముద్దులబిడ్డడైనగజాననున కర్పించిరి. అత్యంతహర్షాంతరంగుడైన మహాదేవు డసంఖ్యాక దివ్యరత్నములను, సువర్ణములను, దుర్లభపదార్థము లను ఘనముగ దానమొనరించెను. లక్ష్మీపతియైనవిష్ణువే స్వయముగ బాలకునకు మంగళకార్యములను, సంపన్నమొనరించెను. కైలాసమున క్షేతెం

చినసర్వులు దివ్యభోజనముల నారగించి, సంతుష్టులైరి. ఆసమయమున తమ దుఃఖమునకు గారణు డైనశనైశ్చరుని గాంచి పార్వతి కుపితయై యంగహీను డవు కమ్మని శపించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ
సంవాదమున విష్ణువు గణేశుని పున
ర్జీవితునిగ జేయుట యను
పండ్రెండవ
అధ్యాయము
సంపూర్ణము.



## పదమూడవ అధ్యాయము

### విష్ణువు మున్నగుదేవతలు గణేశున కగ్రి పూజ నొనరించుట, విష్ణువు గణేశ్వరుని స్తుతించి సంసారమోహన మను కవచమును శనైశ్చరున కుపదేశించుట.

**శ్రీనారాయణఋషి పలికెను :**

బ్రహ్మనందనా! పార్వతీతనయుని బునర్జీవితునిగ నొనరించి శ్రీమహావిష్ణువు సకలదేవతలతో, మహర్షులతో గూడి నానావిధపూజాద్రవ్యములతో గజాననుని బూజించెను. విష్ణు వాబాలకున కమోఘమైనవరము నిట్లుప్రసాదించెను. "సకలసురశ్రేష్ఠా! స్వయముగ నేనే ప్రథమమున నిన్ను బూజించితిని. అందువలన నీవు సర్వజగములయందును ప్రథమమున పూజ నొందగలవు

వత్సా! నీవు సర్వపూజ్యుడవై యోగీంద్రుడ వయ్యెదవుగాక” యని యాశీర్వ దించి శ్రీహరి గజాననుని గళమున దివ్యవనమాల నలంకరించి ముక్తిదాయక మైనపరబ్రహ్మజ్ఞానమును, సర్వసిద్ధులను బ్రసాదించి తనయంతవానినిగ నొన రించెను. పిమ్మట గణేశ్వరునకు శ్రీహరి షోడశోపచారముల నర్పించెను. “విఘ్నే శ్వరుడు, గణేశ్వరుడు, హేరంబుడు, గజాననుడు, లంబోదరుడు, ఏకదంతుడు, శూర్పకర్ణుడు, వినాయకుడు”నను నెనిమిదినామములతో గిరిజానందనుని శ్రీమహావిష్ణువు ప్రథమమున గీర్తించెను. ఆసమయమున సకలమహర్షులు వేదోక్తము లైనయాశీర్వచనముల బలికిరి. సర్వదేవతలు, మహర్షులు మొద లగువారు నానావిధము లగునుపహారములను గణేశ్వరున కర్పించి యాయనను భక్తిపూర్వకముగ బూజించిరి.

నారదా! హర్షోద్భాసితముఖారవింద మైనపార్వతీదేవి తనప్రియపుత్రుని రత్ననిర్మితసింహాసనాసీనునిగ నొనరించి సమస్తతీర్థములను దెప్పించి నూఱు కలశములలో నింపి మహర్షులు వేదములను బఠించుచుండగ నాపవిత్రజలము లతో విఘ్నేశ్వరు నభిషేకించి యగ్నిశుద్ధదివ్యవస్త్రముల నొసంగెను. తదుపరి పాద్యముకొఱకు గోదావరీజలములను, అర్ఘ్యముకొఱకు గంగాజలములను, ఆచ మనముకొఱకు దూర్వాక్షితపుష్పచందనయుక్తము లగుబుష్కరజలములను నొసంగెను. రత్నపాత్రయం దుంచినశర్కరాయుక్తద్రవ్యములను, మధుపర్క ములను నిచ్చెను. అనంతరము స్వర్గలోకవైద్యు లైనయశ్వినీకుమారులు నిర్మిం చిన స్నానోపయోగ మైనవిష్ణుతైలమును, బహుమూల్యరత్ననిర్మితసుందరా భూషణములను, పారిజాతపుష్పములతో నిర్మించిన నూఱుమాలలను, మాలతీ చంపకాద్యనేకవిధపుష్పములను, తులసీదళములుగాక మిగిలినపూజోపయోగ మైనపత్రములను, చందానగరుకస్తూరీకుంకుమరాసులను, రత్నప్రదీపములను సుగంధితధూపములను సాదరముగ బ్రియపుత్రున కర్పించెను. విఘ్నవినాయ కునకు బ్రియ మైనలడ్డు, గోధుమచూర్ణముతో నొనరించిన యుండ్రాళ్ళు, అత్యంతస్వాదిష్టము లైనపక్వాన్నములు, శర్కరామిశ్రితస్వాదిష్టస్వస్తికా చిహ్నితములు, త్రికోణచిహ్నితమును నగుపాకవిశేషములు, బెల్లముతో జేయ బడినపరమాన్నము, బియ్యపుపిండితోనిర్మించిన నానావిధములగువ్యంజనములు, వడపప్పు, నానుబ్రాలు, చెఱకుగడలు, ముద్దపప్పు మొదలగుపదార్థములను రాసులుగ బోసి గణేశ్వరుని బ్రీత్యర్థము పార్వతియర్పించెను. నారదా! గజా

ననుని నైవేద్యసమర్పణమందు పార్వతీదేవి హర్షాంతరంగయై యొకలక్ష పాత్రిలలో క్షీరములను, మఱియొకలక్షపాత్రిలలో పెరుగును, మూడులక్షల పాత్రిలలో మధువు (తేనె)ను, నైదులక్షలపాత్రలలో ఘృతమును సాదరముగ సర్పించెను. నారదా! ఇవియేకాక వెలగ, దానిమ్మ, నేరేడు, ఖర్జూరము, జామ, మామిడి, యరటి, నారికేళము, పనస మొదలగు నసంఖ్యాకఫలములను గణేశ్వరుని భోగమునకై మహామాయ సాదరముగ సమర్పించెను. పిమ్మట యాచమనముకొఱకు, త్రాగుటకొఱకు నత్యంతనిర్మలమైన కర్పూరాదులచే సువాసితమైన గంగాజలముల నర్పించెను. అంతమున గర్పూరాదిసుగంధద్రవ్యయుక్తమైనతాంబూలము నొసంగెను.

తరువాత మాతామహి యైనమేనక, మాతామహు డయినహిమవంతుడు, హిమవంతునిపుత్రిలు, ఇతరులగు నాత్మీయులు గిరిజానందనుని బూజలను సంపన్న మొనరించిరి. కైలాసమం దుపస్థితు లై యున్నబ్రహ్మవిష్ణుశివాదిదేవతలు నిమ్నలిఖితమంత్రోచ్చారణ మొనరించుచు భక్తిపూర్వకముగ నలభ్యవస్తువులను పెక్కింటిని గణేశ్వరున కర్పించి పరమానందమగ్నులైరి.

ఓం శ్రీం హ్రీం క్లీం గణేశ్వరాయ బ్రహ్మరూపాయ చారవే ।
సర్వసిద్ధిప్రదేశాయ విఘ్నేశాయ నమో నమః ॥

ఈమహామంత్రిమున ముప్పదిరెండక్షరములు కలవు. ఈగణేశ్వర మంత్రిము సంపూర్ణాభీష్టఫలముల నిచ్చునది, ధర్మార్థకామమోక్షచతుర్విధ పురుషార్థముల నొసంగునది, సర్వసిద్ధిప్రదాయకమైనది. ఈమంత్రిము నైదు లక్షలపర్యాయములు జపించినవానికి మంత్రిసిద్ధి కలుగగలదు. మంత్రసిద్ధి పొందినమానవుడు నిశ్చయముగ విష్ణుతుల్యుడు కాగలడు. అతడు మహావక్తయు, సిద్ధియుక్తుడు, గుణవంతుడు, విద్వాంసులకు గురువు నై యీజగమునందే వాక్పతిగ బ్రసిద్ధిగాంచగలడు. ఆసమయమున దేవతలంద అనేక విధము లగువాద్యములను బ్రయోగించుచు మహోత్సవ మొనరించిరి.

అథ విష్ణుః సభామధ్యే తం సమ్పూజ్య గణేశ్వరమ్ ।
తుష్టావ పరయా భక్త్యా సర్వవిఘ్నవినాశకమ్ ॥ (40)

మహర్షీ! అనంతర మాసభామధ్యమున విరాజమానుడై యున్నవిష్ణుమూర్తి సంపూర్ణవిఘ్నవినాశకు డైననాగణేశ్వరుని పూజించి, భక్తిపూర్వకముగ స్తుతించెను.

## శ్రీవిష్ణుకృతం గణేశస్తోత్రమ్

**శ్రీవిష్ణు రువాచ :**

ఈశ త్వాం స్తోతుమిచ్ఛామి బ్రహ్మజ్యోతిః సనాతనమ్।
నిరూపితుమశక్తోఽహమనురూపమనీహకమ్ ॥
ప్రవరం సర్వదేవానాం సిద్ధానాం యోగినాం గురుమ్ ।
సర్వస్వరూపం సర్వేశం జ్ఞానరాశిస్వరూపిణమ్ ॥
అవ్యక్తమక్షరం నిత్యం సత్యమాత్మస్వరూపిణమ్ ।
వాయుతుల్యాతినిర్లిప్తం చాక్షతం సర్వసాక్షిణమ్ ॥
సంసారార్ణవపారే చ మయా పోతే సుదుర్లభే।
కర్ణధారస్వరూపం చ భక్తానుగ్రహకారకమ్ ॥
వరం వరేణ్యం వరదం వరదానామపీశ్వరమ్।
సిద్ధం సిద్ధిస్వరూపం చ సిద్ధిదం సిద్ధిసాధనమ్॥
ధ్యానాతిరిక్తం ధ్యేయం చ ధ్యానాసాధ్యం చ ధార్మికమ్।
ధర్మస్వరూపం ధర్మజ్ఞం ధర్మాధర్మఫలప్రదమ్ ॥
బీజం సంసారవృక్షాణామఙ్కురం చ తదాశ్రయమ్।
స్త్రీపున్నపుంసకానాం చ రూపమేతదతీన్ద్రియమ్ ॥
సర్వాద్యమగ్రపూజ్యం చ సర్వపూజ్యం గుణార్ణవమ్ ।
స్వేచ్ఛయా సగుణం బ్రహ్మ నిర్గుణం చాపి స్వేచ్ఛయా।
స్వయం ప్రకృతిరూపం చ ప్రాకృతం ప్రకృతేఃపరమ్।
త్వాం స్తోతుమక్షమోఽనన్తః సహస్రవదనేన చ ॥
న క్షమః పంచవక్త్రశ్చ న క్షమశ్చతురాననః ।
సరస్వతీ న శక్తా చ న శక్తోఽహం తవ స్తుతౌ॥
న శక్తాశ్చ చతుర్వేదాః కే వా తే వేదవాదినః॥
ఇత్యేవం స్తవనం కృత్వా సురేశం సురసంసది ।
సురేశశ్చ సురైః సార్ధం విరరామ రమాపతిః।
ఇదం విష్ణుకృతం స్తోత్రం గణేశస్య చ యః పఠేత్ ।
సాయంప్రాతశ్చ మధ్యాహ్నే భక్తియుక్తః సమాహితః॥
తద్విఘ్ననిఘ్నం కురుతే విఘ్నేశః సతతం మునే ।
వర్ధతే సర్వకల్యాణం కల్యాణజనకః సదా॥

యాత్రాకాలే పఠిత్వా యో యాతి తద్భక్తిపూర్వకమ్ ।
తస్య సర్వాభీష్టసిద్ధిర్భవత్యేవ న సంశయః ॥
తేన దృష్టం చ దుస్స్వప్నం సుస్వప్నముపజాయతే ।
కదాపి న భవేత్తస్య గ్రహపీడా చ దారుణా ॥
భవేద్వినాశః శత్రూణాం బన్ధూనాం చ వివర్ధనమ్ ।
శశ్వద్విఘ్నవినాశశ్చ శశ్వత్సమ్పద్వివర్ధనమ్॥
స్థిరా భవేద్ గృహే లక్ష్మీః పుత్రపౌత్రవివర్ధినీ ।
సర్వైశ్వర్యమిహ ప్రాప్య హ్యన్తే విష్ణుపదం లభేత్ ॥
ఫలం చాపి చ తీర్థానాం యజ్ఞానాం యద్భవేద్ధ్రువమ్ ।
మహతాం సర్వదానానాం శ్రీగణేశప్రసాదతః॥ (41-58)

శ్రీవిష్ణువొనరించిన గణేశ్వర స్తోత్రము

ఈశ్వరా! సనాతనబ్రహ్మజ్యోతిస్స్వరూపుడవై ననిన్ను నేను స్తుతింపవలె ననిభావించుచున్నాను. కాని తగువిధముగ నిన్ను నిరూపణమొనరించుటందు నేను పూర్తిగ నసమర్థుడనైయున్నాను. ఎందువలన ననగ, నీవు ఇచ్ఛారహితుడవు, సంపూర్ణ దేవతలలో శ్రేష్ఠుడవు, సిద్ధులకు, యోగులకు గురుడవు, సర్వస్వరూపుడవు, సర్వేశ్వరుడవు, జ్ఞానరాశిస్వరూపుడవు, అవ్యక్తుడవు, నిత్యుడవు, అవినాశివి, సత్యస్వరూపుడవు, ఆత్మస్వరూపుడవు, వాయువువలె నిర్లిప్తుడవు, క్షతరహితుడవు, సర్వసాక్షివి, సంసారసాగరమును దరించుటకు సాధనమైనదుర్లభమాయారూపనౌకకు కర్ణధారస్వరూపుడవు, భక్తానుగ్రహావిగ్రహుడవు, వరణీయుడవు, వరదాతవు, వరదాతలకుగూడ నీశ్వరుడవు, సిద్ధుడవు, సిద్ధిస్వరూపుడవు, సిద్ధిదాతవు, సిద్ధులను బొందుటకైకసాధనుడవు, ధ్యానతిరిక్తధ్యేయుడవు, ధ్యానమున కసాధ్యమైనవాడవు, ధార్మికుడవు, ధర్మస్వరూపుడవు, ధర్మజ్ఞాతవు, ధర్మాధర్మఫలప్రదాతవు, సంసారవృక్షమునను బీజము, అంకురము, తదంకురమున కాశ్రయుడవు, స్త్రీపుంనపుంసకరూపములయందు విరాజమానుడవై, వారి యింద్రియముల కతీతుడవై యున్నవాడవు, సర్వులకు నాదియైనవాడవు, అగ్రపూజ్యుడవు, సర్వపూజ్యుడవు, గుణసాగరుడవు, స్వేచ్ఛానుసారముగ సగుణ నిర్గుణ బ్రహ్మరూపములను ధరించువాడవు, స్వయముగ ప్రకృతిరూపుడవు, ప్రకృతికంటెపరమైన ప్రాకృతస్వరూపుడవు, శేషుడు తనసహస్రముఖములచేకూడ నిన్ను స్తుతించుట కసమ

ర్థుడైయున్నాడు. పంచముఖుడైనమహేశ్వరుడును, చతుర్ముఖుడైనబ్రహ్మాయు సరస్వతియు, స్వయముగ నేనుగూడ నిన్ను స్తుతింపజాలకున్నాము. నిన్ను స్తుతించుటకు వేదములే యశక్తములైయున్నవి. ఐనచో నిక వేదజ్ఞులసంగతి చెప్పునదేమి?

ఇట్లు దేవసభామధ్యమున దేవతలతోగూడి సురాధీశుడైనరమాపతి సురేశ్వరుడై నగణేశ్వరుని స్తుతించెను. మునీశ్వరా! ఏకాగ్రచిత్తుడై భక్తి భావయుక్తుడై, మూడువేళల నీవిష్ణుకృతగణేశస్తోత్రమును సతతము పఠించు మానవుని విఘ్నేశ్వరుడు సమస్తవిఘ్నములనుండి రక్షించును. ఆభక్తునిసర్వ శుభములు వృద్ధిచెందగలవు. అతడు స్వయముగ కళ్యాణజనకుడు కాగలడు. యాత్రాకాలమందు భక్తిపూర్వకముగ నీస్తోత్రమును బఠించుచు యాత్ర యొనరించువానికి తానభిలషించిన మనోవాంఛితము లన్నియు నెరవేరగలవు. తాను చూచిన దుస్స్వప్నములు సుస్వప్నములుగ బరిణమించగలవు. అతడు దారుణగ్రహపీడలనుండి విముక్తుడగును. ఈస్తోత్రమును బఠించినవారియొక్క శత్రువులు నశింతురు. వానిబంధువులకు, విశేషముగ నుత్కర్షత లభింప గలదు. వానివిఘ్నములు క్షయమొంది సంపదలు వృద్ధిబొందగలవు. వాని గృహమున పుత్రపౌత్రులను, సంపదలను వృద్ధిబొందించులక్ష్మి స్థిరరూపమున నివసించును. అతడిహలోకమందు సమస్తైశ్వర్యముల ననుభవించి యంత్య కాలమందు విష్ణుపదమును బొందును. తీర్థములవలన గలుగుఫలము శ్రీగణే శ్వరుని కృపవలన స్తోత్రపాఠకుడైనభక్తునకు నిస్సందేహముగ లభింపగలదు. ఇది సత్యము.

**నారదుడు పలికెను :**

ప్రభూ! గణేశ్వరుని పూజావిధానము, స్తోత్రము మీకృపవలన నాక ర్ణించితిని. జననమరణమహాచక్రమునుండి జీవుని విముక్తునిగ నొనరింపగల శ్రీగణేశ్వరకవచము నుపదేశింపుడు.

**శ్రీనారాయణఋషి పలికెను :**

దేవర్షీ! ఆదేవసభామధ్యమున గజాననునిపూజ సమాప్తియైన పిమ్మట శనైశ్చరుడు సర్వతారకుడు, జగద్గురువు నగుశ్రీమహావిష్ణువు నిట్లు ప్రార్థించెను.

## శనైశ్చరుడు పలికెను :

వేదవేత్తలయందు శ్రేష్ఠుడవైన దేవా! సమస్తదుఃఖవినాశకరమైన, అత్యంతశాంతిప్రదాయకమైన, విఘ్నవినాశకమైన శ్రీగణేశ్వరుని దివ్యకవచమును వర్ణించి మమ్ములను ధన్యమొనరింపుడు. ప్రభూ! మాయాశక్తియైన పార్వతీదేవివలన నేను శాపగ్రస్తుడనైతిని. అందువలన నావిఘ్నమును నివారించుటకొఱకు శ్రీగణేశ్వరునికవచమును ధరించెదను.

**మహావిష్ణువు పలికెను :**

సూర్యనందనా! పదిలక్షలపర్యాయములు జపించిన శ్రీగణేశ్వరకవచము సిద్ధించును. కవచసిద్ధిని బొందినమానవుడు మృత్యువును జయించుటలో సమర్థుడు కాగలడు. కవచసిద్ధిపొందిన మనుష్యుడు భూతలమందు వాగ్మియు, చిరంజీవియు, సర్వత్రవిజయుడు, పూజ్యుడు కాగలడు. శ్రీగణేశ్వరమాలామంత్రమును జపించుచు నీపుణ్యకవచమును ధరించిన మనుష్యుల సర్వపాపములు నిశ్చయముగ నశింపగలవు. భూత, ప్రేత, పిశాచ, కూష్మాండ, బ్రహ్మరాక్షస, డాకినీ, యోగినీ, బేతాళాదిగ్రహములు, బాలగ్రహ, గ్రహ, క్షేత్రపాలాదులీకవచశబ్దశ్రవణమాత్రముననే భీతులై పారిపోగలరు. గరుత్మంతుని కడకు సర్పములు జేరనట్లు ఈకవచధారియైనపురుషుని ఆధి (మానసికరోగములు) వ్యాధులు (శారీరకరోగములు) శోకములు నావహింపలేవు. ఈకవచమును సరళస్వభావయుక్తుడు, గురుభక్తుడు నగు శిష్యునకే ప్రసాదింపవలెను.

శనైశ్చరంప్రతి విష్ణునోపదిష్టం సంసారమోహనం నామ

### శ్రీ గ ణే శ క వ చ మ్

**విష్ణురువాచ :**

సంసారమోహనస్యాస్య కవచస్య ప్రజాపతిః ।
ఋషిశ్ఛన్దశ్చ బృహతీ దేవో లమ్బోదరః స్వయమ్ ॥
ధర్మార్థకామమోక్షేషు వినియోగః ప్రకీర్తితః ।
సర్వేషాం కవచానాం చ సారాభూతమిదం మునే ॥
ఓం గం హుం శ్రీగణేశాయ స్వాహా మే పాతు మస్తకమ్ ।
ద్వాత్రింశదక్షరో మన్త్రో లలాటం మే సదావతు ॥

ఓం హ్రీం క్లీం శ్రీం గమితి చ సంతతం పాతు లోచనమ్ ।
తాలుకం పాతు విఘ్నేశః సంతతం ధరణీతలే ॥
ఓం హ్రీం శ్రీం క్లీమితి చ సంతతం పాతు నాసికామ్।
ఓం గౌం గం శూర్పకర్ణాయ స్వాహా పాత్వధరం మమ ॥
దన్తాని తాలుకాం జిహ్వాం పాతు మే షోడశాక్షరః ॥
ఓం లం శ్రీం లమ్బోదరాయేతి స్వాహా గణ్డం సదావతు ।
ఓం క్లీం హ్రీం విఘ్ననాశాయ స్వాహా కర్ణం సదావతు ॥
ఓం శ్రీం గం గజాననాయేతి స్వాహా స్కన్ధం సదావతు ।
ఓం హ్రీం వినాయకాయేతి స్వాహా పృష్ఠం సదావతు ॥
ఓం క్లీం హ్రీమితి కఙ్కాలం పాతు వక్షఃస్థలం చ గమ్ ।
కరౌ పాదౌ సదా పాతు సర్వాఙ్గం విఘ్ననిఘ్నకృత్ ॥
ప్రాచ్యాం లమ్బోదరః పాతు ఆగ్నేయ్యాం విఘ్ననాయకః ।
దక్షిణే పాతు విఘ్నేశో నైరృత్యాం తు గజాననః॥
పశ్చిమే పార్వతీపుత్రో వాయవ్యాం శంకరాత్మజః ।
కృష్ణస్యాంశశ్చోత్తరే చ పరిపూర్ణతమస్య చ ॥
ఐశాన్యామేకదన్తశ్చ హేరమ్బః పాతు చోర్ధ్వతః ।
అధో గణాధిపః పాతు సర్వపూజ్యశ్చ సర్వతః
స్వప్నే జాగరణే చైవ పాతు మాం యోగినాం గురుః॥
ఇతి తే కథితం వత్స సర్వమన్త్రౌఘవిగ్రహమ్।
సంసారమోహనం నామ కవచం పరమాద్భుతమ్ ॥
శ్రీకృష్ణేన పురా దత్తం గోలోకే రాసమణ్డలే।
బృన్దావనే వినీతాయ మహ్యం దినకరాత్మజ ॥
మయా దత్తంచ తుభ్యంచ యస్మై కస్మై న దాస్యసి।
పరం వరం సర్వపూజ్యం సర్వసఙ్కటతారణమ్ ॥
గురుమభ్యర్చ్య విధివత్ కవచం ధారయేత్తు యః ।
కణ్ఠే వా దక్షిణే బాహౌ సోఽపి విష్ణుర్న సంశయః ॥
అశ్వమేధసహస్రాణి వాజపేయశతాని చ ।
గ్రహేన్ద్రకవచస్యాస్య కలాం నార్హన్తి షోడశీమ్॥
ఇదం కవచమజ్ఞాత్వా యో భజేచ్ఛంకరాత్మజమ్ ।
శతలక్షప్రజప్తోఽపి న మన్త్రః సిద్ధిదాయకః ॥ (78-96)

శనైశ్చరా! ఈసంసారమోహన మనుకవచమునకు ప్రజాపతి ఋషి, బృహతి ఛందస్సు స్వయముగ లంబోదరు డైనగణేశ్వరుడే దైవము. ధర్మార్థ కామమోక్షచతుర్విధపురుషార్థప్రాప్తికొఱకీకవచమును వినియోగింపవలెను. మునీంద్రా! ఈకవచము సర్వకవచములసారము. "ఓం గం హుం శ్రీగణేశాయ స్వాహా" ఈమంత్రము నాశిరమును రక్షించుగాక! ముప్పదిరెండక్షరములమూలమంత్రము నాలలాటమును కాపాడుగాక! 'ఓం హ్రీం క్లీం శ్రీం గం' ఈమంత్రము నిరంతరము నానేత్రములను రక్షించుగాక! విఘ్నేశ్వరు డెల్లపుడు నాతాలువులను (దవడలను) కాపాడుగాక! 'ఓం హ్రీం శ్రీం క్లీం' ఈమంత్రము నిరంతరము నానాసికను రక్షించుగాక, 'ఓం గౌం గం శూర్పకర్ణాయస్వాహా' నాపెదవులను రక్షించుగాక. ఈషోడశాక్షరమూలమంత్రము నాదంతములను, జిహ్వను సురక్షితముగ గాపాడుగాక. 'ఓం లం శ్రీం లమ్బోదరాయ స్వాహా' ఎల్లపుడు నాగండస్థలమును రక్షించుగాక. 'ఓం హ్రీం క్లీం విఘ్ననాశాయ స్వాహా' నాకర్ణములను రక్షించుగాక. 'ఓం శ్రీం గం గజాననాయ స్వాహా' నాభుజములను రక్షించుగాక. 'ఓం హ్రీం వినాయకాయ స్వాహా' నాపృష్ఠభాగమును రక్షించుగాక. 'ఓం క్లీం హ్రీం' నా కంకాలమును, 'గం' నా వక్షస్థలమును రక్షించుగాక. విఘ్ననిహంతా! నా కరములను, పాదములను, సర్వాంగములను నెల్లపుడు సురక్షితముగ నుంచుగాక. పూర్వదిశయందు లంబోదరుడు, అగ్నికోణమందు విఘ్ననాయకుడు, దక్షిణదిశయందు విఘ్నేశుడు, నైరృత్యకోణమందు గజాననుడు, పశ్చిమ దిశయందు పార్వతీపుత్రుడు, వాయవ్యకోణమందు శంకరాత్మజుడు, ఉత్తర దిశయందు పరిపూర్ణు డైనశ్రీకృష్ణునియంశజుడు, ఈశానకోణమం దేకదంతుడు ఊర్ధ్వభాగమందు హేరంబుడు, అధోభాగమందు సర్వపూజ్యుడు, అన్నివైపుల గణాధిపుడు నన్ను రక్షించుగాక. స్వప్నావస్థయందు, జాగ్రదావస్థయందు యోగీంద్రులకు గురు వగువాడు నన్నుగాపాడుగాక. వత్సా! నేను ప్రవచించిన యీకవచము సంపూర్ణమంత్రవిగ్రహస్వరూపము. ఈపరమాద్భుత సంసారమోహనకవచమును నేను నీకు గృపతో బ్రసాదించితిని. సూర్యనందనా! ప్రాచీనకాలమందు గోలోకబృందావనరాసమండలమధ్యమున శ్రీకృష్ణపరమాత్మ యీదివ్యకవచమును నా కుపదేశించెను. ఆ కవచమునే నీ కనుగ్రహించితిని. పరమశ్రేష్ఠ మైనయీమంత్రము నెవరికిని నుపదేశింప

రాదు. ఈకవచ మత్యంతశ్రేష్ఠము, సర్వపూజ్యము, సమస్త సంకటమోచనము. వినమ్రుడై గురువు నర్థించి యీకవచోపదేశము పొంది, దీనిని గళమందుగాని, దక్షిణభుజమందుగాని, ధరించిన మానవుడు విష్ణుతుల్యుడు కాగలడు. గ్రహేంద్రా! వేలకొలదిగ నశ్వమేధయజ్ఞములు వందలకొలదిగ వాజపేయయజ్ఞములు ఈకవచములో బదునారవ వంతునకుగూడ సరిరావు. ఈకవచమును బఠింపక గణేశ్వరుని మంత్రము నెన్నిమారులు జపించినను మానవుడు సిద్ధిపొందజాలడు.

అనంతరము సభాసీనులై యున్న దేవత లీకవచమును శ్రవణ మొనరించి మహదానందభరితులైరి.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములో నారదనారాయణసంవాదమున
గణపతి మంత్రపూజాస్తవ కవచకథన
మను పదమూడవ అధ్యాయము
సంపూర్ణము.



# పదునాల్గవ అధ్యాయము

## దేవతలవలన బార్వతికి గార్తికేయుని సమాచారము దెలియుట.

నారదుడు పలికెను :

ఆసభలో దేవతలు, గంధర్వులు, మునులు, శైలములు హృష్టమానసులై మహోత్సమును దిలకించుచుండిరి. ఇంతలో దుర్గాదేవిసంతోషముచే వికసించిన ముఖపద్మముకలదియై దేవేశ్వరుడైనవిష్ణువునకు నమస్కరించి యిట్లుపలికినది.

పార్వతీదేవి పలికెను :

"దేవా! నీవు సర్వజగత్తునకు రక్షకుడవై యున్నావు. నేను జగత్తునకు బయటగలేను. ప్రభూ! అమోఘము, రక్షితము నగునాస్వామివీర్య మెట్లప హరింపబడినది? నీచేత, బ్రహ్మచేత, ప్రేరితులైన దేవతలచేత రతిభంగము చేయబడగా భూమిపైబడినవీర్య మేదేవతచే నపహరింపబడినది? దేవత లందఱు సాదరముగ నీయెదుట వచింతురుగాక! నీవు పాలకునిగానుండగా నిట్టి యరాజక మెట్లుజరిగినది" జగదీశ్వరుడు పార్వతీదేవివాక్కులను విని నవ్వి దేవ వర్గము, మునివర్గము నున్నసభలో నిట్లుపలికెను.

విష్ణువు పలికెను :

"మీరు పార్వతీదేవి వాక్కులను వింటిరి. ఇపుడు నావాక్కులను వినుడు. శివునియమోఘవీర్యము నెవరు హరించిరో చెప్పవలసినది. వానిని వెంటనే సభలోనికి దీసికొనిరావలెను. లేనిచో దండనకు గురికాగలరు. ప్రజా బాధకుడు, పక్షపాతముచూపువాడు నగురాజు రాజుకాజాలడు".

విష్ణుపలికిన ఆమాటలువిని పరస్పర మాలోచించుకొని పార్వతీదేవి వాక్కులకు భయపడినవారై దేవతలందఱు విష్ణువునెదుట నిట్లుపలికిరి.

బ్రహ్మ పలికెను :

దేవా! పుణ్యభూమి యగునీభారతదేశమందావీర్యమును హరించిన వాడు పుణ్యావహము లగుపుణ్యకర్మలనుండి వంచితుడగును.

మహాదేవుడు పలికెను :

నావీర్యమును హరించినవాడు నీసేవనుండి, పూజనుండి వంచితుడగును.

యముడు పలికెను :

ఆవీర్యమును హరించినవాడు శరణాగతరక్షణమునుండి, యేకాదశీవ్రతము నుండి వంచితుడగును.

ఇంద్రుడు పలికెను :

ఆవీర్యమును హరించినవాడు పాపులయొక్క పాపమును బొంగొట్టుతన యశస్సు, పుణ్యము, సంతతకర్మ సర్వమును బోగొట్టుకొనును.

వరుణుడు పలికెను :

ఆవీర్యమును హరించినవాడు భారతవర్షమున గలియుగములో శూద్ర యాజకపత్నికి జన్మించును.

కుబేరుడు పలికెను :

ఆవీర్యమును హరించినవాడు కుదువబెట్టినదానిని హరించువాడు, విశ్వాస ఘాతకుడు, మిత్రఘ్నుడు, సత్యనాశకుడు, కృతఘ్నుడు కాగలడు.

ఈశానుడు పలికెను :

ఆవీర్యమును హరించినవాడు పరద్రవ్యాపహారియు, నరహంతకుడు గురు ద్రోహియు కాగలడు.

రుద్రులు పలికిరి :

తద్వీర్యాపహారకులు మిథ్యావాదులు, పారదారికులు, గురునిందారతులు కాగలరు.

కామధేనువు పలికెను :

తాను చేసినప్రతిజ్ఞను నెరవేర్పనిమానవు డేపాపమును బొందునో అట్టి పాపమును ఆవీర్యము నపహరించినవాడు పొందగలడు.

దేవవైద్యులు పలికిరి :

ఆవీర్యమును హరించినవాడు తల్లిదండ్రులయొక్క, గురువులయొక్క, భార్యాపుత్రులయొక్క పోషణమునుండి వంచితుడగును.

దేవతలు పలికిరి :

ఆవీర్యమును హరించినవారు కూటసాక్ష్యులు, పుత్రహీనులు, దరిద్రులు కాగలరు.

దేవపత్నులు పలికిరి :

ఆవీర్యమును హరించినవారు తనభర్తను నిందించువారు, పరపురుషుని బొందువారు, బుద్ధిహీనులు కాగలరు.

దేవీదేవతలవాక్కులను విని సృష్టిస్థితిలయకారకు డగువిష్ణువు స్వయముగ గర్మములకు సాక్షియైనధర్మదేవతనుగూర్చియు, సూర్యచంద్రహుతాశను

లనుగూర్చియు, పృథివీవాయుజలములనుగూర్చియు, రేయింబవళ్ళనుగూర్చియు, సంధ్యనుగూర్చియు నిట్లు పలికెను.

విష్ణువు పలికెను :

జగద్గురు వగుమహేశ్వరునియమోఘవీర్యమును దేవతలు హరింపనిచో నితరు లెవరు హరించిరి? మీరందఱు విశ్వములో నెల్లపుడు సర్వకర్మసాక్షులై యున్నారు. మీలో నెవ్వరు హరించిరి? లేనిచో నేమైనది? చెప్పుడు. పరమేశ్వరుని వాక్కులను విని సభలో గంపితులై వారు పరస్పర మాలోచించుకొని క్రమముగ హరియెదుట నిట్లుపలికిరి.

ధర్ముడు పలికెను :

దేవా! ప్రకోపకారణముగ రతివిరతుడైనశంకరుని యమోఘవీర్యము భూతలముపై బడెను.

భూమి పలికెను :

దేవా! ఆవీర్యమును వహించుట యత్యంతకఠినము. ప్రజ్వలితమగునా వీర్యతేజమును భరింపలేక దానిని యగ్నియందు బడవైచితిని.

అగ్ని పలికెను :

జగన్నాథా! నేనుకూడ నావీర్యతేజమును సహింపలేక దానిని రెల్లుపొదలో బడవైచితిని. శంకరునివీర్య మాక్షణముననే యత్యంతసుందరబాలకునిగ బరిణామమొందెను.

వాయువు పలికెను :

విష్ణుదేవా! స్వర్ణరేఖానదీతటముపై నున్న రెల్లుపొదలో బడిన నాటి దేవునివీర్య మత్యంతసుందరబాలకరూపముగ బరిణమించుటను నేనుగూడ గాంచితిని.

సూర్యుడు పలికెను :

దేవా! కాలచక్రప్రేరితుడనై యాదివ్యబాలకుని దర్శించినపిమ్మట నే నస్తమించితిని. కావున యీబాలకుని విషయమును సాంగోపాంగముగ నే నెరుగను.

చంద్రుడు పలికెను :

విష్ణుదేవా! బాలకుడుత్పన్నమైనసమయముననే కృత్తికలు బదరికాశ్రమమార్గముద్వారా పయనించుచుండిరి. వారు శంకరనందనుని రోదనమును విని సుందరాకారుడైననాశిశువును గాంచి తమవెంట తీసికొని వెడలిపోయిరి.

వరుణుడు పలికెను :

ప్రభూ! కృత్తికలు రోదించు నాదివ్యబాలకునకు తమస్తన్యము నిచ్చి వాని యాకలి దీర్చిరి. శివపుత్రుడు ప్రచండసూర్యునికంటె నధిక ప్రభావశాలి.

ప్రాతస్సాయంసంధ్యలు పలికెను :

శ్రీహరీ! ఆసమయమున హరునికుమారుడాయార్గురుకృత్తికలకు పోష్యపుత్రుడైనాడు. ఆకృత్తికలే స్వయముగ శంకరనందనునకు గార్త్తికేయుడనినామకరణ మొనరించిరి.

రాత్రి పలికెను :

జగత్ప్రభూ! ఆకృత్తికలు కార్త్తికేయుని వీక్షింపనిదే క్షణమైనను జీవింపజాలరు. వారికి తమప్రాణములకంటె గార్త్తికేయుడే యధికప్రియుడయ్యెను. శిశువును పోషించి పాలించువారికే యాశిశువు పుత్రుడనబడును.

దినము పలికెను :

దేవాదిదేవా! ఆకృత్తికలు కార్త్తికేయుని యల్లారుముద్దుగ బెంచుకొనుచు, జగమున దుర్లభములు, అత్యంతస్వాదిష్టములు నగుపదార్థములను బాలకునికొసంగి వారు పరమానందమొందసాగిరి.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణ మందలి
గణపతిఖండములోని నారదనారాయణసంవాదమున
కార్త్తికేయజన్మ కథన మను పదునాల్గవ
అధ్యాయము
సంపూర్ణము.



# పదునైదవ అధ్యాయము

## శివుడు కృత్తికలకడకు దూతనంపుట, కార్తికేయనందీశ్వరులసంవాదము.

దేవతలు తెల్పిన యీ దేవరహస్యమును పార్వతీదేవి యాలకించి మిగుల ప్రసన్నురాలై వారి కనేకదానముల నొసంగెను. బ్రహ్మవిష్ణుశివాదిసకలదేవతలు మరల మహోత్సవ మొనరించిరి.

**శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :**

మహేశ్వరుడు కార్తికేయుని దోడ్కొని రావలసినదిగ క్షేత్రపాలకులను, ప్రమథగణములను, వీరభద్రుని కృత్తికలస్థావరమునకు బంపెను. శివభృత్యులైన ప్రమథగణము లస్త్రశస్త్రసమన్వితులై కృత్తికాభవనమును నాల్గువైపుల నుండి ముట్టడించిరి. భయంకర మగునీయపార సేనావాహినిని గాంచి కృత్తికలు భయభీతలై బ్రహ్మతేజముతో బ్రకాశించుచున్న గార్తికేయుని రక్షింపు మని యర్థించిరి. కృత్తికలనుగాంచి సవినయముగ గార్తికేయు డిట్లుపల్కెను. "మాతృదేవతలారా ! మీరు భయమును బరిత్యజింపుడు. నే నుండగ మీ కపాయ మెట్లుసంభవింపగలదు? కర్మభోగము దుర్నివార్య మనిమీకుగూడ విదితమే. కనుక భీతిచెందకుడు". ఇంతలో బ్రమథగణాధ్యక్షు డైననందీశ్వరుడు కృత్తికాభవనమును బ్రవేశించి కార్తికేయుని దర్శించి యిట్లు పలికెను.

**న ం ది కే శ్వ రు డు ప లి కె ను :**

సోదరా! సంహారకర్తయు, సురశ్రేష్ఠుడు నగుశంకరుడు, మాతయగు పార్వతీదేవి నీకు జెప్ప మని యాదేశించిన పలుకులను జెప్పుచున్నాను, అవధరింపుము. కైలాసపర్వతమందు గణేశ్వరునిజన్మదినోత్సవసమయమున కొలువు దీరియున్న దేవతలు నీ ప్రాదుర్భావప్రసంగమును మాహేశ్వరికోఅగా శ్రీహరి యెదుట వెల్లడించిరి. నిన్ను బొందుటకై విష్ణువు దేవతలను బ్రశ్నించెను. ధర్మాధర్మములకు సాక్షి యైనధర్మదేవతమున్నగు సకలదేవతలు నీవు కృత్తికాభవనమున దినదినప్రవర్థమానుడవగుచున్నా వనివిన్నవించిరి. ప్రాచీనకాలమున కైలాసములో శివపార్వతు లేకాంతక్రీడారతులై యుండగా దేవతలు

గాంచిరి. ఆసమయమున విరతుఁడైనమహాదేవుని ప్రచండవీర్యము భూమిపైఁ బడెను. భూమి యావీర్యతేజమును సహింపలేక దాని నగ్నిలోఁ బడవైచెను. అగ్ని దానిని రెల్లుపొదలలోఁ జారవిడచెను. ఆసమయమున నీ వాదిదేవుని వీర్యమునుండి యావిర్భవించితివి. రోదించుచున్న నిన్ను కృత్తికలు గాంచి పోష్యపుత్రునిగ నొనరించుకొని తమగృహమునకు దీసికొనిపోయిరి. కార్తికేయా! ఈకృత్తికలను వీడి నీస్వస్థలమైనకైలాసమున కరుదెంచుము. కైలాసమందు విష్ణుసహితులైనసకలదేవతలు నిన్ను సురసేనానిగ నభిషేకించెదరు. నీవు మహాదేవునిగృపవలన సకలశస్త్రాస్త్రజ్ఞానసంపన్నుడవై సుజనకంటకుఁడైన తారకాసురుని వధింపుము. నీవు విశ్వసంహర్తయైనపరమేశ్వరుని పుత్రుడవు. శుష్కవృక్షములు తమలో నగ్నిని దాచుకొనలేనట్లు ఈకృత్తికలు నిన్ను దాచలేవు. నీవు విశ్వమందు దీప్తిమంతుడవు. మహాకూపమున బడియున్న చంద్రునివలె నీ వీ కృత్తికా గృహమున బడియున్నావు. సూర్యతేజము మనుష్యుని గుప్పిటయందు బంధింపబడనట్లు నీ యవయవ దివ్యతేజము కృత్తికలస్థలమును దాటి విశ్వమం దంతట ప్రకాశించుచున్నది. శంభునందనా! నీవు జగద్వ్యాపి యైనవిష్ణురూపుడవు. అందువలన నీ వీకృత్తికలకే పరిమితుడవుకావు. ఆకాశమెవ్వరికిని వ్యాప్యముకాక, స్వయముగ సర్వులకు వ్యాపకమై యుండును. కార్తికేయా! నీవు విషయములందు నిర్లిప్తుడవైనయోగీంద్రుడవు, విశ్వాధారుడవు, పరమేశ్వరుడవు. క్షుద్రవిహంగగర్భములో గరుత్మంతుడు నివసించుట యసంభవమైన ట్లీకృత్తికాభవనమున సర్వేశ్వరుడవైననీవు నివసించుట యసంభవమే. మోహానచిత్తులు, భక్తిహీనులు నగుమనుష్యులు హరియొక్క యుత్కృష్టభక్తిజ్ఞానములను దెలిసికొనలేనట్లు ఈకృత్తికలు నీప్రభావమును దెలిసికొనలేరు. నీవు భక్తులకొఱకు మూర్తిభవించినయనుగ్రహస్వరూపుడవు, అఖండతేజోరాశివి, అనిర్వచనీయుడవు, అట్టినిన్ను ఈకృత్తికలు తెలిసికొనలేరు. సోదరా! తక్షణమే యీకృత్తికాగృహమును వీడి నాతోఁ గైలాసమున కరుదెంచుము.

కార్తికేయుడు పలికెను :

సోదరా! భూతభవిష్యద్వర్తమాన కాలములయందు నిక్షిప్తమైయున్న మహాజ్ఞానముగూడ నాకు విదితమే. మృత్యుంజయుని యాశ్రయించియున్న నీవుకూడ మహాజ్ఞానివే. శంకరభక్తుడవైనని న్నేమని ప్రశంసింగలపను ?

సోదరా! ఎవ రేయే యోనులయందు జన్మించెదరో వా రాయోనులందే నిరంతరము నివసించి నిర్వృతిని బొందెదరు. భక్తుడైనను, జ్ఞానియైనను, మూర్ఖుడైనను గర్మభోగపరిణామస్వరూపమున తన కేదేహము ప్రాప్తించునో విష్ణుమాయామోహితుడై యాదేహమునే పరమోత్కృష్ట మనిభావించును. సనాతనియైనవిష్ణుమాయ ఆద్యాశక్తి, సర్వస్వమును బ్రసాదింపగలజనని, విశ్వమంగళకారిణి. ఆదేవి యీసమయమున శైలేంద్రుని పత్నికి గుమార్తెగ జన్మించి యఖండతపముద్వారా శంకరునే పతిగ బొందెను. ఆమెసౌభాగ్యమేమనిపొగడగలను? నందికేశ్వరా! పిపీలికాదిబ్రహ్మపర్యంతముగలసకలసృష్టి కృత్రిమము, అశాశ్వతము, మిథ్య. సర్వము ప్రకృతి సహయోగమున శ్రీకృష్ణునినుండి యుద్భవించెను. సమయ మాసన్నమైనపుడు సకలజగము లాపరమాత్మయందే లయింపగలవు. ప్రతికల్పమందు సృష్టివిధానమున నేను నిత్యుడనై యున్నను మాయాబద్ధుడనై జన్మించుందును. అదృష్టవశమున నా ప్రతిజన్మమందును మహాదేవుడు నాకు జనకుడగును. జగజ్జననిపార్వతి నాకు జనని యగును. ప్రమథగణాధీశ్వరా! జగమునం దున్నస్త్రీలంద ఱాయాద్య ప్రకృతినుండి యుత్పన్నులైనవారే. ఈజ్ఞానసంపన్నలు యోగినులు నైన కృత్తిక లాప్రకృతిమాతకళలే. వీరు మిగులప్రేమతో స్తన్యము నిచ్చి నన్ను పోషించిరి. అందువలన వీరికి నేను పోష్యపుత్రుడను. నన్ను పోషించినకారణమున వీరు నాకు మాతృదేవతలైరి. శంకరభగవానునివీర్యజుడ నైన నేను పార్వతీదేవికి ధర్మపుత్రుడను. నేను గిరిరాజనందినిగర్భమునుండి జనింపలేదు. అందువలన నామెకు నేను ధర్మపుత్రుడనే. పార్వతీదేవి నాకు ధర్మమాతయైనట్లు ఈకృత్తికలుగూడ నాకు ధర్మమాతలే.

> స్తనదాత్రీ గర్భధాత్రీ భక్ష్యదాత్రీ గురుప్రియా ।
> అభీష్టదేవపత్నీ చ పితుః పత్నీ చ కన్యకా ॥
>
> సగర్భకన్యా భగినీ పుత్రపత్నీ ప్రియాప్రసూః ।
> మాతుర్మాతా పితుర్మాతా సోదరస్య ప్రియా తథా ॥
>
> మాతుః పితుశ్చ భగినీ మాతులానీ తథైవ చ ।
> జనానాం వేదవిహితా మాతరః షోడశ స్మృతాః ॥ (38-40)

"స్తన్యము నిచ్చి పోషించుస్త్రీ (ఆయా), గర్భమందుధరించి జన్మము నిచ్చుస్త్రీ (జనని), భోజనమును పెట్టుస్త్రీ, గురుపత్ని, అభీష్టదేవునిపత్ని,

తండ్రిభార్య (సవతితల్లి), కన్య, సోదరి, కుమారునిభార్య, అర్ధాంగితల్లి (అత్త), తల్లియొక్కతల్లి (అమ్మమ్మ), తండ్రియొక్కతల్లి (నాయనమ్మ), సహోదరుని పత్ని, తల్లియొక్కసహోదరి (పెత్తల్లి లేదా పినతల్లి), తండ్రియొక్కసహోదరి మేనత్త, మేనమామభార్య – ఈపదునాఱుగురు మనుష్యునకు వేదవిహితలైన మాతృమూర్తులు". నన్ను పోషించినయీకృత్తికలు సంపూర్ణసిద్ధిజ్ఞానసంపన్నలు, పరమైశ్వర్యయుక్తలు, వీరు క్షుద్రస్త్రీలుకారు. విధాత యైనబ్రహ్మ కుమార్తెలు. నీవుకూడ శంకరునకు బుత్రసమానుడవు. నేను మహాదేవుని యాజ్ఞానుసారముగ కైలాసమున కేగుదెంచెదను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ
సంవాదమున నందికార్తికేయసంవాద
మను పదునైదవ అధ్యాయము
సంపూర్ణము.



## పదునాఱవ అధ్యాయము

### కార్తికేయుడు కైలాసమున కేతెంచి, విష్ణ్వాదిదేవతల యాశీస్సుల స్వీకరించుట.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

బ్రహ్మకంఠోద్భవా ! శంకరనందను డైనషణ్ముఖుడు నందికేశ్వరునితో మధురసంభాషణముల నొనరించి మాతృతుల్యలైనకృత్తికల నోదార్చుచు జ్ఞానయుక్తమైనవచనముల నిట్లుపల్కెను. "తల్లులారా! నేను నాజననీజనకులను, బంధువర్గమును, దేవసముదాయములను సందర్శింపవలె ననియాకాంక్షిం

చుచున్నాను. కైలాసగమనమునకు నాకు గృపతో ననుజ్ఞ నీయవలసినదిగ మిమ్ము బ్రార్థించుచున్నాను. ఈజగత్తున శుభాశుభదాయకము లైనజన్మ కర్మలు, సంయోగవియోగములు, మొదలగునవి యన్నియు దైవాధీనములే. దైవమును మించినబలవంతుడు, మఱియొకడుండడు. కాని దేవాదిదేవు డైన శ్రీకృష్ణపరమాత్మకు గాలస్వరూప మైనదైవముగూడ నెల్లపు డధీనమై యుండును. భక్తజనులు పరమైశ్వర్యశాలి యైనశ్రీకృష్ణపరబ్రహ్మమునే యెల్లపుడు భజింతురు. అక్షరు డైనశ్రీకృష్ణుడు దేహధారుల గాలమును తగ్గించుటలోను, వృద్ధిచేయుటలోను సమర్థుడు. ఆయన యనన్యభక్తులు మాత్రము కాలమునకు వశులుకారు. మాతృమూర్తులారా! క్షుద్రమైన, హృదయదౌర్బల్యమునకు గారణమైన, దుఃఖప్రదమైన, మోహమును బరిత్యజింపుడు. భవబంధమోక్షప్రదాతయు, సుఖప్రదాయకుడు, సర్వసారస్వరూపుడు, జన్మమృత్యుజరాశోకభయములను నశింపజేయగలవాడు, మోహజాలమును ద్రెంపగలవాడు, పరమానందప్రదాయకుడు, బ్రహ్మవిష్ణుశివాదిసకల దేవతావందితుడు, ఆదిపురుషుడు నగుగోవిందుని మీరు సర్వదా భజించి భవబంధవిముక్తులుకండు. ఈ యగాధభవసాగరమం దెవ రెవరికి బంధువులు? సర్వజీవులకు నాపుండరీకాక్షుడే బంధువు. కర్మలు సంసార మహాప్రవాహమున నీటిపై నురుగువలె కేంద్రీకృతములై యున్నవి. సంయోగవియోగము లీశ్వరునిసంకల్పములే. సర్వబ్రహ్మాండము లన్నియు నీశ్వరాధీనములే. త్రిలోకములైనప్రాకృతికజగము లన్నియు నీటిబుడగలవలె క్షణభంగురములు. అయినను మాయామోహితు లైనజీవు లీయశాశ్వతము లైనజగత్తులనే నిత్యమనిభావించి కర్మబంధముల జిక్కి జననమరణచక్రమందు దగుల్కొందురు. కాని నిష్కామ కర్మయుక్తు లైన శ్రీకృష్ణపరమాత్మ భక్తు లీమాయామయ జగములయందున్నను పవిత్రవాయువువలె లిప్తులుకారు. అందువలన కృత్తికలారా నామెడ మీకుగలమోహమును బరిత్యజించి నాకైలాసగమనమున కనుజ్ఞనిండు.

అనంతరము కార్తికేయుడు కృత్తికలకు నమస్కరించి మనస్సున శ్రీహరిని స్మరించి పార్వతీదేవిచే శంకరునిపార్షదులతో బంపబడిన శతచక్ర సమన్వితమైన దివ్యమణిరత్ననిర్మితమైన మహారథము నధిష్ఠించెను. పెంచిన ప్రేమను వీడలేక కృత్తికలు దుఃఖితలై మమ్ముగూడ వెంటనిడుకొనిపొమ్మని కార్తికేయు నర్థించిరి. శంకరనందనుడు తల్లులనుగూడ రథమునం దెక్కించు

కొని కైలాసమునకు వెడలెను. మార్గమధ్యమున కార్తికేయున కెన్నియో శుభశకునములు గనబడినవి. గజరాజు, అశ్వము, ప్రజ్వలితాగ్ని, పవిత్రజల భరితసువర్ణకలశము, పక్వఫలము, పతిపుత్రయుక్తలైన పుణ్యస్త్రీలు, దీపము, ఉత్తమమణిముత్యములు, పుష్పమాలలు మొదలగుమంగళసూచకములైన శకునములను గార్తికేయుడు గాంచెను. దక్షిణభాగమందు రాజహంస, నెమలి, చిలుక, కోకిల, పావురము, చక్రవాకము, కృష్ణసారమృగము, సురభి, వత్సముతోగూడినధేనువు, విజయపతాకము, షణ్ముఖునకు గోచరించెను. ఇన్ని శుభశకునములను గాంచి కార్తికేయుడు సంతుష్టాంతరంగుడయ్యెను. నానా విధవాదజనితధ్వనులు శంఖనూపురధ్వనులు, హరికీర్తనము, శ్రవణానందముగ వినుబడుచుండగ గార్తికేయు డనన్యసుందరమైన, నిత్యమైన, విశాలమైన కైలాసపురికి జేరెను. కైలాస మత్యంతసుందరనగరము. రాజమార్గములు సువిశాలములు. అరటిస్తంభములతో, పచ్చనిచిగురుటాకులతోరణములతో నగర మలంకరింపబడియుండెను. కుమారుని యాగమనము నెఱిగి పార్వతీదేవి, లక్ష్మి, సరస్వతి, దుర్గ, సావిత్రి, తులసి, రతి, అరుంధతి, అహల్య, దితి, తార, అదితి, శతరూప, శచి, సంధ్య, రోహిణి, అనసూయ, స్వాహా, వరుణపత్ని, ఆకూతి, ప్రసూతి, దేవహూతి, మేనాకపత్ని, వసుంధర, మనసాదేవి మొదలగుసాధ్వీమణుల నగ్రభాగమున నిడుకొని కార్తికేయునకు స్వాగతముపలుకుట కరుదెంచెను. ఆమె ననుసరించి యసంఖ్యాకులైనపార్షదులు, క్షేత్రపాలకులు, ప్రమథగణములు బయలుదేరిరి. తనసముఖమున జగజ్జనని యైనపార్వతీదేవిని గాంచి కార్తికేయుడు హర్షపులకితశరీరుడై యామెచరణములపై వ్రాలెను. ముద్దులకుమారుని గాంచి జననియగు పార్వతీదేవి ప్రేమతో లేవనెత్తి యాలింగనముచేసికొనెను. లక్ష్మి, సరస్వతి మొదలగుదేవాంగనలు, మునిపత్నులు సాదరముగ గుశలముల నడిగి శంకరనందనునకు స్వాగతముపల్కిరి. సకలదేవతలు హరకుమారు నాశీర్వదించిరి. వారితోగూడి షడాననుడు సభా భవనమును బ్రవేశించి రత్నసింహాసనాసీనుడై ప్రకాశించుచున్న శ్రీహరిని గాంచెను. నీలనీరదశ్యామలవర్ణుడు, శతకోటిమన్మథాకారుడు, జగన్నాథుడు, పరమాత్మ, చిరునవ్వులు విరాజిల్లుమోముకలవాడు, చతుర్భుజధారియు నగు శ్రీహరిని గాంచి కార్తికేయుడు భక్తిభావయుక్తుడై నమస్కరించెను. ఆనంద బాష్పములు నేత్రములనుండి ప్రవహించుచుండగ పులకితగాత్రుడై గద్గదస్వర

ముతో శ్రీహరిని స్తుతించెను. బ్రహ్మవిష్ణుశివధర్మాదిదేవత లందఱు కార్తి కేయు నాశీర్వదించిరి. పార్వతీసహితుడై శివుడు పుత్త్రోత్సవ మొనరించి, ధనధాన్యవస్త్రములను ఘనముగ దానమొనరించెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ
సంవాదమున కార్తికేయకైలాసగామన
మను పదునాఱవ అధ్యాయము
సంపూర్ణము.

---

# పదునేడవ అధ్యాయము

## కార్తికేయున కభిషేక మొనరించి విష్ణ్వాది దేవత లాయనకు వివిధోపహారముల నర్పించుట, కార్తికేయషష్ఠీ దేవసేనావివాహము.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదమహర్షీ! అఖిలజగన్నాథు డైనహరి యాశుభముహూర్తమున గార్తికేయుని రత్నసింహాసనాధీశునిగా నొనరించి సంపూర్ణ తీర్థజలములతో నభి షేక మొనరించెను. కరుణాంతరంగు డైన శ్రీమహావిష్ణువు కార్తికేయునకు భుజకీర్తులను, ననేకదివ్యరత్నమయాభూషణములను, అగ్నిశుద్ధవస్త్రములను, క్షీరసాగరోత్పన్న మైనకౌస్తుభమణిని, రత్నఖచితకిరీటమును గానుకలుగ నిచ్చెను. సృష్టికర్త యగుబ్రహ్మ, యజ్ఞసూత్రములను, వేదజ్ఞానమును ప్రసాదించెను. వేదజనని యైనగాయత్రీదేవి సంధ్యావందన మంత్రమును, శ్రీకృష్ణమూలమంత్రమును, కవచములను, స్తోత్రములను, కమండలమును, బ్రహ్మాస్త్రమును, శత్రువినాశని యనుపరావిద్యను బ్రసాదించెను. ధర్మదేవత

ధర్మబుద్ధిని, యపారదయను బ్రసాదించెను. శంకరుడు పరమోత్కృష్ట మగు మృత్యుంజయదివ్యజ్ఞానమును, సంపూర్ణ శాస్త్రజ్ఞానమును, సదాసుఖప్రదాయని పరమమనోహరమునగు శ్రీకృష్ణతత్త్వజ్ఞానమును, యోగతత్త్వమును, సిద్ధతత్త్వమును, పరమదుర్లభపరబ్రహ్మజ్ఞానమును, త్రిశూలమును, పినాకధనుర్బాణములను, పరశువును, శక్తిని, పాశుపతాస్త్రమును ఇంకను సకలశస్త్రాస్త్రసంధానోపసంహారజ్ఞానమును బ్రసాదించెను. వరుణుడు శ్వేతఛత్రమును, రత్నమాలలను నర్పించెను. దేవేంద్రుడు గజేంద్రమును, క్షీరసాగరోత్పన్న మైన నమృతకలశమును సమర్పించెను. సూర్యభగవానుడు మనోవేగయుక్త మైన దివ్యరథమును, కవచమును నర్పించెను. యముడు దండమును, అగ్ని యుగ్ర శక్తిని సమర్పించెను. ఇట్లే అన్య దేవతలుకూడ హర్షపూర్వకముగ ననేకానేక శక్తులను షణ్ముఖున కర్పించిరి. విష్ణుపుత్రు డైనమన్మథుడు కార్తికేయునకు కామశాస్త్రము నుపదేశించెను. తదనంతరము కామదేవుడు క్షీరసాగరోత్పన్నము లైననమూల్యరత్నములను, వజ్రనిర్మితము లగునూపురములను గానుకలుగ సమర్పించెను. ఆసమయమున సర్వదేవతారాధ్యు డైనతనప్రియపుత్రుని గాంచి పార్వతి యత్యంతపరమానందమును బొందెను. ఆమె మందహాస మొనరించుచు గార్తికేయునకు మహావిద్య, సుశీలవిద్య, మేధ, దయ, స్మృతి, నిర్మలబుద్ధి, శాంతి, తుష్టి, పుష్టి, క్షమ, ధృతి, శ్రీకృష్ణపరమాత్మయందు సుదృఢభక్తి, శ్రీకృష్ణదాస్యమును బ్రసాదించెను. ప్రజాపతి కార్తికేయునకు మహాషష్టి దేవసేన నర్ధాంగిగ నొసంగెను. ఆమె శీలవతి, యత్యంతసుందరి, మనోహారిణి, జగత్తులో నున్నశిశువుల నెల్లపుడు రక్షించునట్టి కరుణామయి. సర్వదేవతలు, మునులు, గంధర్వకిన్నరకింపురుషులు శంకరనందను నభిషేకించి, మహాదేవునకు బ్రణామము లర్పించి శ్రీహరిని స్తుతించి తమతమ నివాసముల కరిగిరి. ఇరువురుమహాపురుషులను బ్రియపుత్రులుగ బడసి, ప్రమథగణముల సేవల నందుచు సంతుష్టాంతరంగయై పార్వతీదేవి శివారాధన మొనరించుచు గైలాసమున నివసించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణసంవాదమున
కుమారాభిషేకవివాహకథన మనుపదునేడవ
అధ్యాయము సంపూర్ణము.

# పదునెనిమిదవ అధ్యాయము

## శివుని గశ్యపప్రజాపతి శపించుట.

నారదుడు పలికెను:

మహాభాగా! నారాయణఋషీంద్రా! నామనమునం దుద్భవించినసందేహమును నివారింపవలసినదిగ మి మ్మర్థించుచున్నాను. ప్రభూ! జగదీశ్వరుడైనశంకరునకు ప్రియపుత్రుడు, విఘ్నవినాశకుడు, మహాత్ముడు నగుగణేశ్వరునకెట్లువిఘ్నము సంభవించెను? పరిపూర్ణుడు, పరాత్పరుడు, పరబ్రహ్మము నగు శ్రీకృష్ణుడు తనయంశతో గణపతిగ జన్మించినా డనిమీరు వచించితిరి. గ్రహాధిరాజగు శ్రీకృష్ణుని శిరము శనైశ్చరుని దృష్టిపాతమువలన తెగుట మహాశ్చర్యకర మైనవిషయము. ఈపరిణామమునకు గలకారణములను వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీ నారాయణఋషి పలికెను:

బ్రహోద్భవా! విఘ్నేశ్వరునకే యీ విఘ్న మెట్లు సంభవించెనో, ఆప్రాచీనేతిహాసమును ప్రవచించెదను, అవధరింపుము. పూర్వకాలమందు సూర్యభగవానుడు మాలి, సుమాలి యనురాక్షసులపై నలిగి వారిని సంహరింపబోవుచుండగ వారిచే నారాధింపబడువాడు భక్తవత్సలుడు నగుశంకరుడు సూర్యునిపై గోపించి త్రిశూలమును ప్రయోగించెను. సూర్యు డయ్యమోఘత్రిశూలప్రహారముచే చేతనారహితుడయ్యెను. సూర్యుడు లేనిజగ మంధకారబంధుర మయ్యెను. సకలదేవతలు సూర్యునితండ్రి యైనప్రజాపతికడ హాహాకారము లొనరించిరి. చేతనావిహీను డైనతనకుమారుని గాంచి బ్రహ్మతేజస్సుతో ప్రజ్వరిల్లుచున్న కశ్యపప్రజాపతి శంకరు నిట్లు శపించెను. "మహాదేవా! ఈదినమున నీవు త్రిశూలముచే నాపుత్రుని కంఠమును ఖండించిన ట్లొకనాడు నీకుమారునిమస్తకము ఖండింపబడగలదు". హరు డాక్షణమందే శాంతచిత్తుడై సూర్యునకు చేతనత్వమును ప్రసాదించెను. పునర్జీవితు డైనసూర్యుడు తన తండ్రి శివుని శపించె నని తెలిసికొని ఆయనతో నిట్లుపల్కెను. "పితృదేవా! ఈశ్వరుడు లేనిసర్వము తుచ్ఛమని, నశ్వరమని నీ వెఱుంగవా? సర్వమంగళప్రదాయకు డైనశివుని సేవించి విద్వాంసు లన్యదైవముల నుపాసింపరు. తండ్రీ!

శివాపరాధ మొనర్చిననేను పాపపరిహారముగ విరాగినై శ్రీకృష్ణుని భజించెదను". సూర్యునినిర్ణయమును విని శివాదిసకలదేవత లాయనను సమాధానపఱచి జగత్పాలనకార్యమున మరల వినియోగించిరి. సూర్యున కపకార మొనరించినమాలి, సుమాలులకు గర్మఫలవశమున శ్వేతకుష్ఠు సంభవించెను. వారియంగములు శిథిలములై జీర్ణింపదొడంగెను. శక్తిహీనులు ప్రభాహీనులునై దుఃఖంచుచున్నవారిరువురిని గాంచి బ్రహ్మ సూర్యకవచమును, స్తోత్రమును, పూజావిధిని వారి కుపదేశించి రోగవినాశకరు డైనసూర్యభగవాను నారాధింపవలసినదిగ నాదేశించి యంతర్హితుడయ్యెను. అనంతర మాదైత్యులు పవిత్ర పుష్కరక్షేత్రమునకు వెడలి శుద్ధులై చిరకాలము సూర్యు నారాధించిరి. సమయానుసారముగ సూర్యానుగ్రహమును బొంది, రోగవిముక్తులై వారు స్వస్వరూపముల బొందిరి.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ
సంవాదమున శివుని గశ్యపప్రజాపతి
శపించుట యను పదునెనిమిదవ
అ ధ్యా య ము
సంపూర్ణము.



# పందొమ్మిదవ అధ్యాయము

## బ్రహ్మ మాలీసుమాలులకు సూర్యకవచ స్తోత్రముల నుపదేశించుట; సూర్యునికృపచే వారు రోగవిముక్తు లగుట.

నారదమహర్షి ప్రార్థనల నాలకించి నారాయణఋషి సూర్యుని కవచ మును, స్తోత్రమును, పూజావిధిని నుపదేశింపదొడంగెను.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

దేవర్షీ ! మాలి, సుమాలి యనునీ యిర్వురుదైత్యులు సూర్యుని యాగ్రహమునకు గురియై భయంకరవ్యాధిగ్రస్తులై యావ్యాధినుండి విముక్తి పొందుటకు దరణోపాయమును బ్రహ్మదేవు నర్థించిరి. బ్రహ్మ శివకేశవుల వలన సర్వరోగనివారణోపాయమును గ్రహించి పుష్కరతీర్థమందు వ్యాధివినా శకు డైనసూర్యు నారాధించిన రోగవిముక్తులు కాగల రని పలికి సూర్యస్తోత్ర, కవచ, పూజావిధానములను వారి కుపదేశించెను. తదనంతరము బ్రహ్మ వారితో నిట్లుపల్కెను. "దైత్యులారా ! పుష్కరక్షేత్రమందు బవిత్రజలము లలో స్నాన మాచరించి, భక్తిపూర్వకముగ నే నను గ్రహించుసూర్యమంత్ర మును జపింపుడు. సూర్యమంత్రప్రభావమువలన మీరు నిస్సందేహముగ నారోగ్యవంతులుకాగలరు.

"ఓం హ్రీం నమో భగవతే సూర్యాయ పరమాత్మనే స్వాహా"

ఈమంత్రమును జపించుచు సావధానులై సూర్యు నారాధించి, పూజించి, షోడశోపచారము లర్పింపవలయును. ప్రతిదిన మీవిధముగ నొకసంవత్సర పర్యంత మారాధించిన మీరు నిశ్చయముగ రోగవిముక్తులు కాగలరు. పూర్వ కాలమం దహల్య నవమానించినకారణమున గౌతమమహర్షి శాపముచే నింద్రునిశరీరము సహస్రభగములు గలదియయ్యెను. ఆసంకటసమయమున నింద్రునకు దేవగురుడైనబృహస్పతి కరుణతో సూర్యకవచము నుపదేశించెను. ఆయపూర్వకవచమును నేను మీ కుపదేశించెదను.

## ఇన్ద్రం ప్రతి గురుణోక్తం సూర్యకవచమ్

బృహస్పతిరువాచ :

ఇన్ద్ర శృణు ప్రవక్ష్యామి కవచం పరమాద్భుతమ్ ।
యద్ధృత్వా మునయః పూతా జీవన్ముక్తాశ్చ భారతే ॥
కవచం బిభ్రతో వ్యాధిర్న యాతి సన్నిధిం భియా ।
యథా దృష్ట్వా వైనతేయం పలాయన్తే భుజంగమాః ॥
శుద్ధాయ గురుభక్తాయ స్వశిష్యాయ ప్రకాశయేత్ ।
ఖలాయ పరశిష్యాయ దత్వా మృత్యుమవాప్నుయాత్ ॥
జగద్విలక్షణస్యాస్య కవచస్య ప్రజాపతిః ।
ఋషిశ్ఛన్దశ్చ గాయత్రీ దేవో దినకరః స్వయమ్ ॥
వ్యాధిప్రణాశే సౌన్దర్యే వినియోగః ప్రకీర్తితః ॥
సద్యో రోగహరం సారం సర్వపాపప్రణాశనమ్ ।
ఓం క్లీం హ్రీం శ్రీం శ్రీసూర్యాయ స్వాహా మే పాతు మస్తకమ్ ॥
అష్టాదశాక్షరో మన్త్రః కపాలం మే సదావతు ।
ఓం హ్రీం హ్రీం శ్రీం శ్రీం సూర్యాయ స్వాహా మే పాతు నాశికామ్ ॥
చక్షుర్మే పాతు సూర్యశ్చ తారకాం చ వికర్తనః ।
భాస్కరో మేఽధరం పాతు దన్తాన్ దినకరః సదా ॥
ప్రచణ్డః పాతు గణ్డం మే మార్తాణ్డః కర్ణమేవ చ ।
మిహిరశ్చ సదా స్కన్ధౌ పూషా జఙ్ఘే సదావతు ॥
వక్షః పాతు రవిః శశ్వన్నాభిం సూర్యః స్వయం సదా ।
కఙ్కాలం మే సదా పాతు సర్వదేవనమస్కృతమ్ ॥
కరౌ పాతు సదా బ్రధ్నః పాతు పాదౌ ప్రభాకరః ।
విభాకరో మే సర్వాఙ్గం పాతు సన్తతమీశ్వరః ॥
ఇతి తే కథితం వత్స కవచం సుమనోహరమ్ ।
జగద్విలక్షణం నామ త్రిజగత్సు సుదుర్లభమ్ ॥
పురా దత్తం చ మనవే పులస్త్యః పుష్కరే ముదా ।
మయా దత్తం చ తుభ్యం తద్ యస్మై కస్మైన దేహి భోః ॥
వ్యాధితో ముచ్యసే త్వం చ కవచస్య ప్రసాదతః ।
భవానరోగీ శ్రీమాంశ్చ భవిష్యతి న సంశయః ॥

లక్షవర్షహవిష్యేణ యత్ఫలం లభతే నరః ।
తత్ఫలం లభతే నూనం కవచస్యాస్య ధారణాత్ ॥
ఇదం కవచమజ్ఞాత్వా యో మూఢో భాస్కరం భజేత్ ।
దశలక్షప్రజప్తోఽపి మన్త్రః సిద్ధో న జాయతే ॥ (19-33)

ఇంద్రా! ఈకవచమును స్మరించి పవిత్రభారతవర్షమందు మహర్షులు జీవన్ముక్తులైరి. అట్టి సూర్యకవచము నుపదేశించెదను, సావధానచిత్తుడవై యవధరింపుము. గరుత్మంతుని గాంచి పలాయనముచిత్తగించు నురగములవలె నీకవచమును ధరించినవారిని జూచి సకలరోగములు పారిపోగలవు. ఈయద్భుత కవచమును శిష్యునకు, గురుభక్తునకు, శుద్ధాంతఃకరణకల్గినవానికి నుపదేశింప వలెను. దుష్టస్వభావయుక్తులైనశిష్యుల కుపదేశించినవారు మృత్యువును బొందగలరు. ఈజగద్విలక్షణకవచమునకు ప్రజాపతి ఋషి. గాయత్రి ఛందము, స్వయముగ సూర్యభగవానుడే దైవము. వ్యాధివినాశముకొఱకు, సౌందర్యాభివృద్ధికొఱకు నీకవచమును వినియోగింపవలెను. ఈసకలసార స్వరూప మగుసూర్యకవచ మారాధకుని తత్కాలములోనే పవిత్రునిగ నొన రించి, యాతనిసర్వపాపములను నశింపజేయగలదు. 'ఓం క్లీం హ్రీం శ్రీం సూర్యాయ స్వాహా' ఈమంత్రము నామస్తకమును రక్షించుగాక! పైనష్టా దశాక్షరమంత్ర మెల్లపుడు నాకపాలమును గాపాడుగాక. 'ఓం హ్రీం హ్రీం శ్రీం శ్రీం సూర్యాయ స్వాహా' ఈమంత్రము నానాసికను రక్షించుగాక! సూర్యుడు నానేత్రములను, వికర్తనుడు నాకపోలములను, భాస్కరుడు నా యధరములను, దినకరుడు నాదంతములను, ప్రచండుడు నాగండస్థలమును, మార్తాండుడు నాకర్ణములను, మిహిరుడు నాస్కంధములను, పూష్ణుడు నా జంఘములను, రవి నావక్షస్థలమును, స్వయముగ సూర్యదేవుడు నానాభిని, సర్వదేవతానమస్కృతుడు నాకజ్కాశమును, బ్రధ్నుడు నాకరములను, ప్రభా కరుడు నాపాదములను, సామర్థ్యశాలి యగువిభాకరుడు నాసర్వశరీరమును నిరంతరము రక్షించుగాక !

వత్సా! త్రిలోకములలోను బరమదుర్లభ మైనయీజగద్విలక్షణ సూర్య కవచ మత్యంతమనోహరము. ప్రేమపాత్రుడ వైననీకు నే నుపదేశించితిని. పూర్వకాలమున పులస్త్యమహర్షి ప్రసన్నుడై పుష్కరక్షేత్రమం దీకవచమును మనువున కుపదేశించెను. ఈమహామంత్రమును నీ వపాత్రుల కుపదేశింపకుము.

ఈకవచానుగ్రహమువలన నీవు రోగరహితుడవు శ్రీసంపన్నుడవు కాగలవు. ఇందు సంశయములేదు. ఒకలక్షసంవత్సరములు హవిష్యాన్నమును భుజించిన మనుష్యుల కేఫలము సిద్ధించునో ఆఫలమే నిశ్చయముగ నీకవచమును ధరించిన వారికి లభించును. ఈకవచమును దెలిసికొనక సూర్యారాధన మొనరించిన వారికి మంత్రసిద్ధి గలుగదు".

బ్రహ్మ పలికెను :

కుమారులారా! సూర్యకవచమును ధరించి ప్రభాకరుని స్తుతించిన మీరు నిశ్చయముగ రోగవిముక్తులు కాగలరు. సూర్యస్తవము సామవేదమున వర్ణింపబడినది. సూర్యస్తవపఠనము వ్యాధివినాశకము, సర్వపాపహరము, పరమోత్కృష్టము, సర్వసారస్వరూపము, ఆయురారోగ్యప్రదాయకము.

త్వం బ్రహ్మ పరమం ధామ జ్యోతిరూపం సనాతనమ్ ।
త్వామహం స్తోతుమిచ్ఛామి భక్తానుగ్రహకారకమ్ ॥

త్రైలోక్యలోచనం లోకనాథం పాపప్రమోచనమ్ ।
తపసాం ఫలదాతారం దుఃఖదం పాపినాం సదా ॥

కర్మానురూపఫలదం కర్మబీజం దయానిధిమ్ ।
కర్మరూపం క్రియారూపమరూపం కర్మబీజకమ్ ॥

బ్రహ్మవిష్ణుమహేశానామంశం చ త్రిగుణాత్మకమ్ ।
వ్యాధిదం వ్యాధిహన్తారం శోకమోహభయాపహమ్ ॥

సుఖదం మోక్షదం సారం భక్తిదం సర్వకామదమ్ ।
సర్వేశ్వరం సర్వరూపం సాక్షిణం సర్వకర్మణామ్ ॥

ప్రత్యక్షం సర్వలోకనామప్రత్యక్షమనూహకమ్ ।
శశ్వద్రసహరం పశ్చాత్‌రసదం సర్వసిద్ధిదమ్ ॥

సిద్ధిస్వరూపం సిద్ధేశం సిద్ధానాం పరమం గురుమ్ ।
స్తవరాజమితి ప్రోక్తం గుహ్యాద్గుహ్యతరం పరమ్ ॥ (37-43)

దేవా! నీవే సనాతనుడవైనబ్రహ్మవు, పరంధాముడవు, జ్యోతిస్వరూపుడవు, భక్తానుగ్రహవిగ్రహుడవు. త్రిలోకములకు నేత్రరూపుడవైనవాడవు, జగన్నాథుడవు, పాపనాశకుడవు, సకలతపఃఫలప్రదాతవు, పాపులకు దుఃఖముల గలుగజేయువాడవు, కర్మానురూపముగ ఫలములను బ్రసాదించువాడవు, కర్మ

బీజస్వరూపుడవు, దయాసాగరుడవు, కర్మస్వరూపుడవు, క్రియారూపుడవు, రూపరహితుడవు, కర్మబీజుడవు, బ్రహ్మవిష్ణుమహేశాంశరూపుడవు, త్రిగుణాత్మకుడవు, కుకర్ములకువ్యాధినిగలుగజేయువాడవు, సత్కర్ములవ్యాధిని వినాశముచేయువాడవు, శోకమోహాభయవినాశకుడవు, సుఖప్రదాతవు, మోక్షదాతవు, సర్వసారస్వరూపుడవు, భక్తిప్రదాతవు, సంపూర్ణ వాంఛాసిద్ధిప్రదాతవు, సర్వేశ్వరుడవు, సర్వరూపుడవు, కర్మసాక్షివి, సమస్తలోకదృష్టిగోచరుడవు, మనోహరుడవు, నిరంతరరసహారివి, రసదాతవు, సర్వసిద్ధిప్రదుడవు, సిద్ధిస్వరూపుడవు, సిద్ధేశ్వరుడవు, సిద్ధులకేపరమగురుడవు. అట్టి నిన్ను నేను స్తుతించెదను.

వత్సలారా! ఈపరమగోపనీయ మైనస్తవరాజమును నేను మీ కుపదేశించితిని. ప్రతిదినము త్రికాలములయం దీస్తోత్రమును బఠించువారు సమస్త వ్యాధులనుండి ముక్తులుకాగలరు. వా రంధులైనను, కుష్ఠురోగముచే దుఃఖితులైనను, క్రుళ్ళినయంగములు కలవారైనను, దరిద్రులైనను విశ్వేశ్వరుడైన సూర్యునిగ్రుపవలన నిశ్చయముగ రోగవిముక్తులుకాగలరు. ఒకమాసమువఱకు హవిష్యాన్నము భుజించుచు నీస్తోత్రమును శ్రవణమొనరించిన దేహధారి రోగవిముక్తుడై సంపూర్ణతీర్థస్నానఫలమును బొందగలడు. ఇం దెట్టి సందేహము లేదు. అందువలన దైత్యులారా! మీరు శీఘ్రముగ పుష్కరక్షేత్రమునకు వెడలి సూర్యు నారాధింపుడు.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారదా! ఇట్లు శివభక్తులైనమాలి, సుమాలియనుదైత్యులకు సూర్యోపాసన నుపదేశించి బ్రహ్మ యంతర్హితుడయ్యెను. తదనంతర మాదైత్యులు సూర్యుని సేవించి యారోగ్యవంతులైరి. వత్సా! విఘ్నేశ్వరుని విఘ్నమునకు గారణములను, సర్వవిఘ్నహరమగు సూర్యకవచమును, సూర్యస్తవాదులను వినిపించితిని. ఇక ఇపుడు నీ వేమి వినగోరుచున్నావో చెప్పుము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ
సంవాదమున విఘ్నకారణకథన మను
పందొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము.

# ఇరువదియవ అధ్యాయము

## గణపతి గజాస్యుడైనవిధము.

శ్రీ నారాయణ ఋషి పలికెను:

నారదమునీంద్రా! ఒకప్పుడు దేవరాజైన యింద్రుడు నిర్జనమైన నొక పుష్పోద్యానమున రంభతో విహరించి, సరోవరమందు జలక్రీడలాడుచుండెను. ఆసమయమున మునిశ్రేష్ఠుడైన దూర్వాసుడు వైకుంఠమునుండి కైలాసమునకు వెడలుచు తన శిష్యమండలితోగూడ నచటికి జేరికొనెను. దేవేంద్రుడు మహర్షిని గాంచి ప్రణామము లర్పించెను. దూర్వాసుడు సంతుష్టుడై యింద్రుని యాశీర్వదించి తనకు శ్రీహరిప్రసాదించిన పవిత్రపారిజాతకుసుమమును వాని కొసంగి యిట్లుపల్కెను. "దేవేంద్రా! శ్రీమన్నారాయణునకు నివేదింపబడిన యీపారిజాతపుష్పము విఘ్నవినాశకము. ఈపుష్పమును మస్తకమున ధరించువా రంతట విజయులై దేవతలలో నగ్రగణ్యులై యగ్రపూజ కధికారులుకాగలరు. శ్రీమహాలక్ష్మి యెల్లపుడును వారిని నీడవలె ననుసరించును. వారు జ్ఞానమునందు, తేజస్సునందు, బలమునందు, సర్వవిషయములయందు, సర్వశ్రేష్ఠులై శ్రీహరితో సమానమైనపరాక్రమవంతులు కాగలరు. కాని యహంకారయుక్తుడై శ్రీహరికి నివేదితమైన యీపుష్పమును మస్తకమునందు ధరింపనివాడు తనజాతివారితోగూడ శ్రీహీనుడగును". అని పలికి దూర్వాసుడు కైలాసమునకు వెడలిపోయెను. తానే త్రిలోకనాథుడనని భావించి యింద్రుడు మదోన్మత్తుడు, కామలాలసుడు, గర్వయుక్తుడునై శ్రీహరికి నివేదితమైనపారిజాతపుష్పమును సామాన్యపుష్పముగ నెంచి మస్తకమునందు ధరింపక యైరావతగజమస్తకమందలంకరించెను. దానివలన నతడు తత్క్షణమే శ్రీహీనుడయ్యెను. శ్రీహీనుడైనయింద్రుని గాంచి రంభ వానిని వీడి స్వర్గమునకు వెడలెను. పవిత్రపారిజాత పుష్పస్పర్శకలిగినవెంటనే యైరావతము మహాతేజస్సంపన్నమై శ్రీహీనుడైనయింద్రుని వీడి వనమున కరిగెను. ఆవనమున నొకఆడయేనుగుతో విహరింపసాగెను. ఆవనమున దానికెంతయో సంతానముకలిగెను. ఆయైరావతమే యుత్తరదిశగ తల నిడికొని నిద్రించుచుండగ శ్రీమహావిష్ణువు దానిమస్తకమును ఖండించి గణేశ్వరుని శరీరమునకు జోడించి వానిని గజాననునిగా నొనరించెను. కుమారా! శ్రీహరినైవేద్యము

స్వీకరించిన యెంతటిఫలము కలుగునో నీవు గ్రహించితివిగదా! గజముఖుని ప్రసంగమును నీకు ప్రథమముననే వర్ణించితిని. మఱి నీవిపుడేవిషయము విన గోరెదవో చెప్పుము వచించెదను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ
సంవాదమున గణపతిగజాస్యుడగుట
యను నిరువదియవ అధ్యాయము
సంపూర్ణము.

## ఇరువదియొకటవ అధ్యాయము

### బ్రహ్మదేవు డుపదేశించిన నారాయణస్తోత్రకవచ మంత్రజపముచే నింద్రుడు మరల శ్రీమహాలక్ష్మీదేవి అనుగ్రహమును బొందుట.

నారదుడు పలికెను:

దేవా! ఎవని శాపముచే నాదేవత లందఱు శ్రీహీనులైరి? మరల వారెట్లు జగజ్జనని యగు నాకమలాలయను బొందిరి. అప్పుడు మహేంద్రుడేమొనరించెను. నీ వాపరమదుర్లభము, రహస్యము నగువిషయమును దయయుంచి వచింపవలసినది.

శ్రీనారాయణ ఋషి పలికెను:

నారదా! మందబుద్ధి యైనవాడు, శ్రీహీనుడగుటచే దైన్యమును పొందినవాడు, ఆనందహీనుడు నగునాయింద్రుడు గజేంద్రునిచేత, రంభచేత బరాభూతుడై యమరావతికి వెడలెను. మహామనీ! ఆపురములో వానికానంద మెచ్చటను గనపడకపోయెను. అది దైన్యగ్రస్తము, బంధుహీనము,

శత్రువర్గపూర్ణము నైయుండెను. దూతవలన సర్వవృత్తాంతము విని యతడు గురు వగుబృహస్పతికడకు వెడలెను. పిమ్మట గురువుతోను దేవతలతోను గూడి బ్రహ్మదేవునిసభకు వెడలెను. అచటకు వెడలి దేవతలతోగూడ నిందుడు, బృహస్పతి బ్రహ్మకు నమస్కరించి భక్తిభావసహితముగా వేద విధిననుసరించి ఆయనను స్తుతించిరి. అనంతరము బృహస్పతి, ప్రజాపతి యగు బ్రహ్మకు స్వవృత్తాంతము నివేదించెను. దాని నాలకించి బ్రహ్మ యవనత వదనుడై యిట్లుపలుకనారంభించెను.

బ్రహ్మ పలికెను:

దేవేంద్రా! నీవు నాప్రపౌత్రుడవు. శ్రీసంపన్నుడ వగుటచే నెల్లప్పుడు ప్రజ్వలించుచుంటివి. కాని రాజా! లక్ష్మితోసమాన మైనసౌదర్యవతి యగు శచీదేవికి భర్త వైనను నీ వాచరణభ్రష్టుడవైతివి. ఆచరణభ్రష్టు డైనవానికి లక్ష్మిగాని, యశస్సుగాని యెట్లులభించును? ఆపాపి యెల్లపుడు సర్వసభలలో నిందాపాత్రుడు కాగలడు. రంభ నీబుద్ధిని పాడుచేసినది. అందువలన నీవు దూర్వాసప్రదత్త మైన శ్రీహరినైవేద్యమును గజరాజుశిరముపై బడవైచితివి. సర్వులచే ననుభవింపబడు నారంభయెక్కడ? శ్రీహీనుడ వైననీ వెక్కడ? నీవు లక్ష్మీహీనుడ వగుటకు గారణ మైనయారంభకూడ నిన్ను క్షణములో వదలి వెడలిపోయినది. వేశ్యచిత్త మెంత చంచలము? ఆమె ధనవంతులనే కాని నిర్ధనులను ప్రేమించదు. అంతేకాక ప్రాచీనప్రేమికులను దిరస్కరించి నూతననాయకుల నన్వేషించును. కాని వత్సా! గడచిపోయిన దేదోపోయినది, అది యెప్పుడును దిరిగిరాదు. ఇపుడు నీవు లక్ష్మీప్రాప్తికై భక్తితో నారాయణుని సేవింపుము.

అనిపలికి నారాయణపరాయణు డగుబ్రహ్మ యింద్రునకు జగత్స్రష్ట యగునారాయణుని స్తోత్రకవచమంత్రముల నుపదేశించెను. అనంతర మింద్రుడు దేవతలతోను గురువుతోను గలసి పుష్కరక్షేత్రమునకు వెడలి తనయభీష్టమంత్రమును జపింపసాగెను కవచమును గ్రహించి దానిచే శ్రీహరిని స్తుతించుట యందు దత్పరుడయ్యెను. ఇట్లు పుణ్యాదాయక మగుభారతవర్షమున నొకవత్సరపర్యంతము నిరాహారుడై లక్ష్మీప్రాప్తికి హేతు వగులక్ష్మీపతిని యతడు సేవించెను. అపుడు శ్రీహరి ప్రత్యక్షమై యింద్రున కభీష్టవరములను,

లక్ష్మీస్తోత్రకవచములను, ఐశ్వర్యవర్ధక మగుమంత్రమును నుపదేశించి వైకుంఠమునకు వెడలెను. ఇంద్రుడు క్షీరసాగరమునకు జేరుకొనెను. అతడచట కవచమును ధరించి, స్తోత్రముచే స్తుతించి, మంత్రముచే జపించి, శ్రీమహాలక్ష్మి యనుగ్రహమును బొందెను. పిమ్మట దేవేంద్రుడు శత్రువుల జయించి యమ రావతిని దన యధీనములోనికి దేచ్చుకొనెను. ఇట్లు సర్వదేవతలు తమతమ నెలవుల కరిగిరి.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ
సంవాదమున నింద్రుడు లక్ష్మి యను
గ్రహమునకు బాత్రుడగుట యను
ఇరువదియొకటవ అధ్యాయము
సంపూర్ణము.

—o—

# ఇరువదిరెండవ అధ్యాయము

## శ్రీహరి యింద్రునకు శ్రీమహాలక్ష్మీ కవచ మంత్ర ధ్యానస్తోత్రాదుల నుపదేశించుట.

నా ర ద ఉ వా చ :

ఆవిర్భూయ హరి స్తస్మై కిం స్తోత్రం కవచం దదౌ ।
మహాలక్ష్మ్యాశ్చ లక్ష్మీశ స్తస్మై బ్రూహి తపోధన ॥ 1

నా ర దు డు ప లి కె ను :

తపోధనా! రమాపతి యైన శ్రీహరి దేవేంద్రున కుపదేశించిన శ్రీమహా లక్ష్మీకవచ స్తోత్రములను గృపతో నాకనుగ్రహింపవలసినదిగ బ్రార్థించు చున్నాను.

శ్రీ నా రా య ణ ఋ షి ఉ వా చ :

పుష్కరే చ తప స్తప్త్వా విరరామ సురేశ్వరః ।
ఆవిర్బభూవ త త్రైవ క్లిష్టం దృష్ట్వా హరిః స్వయమ్॥
తమువాచ హృషీకేశో వరం వృణు యథేప్సితమ్ ।
స చ వవ్రే వరం లక్ష్మీమీశ స్తస్మై దదౌ ముదా ॥
వరం దత్వా హృషీకేశః ప్రవక్తు ముపచక్రమే ।
హితం సత్యం చ సారం చ పరిణామసుఖావహమ్ ॥ 2-4

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! హృషీకేశు డిందుని కనుగ్రహించిన కవచ స్తోత్రముల నుప దేశించెదను. సావధానుడవై గ్రహింపుము. ఈకవచస్తోత్రములు పరమ హితకరములు, శ్రీకరములు, సత్యములు, సర్వసారస్వరూపములు, పరిణామ సుఖప్రదాయకములు.

శ్రీ మ ధు సూ ద న ఉ వా చ :

గృహాణ కవచం శక్ర సర్వదుఃఖవినాశనమ్ ।
పరమైశ్వర్యజనకం సర్వశత్రువిమర్ధనమ్ ॥
బ్రహ్మణే చ పురా ద త్తం సంసారే చ జలప్లుతే ।
యద్ధృత్వా జగతాం శ్రేష్ఠః సర్వైశ్వర్యయుతో విధిః ॥
బభూవుర్మనవః సర్వే సర్వైశ్వర్యయుతా యతః ।
సర్వైశ్వర్యప్రదస్యాస్య కవచస్య ఋషిర్విధిః ॥
పఙ్క్తిశ్ఛన్దశ్చ సా దేవీ స్వయం పద్మాలయా సుర ।
సిద్ధైశ్వర్యజపేష్వేవ వినియోగః ప్రకీర్తితః ॥
యద్ధృత్వా కవచం లోకః సర్వత్ర విజయీ భవేత్ ॥
మ స్తకం పాతు మే పద్మా కణ్ఠం పాతు హరిప్రియా ।
నాసికాం పాతు మే లక్ష్మీః కమలా పాతు లోచనమ్ ॥
కేశాన్ కేశవకాన్తా చ కపాలం కమలాలయా ।
జగత్ప్రసూర్గణ్డయుగ్మం స్కన్ధం సమ్పత్ప్రదా సదా ॥
ఓం శ్రీం కమలవాసిన్యై స్వాహా పృష్ఠం సదావతు ।
ఓం శ్రీం పద్మాలయాయై స్వాహా వక్షః సదావతు ॥

పాతు శ్రీర్మమ కఙ్కాలం బాహుయుగ్మం చ తే నమః ॥
ఓం హ్రీం శ్రీం లక్ష్మ్యై నమః పాదౌ పాతు మే సంతతం చిరమ్ ।
ఓం హ్రీం శ్రీం నమః పద్మాయై స్వాహా పాతు నితమ్బకమ్ ॥
ఓం శ్రీం మహాలక్ష్మ్యై స్వాహా సర్వాఙ్గం పాతు మే సదా ।
ఓం హ్రీం శ్రీం క్లీం మహాలక్ష్మ్యై స్వాహా మాం పాతు సర్వతః ॥
ఇతి తే కథితం వత్స సర్వసమ్పత్కరం పరమ్ ।
సర్వైశ్వర్యప్రదం నామ కవచం పరమాద్భుతమ్ ॥
గురుమభ్యర్చ్య విధివత్ కవచం ధారయేత్తు యః ।
కణ్ఠే వా దక్షిణే బాహౌ స సర్వవిజయీ భవేత్ ॥
మహాలక్ష్మీర్గృహం తస్య న జహాతి కదాచన ।
తస్య ఛాయేవ సతతం సా చ జన్మని జన్మని ॥
ఇదం కవచమజ్ఞాత్వా భజేల్లక్ష్మీం సుమన్దధీః ।
శతలక్షప్రజప్తోఽపి న మన్త్రః సిద్ధిదాయకః ॥ 5-17

ఇంద్రా! లక్ష్మీప్రాప్తికొఱకు నీవు లక్ష్మీకవచమును గ్రహింపుము. ఈకవచము సమస్తదుఃఖవినాశకము, పరమైశ్వర్యోత్పాదకము. సంపూర్ణశత్రు మర్దనము. పూర్వకాలమందు సర్వప్రపంచము జలమగ్నమైయుండగా నేనీ కవచమును బ్రహ్మకుపదేశించితిని. ఈకవచమును ధరించి బ్రహ్మ త్రిలోకములలో శ్రేష్ఠుడై సమస్తైశ్వర్యసంపన్నుడయ్యెను. ఈకవచమును ధరించిన సర్వమనువులు సమస్తైశ్వర్యాధికారులైనారు. దేవరాజా! సర్వైశ్వర్యప్రద మగు నీకవచమునకు బ్రహ్మయే ఋషి, పఙ్క్తియే ఛందము, స్వయముగ పద్మాలయయగు లక్ష్మీదేవియే దైవము. సిద్ధ్యైశ్వర్యములకొఱకు కీకవచజప మును వినియోగింపవలెను. ఈకవచమును ధరించినవారెంతట విజయులు కాగలరు. పద్మ నామస్తకమును రక్షించుగాక! హరిప్రియ నాకంఠమును, లక్ష్మి నానాసికను, కమల నేత్రయుగ్మమును, కేశవకాంత కేశములను, కమ లాలయ కపాలమును, జగజ్జనని రెండుకపోలములను, సమ్పత్ప్రద స్కంధ మును నెల్లపుడు రక్షించుగాక! 'ఓం శ్రీం కమలవాసిన్యై స్వాహా' ఈ మంత్రము నిరంతరము నాపృష్ఠభాగమును గాపాడుగాక. 'ఓం శ్రీం పద్మాల యాయై స్వాహా' ఇది నా వక్షస్థలమును సదా సురక్షితముగ నుంచుగాక. శ్రీదేవి నీకు నానమస్కారము. నా కంకాళమును, రెండుభుజములనుగాపాడు

గాక! 'ఓం హ్రీం శ్రీం లక్ష్మ్యై నమః' ఈమంత్రము నిరంతరము నాపాదములను, 'ఓం హ్రీం శ్రీం నమః పద్మాయై స్వాహా' ఈ మంత్రము నానితమ్బభాగమును, 'ఓం శ్రీం మహాలక్ష్మ్యై స్వాహా' ఈమంత్రము నా సర్వాంగములను, 'ఓం హ్రీం శ్రీం క్లీం మహాలక్ష్మ్యై స్వాహా' ఈమంత్రి మన్నిదిక్కులనుండి నన్ను కాపాడుగాక. వత్సా! ఇట్టిసర్వైశ్వర్య ప్రదము పరమోత్కృష్టము నగులక్ష్మీకవచమును నీ కుపదేశించితిని. ఈ పర మాద్భుతకవచము సర్వసంపత్ప్రదాయకము. విధిపూర్వకముగ గురువు నర్చించి యీకవచమును గ్రహించి, గళమునందుగాని దక్షిణభుజమునందుగాని ధరించిన మానవుడు సర్వులను జయింపగలసమర్థుడు కాగలడు. మహాలక్ష్మి యెల్లపుడు వానిగృహమును వీడక జన్మజన్మములయందు వానిని ఛాయవలె వెంటునంటి యుండును. మందబుద్ధియుక్తుడైనవా డీకవచమును దెలిసికొనక యెంత కాలము లక్ష్మిని యారాధించినను వానికి సిద్ధికలుగదు".

## లక్ష్మ్యాః మన్త్రో ధ్యానం చ

నారాయణ ఉవాచ:

దత్త్వా తస్మై చ కవచం మన్త్రం చ షోడశాక్షరమ్ ।
సంతుష్టశ్చ జగన్నాథో జగతాం హితకారణమ్ ॥

ఓం హ్రీం శ్రీం క్లీం నమో మహాలక్ష్మ్యై హరిప్రియాయై స్వాహా ।
దదౌ తస్మై చ కృపయా ఇన్ద్రాయ చ మహామునే ॥

ధ్యానం చ సామవేదోక్తం గోపనీయం సుదుర్లభమ్ ।
సిద్ధైర్మునీన్ద్రైర్దుష్ప్రాప్యం ధ్రువం సిద్ధిప్రదం శుభమ్ ॥

శ్వేతచమ్పకవర్ణాభాం శతచన్ద్రసమప్రభామ్ ।
వహ్నిశుద్ధాంశుకాధానాం రత్నభూషణభూషితామ్ ॥

ఈషద్ధాస్యప్రసన్నాస్యాం భక్తానుగ్రహకారకమ్ ।
సహస్రదలపద్మస్థాం స్వస్థాం చ సుమనోహరామ్ ॥

శాన్తాం చ శ్రీహరేః కాన్తాం తాం భజేజ్జగతాం ప్రసూమ్ ॥

ధ్యానేనానేన దేవేన్ద్ర ధ్యాత్వా లక్ష్మీం మనోహరామ్ ।
భక్త్యా దాస్యసి తస్యై చ చోపచారాణి షోడశ ॥

స్తుత్వానేన స్తవేనైవ వక్ష్యమాణేన వాసవ ।
నత్వా వరం గృహీత్వా చ లభిష్యసి చ నిర్వృతిమ్ ॥

స్తవనం శృణు దేవేన్ద్ర మహాలక్ష్మ్యాః సుఖప్రదమ్ ।
కథయామి సుగోప్యం చ త్రిషు లోకేషు దుర్లభమ్ ॥ 18-26

మహామునీ! ఇట్లు జగదీశ్వరుడైన శ్రీహరి ప్రసన్నుడై యింద్రునకు గవచమును బ్రసాదించి మరల జగమునకు హితమొనరించుటకొఱకు దయతో శ్రీమహాలక్ష్మీషోడశాక్షరమంత్రము నుపదేశించెను.

'ఓం హ్రీం శ్రీం క్లీం నమో మహాలక్ష్మ్యై హరిప్రియాయై స్వాహా' శ్రీమహాలక్ష్మీధ్యాన మత్యంతగోపనీయము, పరమదుర్లభము, సిద్ధులకు మునులకు దుష్ప్రాప్యము, సిద్ధిప్రదము, సామవేదోక్తము. శ్వేతచంపకపుష్పముల వంటికాంతిగలదియు, నూఱుగురుచంద్రులతో సమాన మగువెలుగు గలదియు, అగ్నిశుద్ధము లగుబరిధానములను ధరించినదియు, రత్నభూషణములచే నలంకృతమైనదియు, చిఱునవ్వుచే బ్రసన్నమైనముఖముగలదియు, భక్తుల ననుగ్రహించునదియు, వేయిఱేకులుగలపద్మమున నివసించునదియు, స్వస్థమైనదియు, మనోహారిణియైనదియు, శాంతస్వభావముగలదియు, శ్రీహరికి భార్యయైనదియు, జగత్తునకు గారణమైనదియు నగునాలక్ష్మీదేవిని సేవింపవలెను. దేవేంద్రా! నీ విట్లుమనోహారిణి యైనశ్రీమహాలక్ష్మిని ధ్యానించి భక్తిపూర్వకముగ నామెకు షోడశోపచారములను సమర్పించి స్తుతింపుము. పిమ్మట సాష్టాంగదండప్రణామము లర్పింపుము. నీవు నిశ్చయముగ మహాలక్ష్మియను గ్రహమునకు బాత్రుడవై దుఃఖవిముక్తుడవు కాగలవు. దేవరాజా! పరమగోపనీయమైన, శుభప్రదమైన, త్రిలోకములయందు దుర్లభమైననీ మహాలక్ష్మీస్తోత్రము నుపదేశించెదను, ఏకాగ్రచిత్తుడవై యవధరింపుము.

## లక్ష్మ్యాః స్తోత్రమ్

నారాయణ ఉవాచ :

దేవి త్వాం స్తోతుమిచ్ఛామి న క్షమాః స్తోతుమీశ్వరాః ।
బుద్ధేరగోచరాం సూక్ష్మాం తేజోరూపాం సనాతనీమ్ ॥

అత్యనిర్వచనీయాం చ కో వా నిర్వక్తు మీశ్వరః ॥

స్వేచ్ఛామయీం నిరాకారాం భక్తానుగ్రహవిగ్రహామ్ ।
స్తౌమి వాఙ్మనసోః పారాం కిం వాఽహం జగదమ్బికే॥

పరాం చతుర్ణాం వేదానాం పారబీజం భవార్ణవే ।
సర్వస్యధిదేవీం చ సర్వాసామపి సమ్పదామ్ ॥

యోగినాం చైవ యోగానాం జ్ఞానానాం జ్ఞానినాం తథా ।
వేదానాం చ వేదవిదాం జననీం వర్ణయామి కిమ్ ॥

యయా వినా జగత్సర్వమవస్తు నిష్ఫల ధృవమ్ ।
యథా స్తనన్ధయానాం వినా మాత్రా సుఖం భవేత్ ॥

ప్రసీద జగతాం మాతా రక్షాస్మానతికాతరాన్ ।
వయం త్వచ్చరణామ్భోజే ప్రపన్నాః శరణం గతాః ।

నమః శక్తిస్వరూపాయై జగన్మాత్రే నమో నమః ।
జ్ఞానదాయై బుద్ధిదాయై సర్వదాయై నమో నమః ॥

హరిభక్తిప్రదాయిన్యై ముక్తిదాయై నమో నమః ।
సర్వజ్ఞాయై సర్వదాయై మహాలక్ష్మ్యై నమో నమః ॥

కుపుత్రాః కుత్రచిత్ సన్తి న కుత్రచిత్ కుమాతరః ।
కుత్ర మాతా పుత్రదోషే తం విహాయ చ గచ్ఛతి ॥

హేమాతర్దర్శనం దేహి స్తనన్ధాన్ బాలకానివ ।
కృపాం కురు కృపాసిన్ధుప్రియేఽస్మాన్ భక్తవత్సలే ॥

ఇత్యేవం కథితం వత్స పద్మాయాశ్చ శుభావహమ్ ।
సుఖదం మోక్షదం సారం శుభదం సమ్పదః పరమ్ ॥

ఇదం స్తోత్రం మహాపుణ్యం పూజాకాలే చ యః పఠేత్ ॥
మహాలక్ష్మీర్గృహం తస్య న జహాతి కదాచన ॥

ఇత్యుక్త్వా శ్రీహరిస్తం చ తత్రైవాన్తరధీయత ।
దేవో జగమ క్షీరోదం సురైః సార్థం తదాజ్ఞయా ॥ 27-39

దేవీ! స్తుతించుటలో సమర్థులైనవారుగూడ నిన్ను స్తుతింపజాలకపోవు చున్నారు. అట్టి నిన్ను నేను స్తుతింపదలచుచున్నాను. బుద్ధికి అగోచరమైన దానవు, సూక్ష్మస్వరూపిణివి, తేజోరూపిణివి, సనాతనివి, అనిర్వాచనీయమైన దానవు. అట్టినిన్నెవరు వర్ణింపగలరు? జగదంబికా! స్వేచ్ఛామయివి, నిరాకారవు, భక్తులకొఱకే మూర్తిభవించినఅనుగ్రహస్వరూపిణివి, మనస్సునకు, వాణికినతీతమైనదానవు. అట్టినిన్ను నేనేమనిస్తుతింపగలను? దేవీ! చతుర్వేదములకంటె పరమైనదానవు, భవసాగరమును దరించుట కుపాయస్వరూపిణివి,

సర్వసస్యములకు, సమస్తసంపదలకు నధీశ్వరివి, యోగులకు, యోగములకు, జ్ఞానులకు, జ్ఞానమునకు, వేదవేత్తలకు, వేదములకు, జననివినై యున్నావు. అట్టినిన్ను నే నేమనివర్ణింపగలను. పాలుత్రాగుశిశువునకు తల్లి లేనిదే సుఖము లభింపనట్లు, నీవు లేనిదే సర్వజగత్తు నిశ్చయముగ వస్తుహీనమై నిష్ఫలము కాగలదు. అట్టిజగన్మాతవై ననిన్ను ప్రార్థించెదను. దేవీ! ప్రసన్నవై, అత్యంత భయభీతులమైనమమ్ము రక్షింపుము. మేము నీచరణకమలములనాశ్రయించితిమి. శక్తిస్వరూపిణివి జగజ్జననివి నైననీకు మాటిమాటికి నమస్కారములు. జ్ఞానమును, బుద్ధిని, సర్వస్వమును ప్రసాదించునీకు మాటిమాటికి నమస్కారము. మహాలక్ష్మీ నీవు హరిభక్తిని ప్రసాదింపగలదానవు, ముక్తిప్రదాయనివి, సర్వజ్ఞురాలవు, సర్వస్వమును ప్రసాదింపగలదానవు. తల్లీ! దుర్మార్గులైనపుత్రు లెక్కడైన నుండెదరు. కాని, దుర్మార్గురాలైనతల్లి యెచ్చటను నుండబోదు. కుమారుడు దుష్టుడైనచో మాతృదేవి వానిని విడచి యెక్కడకు వెడలిపోవును ? తల్లీ నీవు కృపాసింధువైన శ్రీహరికి ప్రాణప్రియవు. భక్తులను సదా అనుగ్రహించుటయే నీస్వభావము. అందువలన, జననీ మమ్ము పాలుత్రాగుశిశువులవలె భావించి యనుగ్రహింపుము. మాకు నీదివ్యదర్శనమును ప్రసాదింపుము.

"వత్సా! సుఖప్రదాయకమైన, మోక్షప్రదమైన, సకలసారరూపమైన, శుభప్రదమైన, సకలసంపదలకు నాశ్రయస్థానమైననీలక్ష్మీ స్తోత్రము నీ కుపదేశించితిని. పూజాసమయమున నీమహాపుణ్యప్రదాయకమైన స్తోత్రమును బఠించువానిగృహమున లక్ష్మీదేవి నివసించుచు వాని నెప్పుడును బరిత్యజింపదు". ఇంద్రున కిట్లుపదేశ మొనరించి శ్రీహరియంతర్హితుడయ్యెను. శ్రీహరి యాదేశానుసారముగ దేవతలతోగూడ దేవేంద్రుడు శ్రీ మహాలక్ష్మిని యారాధించుటకు క్షీరసాగరమునకు వెడలెను.

ఇదిశ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ
సంవాదమున శ్రీలక్ష్మీస్తవకవచపూజా
కథన మను నిరువదిరెండవ
అధ్యాయము సంపూర్ణము.

—o—

# ఇరువదిమూడవ అధ్యాయము

## శ్రీమహాలక్ష్మి దేవతలకు, మహర్షులకు తననివాసస్థానములను వివరించుట.

శ్రీ నారాయణ ఋషి పలికెను:

నారదమహర్షీ! తదనంతరము ఇంద్రాదిసకలదేవతలు ప్రసన్నచిత్తులై బృహస్పతిని వెంటగొని శ్రీమహాలక్ష్మికటాక్షప్రాప్తికొఱకు క్షీరసాగరమున కేగిరి. మహేంద్రుడు శ్రీమహాలక్ష్మికవచమును రత్నగుటికయందు భద్రపఱచి గళమునందు ధరించెను. దేవతలందఱు శ్రీమహాలక్ష్మి స్తోత్రమును బఠించుచు పులకితదేహులై శ్రీరంగధామేశ్వరి దేవి ననన్యభక్తితో నారాధించిరి. సహస్రదళపద్మవాసిని యైనరమాదేవి వారిప్రార్థనల నాలకించి జగత్తునుదీపింప జేయుమహాజ్యోతితో బ్రకాశించుచు దేవతలసమక్షమున సాక్షాత్కరించెను. ఆమె యాదేవతల నాదేశించుచు నిట్లుపల్కెను. "కుమారులారా! మీరు బ్రాహ్మణశాపమువలన శ్రీహీనులైనారు. మహర్షులైనవిప్రులు సంతుష్టులైనచో నేను మిమ్మనుగ్రహింపగలను". ఆసమయముననే క్షీరసాగరముకడ కాంగీరస, ప్రచేతస, క్రతు, భృగు, పులహ, పులస్త్య, మరీచి, అత్రి, సనక, సనందన, సనాతన, సనత్కుమార, కపిల, పంచశిఖ, దుర్వాస, కాశ్యప, అగస్త్య, గౌతమ, కణ్వ, మార్కండేయ, లోమశ, వసిష్ఠాది సకలమహర్షులు నేతెంచిరి. వారు బ్రహ్మవిష్ణుశివేంద్రసేవితపాదపద్మ యైనశ్రీమహాలక్ష్మికి బ్రణామము లర్పించి యిట్లుప్రార్థించిరి. "మాతా! మహర్షులమైనమేము దేవతలయెడల బ్రసన్నులమైతిమి. జగదంబికా! నీవు కరుణించి దేవలోకములోను, మర్త్యలోకములోను బ్రవేశించి శ్రీహీనులైనజీవులను రక్షింపుము." మహర్షుల బ్రార్థనల నాలకించి జగజ్జనని యిట్లుపల్కెను. "విప్రశ్రేష్ఠులారా! నేను మీప్రార్థనల నాలకించి ప్రసన్నురాలనైతిని. నేను స్వర్గలోకమును బ్రవేశించెదను. కాని మర్త్యలోకమున గొందఱిని మాత్రమే కరుణించెదను, వారివివరములను వర్ణించుచున్నాను, శ్రవణమొనరింపుడు. పుణ్యాత్ములైనగృహస్థుల, ఉత్తమనీతిమంతులగు నరపతులగృహములందు నేను స్థిరముగ నివసించెదను. అట్టివారిని బుత్రులవలె గరుణించెదను. గురువు, దేవతలు, తల్లి, తండ్రి, యన్నదమ్ములు, అతిథులు, పితరులుమున్నగువారిచే గోపింపబడువారు

నాకృపకు పాత్రులుకారు. మిథ్యావాదులను, పరాక్రమహీనులను, దుష్టస్వభావ యుక్తులను, నైశ్వర్యసంపన్నులైనను తమవద్దనేమియు లేదనిబొంకు వారిని నే ననుగ్రహింపను. సత్యరహితులు, లంచగొండులు, అసత్యసాక్ష్యములపలుకువారు, కృతఘ్నులు నగువారు నాకృపకు పాత్రులుకారు. ఎల్లప్పుడు చింతాగ్రస్తులై యుండువారు,భయముతో జీవించువారు, మహాపాపములను ఋణముల నొనరించువారు, కృపణులు నగువారు నాయనుగ్రహమును బొందలేరు. తృప్తితో కూడి యైశ్వర్యవంతులై ప్రశాంతజీవనమొనరించుట నాకరుణాకటాక్షమువలననే. నాకృపకు పాత్రులుకానివా రత్యంతధనసంపన్నులైనను సుఖశాంతులు కఱవై జీవనమే నరకతుల్యముగ జీవించెదరు. సామర్థ్యవిహీనులు, శోకార్తులు, మందబుద్ధులు, స్త్రీకిలోబడి జీవించువారు, కులటాస్త్రీభర్తలు పుత్రులు నగువారు నాయనుగ్రహమును బొందలేరు. కఠోరములైన దుష్టవచనములబల్కువారు, ఇతరులమనస్సు నొప్పించువారు, కలహించుటయే స్వభావముగ గలవారు, గృహములందు స్త్రీయాధిపత్యముగలవారు నగుమానవులునాకరుణనుబొందలేరు. వారిగృహములకు నే నరుదెంచను. హరివిముఖులై దైవారాధనమొనరింపనివారు, శ్రీకృష్ణునిదివ్యగుణములనుగీర్తింపనివారు, జగదాధారునిబ్రశంసింపనివారిని నేను కటాక్షింపను. కన్యను, అన్నమును, వేదాది విద్యలనుఅమ్ముకొనువారు, మనుష్యఘాతుకులు, జీవులను హింసించువారు నగు మానవులు నాకృపకు పాత్రులుకారు. వారిగృహములు నరకకుండములతో సమానము. అందువలన వారిగృహములకు నేను వెడలను. కృపణులై తల్లిని, తండ్రిని, భార్యను, ఆచార్యుని, గురుపత్నిని, బుత్రులను, అనాథ యైనసహోదరిని, ఆశ్రయహీనులై బంధువులను, ఐశ్వర్యహీనులైనసన్మిత్రులను పాలించి పోషింపక యెల్లప్పుడు ధనార్జనయందే లగ్నమైయుండు వారిని నే ననుగ్రహింపను. దంతములు, వస్త్రములు మలినములైయుండువారు, తైలసంస్కారరహితమైనకేశములతో, చిందరవందరగ నున్నశిరముగలవారిని నేను కరుణింపను. మందబుద్ధులైనవారిని, మలమూత్రముల బరిత్యజించుసమయమున వాటియందే దృష్టిసారించువారిని, తడిపాదములతో శయనించువారిని, కాళ్ళుకడుగుకొనక నిద్రించువారిని, గాఢనిద్రకు వశీభూతులై దిగంబరులగువారిని, సంధ్యాసమయము నందు, దినమందు శయనించువారిని నే ననుగ్రహింపను. శిరమునకు నూనెరాచి కొని యాహస్తములతో నితరరాంగములను స్పృశించువారు, శరీరమందు

నూనెను మర్దనచేసికొని స్నానమాడక మలమూత్రవిసర్జన మొనరించువారు, పుష్పముల నకారణముగ త్రుంచువారు నాయనుగ్రహమునకు పాత్రులు కాలేరు. నఖములతో తృణములను త్రుంచువారు, భూమిని బొడచి మట్టిని పెళ్ళగించువారు, శరీరము, పాదములు మట్టికొట్టుకొనియుండువారిని నే నను గ్రహింపను. అన్యులజీవనోపాధుల నపహరించువారు, జ్ఞానయుక్తులుకానివారు, కర్మ మొనరించి దక్షిణయొసంగనివారు, పరుషవాక్యములుపల్కు-వారు, పాపము లొనరించువారు, పుణ్యహీనులై నివసించువారు, మంత్రవిద్యచేత జీవించువారు, క్రోధవశమున వివాహాదిశుభ కార్యములకు, ధర్మకార్యములకు భంగ మొనరించువారు, దినమునందే రమించువారు, నాయనుగ్రహమునకు పాత్రులు కానేరారు".

నారదా ! ఇట్లు శ్రీమహాలక్ష్మి తన యనుగ్రహపాత్రాపాత్రులను వర్ణించి, దేవతల ననుగ్రహించి యంతర్ధానమయ్యెను. లక్ష్మీకటాక్షసంపన్ను లైనదేవతలు శ్రీసంపన్నులై తమరాజ్యమును దిరిగిపొంది, పెక్కు-కాలము సుఖించిరి.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
గణపతి ఖండములోని నారద నారాయణ
సంవాదమున లక్ష్మీస్థాననిరూపణ మను
ఇరువదిమూడవ అధ్యాయము
సంపూర్ణము.

# ఇరువదినాల్గవ అధ్యాయము

## కార్తవీర్యార్జునుడు జమదగ్ని మహర్ష్యాశ్రమములోని కామధేనువును హరింప నుద్యుక్తుడగుట, కామధేనువునుండి యుద్భవించిన సైన్యముతో గార్తవీర్యసైన్యము తలపడుట.

నారదుడు పలికెను :

హర్యంశోద్భవా! మహాభాగా! నారాయణ యతీంద్రా! నీకృపవలన గణేశ్వరుని శుభచరిత మాలకించి ధన్యుడనైతిని. దేవా! శ్రీమహావిష్ణువు గణేశ్వరుని గజాననునిగ నొనరించెనని వచించితివి. ఐనచో నాపార్వతీనందనుడేకదంతుడగుటకు గారణమేమి? గణనాథుని మఱియొక దంతమేమయ్యెను? ఈప్రసంగములను నాకుపదేశింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

శ్రీనారాయణఋషి పలికెను :

దేవర్షీ! ఏకదంతుని దివ్యచరితము మంగళములకును మంగళమైనది. ఈప్రాచీనేతిహాసమును వివరించెద నవధరింపుము. పూర్వకాలమం దొక సమయమున గార్తవీర్యుడు మృగయావినోదియై వనముల కరిగెను. సపరివారముగ నానరేశ్వరుడు దినమంతయు మృగయావినోదము సలిపి యలసి యాకలిగొని నిరాహారముగ రాత్రియంతయు గడిపెను. ప్రాతఃకాలమందు ససైన్యముగ నతడు జమదగ్నిమహర్షి యాశ్రమున కేతెంచెను.

నారదా! భారత వర్షమందు పుణ్యకర్మానుచరణమువలన ననన్య పుణ్యరాశి లభించును. పుణ్యకర్మలవలన మానవు డున్నత స్వర్గభోగముల ననుభవించి మరల భూమిపై పుణ్యాత్ముల గృహములయందే జన్మింపగలడు. జీవుడు పాపకర్మలవలన ఘోరనరకముల ననుభవించి మరల పృథ్విలో నీచయోనులయందు జన్మింపగలడు. కర్మానువర్తులై యుండిన జీవులా సంసారచక్రము నుండి యుద్ధరింపబడరు. అందువలననే మహాత్ములు నిష్కామకర్ములై నిరంతరము సమస్తకర్మలను భగవదర్పిత మొనరించి కర్మక్షయము గావించుకొని హరినామ సంకీర్తన మొనరించుచు పరంధామమును జేరెదరు.

మహర్షి రాజును గాంచి యాదరముతో వానిక్షేమసమాచారముల నడిగెను. మిమ్మట రాజు సూర్యసమాన తేజస్వి యగు మహర్షి పాదములపై బడి నమస్కరింపగా ఆయన రాజు నాశీర్వదించెను. రాజు తనయుపవాసాది వృత్తాంత మంతటిని వివరించెను. మహర్షి భయపడుచు రాజును సపరివారముగ నాతిథ్యమున కాహ్వానించెను. పిమ్మట జమదగ్ని మహర్షి హర్షముతో దనయాశ్రమమునకు వెడలి శ్రీమహాలక్ష్మిసదృశ యగు కామధేనువునకు విషయమునంతటిని వివరించెను. కామధేనువు మునితో నిట్లుపలికెను "మహర్షీ! నే నుండగ నీకు భయమేల? నావలన నీవు సర్వజగత్తునకు భోజనము పెట్టజాలినవాడవు, ఇక రాజువిషయ మెంత? రాజులభోజనమునకు యోగ్యమైన, మూడులోకములలోను దుర్లభములైన యేపదార్థములు కావలెనో కోరుకొనుము. అన్నింటిని నీకు ప్రసాదించెదను."

అనంతరము కామధేను వనేక విధముల భుజించుటకు యోగ్యములైన బంగారు వెండిపాత్రలను, భోజనమును సిద్ధముచేయుటకు దగిన పాత్రలను, వివిధములగు స్వాదిష్టపదార్థములతో నిండియున్న పాత్రలను మహర్షికి సమర్పించెను. ఇంకను నానావిధములైన పక్వములైన రుచిగల ఫలములను, లడ్డు మున్నగు లెక్కలేనన్ని పిండివంటలను, ఉత్తమాన్నములను, శర్కరామోదకాదులను పర్వత ప్రమాణముగ నొసంగి, దుగ్ధదధిఘృతాదులను నదులగ ప్రవహింపజేసెను. అనంతరము రాజులకు యోగ్య మైనకర్పూరాదులచే సువాసితమైనతాంబూలమును, సుందరవస్త్రాభూషణములను నొసంగెను. ఇంతటిసామగ్రిచే సంపన్నుడైన మహర్షి విలాసముగ సేనాసహితు డగు గార్తవీర్యునకు రాజోచిత మగునాతిథ్య మొసంగెను. దుర్లభము లగు పదార్థములను గాంచి రాజాధిరా జగు గార్తవీర్యుడు విస్మితుడై మంత్రితో నిట్లు పలికెను "సచివా! రాజాధిరాజులకుసహితము దుర్లభము లగు నీపదార్థము లెచటినుండి మహర్షికి లభించినవో జాడతీయుము. ఇవి నా కసాధ్యములైనవి, వీనిలో పెక్కుపదార్థముల నామములను సైతము నేను వినియుండలేదు".

మంత్రి పలికెను:

"మహారాజా! నేను మున్యాశ్రమమున సమస్తమును జూచియుంటిని; చెప్పెదను, వినుడు. అచట హోమకుండములు, సమిధలు, కుశములు, పుష్పములు, ఫలములు, కృష్ణమృగచర్మములు, స్రుక్స్రువములు, శిష్య

వర్గము, సూర్యుని తేజస్సుచే ఫలించుసస్యాదులు మొదలగునవి గలవు. అది సర్వసంపద్వివర్జితము. అచట నందఱు జటాధారులు, వల్కలధారులు నైయున్నారు. కాని యాశ్రమములో నొక్కమూల నొకమనోహర మగు కపిలగోవు నాకగుపించినది. దానియవయవములు మిగుల సుందరముగ నున్నవి. దాని వర్ణము చంద్రకాంతిసదృశము. దాని నేత్రములు రక్తపద్మములవలె ప్రకాశించుచున్నవి. అది సాక్షాత్తుగ లక్ష్మీదేవివలె సర్వసంపదలకు గుణములకు నాధారమైయున్నది".

మంత్రి చెప్పిన వాక్కులనాలకించి దుర్బుద్ధి యగు నారాజు మునినాగోవు నర్థింప నుద్యుక్తుడయ్యెను. ఏలయన, అత డాసమయమున పూర్తిగ గాలపాశముచే బద్ధుడైయుండెను.

సా విద్యా త త్తపో జ్ఞానం స గురుః స చ బాన్ధవః ।
సా మాతా స పితా పుత్రస్త త్ క్షయం కారయేత్తు యః ॥

"తనకర్మలను క్షయమొనరించుకొనుటలో జీవునకు సహాయపడువారే నిజమైన విద్య, తపము, జ్ఞానము, గురువు, సోదరుడు, బంధువు, తల్లి, తండ్రి, పుత్రుడు".

జీవులకు తమకర్మలవలన గలుగు శుభాశుభభోగములు దారుణరోగములతో సమానములు, ఆరోగములను భక్తస్వరూపుడైన వైద్యుడు శ్రీకృష్ణభక్తి యనెడురసాయనము నుపయోగించి నశింపజేయగలడు. జగత్తును ధరించి పోషించు బుద్ధిప్రదాయని యగుమాయను జీవుడు సేవించి ఆరాధించినచో నామే సంతుష్టయై తనభక్తున కక్షరమైనహరిభక్తిని ప్రసాదింపగలదు. ఆమే యాగ్రహమునకు గురియైన నెంతటి మహాత్ములైనను బతితులుగాక మానరు. మాయామోహితు డగు గార్తవీర్యుడు జమదగ్ని మహర్షికడ కరిగి నమస్కరించి యిట్లర్థించెను. "మహర్షీ! నీవు భక్తానుగ్రహకారకుడవు. భక్తులపాలిటి కల్పవృక్షరూపుడవు, నేను నీభక్తుడను, నాకు నీగృహమునం దున్న సకలసిద్ధిప్రదాయక యైన కామధేనువును భిక్షారూపమున ననుగ్రహింపుము. దానము లొనరించుదాతల కీపవిత్రభారతవర్షమందు గొదువలేదు. పూర్వకాలమందు దధీచిమహర్షి దేవత లర్థింపగ దనయస్థికలనే దానమొనరించెను. తపోధనా! నీవు తపశ్శక్తివలన నసంఖ్యేయము లైన కామధేనువులను సృష్టింపగలవు, కావున నీకామధేనువును గృపతో నాకనుగ్రహింపుము" దీనుడై కార్తవీర్య

దర్శింపగా నాశ్చర్యచకితుడై జమదగ్నిమహర్షి యిట్లు పల్కెను. "రాజా నీవు విపరీతముగ బలుకుచున్నావు. నాయాశ్చర్యమునకు మేరలేదు. నేను ద్విజుడనై యుండగ క్షత్రియుడ వైన నీ కెట్లుదానమీయగలను. యాచించుట బ్రాహ్మణ ధర్మము సమ్రాట్టు వైననీకు దగదు. ఈకామధేనువును పరమాత్మ యగు శ్రీకృష్ణుడు బ్రహ్మలోకములో యజ్ఞసమయమున బ్రహ్మ కొసంగెను. భూపాలా! బ్రహ్మ యీకామధేనువును దనప్రియపుత్రు డైనభృగుమహర్షికి బ్రసాదించెను, మామూలపురుషు డైననాభృగువు దానిని నాకు బ్రసాదించెను. గోలోమం దుద్భవించిన నీదివ్యగోమాత త్రిలోకములయందును దుర్లభమైనది. అందువలన నీకామధేనువు నాకు ప్రాణాధికప్రియము, కావున దానయోగ్యము కాదు. మహర్షి నైనను నేనిటువంటి కామధేనువును సృష్టించుట కసమర్థుడను. రాజా! నీయాచ్నామనోవృత్తిని వీడి వెడలిపొమ్ము".

మునిపల్కులను విని కార్తవీర్యుడు కోపించి యాశ్రమమును వీడి తన సేనామధ్యమున గరిగి బలప్రయోగముతో గోవును హరింపు డనిసైనికుల నాదేశించెను. జమదగ్ని యావిషయమును గ్రహించి కామధేనువును ప్రార్థించెను. సాక్షాత్తుగ శ్రీమహాలక్ష్మి స్వరూపిణి యైన యాకామధేనువు జమదగ్నిని గాంచి యిట్లుపల్కెను. మునీశ్వరా! తనవస్తువులను శాసించి, పోషించి, దానమొనరించువాడే దాత. ఇంద్రు డైనను సామాన్యుడైనను దనవస్తువును దానమొనరింపవచ్చును. తపోధనా! నీవు మనస్ఫూర్తిగ నన్ను రాజునకొసంగిన నేను నీయాజ్ఞను శిరసావహించి కార్తవీర్యు ననుసరించెదను. నీయాజ్ఞలేనిదే నేను నీగృహమును వీడజాలను. సర్వజ్ఞుడ వైననీవు చింతింపబనిలేదు. సంయోగ వియోగములు కాలకృతములు, ఆత్మకృతములుకావు. ఈసంసారమం దెవరికి యెవరు గలరు? జీవులపరస్పరసంబంధములు కాలముద్వారా సంధింపబడును. మనసంబంధము నిర్ణయింపబడునంతవరకే మీరు నావారై యుండెదరు. ఏవస్తువు నైనను మనది యనిభావించి దానియం దనురాగము గలిగియున్నచో దానివియోగమువలన దుఃఖముగూడాగలుగును. జగత్తు, జగత్తునం దున్న సర్వపదార్థములు నీశ్వరునవే. మనమందరము నిమిత్తమాత్రులమే. కావున మహర్షీ! నీవు నాచేసృష్టింపబడు నపారసేనావాహినితో గార్తవీర్యుని శిక్షింపుము."

వెంటనే కామధేనువు వివిధాంగములనుండి సూర్యసదృశకాంతియుక్త

లైన అస్త్రశస్త్రధారులు కోట్లకొలదిగ నుద్భవించిరి. వారిలో మ్లేచ్ఛులు కూడ కలరు. రాజు పంపినసేవకులు పరాజితులై కార్తవీర్యునిజేరి విషయమును వెల్లడించిరి. జమదగ్నియాశ్రమము సకలసేనాసంపన్నమై యుండుట గాంచి కార్తవీర్యుడు భీతిచెందెను. రాజధానికి వార్తపంపి తనసమస్తసైన్యమును సంగరభూమికి రప్పించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని జమదగ్ని కార్తవీర్య
యుద్ధారంభవర్ణన మనునిరువదినాల్గవ
అధ్యాయము
సంపూర్ణము.

## ఇరువదియైదవ అధ్యాయము

### జమదగ్ని కార్తవీర్యుల యుద్ధము

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారదా! పిమ్మట కార్తవీర్యుడు దుఃఖహృదయముతో శ్రీహరిని స్మరించి కుపితుడై మునికడకు దూతద్వారా యిట్లువార్తనంపెను—"మునిశ్రేష్ఠా! యుద్ధముచేయుము, లేదా అతిథిని, భృత్యుడను నగునాకు వలసినగోవు నిమ్ము. చక్కగ ఆలోచించి నీకు దగినట్లుగ బ్రవర్తింపుము." దూతద్వారా పంపబడినయావార్తను విని మునివరుడగుజమదగ్ని పెద్దగ నవ్వి హితకరములు, సత్యములు, నీతియొక్కసారతత్త్వములు నగువిషయముల నిట్లుదూతతో జెప్పెను.

ముని పలికెను :

"దూతా! ఆహారరహితుడుగ నుండుట జూచి రాజును నేను నాయాశ్రమమునకు దీసికొనివచ్చి తగువిధముగ నాశక్తి ననుసరించి అనేకవిధము లగు వ్యంజనములతో వానికి భోజన మిడితిని. ఇప్పు డారాజు నాప్రాణములకంటెను

మిక్కిలిప్రియ మగుకపిలగోవును బలవంతముగ నడుగుచున్నాడు. నేను దాని నీయజాలను. అందువలన యుద్ధమునే యొసంగుదును. ఇది నానిశ్చయము.” ముని పలికినయీవాక్కులను విని దూత తిరిగివచ్చి సభలో భయముచే గవచ మును ధరించి గూర్చుండియున్నరాజునకు సర్వవృత్తాంతమును వినిపించెను.

ముని కపిలగోవుతో నిట్లు పలికెను :

“ఇపుడు నే నేమిచేయుదును ? కర్ణధారుడు లేనిదే నౌక సరిగ పయ నించదు. ఆస్థితియె నేను లేని యీసేనకు గలుగుచున్నది.” అపుడు కపిలగోవు ముని కనేకవిధము లగుశస్త్రములను యుద్ధశాస్త్రమును బోధించి వాని నుపయోగించుటకు దగినవిధానమును వివరించి యిట్లుపలికెను —“విప్రశ్రేష్ఠా! నీకు జయమగుగాక! నీవు యుద్ధములో దప్పక శత్రువును జయింతువు. అమోఘ దివ్యాస్త్రములేనిదె నీకు మృత్యువు సంభవింపదు. ఇది నిశ్చయము. నీవు బ్రాహ్మణుడవు. అందువలన దత్తాత్రేయుని శిష్యుడు అమోఘశక్తిధారియు నగురాజుతో యుద్ధమొనరించుట నీకు దగదు.” అనిపలికి కపిలగోవు మిన్న కుండెను. అపుడు బుద్ధిమంతు డగుముని సేనను సిద్ధపఱచి ఆసేనను వెంట నిడుకొని యుద్ధరంగమునకు వెడలెను. రాజుగూడ యుద్ధరంగమున సిద్ధముగ నుండెను. అతడు జమదగ్నిమహర్షికి నమస్కరించెను. తరువాత రెండుసేనలకు భయంకరమైన పోరాటము ప్రారంభమయ్యెను. ఆ యుద్ధమున కపిలగోవు సైన్యము రాజుసైన్యమును జయించెను. రాజుయొక్కవిచిత్రరథమును పొడి పొడిచేసెను. రాజుయొక్క కవచమును ధనుర్బాణములను ముక్కలుముక్కలుగ జేసెను. కార్తవీర్యుడు కపిలగోవుసేనను జయించలేకపోయెను. ఆసైన్యము బాణవర్షముచే రాజునువివశునిగజేసెను. అనంతరము బాణవర్షముచే రాజు మూర్ఛితుడయ్యెను. ఆసమయమున రాజుయొక్క కొంతసేన నశించినది, కొంత సేన పారిపోయినది. మహాముని! దయాసాగరు డగుజమదగ్నిమహాముని “నాయతిథి రాజాధిరాజు నగుకార్తవీర్యుడు మూర్ఛితుడయ్యె”నని తలంచెను. కృపాపరవశుడై ఆతడు తనసైన్యము నుపసంహరించెను. అనంతర మాకృత్రిమ సైన్యము కపిలగోవుశరీరములో లీనమయ్యెను. పిమ్మట దయాళు వగుముని శీఘ్రముగ రాజునకు దనచరణధూళి నిచ్చి ‘నీకు జయ మగుగాక !’ యని యాశీర్వదించి కమండలజలమును జల్లి వానిని చైతన్యునిగ జేసెను. స్మృతి లోనికి వచ్చినపిమ్మట ఆరాజు యుద్ధభూమిలో నిలబడి భక్తితో చేతుల

జోడించి తలవంచి యామునికి నమస్కరించెను. అపుడు ముని రాజు నాశీర్వదించి ఆలింగనముచేసికొనెను. మరల స్నానముచేయించి వానికి చక్కగ భోజనమిడెను. బ్రాహ్మణుల హృదయమెల్లపుడు నవనీతమువలె గోమలముగనుండును. కాని యితరులహృదయము ఖడ్గధారవలె తీక్ష్ణముగను, దారుణముగను నుండును. అనంతరము ముని రాజుతో 'మహారాజా! ఇక నీవు నీయింటికి బొమ్మనిపలికెను.

రా జు ప లి కె ను :

మహాబాహూ! యుద్ధముచేయుము, లేదా నేనుగోరుకపిలగోవును నాకు సమర్పింపుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్తమహాపురాణమందలి
గణపతిఖండములోని నారద నారాయణ
సంవాదమున జమదగ్ని కార్తవీర్యుల
యుద్ధ మను ఇరువదిమైదవ
అ ధ్యా య ము
సంపూర్ణము.

—: o :—

## ఇరువదియాఱవ అధ్యాయము

### జమదగ్ని కార్తవీర్యులు యుద్ధమును విరమించుట

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! భూపాలుని వాక్కులను విని మునివరుడు శ్రీహరిని స్మరించి హితకరములు, సత్యములు, నీతిసారరూపములునగు వాక్కులనిట్లు పలికెను.

ము ని ప లి కె ను :

మహాత్మా! నీవు గృహమునకు వెడలుము. సనాతనధర్మమును రక్షింపుము

ధర్మము సురక్షితముగ నున్న సర్వసంపదలు ఎల్లప్పుడు స్థిరముగ నుండును. ఇది సత్యము. రాజా! నీకుభోజనము లేకపోవుటచూచి, నేను నిన్ను నాగృహమునకు దెచ్చి యథావిధిగ నీకాదారసత్కారముల నొనర్చితిని. ఇపుడు మూర్ఛితుడవై యున్న నిన్ను నాచరణధూళిని, ఆశీస్సులను నొసంగి నీమూర్ఛను బోగొట్టితిని. ఇపుడు నీవిట్లుపలుకుట తగదు.

ఈమాటలను విని రాజు మునికి ప్రణమిల్లి మఱియొకరథముపై నధిరోహించి యుద్ధముచేయుడని యాహ్వానించెను. అపుడు ముని కవచమును ధరించి వానితో యుద్ధముచేయుట కుద్యుక్తుడయ్యెను. క్రోధముచే రాజుబుద్ధి భ్రష్టమయ్యెను. అందువలన నతడు మునితో దలపడెను. ముని కపిలగోవుచే నీయబడిన శక్తియొక్క, శాస్త్రములయొక్క బలముచే రాజును శస్త్రహీనునిగ నొనరించి మూర్ఛనొందించెను. అపుడు కమలలోచను డగుకార్తవీర్యుడు మఱల స్మృతిలోనికి వచ్చి క్రోధముతో మునితో దలపడెను. ఆరాజు సమరభూమియందు ఆగ్నేయాస్త్రమును బ్రయోగించెను. ముని వారుణాస్త్రమును ప్రయోగించి దానినిశాంతపఱచెను. రాజు మునిపై వారుణాస్త్రమును విసరెను. మునివిలాసముగ వాయవ్యాస్త్రమును విడిచిదానిని శాంతపఱచెను. అపుడు రాజు వాయవ్యాస్త్రమును విడువగా ముని వెంటనే దానిని గాంధర్వాస్త్రముద్వారా నిరోధించెను. పిమ్మట నరేశ్వరుడు మునిపై నాగాస్త్రమునువిడచెను. మునిగారుడాస్త్రము ద్వారా దానినినాశనము చేసెను. అపుడు రాజు వందలకొలదిసూర్యులవలెప్రకాశించునట్టిది, దశదిశలను ఉద్దీప్తముచేయునట్టిదియగు మాహేశ్వర మనునస్త్రమును బ్రయోగించెను. నారదా! అపుడుముని ప్రయత్నముతో త్రిలోకవ్యాపియు, దివ్యము నగువైష్ణవాస్త్రము ద్వారా దానిని నివారించెను. పిమ్మట నారాయణాస్త్రమును విడచెను. ఆయస్త్రమును జూచి కార్తవీర్యుడు దానికి నమస్కరించి శరణాగతుడయ్యెను. అపుడు ప్రళయాగ్నివలె నాయస్త్రము అచట పైపైన దిరిగి క్షణకాలము దశదిశలను ప్రకాశితమొనర్చి యంతర్ధానము చెందెను. అపుడు ముని యుద్ధరంగమున జృంభకాస్త్రమును విడచెను. ఆ యస్త్రప్రభావముచే రాజు నిద్రావశుడయ్యెను. ఆతడు మరణించినవానివలెబడి నిద్రించెను. ముని వెంటనే అర్ధచంద్రాస్త్రముద్వారా భూపాలుని సారథిని, రథమును, ధనుర్బాణములను ఛిన్నభిన్నముచేసెను. ఈవిధమునయుద్ధముచే

ముకుటమును, ఛత్రమును, కవచమును బ్రద్దలుచేసెను. వివిధములగు న స్త్రములను ప్రయోగించి వానియస్త్రములను, అమ్ములపొదిని, గుఱ్ఱములను ధ్వంసముచేసెను. యుద్ధరంగమున మునివర్యుడు విలాసముగ నాగాస్త్రముచే రాజుయొక్క మంత్రులనందఱను బంధించి చెఱసాలలో నుంచెను. పిమ్మట ఉత్తమమంత్రమును బ్రయోగించి యారాజును మేలుకొల్పెను. బంధితులై యున్నమంత్రులను వానికి జూపెను. వెంటనే వారిని బంధవిముక్తులునుగ జేసి రాజు నాశీర్వదించి "రాజా! ఇక నీవు గృహమునకు వెడలు" మనిపలికెను. కాని రాజు క్రోధపూరితుడై లేచి త్రిశూలమును ధరించి జమదగ్నిపై విసరెను. అపుడు ముని వానిపై శక్తినివిసరెను. ఇంతలో రణరంగములోనికి బ్రహ్మవచ్చి యుత్తమమగునీతిద్వారా ఇరువురిలోను బరస్పరము ప్రేమను నెలకొల్పెను. అపుడు ముని సంతుష్టుడై రణరంగమున బ్రహ్మదేవుని పాదములకు బ్రణతుడయ్యెను. రాజు బ్రహ్మదేవునకు మునికి నమస్కరించి తనగృహమునకు వెడలెను. పిమ్మట ముని బ్రహ్మ తమతమ నెలవులకు వెడలిపోయిరి. ఇప్పుడింతవఱకు జెప్పితిని, మిగిలినది తరువాత జెప్పెదను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని జమదగ్ని కార్తవీర్య
యుద్ధోపశమన మను నిరువదియాఱవ
అధ్యాయము
సంపూర్ణము.

— 0 —

# ఇరువదియేడవ అధ్యాయము

## దత్తాత్రేయ దత్తశక్త్యాయుధ ప్రహారముచే జమదగ్ని మరణించుట, పరశురాముడు క్షత్రియవధకై ప్రతిజ్ఞచేయుట.

శ్రీ నారాయణ ఋషి పలికెను:

నారాదా! కార్తవీర్యుడు కేవలము బ్రహ్మదేవుని యాజ్ఞకు బద్ధుడై యాదినమున రణము చాలించి గృహమున కరిగెను. కాని యతని యంతరంగ మందు కామధేనువును బలప్రయోగముచే నపహరింపవలెననెడి దుర్బుద్ధి దృఢముగ నుండెను. రాజు మరల విశాలసైన్యమును సమకూర్చుకొని జమదగ్ని యాశ్రమమును ముట్టడించెను. రణరంగమందు మహర్షి యనేక పర్యాయములు కార్తవీర్యుని మూర్ఛిల్లజేసెను, కాని దయతో సంహరింప లేదు. మూర్ఖుడైన నృపతి మునివర్యునిగరుణాంతరంగమును దెలిసికొనలేక యుద్ధరంగమందు విజృంభించి తనకు దత్తాత్రేయు డనుగ్రహించిన మహాపురుష సంహారక మగునమోఘశక్తిని జమదగ్ని మహర్షిపై దయారహితుడై ప్రయోగించెను. ఆ యస్త్రము విష్ణుభగవానుని యమోఘశక్తి. ఆదివ్యాస్త్రము ప్రళయకాలాగ్నివలె ప్రజ్వరిల్లుచు మునివక్షస్థలమును జీల్చి వైకుంఠమునకు వెడలిపోయెను. వైష్ణవాస్త్రప్రహారమువలన ననంతతేజస్వియైనజమదగ్ని మహర్షి రణరంగమున నిర్జీవుడై యొరగిపోయెను. మున్యాశ్రమమంతయు హాహా కారములతో మార్మ్రోగెను. కామధేను వాక్షణముననే యంతర్ధానమై గోలోక మునకు వెడలిపోయెను. మాయవలన మోహితుడై వివేకశూన్యుడైన కార్తవీర్యునకు కామధేనువు లభింపకపోగా, బ్రహ్మహత్యాపాతక మావహించెను. కార్తవీర్యుడు వ్యథితహృదయముతో ప్రాయశ్చిత్త మొనరించు కొనుటకై రాజధాని కేగెను.

పరమసాధ్వియైనజమదగ్నిమహర్షియర్థాంగి పతివియోగమును భరింప లేక హృదయవిదారకముగ శోకించుచు దీర్ఘయాత్ర లొనరించుచున్న దన పుత్రుడైనపరశురాముని స్మరించెను. ఆ సమయమున బుష్కరక్షేత్రమును

దర్శించుచున్న యోగీశ్వరుడైనపరశురామునకు దల్లి యాక్రందనము యోగ
శక్తివలన వినిపించెను. పరశురాముడు తీర్థయాత్రను జాలించి వాయువేగ
మనోవేగములతో జమదగ్నిమహర్షి యాశ్రమమును జేరి మాతృదేవి పాద
ములపై వ్రాలెను. జనకుని దుర్మరణకారణమును దెలిసికొని పరశురాము
డత్యంతదుఃఖితుడయ్యెను. వీతరాగుడుకావున శోకమును నిగ్రహించి శోక
దేవతయైనమాతృమూర్తిని యూరడించి జనకున కంత్యక్రియల నొనరించెను.
ఆ సమయమున పరశురాము డత్యంతరోషయుక్తుడై దుర్మార్గులైనక్షత్రియ
నృపతుల నిరువదియొక్క పర్యాయములు సంహరించి పృథ్విని నిఃక్షత్రియ
మొనరించెద నని రేణుకాదేవి వారించుచున్నను సరకుగొనక కఠోరప్రతిజ్ఞ
నొనరించెను. పితృఘాతకుడైనకార్తవీర్యుని సంహరించెద ననిపరశురాముడు
పల్కి మరల యిట్లనెను– "జననీ! పితృదేవునియాజ్ఞను పాలింపనివారు, తండ్రిని
హింసించినపాపిని వధింపనివారు పరమమూర్ఖులు, వారు నిశ్చయముగ
రౌరవాది నరకముల ననుభవింపగలరు. గృహమునకు నిప్పంటించువాడు,
విషప్రయోగ మొనరించువాడు, ఆయుధములను ధరించి సంహరించుట కుద్యుక్తు
డైనవాడు, సశ్యశ్యామలక్షేత్రములను వినాశ మొనరించువాడు, పరభార్యనపహ
రించువాడు, తండ్రిని వధించినవాడు, బంధుమిత్రులను హింసించువాడు,
ఎల్లపుడు నపకారము లొనరించువాడు, ఎల్లపుడు నిందించువాడు, కఠినవచన
ములతో మనస్సు నొప్పించువాడు, ధనమునపహరించువాడు ననునీపదు
నొకండుగురు వ్యక్తులు వేదవిహితులైనఘోరపాపాత్ములు. వీరు నిశ్చయముగ
సంహరింపబడుటకు యోగ్యులు."

ఆ సమయమున జమదగ్ని యాశ్రమమునకు భృగుమహర్షి యరు
దెంచెను. మహర్షిని గాంచి రేణుకాపరశురాము లాయనచరణములపై బడి
విలపించిరి. భృగుమహర్షి వేదోక్తములైనహితకరవచనములతో వారిని
యూరడింపదొడంగెను.

భృగుమహర్షి పలికెను:

కుమారా! పరశురామా! నీవు నావంశమునం దుత్పన్నుడవైన
యఖండజ్ఞానసంపన్నుడవు. హృదయదౌర్బల్యముతో నేలసామాన్యునివలె
విలపింతువు? క్షుద్రమైనహృదయదౌర్బల్యమును వీడుము. ఈ జగత్తులోని

సకలచరాచరప్రాణులు ధరించినయుపాధు లన్నియు నీటిబుడగలవలె క్షణభంగు
రములు. వత్సా ! సత్యసారము, సత్యబీజము కేవలము శ్రీకృష్ణుడే యని
గ్రహించి, నీ వాయననే యెల్లపుడు స్మరింపుము. జరిగినదేదో జరిగినది,
గతించిన విషయము మరల తిరిగి రాదు. జరుగనున్నది జరుగకమానదు, జరుగ
వలసినది నిశ్చయముగ జరుగును. ఎందువలెననగ ప్రారబ్ధజన్యమైన కర్మము
ననుభవింపకతప్పదు. కర్మఫలభోగము నెవ్వరును దప్పించుకొనజాలరు. శ్రీకృష్ణ
పరమాత్మ రచించిన భూతభవిష్యద్వర్తమానకాలములద్వారా నిరూపితము
లైనకర్మల నెవరు నివారణచేయగలరు ? జీవులు మాయకు వశీభూతులై పర
మాత్మను విస్మరించుటకు గలకారణ మీపాంచభౌతికశరీరమును నేను, నాది
యనిభావించుటయే. ఇవి ప్రాతఃకాలమున సంభవించు స్వప్నములవలె నిరర్థ
కములు, నశ్వరములు. పరమాత్మయొక్క అంశసంభూతు డైనఆత్మ దేహమును
వీడి వెడలిపోయినచో వాని ననుసరించి యాకలి, నిద్ర, దయ, శాంతి, క్షమ,
కాంతి, ప్రాణములు, మనస్సు, జ్ఞానము మొదలగునవి యన్నియు రాజు ననుస
రించు భృత్యులవలె వెడలిపోవును. అందువలన పరశురామా ! సాంసారిక
విషయములను వీడి యత్నపూర్వకముగ శ్రీకృష్ణుని భజించి తరింపుము.
కుమారా ! ఎవ రెవరికి తండ్రి ? ఎవ రెవరికి బుత్రుడు ? వీరందఱు దుస్తరభవ
సాగరమం దుద్భవించు కర్మస్వరూపము లైనతరంగములవంటివారే.

జ్ఞానినో మా రుద న్త్యేవ మా రోదీః పుత్ర సామ్ప్రతమ్ ।
రోదనాశ్రుప్రపతనాన్మృతానాం నరకం ధ్రువమ్ ॥

కుమారా ! జ్ఞానులైనవారు విలపింపరు. అందువలన నీవుకూడ
రోదింపకుము. ఎందువలెననగ, దుఃఖించినవారి యశ్రువులు భూమిపై బడినచో
మృతిచెందినవారికి నిశ్చయముగ నరకము లభించును.

దేహధారి యైనజీవుని సాంకేతికనామము నుచ్చరించుచు బంధుజనులు
మరణసమయమున రోదింతురు. ఎంతగ దుఃఖించినను వారు దానిని బొందలేరు,
ఇది నిశ్చయము. ఎందువలెననగ చర్మము, రక్తము, మాంసము మున్నగు
వానితో నిర్మింపబడిన మీపాంచభౌతికశరీరము పరమాత్మాంశమైన ఆత్మ
వీడినవెంటనే నిర్జీవమై, చేతనారహితమై, అస్పృశ్యమై నశించి పంచభూతముల
యందు గలసిపోవును. అట్టి క్షణభంగుర మగుశరీరముకొఱకు విలపించిన
నదితిరిగిరాదు. 'అక్షయుడైన పరబ్రహ్మమునుండి యుద్భవించినజీవుడు శిథిల

దేహమును వీడి మరల తన కర్మానుసారముగ నూతనశరీరమును ధరించును. జీవుడు శరీరమును వీడినను ఆత డాజన్మమున నొనరించిన సత్కర్మములు కీర్తి యుక్తములై జగమందు స్మరింపబడగలవు. అందువలన నీవు తక్షణమే వేద విహితము లైనపారలౌకికకర్మములనొనరించినీపితృదేవున కుత్తమగతులను ప్రసా దించుము. భవసాగరమును దరించుటకు జీవునకు సాహాయ్య మొనరించు వారే వాస్తవముగ బుత్రులు, బంధువులు, మిత్రులు నగుదురు''.

భృగుమహర్షి యుపదేశించిన దివ్యజ్ఞానమువలన సాధ్వియగు రేణుక యాక్షణమునందే భర్తృవియోగజనితశోకమును బరిత్యజించి, జ్ఞానార్థినియై యిట్లు ప్రశ్నించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణసంవాదమున
పరశురామప్రతిజ్ఞ యను ఇరువదియేడవ
అ ధ్యా య ము
సంపూర్ణము.

♦ ♦ ♦

## ఇరువదియెనిమిదవ అధ్యాయము

### రేణుకా భృగుసంవాదము : పరశురాముడు తండ్రికి అంత్యేష్టిక్రియ లొనరించి బ్రహ్మకడకు వెడలుట : బ్రహ్మాదేశమున శివలోక మునకు వెడలుట.

రే ణు క ప లి కె ను :-

బ్రాహ్మణోత్తమా! మీ యనుగ్రహమువలన నేను శోకమును వీడితిని. ఇతరులకు మానమర్యాదలను గలుగజేయు నాపతిదేవుడు నాబుతుకాలము నాటి నాల్గవదినమున నన్ను వీడినాడు. నే నాయన ననుసరింపవలె ననికోరు

కొనుచున్నాను. అనేకజన్మముల సముపార్జిత ఫలస్వరూపముగ నీనాడు మిమ్ము సాక్షాత్కరించినారు. అందువలన వేదవేత్తలయందు శ్రేష్ఠుడవగు మహర్షీ! నాకు తత్క్షణకర్తవ్యమును నిర్దేశింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

భృగు మహర్షి పలికెను :

మహాసతీ! నీవు పుణ్యాత్ముడైన నీపతిని అనుగమింపుము. ఋతుకాలము నాటి నాల్గవదినము పతియొక్క సర్వకర్మలలోను పరిశుద్ధమని తలంపబడు చున్నది.

స పుత్రో భక్తిదాతా యః సా చ స్త్రీ యానుగచ్ఛతి ।
స బన్ధుర్దానదాతా యః స శిష్యో గురుమర్చయేత్ ॥
సోఽభీష్టదేవో యో రక్షేత్ స రాజా పాలయేత్ ప్రజాః ।
స చ స్వామీ ప్రియాం ధర్మే మతిం దాతుమిహేశ్వరః ॥
స గురుర్ధర్మదాతా యో హరిభక్తిప్రదాయకః ।
ఏతే ప్రశంస్యా వేదేషు పురాణేషు చ నిశ్చితమ్ ॥ 7-9

భక్తిదాతయగువాడే పుత్రుడు, అనుసరించి ప్రవర్తించు స్త్రీయే సహధర్మచారిణి, దానమొనరించువారే బంధువులు, గురువు నర్చించి, గౌరవించు వారే శిష్యులు, రక్షించువాడే అభీష్టదైవము, ప్రజలను ప్రేమతో పాలించు వాడే రాజు, భార్యయొక్కబుద్ధిని ధర్మమందు నియోజితమొనరించువాడే స్వామి (భర్త), ధర్మము నుపదేశించి హరిభక్తిని ప్రసాదించువాడే నిజమైన గురువు వీరందఱు వేదములయందు, పురాణములయందు నిశ్చయముగ ప్రశంసనీయు లనిచెప్పబడిరి.

రేణుక పలికెను :

మునీశ్వరా! భారతవర్షమున నేస్త్రీలు మరణించినపతి ననుసరింపవలెను? ఎట్టివా రనుసరింపరాదు?

భృగు మహర్షి పలికెను :

సాధ్వీ! సంతానముగలది, గర్భిణియైనది, ఋతుమతి కానిది, రజస్వలయైనది, కులటయైనది, పతిభక్తిరహితయైనది యగుస్త్రీ మరణించిన భర్త ననుసరింపరాదు. ఏస్త్రీయైనను తనమనోభిలాషకు విరుద్ధముగ సహగమన

మొనరింపరాదు. అట్లుచేయవలసినదిగో యని యాదేశించి బలప్రయోగ మొనరించినవారు కుంభీపాకనరకమును బొందగలరు. పతివ్రతయగు స్త్రీ చితియం దుంచబడిన పతిశరీరమున కగ్నిసంస్కార మొనరించి తాను మనః పూర్వకముగ సహగమన మొనరింపవలెను. ఆస్త్రీ పతివ్రత యైనచో నిశ్చయముగ భర్తతోగలసి యుత్తమలోకమును బొందగలదు. మనస్సునందిచ్ఛలేక సహగమన మొనరించినస్త్రీ పతిని జేరదు, అంతేకాక ఆత్మహత్యా పాతకమునకు గురికాగలదు. శ్రీకృష్ణభక్తిపరాయణులైనదంపతులు మరణానంతరము దివ్యశరీరధారులగుదురు. మహాప్రళయము సంభవించినను వారు నశింపరు.

ఇట్లు భృగుమహర్షి రేణుక నాదేశించి పరశురామునితో నిట్లుపలుకనారంభించెను- "వత్సా ! మహాభాగా! ధైర్యము వహింపుము. అమంగళప్రద మైనశోకమును బరిత్యజించి పితృదేవుని శరీరమున కగ్నిసంస్కార మొనరింపుము. భృగునందనందనా ! నీతండ్రిశరీరమునకు నూతనవస్త్రములను, యజ్ఞోపవీతమును ధరింపజేసి శిరమును దక్షిణదిశయం దుంచుము. నీవు దక్షిణాభిముఖముగ నాసీనుడవై భక్తిపూర్వకముగ నరణిద్వారా అగ్ని నుత్పన్న మొనరించి, హస్తమందు ధరించి పృథ్వియందుగల పుణ్యతీర్థములను, ప్రదేశములను స్మరింపుము. అనంతరము చందనము, అగరు, కస్తూరి, సుగంధ పుష్పములు మున్నగుదివ్యములతో దండ్రిశరీరమును బూజించి వస్త్రముతో సంపూర్ణముగ నాచ్ఛాదిత మొనరించి చితిపై నుంచుము. పిమ్మట సువర్ణ నిర్మిత మగుతీగతో లోచనములను, గర్ణములను నిర్మన్థన మొనరించి యా సువర్ణమును బ్రాహ్మణునకు దానమొనరింపుము. నువ్వులతో నిండిన రాగి పాత్రను, గోవును, సువర్ణమును, వెండిని, దక్షిణసహితముగ బురోహితునకు దాన మొనరించి స్వస్థచిత్తుడవై శోకమును వీడి తండ్రికి అగ్నిసంస్కార మొనరింపుము. ఈ క్రిందిమంత్రమును స్మరించుచు తండ్రిచితికి అగ్నిసంస్కార మొనరింపవలెను. తరువాత నీసోదరు లగ్ని నిడుదురు.

ఓం కృత్వా తు దుష్కృతం కర్మ జానతావాఽప్యజానతా ।
మృత్యుకాలవశం ప్రాప్య నరం పంచత్వమాగతమ్ ॥

ఓం ధర్మాధర్మసమాయుక్తం లోభమోహసమావృతమ్ ।
దహేయం సర్వగాత్రాణి దివ్యాన్ లోకాన్ స గచ్ఛతు ॥

ఇమం మన్త్రం పఠిత్వా తు తాతం కృత్వా ప్రదక్షిణమ్ ।
మన్త్రేణానేన దేహ్యగ్నిం జనకాయ హరిం స్మరన్ ॥
ఓం అస్మత్కులే త్వం జాతోఽసి త్వదీయో జాయతాం పునః ।
అసౌ స్వర్గాయ లోకాయ స్వాహేతి వద సామ్ప్రతమ్ ॥ 32 – 35

"ఓం" నా తండ్రి తెలిసి తెలియక పాపకర్మముల నొనరించి కాలమునకు వశుడై పంచత్వము నందెను. 'ఓం' ధర్మాధర్మయుక్తుడై నలోభమోహ సమావృతుడై నసతనిశరీరమును దహన మొనరిచుచున్నాను. అతనికి దివ్యలోకములు ప్రాప్తించుగాక. ఈమంత్రమును బఠించి తండ్రిశరీరమునకు బ్రదక్షిణ మొనరించి యిట్లుపలుకవలెను. "ఓం'నీవు నాకులమునందే మరల ఉద్భవింపగలవు. నేను నీ కుద్భవింపగలను, నీకు స్వర్గలోకము ప్రాప్తించుగాక, స్వాహా". ఇట్లుపలికి శ్రీహరిని స్మరించుచు దండ్రి కగ్నిసంస్కారము మొనరింపుము". భృగునందనందనా ! నీవు సోదరులతో గలసి తండ్రిశిరమం దగ్నిని బ్రజ్వరిల్ల జేయుము.

ఆసమయమున భృగుమహర్షి యాదేశానుసారముగ పరశురాముడు తనసగోత్రులతో బితృదహనసంస్కారకార్యమును సంపన్న మొనరించెను. రేణుక పరశురాము నుద్దేశించి యిట్లుపల్కెను. "కుమారా ! ఈ భవసాగరమం దెవరితోను విరోధము పూనక జీవించుట యుత్తమము. ఇతరులతోడి విరోధము ఉపద్రవములకు హేతువై నాశనమునకు గారణము కాగలదు. అందువలన క్రూరులైనక్షత్రియులతో విరోధము పూనుట నీ కుచితముకాదు. కాని నీ వొనరించినప్రతిజ్ఞ సంపూర్ణ మొనరింపకతప్పదు. అందువలన నీవు దివ్యమంత్రజ్ఞానియైన భృగుమహర్షిని, బ్రహ్మదేవుని బ్రార్థించి, వారు నిర్దేశించిన విధముగ నీశపథమును సంపన్న మొనరింపుము. సజ్జనులతో సమాలోచన మొనరించి యాచరించినసత్కర్మములు నిశ్చయముగ శుభప్రదములు కాగలవు". పిమ్మట రేణుక శ్రీహరిని స్మరించుచు సహగమన మొనరించెను. ఆసమయమున శంఖచక్రగదాపద్మధరులు, చతుర్భుజులు నగువిష్ణుదూతలు రేణుకను దివ్యరథముపై నారుఢగనొనరించి ప్రథమముననే వైకుంఠము జేరిన జమదగ్నిమహర్షి కడకు జేర్చిరి.

పరశురాముడు పితృకార్యమును సాంగోపాంగముగ సంపూర్ణ మొనరించి బ్రహ్మలోకమునకు జని, తనజనకునిమరణమును, తా నొనరించినఘోరప్రతిజ్ఞను

బ్రహ్మదేవునకువిన్నవించిదుఃఖింపదొడంగెను. పరశురామునిగరుణామయగాథను విని యాశీర్వదించి యాలింగనమొనరించుకొని బ్రహ్మదేవుడు వాని ననుగ్రహించెను. జీవహింసతో గూడిన పరశురామునిప్రతిజ్ఞ విని బ్రహ్మయచ్చెరువందెను. ప్రారబ్ధమువలన సర్వము ఘటింపగలదని తలచి, పరశురామునితో నిట్లుపల్కెను. "వత్సా! అనేకజీవులదేహములను ఖండించి, హింసించునీప్రతిజ్ఞ యత్యంతదుష్కరము. ఎందువలెననగ, ఈసృష్టియంతయు శ్రీహరిసంకల్పము వలన నుత్పన్నమైనదే. ఆపరమేశ్వరునియాజ్ఞను శిరసావహించి నేనెంతో యత్నపూర్వకముగ నీరమణీయసృష్టిని సృజించితిని. కాని నిష్కారణముగ నీ వొనరించిన ఘోరప్రతిజ్ఞవలన నీసృష్టియంతయు నశింపగలదు. కేవలమొకక్షత్రియు డొనరించియపరాధమునకు బృథ్విని యిరువదియొక్కపర్యాయములు నిఃక్షత్రియ మొనరించెద నని ప్రతిజ్ఞబూనితివి. మానవసృష్టిలో శ్రీహరియాజ్ఞననుసరించి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రు లనుచాతుర్వర్ణములను వారివారికర్మానుసారముగ సృష్టించితిని. బ్రాహ్మణుడ వైననీవు క్షత్రియోచిత మైనప్రతిజ్ఞ నొనరించితివి. నీకార్యసిద్ధికొఱకు నీవు కఠినపరిశ్రమ మొనరింపవలెను. వత్సా! నీవు తక్షణమే శివలోకమున కేగి శంకరుని శరణువేడుము. ఈసమయమున భూపాలకు లైన నరేశ్వరులు పెక్కుమంది శివభక్తులై యున్నారు. వారెల్లపుడు శివకవచమును ధరించి శక్తిస్వరూపిణి యైనపార్వతిచే రక్షింపబడుచున్నారు. మహేశ్వరునియనుగ్రహము లేనిదే వారిని సంహరించుట కెవరు సమర్థులుకాగలరు! అందువలన విజయమునకు, శుభమునకు గారణమైనకార్యమును నీ వుపాయముతో యత్నపూర్వకముగ నొనరింపుము. ఎందువలెననగా, ఉపాయపూర్వకముగ నారంభించినకార్యము నిశ్చయముగ సిద్ధింపగలదు. అందువలన నీవు శంకరు నాశ్రయించి శ్రీకృష్ణ మహామంత్రమును, స్తోత్రమును, గవచమును గ్రహింపుము, శ్రీకృష్ణమహా మంత్రకవచానుష్ఠానసిద్ధి పరమదుర్లభము. వైష్ణవతేజయుక్తుడవై నీవు వైష్ణ శైవ శాక్తనరేశ్వరులపై సులభముగ విజయము నందగలవు. జగదీశ్వరుడైన శివుడు నీకు జన్మజన్మములనుండి గురుదేవుడై యున్నాడు. అందువలన మహేశ్వరునినుండి నీవు శ్రీకృష్ణమంత్రమును గ్రహించు టత్యంతశుభప్రదము. సత్కర్మాచరణమువలననే కర్మభోగరూపమున దేవతామంత్రము, సత్పురుషుడైనభర్త, సాధ్వియైనస్త్రీ, హరిభక్తిని బ్రసాదించునాచార్యుడు, పరిపూర్ణ

తము డైనదేవుడు లభింపగలరు. భృగునందనందనా ! నీ వాయాదిదేవునినుండి త్రైలోక్యవిజయ మను శ్రేష్ఠకవచమును గ్రహించి యజేయుడవై యిరువది యొక్క పర్యాయములు పృథ్విని భూపాలరహితమొనరింపుము. శంకరుడు నీకుదివ్యపాశుపతాస్త్రమును ప్రసాదించును.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారాదనారాయణసంవాదమున
పరశురాముడు బ్రహ్మలోకమునకు వెడలుట
యను ఇరువదిమెనిమిదవ అధ్యాయము
సంపూర్ణము



# ఇరువదితొమ్మిదవ అధ్యాయము

## పరశురామకృత శివస్తోత్రము

శ్రీ నారాయణఋషి పలికెను :-

నారదమహర్షీ ! పరశురాముడు బ్రహ్మోపదేశమును శిరసావహించి యాజగద్గురువునకు ప్రణామము లర్పించి ఆయన యాశీర్వచనమును బొంది, సఫలమనోరథుడై శివలోకమునకు ప్రస్థానమొనరించెను. చిన్మయవ్యోమమం దేయాధారములేక శివలోకము శివశక్తిచే నిలచియుండును. ఆలోకము బ్రహ్మలోకమునకు పైననొకలక్షదివ్యయోజనముల దూరములో నున్నది. ఆ లోకమును వర్ణించుట నాకును నత్యంతకష్టమే. శివలోకమునకు దక్షిణభాగమున వైకుంఠము, వామభాగమున గౌరీలోకము, అధోభాగమున ధ్రువలోకము కలవు. ధ్రువలోకము ప్రాకృతికాకాశముననున్న అత్యంతోన్నతధామము. శివలోకమున కూర్ధ్వభాగమున నేబదికోట్ల యోజనములదూరమున సచ్చిదానంద స్వరూపమైన దివ్యగోలోకధామము కలదు. అదియన్నిలోకములకంటె పైననున్నది. మనోవేగయుక్తుడు యోగీంద్రుడు నగుపరశురాముడు హర

లోకముచేరి దానినిగన్నులారదర్శించెను. ఆ మహాద్భుతలోకము ఉపమానోప మేయరహితము. ఆ శివలోకము శ్రేష్ఠులైనయోగీంద్రులతో, సిద్ధులతో, విద్యావిశారదులతో కోట్లకొలది కల్పములవఱకు దప మాచరించి, పవిత్ర శరీరమును ధరించిన పుణ్యాత్ములతోసుసేవితము, మనోరథములను పూర్ణ మొనరించు కల్పవృక్షసమూహములతో బరివేష్టితము, అసంఖ్యాకములైన కామధేనుసమూహములతో సుశోభితము, పారిజాతవృక్షవనములతో శోభితము, వేలకొలది దివ్యపుష్పోద్యానములతో యుక్తము, ఉత్కృష్టశోభతో సంప న్నము, చిన్మయమణిమాణిక్యనిర్మిత భవనములతో విరాజితము నై యున్నది.

ఆ దివ్యలోకమధ్యమున గగనచుంబితమహాహర్మ్యము కలదు. ఆ భవ నమునకు పదునాఱుద్వారములు కలవు. శివమందిరమును అస్త్రశస్త్రధారులైన ప్రమథగణములు రక్షించుచున్నవి. ద్వారపాలకుల యనుజ్ఞ గైకొని శ్రీహరిని స్మరించుచు పరశురాము డాభవనమున బ్రవిష్టుడయ్యెను. పదునాఱు ద్వార ములను దాటి పరశురాముడు శివసభాభవనమును జేరెను. ఆ దివ్యసభ అసంఖ్యాకసిద్ధగణములచే వ్యాప్తము, మహర్షులచే సేవితము, పారిజాతపుష్ప గంధయుక్తవాయువుద్వారమున సువాసితమునై యుండెను. పరశురాము డాసభామధ్యమున ననంతకోటిసూర్యప్రభాభాసమాను డైనశంకరుని దర్శిం చెను. మహాదేవుడు రత్నమయభూషణవిభూషితుడు. ఆయన శిరమున జంద్రుడు శరీరమున పులిచర్మమును హస్తములయందు త్రిశూలపట్టిసములు ప్రకాశించు చుండెను. శరీరమున విభూతిని, సర్పయజ్ఞోపవీతమును ధరించిన భూతనాథుడు కళ్యాణస్వరూపుడు, కళ్యాణప్రదాత, కళ్యాణకారణుడు, కళ్యాణనిలయుడు, ఆత్మారాముడు, పూర్ణకాముడు, అసంఖ్యప్రచండసూర్యసమాన తేజోసంప న్నుడు. ఆ గిరిజాపతిముఖారవింద మత్యంతప్రసన్నమై చిరునవ్వులు చిందులు త్రొక్కగా భక్తుల ననుగ్రహించుటకు సిద్ధముగనుండెను. ఆ సనాతనజ్యోతి స్వరూపము భక్తుల ననుగ్రహించుటకు మూర్తీభవించిన సచ్చిదానంద విగ్రహమువలెనుండెను. జటలను ధరించి శుద్ధస్ఫటికవర్ణయుక్తుడై, పంచ ముఖుడై, త్రినేత్రధారియై రత్నసింహాసనము నధిష్ఠించి శిష్యులకు దత్త్వ ముద్రద్వారా పరబ్రహ్మోపదేశ మొనరించుచుండెను. యోగీంద్రు లట్టిమహా దేవుని స్తుతించుచుండిరి, సిద్ధులు సేవయందు నియుక్తులై యుండిరి. హరుడు జరామరణశోకహారి, గుణాతీతుడు, స్వేచ్ఛామయుడు, పరిపూర్ణపరబ్రహ్మజ్ఞాన

నిమగ్నుడు. ఆ పరబ్రహ్మము జ్యోతిస్స్వరూపము, సర్వమునకాది, ప్రకృతి కతీతము పరమానందమయము. శ్రీకృష్ణధ్యానమొనరించుచున్న శివునిశరీరము పులకరించుచుండెను. నేత్రములయం దానందబాష్పములునిండియున్నవి, మహాదేవు డుచ్చైఃస్వరముతో శ్రీకృష్ణునిదివ్యగుణసంకీర్తన మొనరించుచుండెను. శంకరుని భూతగణములు, రుద్రగణములు, క్షేత్రపాలకులు పరివేష్టించి యుండిరి. శివునివామభాగమందు కార్తికేయుడు, దక్షిణభాగమందు గణేశ్వరుడు, ఎదురుగ నందీశ్వరుడు, మహాకాలుడు, వీరభద్రుడు, వామాంకమందర్ధాంగియైన గిరిరాజనందిని ఆసీనులై యుండిరి. వారందఱకు శిరమును వంచి వినీతభావుడై, భక్తియుక్తుడై నమస్కరించెను. పరమానందస్వరూపుడైన శివుని దర్శించి పరశురాముడత్యంతప్రసన్నుడై గద్గదవాణితో ఆయన నిట్లు స్తుతింపదొడంగెను.

ప ర శు రా మ ఉ వా చ :

ఈశ త్వాం స్తోతుమిచ్ఛామి సర్వథా స్తోతుమక్షమమ్ ।
అక్షరాక్షరబీజం చ కిం వా స్తౌమి నిరీహకమ్ ॥

న యోజనాం కర్తుమీశో దేవేశం స్తౌమి మూఢధీః ।
వేదా న శక్తా యం స్తోతుం కస్త్వాం స్తోతుమిహేశ్వరః ॥

బుద్ధేర్వాఙ్మనసోః పారం సారాత్సారం పరాత్పరమ్ ।
జ్ఞానబుద్ధేరసాధ్యం చ సిద్ధం సిద్ధైర్నిషేవితమ్ ॥

యమాకాశమివాద్యన్తమధ్యహీనం తథా వ్యయమ్ ।
విశ్వతన్త్రమతన్త్రం చ స్వతన్త్రం తన్త్రబీజకమ్ ॥

ధ్యానాసాధ్యం దురారాధ్యమతిసాధ్యం కృపానిధిమ్ ।
త్రాహి మాం కరుణాసిన్ధో దీనబన్ధోఽతిదీనకమ్ ॥

అద్య మే సఫలం జన్మ జీవితం చ సుజీవితమ్ ।
స్వప్నేఽప్యదృష్టం భక్తైశ్చాధునా పశ్యామి చక్షుషా ॥

శక్రాదయః సురగణాః కలయా యస్య సమ్భవాః ।
చరాచరాః కలాంశేన తం నమామి మహేశ్వరమ్ ॥

యం భాస్కరస్వరూపం చ శశిరూపం హుతాశనమ్ ।
జలరూపం వాయురూపం తం నమామి మహేశ్వరమ్ ॥

స్త్రీరూపం క్లీబరూపం చ పుంరూపం చ బిభర్తి యః।
సర్వాధారం సర్వరూపం తం నమామి మహేశ్వరమ్॥

దేవ్యా కఠోరతపసా యో లబ్ధో గిరికన్యయా।
దుర్లభ స్తపసాం యో హి తం నమామి మహేశ్వరమ్॥

సర్వేషాం కల్పవృక్షం చ వాంఛాధికఫలప్రదమ్।
ఆశుతోషం భక్తబన్ధుం తం నమామి మహేశ్వరమ్॥

అనన్తవిశ్వసృష్టీనాం సంహర్తారం భయంకరమ్।
క్షణేన లీలామాత్రేణ తం నమామి మహేశ్వరమ్॥

యః కాలః కాలకాలశ్చ కాలబీజం చ కాలజః।
అజః ప్రజశ్చ యః సర్వ స్తం నమామి మహేశ్వరమ్॥

ఇత్యేవముక్త్వా స భృగుః పపాత చరణామ్బుజే।
ఆశిషం చ దదౌ తస్మై సుప్రసన్నో బభూవ సః॥

జమదగ్న్యా కృతం స్తోత్రం యం పఠేద్భక్తిసంయుతః।
సర్వపాపవినిర్ముక్తః శివలోకం స గచ్ఛతి॥ (43-57)

ఈశ్వరా ! నేను నిన్ను స్తుతింపవలె నని యభిలషించుచున్నాను. కాని నీ స్తవన మొనరించుటలో నేను సర్వదా అసమర్థుడనే. నీ వక్షరుడవు, అక్షరమునకే కారణుడవు, ఇచ్ఛారహితుడవు, అట్టి నిన్ను నే నేమని స్తుతింపగలను ? నేను మందబుద్ధిని. నాకు శబ్దములను జోడించు జ్ఞానములేదు. అయినను దేవేశ్వరుడ వైననిన్ను స్తుతింప యత్నించుచున్నాను. ఏ దేవాది దేవుని స్తుతించుశక్తి వేదములకుగూడ లేదో అట్టి ని న్నెవరు స్తుతింపగలరు ? మనస్సునకు, బుద్ధికి, వాణికి నగోచరమైనవాడా ! సారముకంటె సారమైనవాడా! పరాత్పరా! జ్ఞానమునకు బుద్ధికి నసాధ్యుడవైనవాడా! సిద్ధుడా ! సిద్ధులద్వారా సేవింపబడువాడా! ఆకాశమువలె నాదిమధ్యాంతరహితుడవైనవాడా! అవినాశీ! విశ్వమును శాసించువాడా! తంత్రరహితా! స్వతంత్రా! తంత్రకారణా! ధ్యానమున కసాధ్యమైనవాడా! దురారాధ్యుడా! సాధన మొనరించినచో సుగమముగ లభించువాడా ! దయాసాగరా ! దీనబాంధవా ! నేనత్యంతము దీనుడను, కరుణాసింధూ ! నన్ను రక్షింపుము. ఈ దినమున నాజన్మము సఫలమైనది, నాజీవనము ధన్యమైనది; ఎందువలెననగ, భక్తజనులు స్వప్నమునందుగూడ గాంచలేనివాని నేను ప్రత్యక్షముగ దర్శించుచున్నాను.

ఎవనికళనుండి యింద్రాది దేవగణములు, కళాంశనుండి చరాచరప్రాణులు నుద్భవించినవో అట్టి మహేశ్వరుడవైన నీకు నమస్కరించెదను. సూర్య చంద్రాగ్ని జల వాయురూపములయందు విరాజమానుడవై యున్న దేవా! మహేశ్వరా! నేను నీ కభివాదన మొనరించెదను. స్త్రీరూపమును నపుంసక రూపమును, పురుషరూపమును ధరించి జగత్తును విస్తరించుచున్నవాడు, నాధారుడు, సర్వరూపుడు నగునామహేశ్వరునకు నమస్కరించెదను. హిమ వంతుని బుత్రిక యగుపార్వతిదేవి కఠోరతప మాచరించి యెవనిని బొందెనో, దీర్ఘతపముచేగూడ నెవనిని బొందుట దుర్లభమో, ఆ మహేశ్వరునకు నేను నమస్కరించెదను. సర్వులకు కల్పవృక్షమువంటివాడు, అభిలషించినదానికంటె నధికఫలము ప్రసాదించువాడు, శీఘ్రముగ బ్రసన్నమగువాడు, భక్తులకు బంధువు నగునామహేశ్వరునకు నేను నమస్కరించెదను. లీలాపూర్వ కముగ క్షణములో ననంతవిశ్వమును సృష్టించి సంహరింపగలవాడు, భయంకర రూపధారి యైనమహేశ్వరునకు ప్రణామము లర్పించెదను. కాలరూపుడు, కాలమునకు గాలము, కాలమునకు గారణుడు, కాలజుడు, అజన్ముడు, మాటి మాటికి నవతరించువాడు నగు నామహేశ్వరునకు నమస్కరించెదను.

ఇట్లు స్తుతించి భృగువంశోద్భవు డైనపరశురాముడు శంకరుని చరణముల పైబడెను. శివు డత్యంతప్రసన్నుడై పరశురాము నాశీర్వదించెను. నారదా! భక్తిభావసహితముగ నీపరశురామకృతస్తోత్రముచే శివుని స్తుతించువారు సర్వపాపములనుండి ముక్తులై శివలోకమును బొందెదరు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారాదనారాయణసంవాద
మున బరశురామకృత శివస్తోత్రే మను
ఇరువదితొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము



# ముప్పదియవ అధ్యాయము

## పరశురామునకు శివుడు శస్త్రాస్త్రము లొసంగుట

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

తదనంతరము మహాదేవుడు ప్రశ్నింపగా పరశురాము డిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "దయానిధీ! నేను భృగువంశోద్భవు డైన జమదగ్నికి బుత్రుడనైన పరశురాముడను, నీదాసుడను, నీశరణాగతుడను, నన్ను రక్షింపుము. నాపితృ దేవుని ఘోరకర్ము డైన క్షత్రియుడు సంహరించెను. అందువలన బృథ్విని ఇరువదియొక్క పర్యాయములు క్షత్రియశూన్య మొనరించెదనని మత్పితృఘాతకు డైన కార్తవీర్యుని వధించెద నని ప్రతిజ్ఞ బూనితిని. మహాదేవా! నే నొనరించిన భీషణప్రతిజ్ఞను బరిపూర్ణ మొనరింపుము."

జీవహింసతో గూడిన బరశురాముని శపథమును విని పార్వతి, భద్రకాళి కోపించి పరశురాముని నిష్ఠురముగ బలికిరి. భృగునందనందను డైన పరశు రాముడు వారి క్రోధవచనములను విని నిరాశ చెంది దుఃఖించుచు నాత్మసమర్ప ణమునకు సంసిద్ధుడయ్యెను. దయాసాగరుడు, భక్తానుగ్రహాకారకుడు నగుమహా దేవుడు రోదించు బ్రాహ్మణబాలకుని గాంచి స్నేహార్ద్రచిత్తుడై వినయవచన ములతో గౌరీకాళికల క్రోధమును శాంతింపజేసెను. అనంతరము పరశురాము నిట్లనుగ్రహించెను.

మ హా దే వు డు ప లి కె ను :

వత్సా! ఈ దినమునుండి నీవు నాకు బుత్రసమానుడవు. అందువలన నేను నీకు త్రిలోకములలోను దుర్లభము, అత్యంతగుహ్యము నగుమహా మంత్రము నుపదేశించెదను. అట్లే పరమాద్భుతకవచమును బ్రసాదించెను. ఆ కవచమును ధరించి నీవు నాకృపకు బాత్రుడవై యిరువదియొక్క పర్యాయ ములు భూపాలశూన్య మొనరింపగలవు. జగత్తున నీకీర్తిప్రభ ప్రకాశింపగలదు. ఇందు లేశమాత్ర మైనను సంశయములేదు.

నారదా ! శంకరు డిట్లుపలికి పరశురామునకు బరమదుర్లభ మగుమహా మంత్రమును, త్రైలోక్యవిజయ మనుపరమాద్భుత కవచమును బ్రసాదించెను. తరువాత స్తోత్రమును, పూజావిధిని, పురశ్చరణపూర్వకమైన మంత్రసిద్ధికొఱ కనుష్ఠానమును, నియమక్రమములను, సిద్ధిస్థానమును, కాలసంఖ్యను నుపదేశించెను. ఆసమయముననే వేదవేదాంగజ్ఞానమును బ్రసాదించెను. పిమ్మట భవుడుపరశురామునకు నాగపాశము, పాశుపతాస్త్రము, బ్రహ్మాస్త్రము, ఆగ్నేయాస్త్రము,నారాయణాస్త్రము,వాయవ్యవారుణాస్త్రములు, గాంధర్వాస్త్రము, గారుడాస్త్రము, జృమ్భకాస్త్రము, గద, శక్తి, పరశువు, త్రిశూలము మున్నగు వివిధములైన అస్త్రశస్త్రమంత్రములను, అస్త్రముల సంధానోపసంహారములను, అక్షయతూణీరమును, ధనువును, ఆత్మరక్షోపాయములను, సంగ్రామవిజయములను సిద్ధింపజేసికొనుక్రమములను, అనేకప్రకారములగు మాయాయుద్ధములను, మంత్రపూర్వక హుంకారములను, స్వసైన్యమును రక్షించుచు శత్రుసైన్యమును సంహరించు నుపాయమును, యుద్ధసంకటసమయమం దాచరించు నుపాయములను, సంసారమును మోహింపజేయునట్టిదియు, జరామరణములను నివారించు మహావిద్యాదులను బ్రసాదించెను. పరశురాముడు చిరకాలము శివలోకమందు నివసించి మహేశ్వరున కనుంగుశిష్యుడై సర్వవిద్యల నభ్యసించెను. పవిత్రతీర్థమందు మంత్రసిద్ధిపొంది, తదనంతరము శివాదుల కనేకప్రణామము లర్పించి పరిపూర్ణ మనస్కుడై తనయాశ్రమమునకు దిరిగి వచ్చెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణసంవాదమున
శివుడు పరశురామునకు శస్త్రాస్త్రము లొసంగుట
యను ముప్పదియవ అధ్యాయము
సంపూర్ణము.



నారదా! శంకరు డిట్లుపలికి పరశురామునకు బరమదుర్లభ మగుమహా మంత్రమును, త్రైలోక్యవిజయ మనుపరమాద్భుత కవచమును బ్రసాదించెను. తరువాత స్తోత్రమును, పూజావిధిని, పురశ్చరణపూర్వకమైన మంత్రసిద్ధికొఱ కనుష్ఠానమును, నియమక్రమములను, సిద్ధిస్థానమును, కాలసంఖ్యను నుపదేశించెను. ఆసమయముననే వేదవేదాంగజ్ఞానమును బ్రసాదించెను. పిమ్మట భవుడుపరశురామునకు నాగపాశము, పాశుపతాస్త్రము, బ్రహ్మాస్త్రము, ఆగ్నేయాస్త్రము,నారాయణాస్త్రము,వాయవ్యవారుణాస్త్రములు, గాంధర్వాస్త్రము, గారుడాస్త్రము, జృమ్భకాస్త్రము, గద, శక్తి, పరశువు, త్రిశూలము మున్నగు విధములైన అస్త్రశస్త్రమంత్రములను, అస్త్రముల సంధానోపసంహారములను, అక్షయతూణీరమును, ధనువును, ఆత్మరక్షోపాయములను, సంగ్రామవిజయములను సిద్ధింపజేసికొనుక్రమములను, అనేకప్రకారములగు మాయాయుద్ధములను, మంత్రపూర్వక హుంకారములను, స్వసైన్యమును రక్షించుచు శత్రుసైన్యమును సంహరించు నుపాయమును, యుద్ధసంకటసమయమం దాచరించు నుపాయములను, సంసారమును మోహింపజేయునట్టిదియు, జరామరణములను నివారించు మహావిద్యాదులను బ్రసాదించెను. పరశురాముడు చిరకాలము శివలోకమందు నివసించి మహేశ్వరున కనుంగుశిష్యుడై సర్వవిద్యల నభ్యసించెను. పవిత్రతీర్థమందు మంత్రసిద్ధిపొంది, తదనంతరము శివాదుల కనేకప్రణామము లర్పించి పరిపూర్ణ మనస్కుడై తనయాశ్రమమునకు దిరిగి వచ్చెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణసంవాదమున
శివుడు పరశురామునకు శస్త్రాస్త్రము లొసంగుట
యను ముప్పదియవ అధ్యాయము
సంపూర్ణము.



శ్రీకృష్ణేన పురా దత్తం గోలోకే రాధికాశ్రమే ।
రాసమణ్డలమధ్యే చ మహ్యం బృన్దావనే వనే ॥

అతిగుహ్యతరం తత్త్వం సర్వమన్త్రౌఘవిగ్రహమ్ ।
పుణ్యాత్ పుణ్యతరం చైవ పరం స్నేహాత్ వదామి తే ॥

య ద్ధృత్వా పఠనాద్దేవీ మూలప్రకృతిరీశ్వరీ ।
శుమ్భం నిశుమ్భం మహిషం రక్తబీజం జఘాన హ ॥

య ద్ధృత్వాహం చ జగతాం సంహర్తా సర్వతత్త్వవిత్ ।
అవధ్యం త్రిపురం పూర్వం దురన్తమవలీలయా ॥

య ద్ధృత్వా పఠనాద్ బ్రహ్మా ససృజే సృష్టిముత్తమామ్ ।
య ద్ధృత్వా భగవాన్ శేషో విధత్తే విశ్వమేవ చ ॥

య ద్ధృత్వా కూర్మరాజశ్చ శేషం ధత్తేఽవలీలయా ।
య ద్ధృత్వా భగవాన్ వాయుర్విశ్వాధారో విభుః స్వయమ్ ॥

య ద్ధృత్వా వరుణః సిద్ధః కుబేరశ్చ ధనేశ్వరః ।
య ద్ధృత్వా పఠనాదిన్ద్రో దేవానామధిపః స్వయమ్ ॥

య ద్ధృత్వా భాతి భువనే తేజోరాశిః స్వయం రవిః ।
య ద్ధృత్వా పఠనాచ్చన్ద్రో మహాబలపరాక్రమః ॥

అగస్త్యః సాగరాన్ సప్త య ద్ధృత్వా పఠనాత్ పపౌ ।
చకార తేజసా జీర్ణం దైత్యం వాతాపి సంజ్ఞకమ్ ॥

య ద్ధృత్వా పఠనాద్దేవీ సర్వాధారా వసున్ధరా ।
య ద్ధృత్వా పఠనాత్ పూతా గఙ్గా భువనపావనీ ॥

య ద్ధృత్వా జగతాం సాక్షీ ధర్మో ధర్మభృతాం వరః ।
సర్వవిద్యాధిదేవీ సా యచ్చ ధృత్వా సరస్వతీ ॥

య ద్ధృత్వా జగతాం లక్ష్మీరన్నదాత్రీ పరాత్పరా ।
య ద్ధృత్వా పఠనా ద్వేదాన్ సావిత్రీ ప్రసుషావ చ ॥

వేదాశ్చ ధర్మవక్తారో యద్ధృత్వా పఠనాద్భృగో ।
య ద్ధృత్వా పఠనాచ్ఛుద్ధస్తేజస్వీ హవ్యవాహనః ॥

సనత్కుమారో భగవాన్ యద్ధృత్వా జ్ఞానినాం వరః ।
దాతవ్యం కృష్ణభక్తాయ సాధవే చ మహాత్మనే ॥

శఠాయ పరశిష్యాయ దత్త్వా మృత్యుమవాప్నుయాత్ ।
త్రైలోక్యవిజయస్యాస్య కవచస్య ప్రజాపతిః

ఋషిశ్ఛన్దశ్చ గాయత్రీ దేవో రాసేశ్వరః స్వయమ్ ।
త్రైలోక్యవిజయప్రాప్తౌ వినియోగః ప్రకీర్తితః ॥

పరాత్పరం చ కవచం త్రిషు లోకేషు దుర్లభమ్ ।
ప్రణవో మే శిరః పాతు శ్రీకృష్ణాయ నమః సదా ॥

సదా పాయాత్కపాలం కృష్ణాయ స్వాహేతి పంచాక్షరః ।
కృష్ణేతి పాతు నేత్రే చ కృష్ణ స్వాహేతి తారకమ్ ॥

హరయే నమ ఇత్యేవం భ్రూలతాం పాతు మే సదా ।
ఓం గోవిన్దాయ స్వాహేతి నాసికాం పాతు సంతతమ్॥

గోపాలాయ నమో గణ్డౌ పాతు మే సర్వతః సదా ।
ఓం నమో గోపాఙ్గనేశాయ కర్ణౌ పాతు సదా మమ ॥

ఓం కృష్ణాయ నమః శశ్వత్ పాతు మేఽధరయుగ్మకమ్ ।
ఓం గోవిన్దాయ స్వాహేతి దన్తావలిం మే సదాఽవతు ॥

ఓం కృష్ణాయ దన్తరన్ధ్రం దన్తోర్ధ్వం క్లీం సదాఽవతు ।
ఓం కృష్ణాయ స్వాహేతి జిహ్వికాం పాతు మే సదా ॥

రాసేశ్వరాయ స్వాహేతి తాలుకం పాతు మే సదా ।
రాధికేశాయ స్వాహేతి కణ్ఠం పాతు సదా మమ ॥

నమో గోపాఙ్గనేశాయ వక్షః పాతు సదా మమ ।
ఓం గోపేశాయ స్వాహేతి స్కన్ధం పాతు సదా మమ ॥

నమః కిశోరవేశాయ స్వాహా పృష్ఠం సదావతు ।
ఉదరం పాతు మే నిత్యం ముకున్దాయ నమః సదా ॥

ఓం హ్రీం క్లీం కృష్ణాయస్వాహేతి కరౌ పాదౌ సదా మమ।
ఓం విష్ణవే నమో బాహుయుగ్మం పాతు సదా మమ ॥

ఓం హ్రీం భగవతే స్వాహా నఖరం పాతు మే సదా।
ఓం నమో నారాయణాయేతి నఖరన్ధ్రం సదాఽవతు ॥

ఓం హ్రీం హ్రీం పద్మనాభాయ నాభిం పాతు సదా మమ।
ఓం సర్వేశాయ స్వాహేతి కఙ్కాలం పాతు మే సదా॥

ఓం గోపీరమణాయ స్వాహా నితమ్బం పాతు మే సదా।
ఓం గోపీరమణనాథాయ పాదౌ పాతు సదా మమ ॥

ఓం హ్రీం శ్రీం రసికేశాయ స్వాహా సర్వం సదాఽవతు ।
ఓం కేశవాయ స్వాహేతి మమ కేశాన్ సదాఽవతు ॥

నమః కృష్ణాయ స్వాహేతి బ్రహ్మరన్ధ్రం సదాఽవతు ।
ఓం మాధవాయ స్వాహేతి లోమాని మే సదాఽవతు ।
ఓం హ్రీం శ్రీం రసికేశాయ స్వాహా సర్వం సదాఽవతు ॥

పరిపూర్ణతమః కృష్ణః ప్రాచ్యాం మాం సర్వదాఽవతు ।
స్వయం గోలోకనాథో మామాగ్నేయ్యాం దిశి రక్షతు ॥

పూర్ణబ్రహ్మస్వరూపశ్చ దక్షిణే మాం సదాఽవతు ।
నైరృత్యాం పాతు మాం కృష్ణః పశ్చిమే పాతు మాం హరిః ॥

గోవిన్దః పాతు మాం శశ్వద్ వాయవ్యాం దిశి నిత్యశః ।
ఉత్తరే మాం సదా పాతు రసికానాం శిరోమణిః ॥

ఐశాన్యాం మాం సదా పాతు బృన్దావనవిహారకృత్ ।
బృన్దావనీప్రాణనాథః పాతు మామూర్ధ్వదేశతః ॥

సదైవ మాధవః పాతు బలిహారీ మహాబలః ।
జలే స్థలే చాన్తరిక్షే నృసింహః పాతు మాం సదా ॥

స్వప్నే జాగరణే శశ్వత్ పాతు మాం మాధవః సదా ।
సర్వాన్తరాత్మా నిర్లిప్తో రక్ష మాం సర్వతో విభుః ॥

ఇతి తే కథితం వత్స సర్వమన్త్రౌఘవిగ్రహమ్ ।
త్రైలోక్యవిజయం నామ కవచం పరమాద్భుతమ్ ॥

మయా శ్రుతం కృష్ణవక్త్రాత్ ప్రవక్తవ్యం న కస్యచిత్ ।
గురుమభ్యర్చ్య విధివత్ కవచం ధారయేత్తు యః ॥

కణ్ఠే వా దక్షిణే బాహౌ సోఽపి విష్ణుర్న సంశయః
స చ భక్తో వసేద్యత్ర లక్ష్మీర్వాణీ వసేత్తతః ॥

యది స్యాత్ సిద్ధకవచో జీవన్ముక్తో భవేత్తు సః ।
నిశ్చితం కోటివర్షాణాం పూజాయాః ఫలమాప్నుయాత్ ॥

రాజసూయసహస్రాణి వాజపేయశతాని చ ।
అశ్వమేధయుతాన్యేవ నరమేధాయుతాని చ ॥

మహాదానాని యాన్యేవ ప్రాదక్షిణ్యం భువస్తథా ।
త్రైలోక్యవిజయస్యాస్య కలాం నార్హన్తి షోడశీమ్ ॥

వ్రతోపవాసనియమం స్వాధ్యాయాధ్యయనం తపః
స్నానం చ సర్వతీర్థేషు నాస్యార్హన్తి కలామపి ॥

సిద్ధిత్వమమరత్వం చ దాస్యత్వం శ్రీహరేరపి ।
యది స్యాత్సిద్ధకవచః సర్వం ప్రాప్నోతి నిశ్చితమ్ ॥

స భవేత్సిద్ధకవచో దశలక్షం జపేత్తు యః ।
యో భవేత్సిద్ధకవచః సర్వజ్ఞః స భవేద్ధ్రువమ్ ॥

ఇదం కవచమజ్ఞాత్వా భజేత్కృష్ణం సుమన్దధీః ।
కోటికల్పప్రజప్తోఽపి న మన్త్రః సిద్ధిదాయకః ॥

గృహీత్వా కవచం వత్స మహీం నిఃక్షత్రియాం కురు ।
త్రిఃసప్తకృత్వో నిశ్శఙ్కః సదానన్దోఽవలీలయా ॥

రాజ్యం దేయం శిరో దేయం ప్రాణా దేయాశ్చ పుత్రక ।
ఏవం భూతం చ కవచం న దేయం ప్రాణసంకటే ॥ 7-57

వత్సా ! భృగువంశసముద్భవా ! మహాభాగా ! నీయందు నాకుగల యనన్యప్రేమకారణమున నీవు నాకు నాపుత్రునికంటెను నధికప్రియుడవు. కుమారా ! రమ్ము దివ్యకవచమును గ్రహింపుము. రామా ! బ్రహ్మాండము లందు బరమాద్భుతము, విజయప్రదము నగు శ్రీకృష్ణపరమాత్మయొక్క యా త్రైలోక్యవిజయ మనుకవచము నుపదేశించెద నవధరింపుము. పూర్వ కాలమందు శ్రీకృష్ణపరమాత్మ గోలోకమం దున్న బృన్దావనములో, రాధికా శ్రమములో, రాసమండల మధ్యమున నీదివ్యకవచమును నాకు బ్రసాదించెను. ఈకవచ మత్యంతగోపనీయము, సర్వమంత్రసముదాయవిగ్రహాస్వరూపము, పరమోత్కృష్టపుణ్యప్రదము. ఈకవచమును నేను స్నేహవశమున నీ కుప దేశించుచున్నాను. ఈకవచమును బఠించి, ధరించి మూలప్రకృతి ఆద్యా శక్తి యగుభగవతి శుమ్భ నిశుమ్భ మహిష రక్తబీజాదిరాక్షసులను సంహరిం చెను. ఈయద్భుతకవచమును ధరించియే నేను సర్వలోకసంహారకారినై సంపూర్ణతత్త్వములను దెలిసికొనగల్గితిని. దీనిప్రభావమువలననే త్రిపురాసురు లను వధింపగల్గితిని. దీనిని బఠించి, ధరించి బ్రహ్మ యత్తమసృష్టి నొనర్ప గల్గెను. దీనిని ధరించి యాదిశేషుడు సర్వవిశ్వమును ధరింపగల్గెను. ఆది కూర్మ మాదిశేషువునే లీలాపూర్వకముగ భరింపగల్గెను. సర్వవ్యాపకు డైన వాయుదేవుడు విశ్వాధారుడయ్యెను. ధరించి వరుణుడు సిద్ధుడయ్యెను,

కుబేరుడు ధనేశ్వరుడయ్యెను. ఈకవచమును బఠించి, ధరించి యింద్రుడు దేవేంద్రుడయ్యెను. సూర్యభగవానుడు స్వయం తేజోరాశియై భువనములందు బ్రకాశించుచుండెను. చంద్రుడు మహాబలపరాక్రమసంపన్నుడయ్యెను. అగస్త్య మహర్షి సప్తసముద్రములను ద్రాగగల్గెను. ఆయన వాతాపి యనుదైత్యుని జీర్ణముచేసికొనగల్గెను. ఈకవచమునే పఠించి, ధరించి వసుంధర సర్వమునకు నాధారమయ్యెను. గంగ స్వయముగ బవిత్రమై భువనములను బవిత్రమొన రింపగల్గెను. ఈకవచమును ధరించి ధర్మాత్ములయందు శ్రేష్ఠుడైన ధర్మదేవత లోకములకు సాక్షియయ్యెను. ఈకవచమును ధరించి సరస్వతీదేవి సర్వవిద్య లకు నధిష్ఠాత్రియయ్యెను. ఈకవచమును ధరించి పరాత్పర యగులక్ష్మిదేవి లోకములకు వివిధసస్యములను, సౌభాగ్యములను బ్రసాదింపగల్గెను. ఈకవచ మును ధరించియే సావిత్రి వేదమాతయయ్యెను. భృగునందనా! ఈకవచమును ధరించి, పఠించి వేదములు ధర్మమును జెప్పగలిగినవి. ఈకవచమును బఠించి ధరించి యగ్నిపరిశుద్ధుడై యత్యంత తేజస్వియయ్యెను. ఈకవచమును ధరించి సనత్కుమారుడు జ్ఞానులలో సర్వశ్రేష్ఠుడయ్యెను. మహాత్ములు, సాధువులు, శ్రీకృష్ణభక్తులు నగువారికే యీకవచము నుపదేశింపవలెను. శఠులకుగాని, మూఢులకుగాని యుపదేశించినవాడు మృత్యువుపాలగును.

ఈత్రైలోక్యవిజయదివ్యకవచమునకు బ్రజాపతియే ఋషి, గాయత్రియే ఛందము, స్వయముగ రాసేశ్వరుడే దైవము. త్రైలోక్యవిజయప్రాప్తి కొఱకీపరమాద్భుతకవచ ముపయోగింపవలెను. ఈపరాత్పరకవచము త్రిలోక ములయం దత్యంతదుర్లభము. 'ఓం శ్రీకృష్ణాయ నమః' ఎల్లడు నాశిరమును, 'కృష్ణాయస్వాహా' ఈపంచాక్షరమహామంత్రము నాకపాలమును' 'కృష్ణ' యను నదినానేత్రములను; 'కృష్ణాయస్వాహా' నాతారకములను (కనిగ్రుడ్లను) 'హరయే నమః' భృకుటిని! 'ఓంగోవిన్దాయస్వాహా' నానాసికను, 'గోపాలాయ నమః' నాగండస్థలమును, 'ఓంగోపాంగనేశాయ నమః' నాకర్ణములను, 'ఓంకృష్ణాయ నమః' నిరంతరము నాయధరములను. 'ఓంగోవిందాయ స్వాహా' నాదంతములను, 'ఓంకృష్ణాయనమః' నాదంతరంధ్రములను, 'క్లీం' నాదంత ములయూర్ధ్వభాగమును, 'ఓంశ్రీకృష్ణాయ స్వాహా' నాజిహ్వను, 'రాసేశ్వ రాయ స్వాహా' నాతాలుకములను, 'రాధికేశాయ స్వాహా' నాకంఠమును, 'గోపాఙ్గనేశాయ నమః' నావక్షస్థలమును, 'ఓంగోపేశాయస్వాహా' నాభుజము

లను 'నమః కిశోరవేశాయ స్వాహా' నాపృష్ఠభాగమును, 'ముకుందాయ నమః' నాయుధరమును, 'ఓం హ్రీం క్లీం కృష్ణాయ స్వాహా' నాహస్తములను, పాదములను, 'ఓంవిష్ణవే నమః' నా రెండుబాహువులను, 'ఓంహ్రీం భగవతే స్వాహా' నానఖములను, 'ఓం నమోనారాయణాయ' నానఖరంధ్రములను 'ఓం హ్రీం, హ్రీం పద్మనాభాయ' నానాభిని, ఓం సర్వేశాయ స్వాహా' నాకంకాలమును 'ఓంగోపీరమణాయస్వాహా' నానితమ్బములను 'ఓంగోపీరణనాథాయ' నాపాదములను, 'ఓంహ్రీంశ్రీం రసికేశాయస్వాహా' నాసర్వస్వమును, 'ఓం కేశవాయ స్వాహా' నా కేశములను, 'నమఃకృష్ణాయ స్వాహా' నాబ్రహ్మరంధ్రమును 'ఓంమాధవాయస్వాహా' నారోమములను, 'ఓంహ్రీంశ్రీం రసికేశాయ స్వాహా' నాసర్వస్వమును నెల్లపుడు రక్షించుగాక! పరిపూర్ణతముడైన శ్రీకృష్ణుడు పూర్వదిశయందు, స్వయముగ గోలోకనాథు డగ్నికోణమందు, పూర్ణబ్రహ్మస్వరూపుడు దక్షిణదిశయందు, శ్రీకృష్ణుడు నైరృతీకోణమందు, శ్రీహరి పశ్చిమదిశయందు, గోవిందుడు వాయవ్యకోణమందు నిత్యము నన్నురక్షించుగాక! రసికశిరోమణి ఉత్తరదిశయందు, బృందావనవిహారి ఈశాన కోణమందు నన్ను రక్షించుగాక! బృందావనప్రాణనాథు డూర్ధ్వభాగమందు నన్ను రక్షించుగాక! మహాబలి, బలిహారి యగుమాధవుడు అన్నివేళలయందు నన్ను రక్షించుగాక! జలమందు, స్థలమందు, అంతరిక్షమందు నృసింహుడు సదా నన్ను రక్షించుగాక! స్వప్నమందు, జాగ్రదావస్థయందు మాధవుడు నన్ను పాలించుగాక! సర్వులకు నంతరాత్మయు, నిర్లిప్తుడు, సర్వవ్యాపకుడు నగునాభగవంతుడే యన్నివైపులనుండి నన్నెల్లపుడు రక్షించుగాక!

వత్సా! పరమాద్భుతము, దుర్లభము, సర్వమంత్ర సముదాయములకు మూర్తిస్వరూపము, త్రైలోక్యవిజయము నగునీదివ్యకవచమును నేను నీ కుపదేశించితిని. శ్రీకృష్ణపరమాత్మముఖారవిందమునుండి యీదివ్యకవచమును నే నుపదేశము నందితిని. ఈ గుహ్యకవచమును అర్హులకే యుపదేశింపవలెను. విధిపూర్వకముగ గురుదేవుని బూజించి యీ కవచోపదేశము పొంది, కవచమును గళమునందుగాని, దక్షిణభుజమునందుగాని ధరించినవారు విష్ణుతుల్యులు కాగలరు. ఇందేమాత్రము సంశయము లేదు. ఈ కవచధారి యైనభక్తుడు నివసించుప్రదేశమున లక్ష్మీసరస్వతులు విరాజిల్లగలరు.

ఈ కవచము సిద్ధించిన జీవుడు జీవన్ముక్తుడై యనేకజన్మలపూజాఫలమును పొందగలడు. వేలకొలదిగ రాజసూయయజ్ఞములయొక్క, వందలకొలది వాజపేయయజ్ఞములయొక్క, పదివేల అశ్వమేధములయొక్క, నరమేధముల యొక్క, సంపూర్ణదానములయొక్క, పృథ్వికి జేసిన ప్రదక్షిణములయొక్క, సర్వఫలము లీ త్రైలోక్యవిజయకవచసిద్ధిఫలమందు బదునాఱవ యంశకుగూడ సమానములుకావు. వ్రతోపవాసాదినియమములు, స్వాధ్యాయాధ్యయన తపస్యాదులు, సమస్తతీర్థస్నానములు మొదలగుపుణ్యకర్మములన్నియు నీ కవచ ఫలమం దొకయంశమునకైనను సరిరావు. ఈదివ్యకవచసిద్ధినిబొందినవానికి నిశ్చ యముగ సిద్ధత్వము, అమరత్వము, శ్రీహరిదాస్యము మొదలగునవి లభింప గలవు. ఏకాగ్రచిత్తులై పదిలక్షలపర్యాయము లీకవచమును జపించిన కవచసిద్ధిని బొందగలరు. ఈ కవచసిద్ధిని బొందువారు నిశ్చయముగ సర్వజ్ఞులు కాగలరు. కాని యెవరైన యీకవచమును గ్రహింపక శ్రీకృష్ణుని భజించినచో కోట్ల కొలది కల్పములు గతించినను వారి కీమంత్రము సిద్ధిప్రదముకాదు. వత్సా! ఈపరమాద్భుత కవచమును ధరించి నీవు ప్రసన్నతాపూర్వకముగ నిశ్శంకుడవై యనాయాసముగ నిరువదియొక్క పర్యాయములు పృథ్విని క్షత్రియశూన్య మొనరింపుము. కుమారా! ప్రాణసంకటసమయములందు రాజ్యము నీయ వచ్చును, శిరమును ఖండించి సమర్పింపవచ్చును, ప్రాణములను బరిత్యజింప వచ్చును. కాని యీదివ్యకవచమును దానమొనరింపరాదు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ సంవాదమున
శివుడు పరశురామునకు త్రైలోక్యవిజయ మను
శ్రీకృష్ణకవచము నుపదేశించుట యను
ముప్పదియొకటవ అధ్యాయము
సంపూర్ణము.

# ముప్పదిరెండవ అధ్యాయము

## శివుడు పరశురామునకు శ్రీకృష్ణ స్తోత్రము నుపదేశించుట.

పరశురాముడు పలికెను:

జగద్గురూ! సుఖప్రదము, మోక్షదాయకము, సకలసారసర్వస్వము, శత్రుసంహారకారకము, సంపూర్ణాంగసంరక్షకము, పరమాద్భుతము నగుసీ త్రైలోక్యవిజయకవచము నీయనుగ్రహమువలన గ్రహించి ధన్యుడనైతిని. దేవా! నీవు నాకు కృపతో 'మంత్రకల్పతరు'వను శ్రీకృష్ణమహామంత్రమును, 'స్తవరాజ' మనుపరమాత్మస్తోత్రమును, సాంగోపాంగముగ బూజావిధానమును నుపదేశింపవలసినదిగ బ్రార్థించుచున్నాను. నీవు శరణాగతపాలకుడవుగదా!

మహాదేవుడు పలికెను:

భృగువంశసముద్భవా! సమస్తదివ్యమంత్రములలోను సర్వోత్కృష్ట మైనమహామంత్రరాజము నుపదేశించెద నవధరింపుము.

"ఓం శ్రీం నమః శ్రీకృష్ణాయ పరిపూర్ణతమాయ స్వాహా"

ఈ సప్తదశాక్షరమహామంత్రము నైదులక్షలపర్యాయములు జపించిన మంత్రసిద్ధి లభింపగలదు. శ్రీకృష్ణపూజావిధానమందు మహామంత్రజపము, జపమందు పదియవవంతు హవనము, హవనమందు పదియవవంతు అభిషేకము, అభిషేకమందు పదియవవంతు తర్పణము, తర్పణమందు పదియవవంతు మార్జనము, దక్షిణగ నూఱుసువర్ణములను సర్పింపవలెను. ఈ మంత్రము సిద్ధించినవానికి సర్వజగత్తు కరతలగతమగునని గ్రహింపుము. అతడు సర్వ సమర్థుడై సముద్రములను ద్రాగగలడు, విశ్వసంహర్త కాగలడు, అంత్యకాల మందు దివ్యశరీరధారియై వైకుంఠమును బొందగలడు. మంత్రసిద్ధిపొందిన యనన్యభక్తుని చరణధూళిని స్పృశించినంతమాత్రముననే వసుంధర, సకల తీర్థములు పవిత్రములు కాగలవు.

## శ్రీ కృష్ణ ధ్యానమ్

ధ్యానం చ సామవేదోక్తం శృణు మన్ముఖతో మునే ।
సర్వేశ్వరస్య కృష్ణస్య భక్తిప్రదాయి చ ॥

నవీనజలదశ్యామం నీలేన్దీవరలోచనమ్ ।
శరత్పార్వణచన్ద్రాస్యమీషద్ధాస్యం మనోహరమ్ ॥

కోటికన్దర్పలావణ్యం లీలాధామమనోహరమ్ ।
రత్నసింహాసనస్థం తం రత్నభూషణభూషితమ్ ॥

చన్దనోక్షితసర్వాఙ్గం పీతామ్బరధరం వరమ్ ।
వీక్ష్యమాణం చ గోపీభిః సస్మితాభిశ్చ సంతతమ్ ॥

ప్రఫుల్లమాలతీమాలావనమాలావిభూషితమ్ ।
దధతం కున్దపుష్పాఢ్యాం చూడాం చన్ద్రకచర్చితామ్ ॥

ప్రభాం క్షిపన్తీం నభసశ్చన్ద్రతారాన్వితస్య చ ।
రత్నభూషితసర్వాఙ్గం రాధావక్షఃస్థలస్థితమ్ ॥

సిద్ధేన్ద్రైశ్చ మునీన్ద్రైశ్చ దేవేన్ద్రైః పరిసేవితమ్ ।
బ్రహ్మవిష్ణుమహేశైశ్చ శ్రుతిభిశ్చ స్తుతం భజే ॥ 9—15

మహామునీ! సామవేదోక్తము, భుక్తిముక్తిప్రదాయకమునగు శ్రీకృష్ణుని ధ్యానమును నావలన వినుము.

నూతనమేఘమువలె శ్యామలవర్ణుడు, నల్లనికలువలవంటి నేత్రములు గలవాడు, చిరునవ్వుతో గూడిన మనోహరమైన శరత్పార్వణచంద్రునివంటి ముఖముగలవాడు, కోట్లకొలదిమన్మథులవలె సుందరమైనవాడు, లీలలకు నిలయుడు, మనోహరమగురత్నసింహాసనమున నుపవిష్టుడైయున్నవాడు, రత్నభూషణములచే భూషితుడు, చందనచర్చితములైనసర్వావయవములు గలవాడు, పీతాంబరమును ధరించినవాడు, శ్రేష్ఠుడు, సస్మితలైనగోపికలచే నిరంతరము చూడబడుచున్నవాడు, వికసించిన మాలతీమాలలతోను వనమాలలతోను విభూషితుడైనవాడు; కుందపుష్పములచే శోభిల్లునది కర్పూరముచే సువాసితమైనది చంద్రతారకలతోగూడి యాకాశశోభను దిరస్కరించునది యగుజుట్టుముడిగలవాడు, సిద్ధులచేత మునీంద్రులచేత దేవేంద్రులచేత సేవింపబడువాడు, బ్రహ్మవిష్ణుమహేశ్వరులచేత, వేదములచేత స్తుతింపబడువాడు నగునాశ్రీకృష్ణభగవానుని భజించుచున్నాను.

ఈసామవేదోక్త ధ్యానముద్వారమున పరమాత్మను ధ్యానించి, షోడశోప చారముల నర్పించి, యేకాగ్రచిత్తముతో పూజించు మానవుడు సర్వజ్ఞుడు కాగలడు. దేవాదిదేవుని పూజావిధానము నుపదేశించెదను, గ్రహింపుము. భగవంతునకు భక్తిపూర్వకముగ నర్ఘ్యమును, పాద్యమును, ఆసనమును, వస్త్రమును, భూషణమును, మధుపర్కమును, యజ్ఞసూత్రమును, ధూపదీప నైవేద్యములను, ఆచమనమును, అనేకవిధములగు పుష్పములను, తాంబూలమును, చందనమును, అగరును, కస్తూరిని, మనోహరదివ్యశయ్యను, కుసుమ మాలలను, మూడుపర్యాయములు పుష్పాంజలులను నర్పింపవలెను. అనంతరము షడంగపూజయొనర్చి శ్రీకృష్ణపార్షదగణములను విధిపూర్వకముగ నర్చింప వలెను. శ్రీదామ, సుదామ, వసుదామ, హరిభాను, చంద్రభాను, సూర్య భాను, సుభాను లనునీశ్రీకృష్ణపార్షదుల నేడుగురిని భక్తిభావసహితముగ నారాధింపవలెను. గోపీశ్వరి, మూలప్రకృతి, ఆద్యాశక్తి, శ్రీకృష్ణశక్తియగు రాధాదేవిని షోడశోపచారములతో భక్తిపూర్వకముగ బూజింపవలెను. పిమ్మట గోపగోపీసముదాయములను, మహాదేవుని, బ్రహ్మదేవుని, శ్రీహరిని, పార్వతిని, లక్ష్మిని, సరస్వతిని, పృధ్వీదేవతలను, సమస్తదేవతలను పంచోప చారములద్వారా అర్చింపవలెను. (పంచోపచారములనగా ధూపము, దీపము, నైవేద్యము, హారతి, నమస్కారము. షడోపచారపూజయనగ పుష్పములు లేదా అక్షతలు, ధూపము, దీపము, నైవేద్యము, హారతి, నమస్కారము. షోడశోపచారపూజయనగ పదునారు అంగములతోగూడిన యారాధన. అవియేవనగ : 1) ఆవాహనము, 2) ఆసనము, 3) అర్ఘ్యము 4) పాద్యము, 5) స్నానము, 6) వస్త్రము, 7) యజ్ఞోపవీతము, 8) అలంకరణము, 9) పుష్ప ములతో లేక దివ్యనామములతో నొనరించుపూజ, 10) ధూపము, 11) దీపము, 12) నైవేద్యము, 13) తాంబూలము, 14) దక్షిణ, 15) హారతి, 16) సాష్టాంగ నమస్కారము).

అనంతర మనన్యభక్తితో శ్రీకృష్ణుని షోడశోపచారములద్వారా ఆరాధించి ధ్యానింపవలెను. గణేశ్వరుని, సూర్యుని, అగ్నిదేవుని, శ్రీమహా విష్ణువును, శంకరుని, పార్వతిని నేకాగ్రచిత్తముతో నర్చింపవలెను. తదనంతర మిష్టదైవము నారాధింపవలెను. విఘ్నవినాశముకొఱకు విఘ్నేశ్వరుని సకల వ్యాధి సంహారముకొఱకు సూర్యదేవుని, ఆత్మశుద్ధికొఱ కగ్నిభట్టారకుని,

సంసారసాగరవిముక్తికొఱకు శ్రీమహావిష్ణువును, భక్తిజ్ఞానవైరాగ్యములకొఱకు శంకరుని, పరమైశ్వర్యవిభూతిప్రాప్తికొఱకు దుర్గను బూజించిన నభీష్టఫలములు సిద్ధింపగలవు. ఈ యార్గురుదైవముల నారాధింపక యొనర్చిన నేపూజయైనను నిష్ఫలముకాగలదు. పిమ్మట సామవేదోక్తస్తోత్రముద్వారా సకలదేవవందిత పాదపద్మ డైన శ్రీకృష్ణపరమాత్మను స్తుతింపవలెను. జమదగ్నినందనా! భార్గవంశజా! పరశురామా! ఆసనాతన దివ్యస్తోత్రరాజము నుపదేశించెదను, నేకాగ్రచిత్తుడవై యవధరింపుము.

## పరశురామం ప్రతి శివేనోపదిష్టం స్తవరాజస్తోత్రమ్

**మహాదేవ ఉవాచ :**

పరం బ్రహ్మ పరం ధామ పరం జ్యోతిః సనాతనమ్ ।
నిర్లిప్తం పరమాత్మానం నమామి సర్వకారణమ్ ॥

స్థూలాత్ స్థూలతమం దేవం సూక్ష్మాత్ సూక్ష్మతమం పరమ్।
సర్వదృశ్యమదృశ్యం చ స్వేచ్ఛాచారం నమామ్యహమ్ ॥

సాకారం చ నిరాకారం సగుణం నిర్గుణం ప్రభుమ్ ।
సర్వాధారం చ సర్వం స్వేచ్ఛారూపం నమామ్యహమ్ ॥

అతీవకమనీయం చ రూపం నిరుపమం విభుమ్ ।
కరాలరూపమత్యన్తం బిభ్రతం ప్రణమామ్యహమ్ ॥

కర్మణః కర్మరూపం తం సాక్షిణం సర్వకర్మణామ్ ।
ఫలం చ ఫలదాతారం సర్వరూపం నమామ్యహమ్ ॥

స్రష్టా పాతా చ సంహర్తా కలయా మూర్తిభేదతః ।
నానామూర్తిః కలాంశేన యః పుమాంస్తం నమామ్యహమ్ ॥

స్వయం ప్రకృతిరూపశ్చ మాయయా చ స్వయం పుమాన్ ।
తయోః పరం స్వయం శశ్వత్తం నమామి పరాత్పరమ్ ॥

స్త్రీపుంనపుంసకం రూపం యో బిభర్తి స్వమాయయా ।
స్వయం మాయా స్వయం మాయీ యో దేవస్తం నమామ్యహమ్ ॥

తారణం సర్వదుఃఖానాం సర్వకారణకారణమ్ ।
ధారణం సర్వవిశ్వానాం సర్వబీజం నమామ్యహమ్ ॥

తేజస్వినాం రవిర్యో హి సర్వజాతిషు బ్రాహ్మణః ।
నక్షత్రాణాం చ యశ్చన్ద్రస్తం నమామి జగత్ప్రభుమ్ ॥

రుద్రాణాం వైష్ణవానాం చ జ్ఞానినాం యో హి శంకరః ।
నాగానాం యో హి శేషశ్చ తం నమామి జగత్పతిమ్ ॥

ప్రజాపతీనాం యో బ్రహ్మ సిద్ధానాం కపిలః స్వయమ్ ।
సనత్కుమారో మునిషు తం నమామి జగద్గురుమ్ ॥

దేవానాం యో హి విష్ణుశ్చ దేవీనాం ప్రకృతిః స్వయమ్ ।
స్వాయమ్భువో మనూనాం యో మానవేషు చ వైష్ణవః ।
నారీణాం శతరూపా చ బహురూపం నమామ్యహమ్ ॥

ఋతూనాం యో వసన్తశ్చ మాసానాం మార్గశీర్షకః ।
ఏకాదశీ తిథీనాం చ నమామి సర్వరూపిణమ్ ॥

సాగరః సరితాం యశ్చ పర్వతానాం హిమాలయః ।
వసున్ధరా సహిష్ణూనాం తం సర్వం ప్రణమామ్యహమ్ ॥
పత్రాణాం తులసీపత్రం దారురూపేషు చన్దనమ్ ।
వృక్షాణాం కల్పవృక్షో యస్తం నమామి జగత్పతిమ్ ॥

పుష్పాణాం పారిజాతశ్చ సశ్యానాం ధాన్యమేవ చ ।
అమృతం భక్ష్యవస్తూనాం నానారూపం నమామ్యహమ్ ॥
ఐరావతో గజేన్ద్రాణాం వైనతేయశ్చ పక్షిణామ్ ।
కామధేనుశ్చ ధేనూనాం సర్వరూపం నమామ్యహమ్ ॥
తేజసానాం సువర్ణం చ ధాన్యానాం యవ ఏవ చ ।
యః కేసరీ పశూనాం చ వరరూపం నమామ్యహమ్ ॥
యక్షాణాం చ కుబేరో యో గ్రహాణాం చ బృహస్పతిః ।
దిక్పాలానాం మహేన్ద్రశ్చ తం నమామి పరం వరమ్ ॥
వేదసంఘశ్చ శాస్త్రాణాం పణ్డితానాం సరస్వతీ ।
అక్షరాణామకారో యస్తం ప్రధానం నమామ్యహమ్ ॥
మన్త్రాణాం విష్ణుమన్త్రశ్చ తీర్థానాం జాహ్నవీ స్వయమ్ ।
ఇన్ద్రియాణాం మనో యో హి సర్వశ్రేష్ఠం నమామ్యహమ్ ॥
సుదర్శనం చ శస్త్రాణాం వ్యాధీనాం వైష్ణవో జ్వరః ।
తేజసాం బ్రహ్మతేజశ్చ వరేణ్యం తం నమామ్యహమ్ ॥
నిమేషశ్చ బలవతాం మనశ్చ శీఘ్రగామినామ్ ।
కాలః కలయతాం యో హి తం నమామి విలక్షణమ్ ॥

జ్ఞానదాతా గురూణాం చ మాతృరూపశ్చ బన్ధుషు ।
మిత్రేషు జన్మదాతా యస్తం సారం ప్రణమామ్యహమ్ ॥

శిల్పినాం విశ్వకర్మా యః కామదేవశ్చ రూపిణామ్ ।
పతివ్రతా చ పత్నీనాం నమస్యం తం నమామ్యహమ్ ॥

ప్రియేషు పుత్రరూపో యో నృపరూపో నరేషు చ ।
సాలగ్రామశ్చ యన్త్రాణాం తం విశిష్టం నమామ్యహమ్ ॥

ధర్మః కళ్యాణబీజానాం వేదానాం సామవేదకః ।
ధర్మాణాం సత్యరూపో యో విశిష్టం తం నమామ్యహమ్ ॥

జలే శైత్యస్వరూపో యో గన్ధరూపశ్చ భూమిషు ।
శబ్దరూపశ్చ గగనే తం ప్రణమ్యం నమామ్యహమ్ ॥

క్రతూనాం రాజసూయో యో గాయత్రీ ఛన్దసాం చ యః ।
గన్ధర్వాణాం చిత్రరథస్తం గరిష్ఠం నమామ్యహమ్ ॥

క్షీరస్వరూపో గవ్యానాం పవిత్రాణాం చ పావకః ।
పుణ్యదానాం చ యః స్తోత్రం తం నమామి శుభప్రదమ్॥

తృణానాం కుశరూపో యో వ్యాధిరూపశ్చ వైరిణామ్ ।
గుణానాం శాన్తరూపో యశ్చిత్రరూపం నమామ్యహమ్ ॥

తేజోరూపో జ్ఞానరూపః సర్వరూపశ్చ యో మహాన్ ।
సర్వానిర్వచనీయం చ తం నమామి స్వయం విభుమ్ ॥

సర్వాధారేషు యో వాయుర్యథాత్మా నిత్యరూపిణామ్ ।
ఆకాశో వ్యాపకానాం యో వ్యాపకం తం నమామ్యహమ్ ॥

వేదానిర్వచనీయం యన్న స్తోతుం పణ్డితః క్షమః ।
యదనిర్వచనీయం చ కో వా తత్ స్తోతుమీశ్వరః ॥
వేదా న శక్తా యం స్తోతుం జడీభూతా సరస్వతీ।
తం చ వాఙ్మనసోః పారం కో విద్వాన్ స్తోతుమీశ్వరః ॥

శుద్ధతేజఃస్వరూపం చ భక్తానుగ్రహవిగ్రహమ్ ।
అతీవకమనీయం చ శ్యామరూపం నమామ్యహమ్ ॥

ద్విభుజం మురలీవక్త్రం కిశోరం సస్మితం ముదా ।
శశ్వద్గోపాఙ్గనాభిశ్చ వీక్ష్యమాణం నమామ్యహమ్ ॥
రాధయా దత్తతామ్బూలం భుక్తవన్తం మనోహరమ్ ।
రత్నసింహాసనస్థం చ తమీశం ప్రణమామ్యహమ్ ॥

రత్నభూషణభూషాఢ్యం సేవితం శ్వేతచామరైః ।
పార్షదప్రవరైర్గోపకుమారైస్తం నమామ్యహమ్ ॥

బృన్దావనాన్తరే రమ్యే రాసోల్లాససముత్సుకమ్ ।
రాసమణ్డలమధ్యస్థం నమామి రసికేశ్వరమ్ ॥

శతశృఙ్గే మహాశైలే గోలోకే రత్నపర్వతే ।
విరజాపులినే రమ్యే ప్రణమామి విహారిణమ్ ॥

పరిపూర్ణతమం శాన్తం రాధాకాన్తం మనోహరమ్ ।
సత్యం బ్రహ్మస్వరూపం చ నిత్యం కృష్ణం నమామ్యహమ్॥

శ్రీకృష్ణస్య స్తోత్రమిదం త్రిసంధ్యం యః పఠేన్నరః ।
ధర్మార్థకామమోక్షాణాం స దాతా భారతే భవేత్ ॥

హరిదాస్యం హరౌ భక్తిం లభేత్ స్తోత్రప్రసాదః ।
ఇహ లోకే జగత్పూజ్యో విష్ణుతుల్యో భవేద్ధ్రువమ్॥

సర్వసిద్ధేశ్వరః శాన్తోఽప్యన్తే యాతి హరేః పదమ్ ।
తేజసా యశసా భాతి యథా సూర్యో మహీతలే ॥

జీవన్ముక్తః కృష్ణభక్తః స భవేన్నాత్ర సంశయః ।
అరోగీ గుణవాన్ విద్వాన్ పుత్రవాన్ ధనవాన్ సదా ॥

షడ్విజ్ఞో దశబలో మనోయాయీ భవేద్ధ్రువమ్ ।
సర్వజ్ఞః సర్వదశ్చైవ స దాతా సర్వసమ్పదామ్ ॥
కల్పవృక్షసమః శశ్వద్భవేత్కృష్ణప్రసాదతః ।

ఇత్యేవం కథితం స్తోత్రం త్వం వత్స గచ్ఛ పుష్కరమ్ ।
తత్ర కృత్వా మన్త్రసిద్ధిం పశ్చాత్ ప్రాప్స్యసి వాంఛితమ్॥

త్రిఃసప్తకృత్వో నిర్భూపాం కురు పృథ్వీం యథాసుఖమ్ ।
మమాశిషా మునిశ్రేష్ఠా శ్రీకృష్ణస్య ప్రసాదతః ॥ 27–76

పరబ్రహ్మ, పరమధాముడు, పరమజ్యోతి, సనాతనుడు, నిర్లిప్తుడు, సర్వకారణుడు నగునాపరమాత్మకు నమస్కరించుచున్నాను.

స్థూలముకంటెమిక్కిలిస్థూలమైనవాడు, సూక్ష్మముకంటె మిక్కిలి సూక్ష్మమైనవాడు, అందఱకు గనబడువాడు, గనబడనివాడు, స్వేచ్ఛగ సంచరించువాడు నగునాయుత్కృష్టదైవమునకు నమస్కరించుచున్నాను.

సాకారుడు, నిరాకారుడు, సగుణుడు, నిర్గుణుడు, సర్వాధారుడు సర్వ స్వరూపుడు, స్వేచ్ఛానుసారముగ రూపముల ధరించువాడు నగు నాప్రభువునకు నమస్కారము.

మిగులసుందర మైనరూపముగలవాడు, ఉపమారహితుడు, అత్యంత కరాళరూపమును ధరించువాడు, సర్వవ్యాపియైనవాడు నగునాథగవానునకు నమస్కరించుచున్నాను.

కర్మకు గర్మరూపుడు, సర్వకర్మలకు సాక్షియు, ఫలరూపుడు, ఫలము నిచ్చువాడు నగునాసర్వరూపునకు నమస్కరించుచున్నాను.

తనకళతో విభిన్నరూపముల ధరించి సృష్టిచేయువాడు, పాలించువాడు, సంహరించువాడు, కళాంశములతో నానారూపముల ధరించువాడు నగునాథగ వానునిచరణములకు నమస్కరించుచున్నాను.

మాయకు వశుడై స్వయముగ ప్రకృతియుపురుషుడు నైయున్నవాడు, ఆరెంటికంటె పరుడైయున్నవాడు నగునాపరాత్పరునకు నమస్కరించు చున్నాను.

తనమాయచే స్త్రీపురుషనపుంసకరూపముల ధరించువాడు, తానే మాయయు, మాయాధిపతియు నైనవాడు నగునా దేవునకు నమస్కరించు చున్నాను.

సర్వదుఃఖములనుండి తరింపజేయువాడు, సర్వకారణకారణుడు, సమస్త విశ్వములను ధరించువాడు, అన్నింటికి గారణస్వరూపుడు నగునాపరమేశ్వరునకు నమస్కరించుచున్నాను.

తేజస్సుగలవారిలో సూర్యుడు, సర్వజాతులలో బ్రాహ్మణుడు, నక్షత్ర ములలో చంద్రుడు నగునాజగదీశ్వరునకు నానమస్కారములు.

రుద్రులలోను, వైష్ణవులలోను, జ్ఞానులలోను శంకరుడైనవాడు, నాగు లలో శేషనాగము నగునాజగత్పతికి నమస్కరించుచున్నాను.

ప్రజాపతులలో బ్రహ్మ, సిద్ధులలో గపిలుడు, మునులలో సనత్కుమా రుడు నగునాజగద్గురువునకు నమస్కరించుచున్నాను.

పురుష దేవతలలో విష్ణువు, స్త్రీ దేవతలలో ప్రకృతి, మనువులలో స్వాయంభువమనువు, మనుష్యులలో వైష్ణవుడు, స్త్రీలలో శతరూపయు నగు నాబహురూపునకు నమస్కరించుచున్నాను.

ఋతువులలో వసంతఋతువు, మాసములలో మార్గశీర్ష మాసము, తిథులలో నేకాదశియు నగు నాసర్వరూపనకు నమస్కరించుచున్నాను. సరిత్తులలో సాగరము, పర్వతములలో హిమాలయము, సహనశీలురలో పృథ్వీ రూపుడు నగునాసర్వరూపునకు నానమస్కారము. పత్రములలో దులసీపత్రము, దారురూపములలో చందనము, వృక్షములలో గల్పవృక్షము నగునాజగత్పతికి నమస్కరించుచున్నాను.

పుష్పములలో పారిజాతము, సశ్యములలో ధాన్యము, భక్ష్యపదార్థములలో నమృతము నగునానారూపధారికి నానమస్కారములు.

గజరాజులలో నైరావతము, పక్షులలో గరుడుడు, గోవులలో కామధేనువు నగునాసర్వరూపునకు నాప్రణామములు.

తైజసపదార్థములలో సువర్ణము, ధాన్యములలో యవలు, పశువులలో సింహము నగునాశ్రేష్ఠరూపధారికి నానమస్కారములు.

యక్షులలో గుబేరుడు, గ్రహములలో బృహస్పతి, దిక్పాలకులలో మహేంద్రుడు నగునాశ్రేష్ఠపరమాత్మకు నమస్కరించుచున్నాను.

శాస్త్రములలో వేదసముదాయము, సదసద్వివేకశీలు రగుబుద్ధిమంతులలో సరస్వతి, అక్షరములలో అకారము నగునాప్రధానదేవునకు నమస్కరించుచున్నాను.

మంత్రములలో విష్ణుమంత్రము, తీర్థములలో గంగ, ఇంద్రియములలో మనస్సు నగునాసర్వశ్రేష్ఠునకు నానమస్కారములు..

శస్త్రములలో సుదర్శనచక్రము, వ్యాధులలో వైష్ణవజ్వరము, తేజస్సులలో బ్రహ్మతేజస్సు నగునాశ్రేష్ఠప్రభువునకు నమస్కరించుచున్నాను.

బలముగలవానిలో నిషేకము అనగా కర్మభోగము, శీఘ్రముగ వెడలువానిలో మనస్సు, లెక్కించువానిలో కాలము నగునావిలక్షణుడైన దేవునకు నమస్కరించుచున్నాను.

గురువులలో జ్ఞానదాత, బంధువులలో మాతృరూపుడు, మిత్రులలో జన్మదాత అనగా పితృరూపుడు నగునాసారరూపపరమేశ్వరునకు నమస్కరించుచున్నాను.

శిల్పులలో విశ్వకర్మ, రూపవంతులలో మన్మథుడు, పత్నులలో పతివ్రతయు నగునాప్రభువునకు నమస్కరించుచున్నాను.

ప్రియమైనవారిలో పుత్రరూపుడు, మనుష్యులలో నరేశ్వరుడు యంత్రములలో సాలగ్రామము నగునావిశిష్టునకు నానమస్కారములు.

కల్యాణబీజములలో ధర్మము, వేదములలో సామవేదము, ధర్మములలో సత్యరూపము నగునావిశిష్టునకు నమస్కరించుచున్నాను.

జలములలో శైత్యస్వరూపముగను, భూములలో గంధరూపముగను, గగనమున శబ్దరూపముగను నున్ననాభగవానునకు ప్రణమిల్లుచున్నాను.

యజ్ఞములలో రాజసూయయజ్ఞము, ఛందస్సులలో గాయత్రీఛందము గంధర్వులలో చిత్రరథుడు నగునాపరమమహనీయునకు నాప్రణామములు.

గవ్యపదార్థములలో దుగ్ధస్వరూపుడు, పవిత్రులలో నగ్ని, పుణ్యప్రదమైనవానిలో నీస్తోత్రము నగునాశుభదాయకునకు నమస్కరించుచున్నాను.

తృణములలో కుశరూపుడు, శత్రువులలో వ్యాధిరూపుడు, గుణములలో శాంతరూపుడు నగునావిచిత్రరూపధారికి నమస్కరించుచున్నాను.

తేజోరూపుడు, జ్ఞానరూపుడు, సర్వరూపుడు, మహాత్ముడు, సర్వులకు ననిర్వచనీయుడు, సర్వవ్యాపియు నగునాభగవానునకు నమస్కరించుచున్నాను.

సర్వాధారస్వరూపములలో వాయువు, నిత్యరూపులలో నాత్మసదృశుడు, వ్యాపకమైనవానిలో నాకాశము నగునాసర్వవ్యాపకునకు నానమస్కారములు.

వేదములకు వర్ణింప నలవికానివాడు, పండితుల స్తుతులకు నందనివాడు వాక్కుల కతీత మైనగుణములుగలవాడు నగునాభగవానునకు నమస్కరించుచున్నాను.

అయినను స్తుతించుటలో వేదములుగూడ సమర్థములు కాలేదు. సరస్వతి జడమువలె నగును, మనోవాక్కుల కతీతమైనవాడు. అట్టిభగవానునే విద్వాంసుడు స్తుతింపగలడు.

శుద్ధతేజస్స్వరూపుడు, భక్తానుగ్రహవిగ్రహుడు, మిగులసుందరుడు, శ్యామరూపధారియు నగునాప్రభువునకు నానమస్సులు.

రెండుభుజములుగలవాడు, మురళి ముఖమునగలవాడు, కైశోరావస్థలోనున్నవాడు, సంతోషముతో నవ్వువాడు, గోపాంగనలచే నెల్లపుడు చూడబడువాడు నగునా దేవునకు నాప్రణామములు.

రత్నమయసింహాసనముపై విరాజిల్లువాడు, రాధాదేవిచే నీయబడిన తాంబూలమును భుజించువాడు, మనోహరరూపమును ధరించినవాడు నగు నాపరమేశ్వరునకు నమస్కరించుచున్నాను.

రత్నాభరణములచే నలంకృతుడు, పార్షదశ్రేష్ఠు లగుగోపకుమారులు శ్వేతచామరములచే జేయుసేవలను స్వీకరించువాడు నగునా దేవునకు నమస్కరించుచున్నాను.

రమణీయబృందావనములో రాసమండలమునడుమ నుండి రాసక్రీడోల్లాసముచే సముత్సుకుడై యున్నవాడు నగునారసికేశ్వరునకు నాప్రణామములు.

శతశృంగశిఖరములమీద, మహాశైలముమీద, గోలోకములో రత్నపర్వతముమీద, విరజానదిసుందరతటముపైన విహరించు నాపరమేశ్వరునకు నమస్కరించుచున్నాను.

పరిపూర్ణతముడు, శాంతుడు, రాధాదేవికి ప్రియతముడు, మనోహరుడు సత్యరూపుడు, బ్రహ్మస్వరూపుడు నిత్యుడు నగునాశ్రీకృష్ణభగవానునకు నమస్కరించుచున్నాను.

భారతవర్షమున శ్రీకృష్ణ దివ్యస్తోత్రమును త్రికాలములందు త్రికరణశుద్ధిగ బఠించుమానవుడు ధర్మార్థకామమోక్షములకే దాతకాగలడు. ఈ స్తోత్రమును బఠించినవానికి శ్రీహరియందు భక్తి శ్రీహరిదాస్యము లభింపగలదు. అతడు నిశ్చయముగ విష్ణుసమానుడై జగత్పూజ్యుడు కాగలడు. ఆభక్తుడు శాంతిని బొంది, సమస్తసిద్ధులకు నీశ్వరుడు కాగలడు. అతడు భూతలమున తేజస్సున-దు యశమునందు సూర్యునివలె ప్రకాశించి, అంత్య

కాలమున శ్రీహరిపరమపదమును బొందగలడు. అతడు జీవన్ముక్తుడు శ్రీకృష్ణ భక్తుడు, ఆరోగ్యవంతుడు, విద్వాంసుడు, పుత్రవంతుడు, ఐశ్వర్యవంతుడు నై సుఖింపగలడు. ఇందు లేశమాత్ర మైనను సందేహాము లేదు. నిశ్చయముగ నతడు సర్వజ్ఞుడు, మహాబలసంపన్నుడు, మనోసదృశవేగశాలి, మహాదాత, సర్వసంపత్ప్రదాత కాగలడు. శ్రీకృష్ణునియనుగ్రహాములన నాభక్తుడు కల్పవృక్షసముడై నివసింపగలడు. వత్సా ! నేను నీకీదివ్యస్తోత్రము నుపదేశించితిని, నీవు తత్క్షణమే పవిత్రపుష్కరతీర్థమున కేగి మంత్రసిద్ధి పొందుము. అచిరకాలములోనే నీ యభీష్టములు సిద్ధింపగలవు. మునిశ్రేష్ఠా ! శ్రీకృష్ణపరమాత్మకృపవలన, నాయశీర్వాదమువలన నీ వనాయాసపూర్వకముగ బృథ్విని యిఱువదియొక్క పర్యాయములు క్షత్రియశూన్య మొనరింపగలవు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారాదనారాయణసంవాద
మున శివుడు పరశురామునకు శ్రీకృష్ణ స్తవ
రాజము నుపదేశించుట యను
ముప్పదిరెండవ అధ్యాయము
సంపూర్ణము



## ముప్పదిమూడవ అధ్యాయము

### పుష్కరక్షేత్రమున బరశురాముడు శ్రీకృష్ణునిగూర్చి తపస్సుచేయుట.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

బ్రహ్మకులసుధాకరా ! తదనంతరము భృగువంశకులోద్భవు డైన పరశురాముడు మహాదేవునియాశీర్వచనమును బొంది హర్షాంతరంగుడై శివునకు,

దుర్గకు, భద్రకాళికి, బ్రణామము లర్పించి, వారియనుజ్ఞగైకొని మంత్రసిద్ధి కొఱకు పుష్కరక్షేత్రమునకు బయలుదేరెను. పరశురాము డాకహూస మన్న జలములను బరిత్యజించి, భక్తిపూర్వకముగ శ్రీకృష్ణునిచరణారవిందములను నేకాగ్రచిత్తుడై ధ్యానించుచు వాయువును నవరుద్ధ మొనరించి పుష్కరక్షేత్ర మందు ఘోరతప మాచరించెను. హృదయాంతరంగమున సాక్షాత్కరించిన సచ్చిదానందవిగ్రహస్వరూపు డంతర్ధానము కాగా, ధ్యానము భంగమై పరశు రాముడు కన్నుల దెరచెను. ఆకాశమంతయు నద్భుతతేజముతో నోతప్రోతమై దిశలన్నియు నఖండతేజమువలన నుద్దీప్తమగుచుండెను. సూర్యుని ప్రచండ తేజముసహిత మాయఖండతేజములో సహస్రాంశమునకైననుసరిరాదు. ఆ తేజో మండలము నడుమ పరశురామున కత్యంతసుందరుడు శ్రేష్ఠుడు నగుపురుషోత్త ముడు దర్శన మొసంగెను. ఆయన భక్తానుగ్రహావిగ్రహుడు, మందస్మిత వదనుడు, ఆ భగవంతుని గాంచి పరశురాముడు బ్రహ్మానందభరితుడై సాష్టాంగ దండప్రణామము లర్పించి యనేకవిధముల స్తుతించి యభీష్టవరముల నిట్లు అర్థించెను. "దేవాదిదేవా! పరమపురుషా! సనాతనా! అక్షరా! అనంతా! నే నిరువదియొక్క పర్యాయములు పృథ్విని భూపాలరహిత మొనరింపవలెను, మీ చరణకమలములందు సుదృఢభక్తిని, మీపాదారవిందములవద్ద నాకు దాస్యమును ప్రసాదింపవలసినదిగ నర్థించుచున్నాను." శ్రీకృష్ణపరమాత్మ తథాస్తనిపలికి యంతర్హితుడయ్యెను. మంత్రసిద్ధిపొందిన భృగురాముడు సంతు ష్టాంతరంగుడై తనయాశ్రమమునకు దిరిగి చేరెను. ఆ సమయమున శుభ సూచకముగ బరశురాముని దక్షిణాంగములు కంపింపదొడంగెను. రాత్రిలం దాతనికి వాంఛాసిద్ధిప్రదములైననుత్తమస్వప్నములు గోచరించెను. పరశు రాముడు తనశిష్యులను, పితృదేవుని శిష్యులను, సోదరులను, బంధువర్గమును సమావేశపఱచి జరిగినవృత్తాంతమంతయు సభామధ్యమున బహిర్గత మొనర్చి, వారందఱితో సంప్రదించి యొకశుభముహూర్తమున విజయయాత్రకు సన్నద్ధు డయ్యెను.

మార్గమధ్యమున వారి కనేకమంగళశకునములు, విజయసూచకములైన శబ్దములు గోచరించినవి. ఆ సమయమున పరశురాముడు నిశ్చయముగ దనకు విజయము సంభవించునని, శత్రువులు నశింపగలరని నిర్ధారణచేసికొనెను. యాత్రామార్గమందు వారియెదుట మయూరములు నాట్యమాడినవి, సింహ

ములు గర్జించినవి, ఘంట, దుందుభి, సంగీతాదినాదములు శ్రవణానందముగ వినిపించినవి. విజయసూచకముగ నాకాశమందు మేఘములు గర్జించినవి. నీకు విజయము సిద్ధించుగాక యనియాకాశవాణి ప్రతిధ్వనించినది. పరశురాముడు మార్గమధ్యమున దనయెదుట సద్బ్రాహ్మణులను వందిమాగధులను, జ్యోతిష్యుని, భిక్షుకుని గాంచెను. పిమ్మట నానావిధభూషణవిభూషితయైన, పతిపుత్రసంపన్నయైన సాధ్వి తనహస్తమునందు ప్రజ్వలితదీపమునుధరించి మంద స్మితవదనయై యెదురుగ నేతెంచెను. ప్రయాణము సాగించుచుండగవారికి దక్షిణ భాగమున మంగళసూచకముగ శవము, శృగాలము, స్వచ్ఛజలపూర్ణఘటము, నీలకంఠమృగము, ముంగిస, కృష్ణసారమృగము, గజరాజు, సింహము, అశ్వము, గోవు, రాజహంస, చక్రవాకము, శుకము, కోయిల, మయూరము, చకోరము, పావురము, చాతకము గోచరించినవి ఆకాశమందు మెఱపులు మెరసెను, ఇంద్రధనుపు గోచరించెను. తదనంతరము సూర్యుడు దర్శనమొసంగెను. మార్గ మధ్యమున వారు జీవించియున్న మత్స్యమును, శంఖమును, సువర్ణమును, మాణిక్యములను, వెండిని, ముత్యములను, వజ్రములను, ధాన్యములను, ధవళ పుష్పములను, కుంకుమమును, తాంబూలపత్రములను, పతాకమును, ఛత్రమును, దర్పణమును, శ్వేతచామరమును, సవత్సగోవును, రథారూఢుడైన భూపాలుని, క్షీరములను, ఘృతమును, నమృతమును, పరమాన్నమును, సాలగ్రామమును, పండినఫలములను, చక్కెరను, మధువును, మేఘములనుండి బయల్వెడలు సూర్యుని, కస్తూరిని, జలములను, సారసములను, దర్భలను, బ్రాహ్మణబాలకుని, కన్యను, తుమ్మెదను, కర్పూరమును, గోమూత్రమును, గోమయమును, గోధూళిని, గోపదచిహ్నములను, రమణీయగోశాలను, భూషణములను, దైవ ప్రతిమను, ప్రజ్వలితాగ్నిని, మహోత్సవమును, శాగిని, స్ఫటికమును, వైద్యుని సిందూరమును, పుష్పమాలను, సుగంధితచందనమును, వజ్రములను, రత్న ములను దర్శించి, సుగంధవాయువుల నాఘ్రాణించి బ్రాహ్మణుల యాశీర్వాద ములను బొందిరి. ఇట్లనేకమంగళశకునములు సంభవించుచుండగ బరశురామ సహితముగ నాయఖండసేనావాహిని హర్షపూర్వకముగ బయనించుచు సూర్యాస్తమయమున బవిత్రనర్మదానదీతటమునకు జేరెను.

అచట నొకయత్యంతవిశాలమైనఅక్షయవటవృక్షము కలదు. ఆ ప్రదే మునకు గార్తవీర్యార్జునుని రాజధాని కొంతదూరమందే యుండెను. మిగుల

యున్నతము, విశాలము నగుసాయక్షయవటవృక్షప్రాంత మొకపావనాశ్రమము. అచ్చోట సుగంధవాయువులు వీచుచుండెను. ఆ ప్రదేశముననే పులస్త్య నందనుడు తపమొనరించెను. ఆ రాత్రిసమయమున బరశురాముడు తనవారితో నచట విశ్రమించెను, బ్రహ్మ ముహూర్తకాలమున బరశురామునకు వాతపిత్త కఫప్రకోపరహితమైన మనస్సునందు విచారమొనరింపని శుభస్వప్నములు గోచరించినవి.

ఆయన యాస్వప్నమందు గజమును, అశ్వమును, పర్వతమును, అట్టాలికను, ఫలయుక్తవృక్షమును నధిరోహించినట్లు గాంచెను. తనను గీటకములు బాధించుచుండగ రోదించుచున్నట్లు దర్శించెను. పరశురాముని శరీరము చందనానులేపన మొనరింపబడియుండెను. ఎఱ్ఱని వస్త్రములను, పుష్పమాలను ధరించియుండెను. నౌక నధిరోహించినట్లు, వీణను మీటినట్లు, నదీతటమందు కమలపత్రములలో దధిని, ఘృతమును, మధుమిశ్రితపరమాన్న మును భుజించినట్లు, తాంబూలము సేవించినట్లు గాంచెను. తనయెదుట ఫల పుష్పములను, దీపమును, ఆశీర్వదించుచున్న బ్రాహ్మణులను స్వప్నములో దర్శించెను, అట్లే స్వాదిష్టములైన వ్యంజనములను, ఆహారపదార్థములను, నన్నమును గాంచెను. తదనంతరము తన్ను జలజంతువులు, తేళ్ళు, సర్పములు, కఱచుచున్నట్లు, తాను భీతుడై పారిపోవుచున్నట్లు గాంచెను. చంద్రుడుదయించుటను, సూర్యమండలమును, పతిపుత్రసంపన్నయైనస్త్రీని, మందస్మిత వదనుడైనబ్రాహ్మణుని గాంచెను. సుందరవేషభూషణసంపన్నయైనతనకన్య పరమసంతుష్టయై, మందహాసయుక్తయై బ్రాహ్మణునిచే ఆలింగితయైనట్లు గాంచెను. రత్నమయాభూషణములను ధరించి, గృహమునందు బ్రవేశించు చున్న బ్రాహ్మణస్త్రీని గాంచెను. తదుపరి శంఖమును, స్ఫటికమును, శ్వేత మాలను, ముత్యములను, చందనమును, సువర్ణమును, రత్నములను, వెండినిగాంచెను. పిమ్మట గజమును, వృషభములను, శ్వేతసర్పమును, ధవళచామరమును, నీలకమలమును, దర్పణమును గాంచెను. భార్గవ రాముడు స్వప్నమందు దాను రథారూఢుడైనట్లు, రత్నాభూషణవిభూషితు డైనట్లు, మాలతీమాలలతో నలంకరింపబడియున్న సింహాసనము నధిష్ఠించి యున్నట్లు గాంచెను. కొంగలపంక్తులను, హంసలసమూహములను, మంగళ కలశములను, బూజించుచున్న కన్యకాపంక్తులను గాంచెను. శివకేశవులను

బూజించుచు జయముకల్గు ననివచించుచున్న బ్రాహ్మణులను గాంచెను. భృగురాముడు స్వప్నమందు సుధావృష్టిని, పత్రివర్షమును, ఫలవృష్టిని, సర్వదా పుష్పించు పుష్పములను, చందనవర్షమును, జీవించియున్న మత్స్యమును, మయూరమును, శ్వేతఖంజనమును, సరోవరమును, తీర్థములను, పావురములను, శుకమును, నీలకంఠమృగమును, తెల్లనికొంగను, చాతకపక్షిని, వ్యాఘ్రమును, సింహమును, సురభిగోవును, గోరోచనమును, తెల్లనిధాన్యములను, విశాలపర్వతమును, ప్రజ్వలితాగ్నిని, దర్భలను, దైవమందిరములను, శివలింగమును, పూజింపబడియున్న పుణ్యామయమూర్తియైనశివుని దర్శించెను. తా నకస్మాత్తుగ శస్త్రములచే క్షతగాత్రుడై సంకెళ్ళతో బంధింపబడియున్నట్లు గాంచి పరశురాముడు మేల్కాంచెను. ప్రాతఃకాలముననే శ్రీహరిని స్మరించి శుభస్వప్నములను గాంచి యానందాంతరంగుడై నిత్యనైమిత్తికకర్మలను సంపన్నమొనరించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ సంవాదమున
పరశురాముడు శ్రీకృష్ణునిగూర్చి తపస్సుచేయుట
అను ముప్పదిమూడవ అధ్యాయము
సంపూర్ణము.



# ముప్పదినాలుగవ అధ్యాయము

## పరశురాముడు కార్తవీర్యునికడకు దూతను బంపుట : కార్తవీర్యుడశుభములను జూచుట.

శ్రీ నా రా య ణ ఋ షి ప ల్కి కె ను :

నారదమునీంద్రా! ప్రాతఃకాలమున బరశురాముడు తనసోదర బంధువులతో జర్చించి కార్తవీర్యునికడకు దూతను బంపెను. ఆ దూత కార్తవీర్యునకు సభామధ్యమున పరశురాముని ప్రతిజ్ఞను వివరించి యుద్ధమునకు సిద్ధముగ నుండవలసిన దనియాదేశించి పరశురామునికడకు తిరిగి వెడలి పోయెను. మహావీరు డైనకార్తవీర్యార్జునుడు శివకవచమును ధరించి రణమునకు సంసిద్ధుడయ్యెను. మహారాణి యగుమనోరమ తనప్రాణపతి రణమునకు సిద్ధ మైయుండుట గాంచి యుద్ధ మొనరింపవల దనివారించెను. భార్యను గాంచి ప్రసన్నవదనుడై కార్తవీర్యు డిట్లుపల్కెను. "ప్రియా! జమదగ్ని మహర్షి కుమారుడు, అత్యంత పరాక్రమవంతుడు నగుబరశురాముడు సోదరబంధువులతో ససైన్యముగ నర్మదానదీతటమున విడిసి నన్ను యుద్ధమున కాహ్వానించెను. అమ్మహాత్ముడు శంకరుని కృపవలన సకలశస్త్రములను, శ్రీహరిమంత్రకవచ ములను బొందెను. పృథ్విని యిరువదియొక్క పర్యాయములు భూపాలరహిత మొనరించెద నని ప్రతిజ్ఞ పూనెను. సహధర్మచారిణీ! ఈ విషయము తెలిసికొని నేను కంపించుచున్నాను, నామనస్సు క్షోభించుచున్నది, నావామాంగములు కంపించుచున్నవి. మనోరమా! నే ననేకదుస్స్వప్నములను గాంచితిని, వానిని వివరించెదను, వినుము. నేను నూనెలో తడిసియున్నట్లు, ఎఱ్ఱనివస్త్రములను, నెఱ్ఱనిచందనమును ధరించి యున్నట్లు, లోహములతో జేయబడిన నాభూషణ ములను ధరించియున్నట్లు, గార్దభము నధిరోహించియున్నట్లు, నవ్వుచు నారిపోయిన నగ్నిరాశితో గ్రీడించుచున్నట్లు గాంచితిని. ఆకాశము చంద్ర సూర్యరహితమై సంధ్యారుణకాంతితో వ్యాప్తమై గోచరించెను. విధవయగు స్త్రీ శిరోజములను విరబోసికొని, యెఱ్ఱనివస్త్రములను ధరించి నాసిక ఖండింప బడియుండగ నట్టహాస మొనరించుచు, నృత్యముచేయుచు గోచరించెను.

మహారాణీ ! బాణములతో జేర్చబడియున్న అగ్నిరహితమైన భస్మ సంయుక్తమైన చితిని గాంచితిని. బూడిదవర్ణమును, రక్తవర్ణమును, నిప్పు కణములవర్ణమును జూచితిని. పండిన తాటిఫలములతో నాచ్ఛాదితమైయున్న, ఎముకలతో గూడియున్న పృథ్విని గాంచితిని; కపాలరాసులను, ఖండింపబడిన శిరోజములను, నఖములను గాంచితిని. రాత్రిసమయమం దుప్పుకొండను, నూనెతో నిండిన కండకములను, ధూళిని దర్శించితిని. పుష్పించిన యశోక వృక్షమును, కరవీరవృక్షమును, ఫలములతో నిండియున్న తాటిచెట్టునుండి తెగిపడుచున్న పండ్లను గాంచితిని, నాహస్తమునం దున్న మంగళకలశము జారి పడి ఛిన్నాభిన్నమైనట్లు, ఆకాశము భూమిపై బడుచున్నట్లు గాంచితిని. ఉల్కా-పాతములను, ధూమకేతువును, సూర్యచంద్రగ్రహణములను, భయంకరుడు, వస్త్రహీనుడు నగుబురుషుని గాంచితిని. పంద్రెండ్రుడువర్షముల వయస్సుగల కన్యక వస్త్రములను, రత్నమయాభూషణములను ధరించి, నాపై గోపించి 'రాజేంద్రా ! నీవు శోకపూర్ణమనస్కుడవై పలుకుచున్నావు, కావున నేను నీగృహమునువీడి వనమునకు జనుదును. నా కనుజ్ఞ నిండు'' అని పలుకుచు గృహమును వీడి వెడలుచున్నట్లు గాంచితిని. కోపించు బ్రాహ్మణుని, శపించుగురువును, సన్యాసిని, చరించుచున్నగ్రద్దలను, కాకులను, దున్న పోతులను గాంచితిని. ఒకవితంతుస్త్రీ నల్లనిరంగుగలదియై, నల్లనివస్త్రములను ధరించి శిరోజములను విరబోసికొని, వస్త్రహీనయై నన్నాలింగన మొనరించు చున్నట్లు, భూతప్రేతపిశాచములు నాట్య మొనరించుచున్నట్లు, శవము మండు చున్నట్లు గాంచితిని, వ్యాధిగ్రస్తుడైనమనుష్యుని, అంగహీనుడైన శూద్రుని, వజ్రపాతమును జూచితిని. ప్రాతఃకాలమున గ్రామదేవత రోదించు చుండగ నేను నిద్ర మేల్కాంచితిని. మనోరమా ! ఈ దుస్స్వప్నముల నివారణోపాయమును వివరింపుము''. కార్తవీర్యుని దుస్స్వప్నములను విని దుఃఖితయై గద్గదవాణితో మనోరమ యిట్లుపల్కెను. "నాథా! నీవు రమణుల యం దుత్తముడవు, సమస్తమహీపాలురయందు శ్రేష్ఠుడవు, నాకు ప్రాణముల కంటె నధికప్రియుడవు. ప్రాణేశ్వరా ! నాశుభదాయకవచనముల నాలకింపుము. జమదగ్నినందనుడు మహాబలవంతుడు నగుపరశురాముడు శ్రీమన్నారాయణుని యంశజుడు, సృష్టిసంహారకారకుడైనసదాశివుని యనుంగుశిష్యుడు. ఆ మహాను భావునితో యుద్ధ మొనరించుట యాత్మహత్యాసదృశము. పాపాత్ముడైన రావణుని జయించి నిన్ను నీవు యోధానయోధుడ ననిభావించుట కేవలము

భ్రమయే. ఎందువలెననగ, నీవు రావణుని యోడింపలేదు. రావణుడే తన పాపకర్మములవలన బరాజితుడైనాడు. ధర్మమునురక్షింపనివాని నెవ్వరు రక్షింపగలరు ? ధర్మభ్రష్టుడైనమూర్ఖుడు నిశ్చయముగ నశింపక తప్పదు. అట్టివాడు జీవించియున్నను మృతునితో సమానుడే. ధర్మమునకు, శుభాశుభకర్మములకు సాక్షియైన, ఆత్మారాముడు నిరంతరము సర్వదేహధారుల హృదయములందు నుండును. మోహాయుక్తుడవై నీవు అయ్యాత్మారాముని దర్శింపలేకున్నావు.

నరేశ్వరా ! ఉత్తములైనధర్మాత్ములు స్త్రీపుత్రాదులను, సకలైశ్వర్యములను సకలజగత్తులను నీటిపై నుద్భవించు బుద్బుదములవలె ననిత్యములని భావించెదరు. అందువలననే పవిత్రభారతవర్షమందు నివసించు మహాత్ములు జగము లన్నియు స్వప్నసదృశము లనియెఱింగి నిరంతరము ధర్మమును పరిపాలించుచు, భక్తిపూర్వకముగ భగవంతుని ధ్యానించుచు దపమాచరించెదరు. నాథా ! భగవాను డగుదత్తాత్రేయు డనుగ్రహించిన పవిత్రజ్ఞానమును నీవు విస్మరించినట్లున్నావు. లేనిచో మరల నీవు బ్రాహ్మణహత్యకై యేల నుద్యుక్తుడవగుచున్నావు ? గతించిన సమయమున నీవు మృగయావినోదివై జమదగ్నిమహర్షి యాశ్రమమును జేరి ఆయన యొసంగిన మృష్టాన్నములను భుజించి యకారణముగ నాబ్రాహ్మణోత్తముని వధించితివి. 'గురువును, బ్రాహ్మణుని, మాతాపితరులను, దైవమును నవమానించు వారిపై, వారి యిష్టదైవము కోపించి వెడలిపోవును. అట్టివారిని విపత్తులు ముట్టడింపగలవు'.

గురువిప్రసురాణాం చ యః కరోతి పరాభవమ్ ।
అభీష్టదేవస్తం రుష్టో విపత్తిస్తస్య సన్నిధౌ ॥ 52

కనుక నాథా ! నీవు దత్తాత్రేయుని జరణకమలములను స్మరించి పరశురాముని శరణు వేడవలసినదిగ గోరుచున్నాను.''

మనోరమ యుపదేశించినవచనములను సావధానముగ విని, పరమబుద్ధిశాలి యైనకార్తవీర్యు డిట్లుపల్కెను. ''కాంతా ! నీవు వంచినదంతయు నేను గ్రహించితిని. ఇపుడు నామాటల నాలకింపుము. శోకపీడితులైనవారివచనములు సభయందు బ్రశంసనీయములు కావు. సుందరీ ! కర్మభోగమునకు యోగ్యకాల మాసన్న మైనపుడు సుఖదుఃఖభయశోకకలహప్రేమాదులు ప్రారబ్ధానుసారముగ సంభవింపగలవు. కాలమే రాజ్యమును బ్రసాదించును.

ఆకాలమే మృత్యువునకుపునర్జన్మమునకుగారణముకాగలదు. అదిసంసారమును సృష్టించును, పాలించును సంహరించును. అక్కాలము జనార్దనుని స్వరూపమే. కాని శ్రీకృష్ణపరమాత్మ ఆకాలముకంటెను, విధాతకంటెను మిగుల యున్నతుడు. సృష్టియొక్క యావిర్భావతిరోభావము లాజగన్నాథుని యాజ్ఞ వలననే సంభవించును. జీవులసర్వకార్యము లాపరంధాముని యాజ్ఞవలననేసంభ వింపగలవు. కాని తమతమ యిచ్ఛలవలన కాదు. మహాబలవంతు డగుపరశు రాముడు శ్రీమన్నారాయణుని యంశజు డనినాకు విదితమే. పరశురాము డంతటి యవతారపురుషుడే పృథ్విని యిఱువదియొక్క పర్యాయములు భూపాలశూన్య మొనరించెద నని ప్రతిజ్ఞపూనిన నిక నాప్రతిజ్ఞ నెవరు నిరో ధింపగలరు. సువరిత్రా! నే నామహాత్ముని వల్లనే మరణించెద ననియు నాకు దెలియును. భవిష్యత్తు నెఱింగియున్న నేను పరశురాము నెట్లు శరణు వేడ గలను? యుద్ధ మొనరించుటట క్షత్రియధర్మము. పరాక్రమమే వీరులకు ప్రతిష్ఠ. కీర్తియే పురుషులకు జీవనము. అపకీర్తి మృత్యువుకంటె నధిక దుఃఖ దాయకమైనది.

ఇట్లు భార్యతో పలికి కార్తవీర్యార్జునుడు సర్వశుభకార్యములను సంపన్న మొనరించి; యసంఖ్యాకసైన్యముల నాయుత్తపఱచెను. ఆ సేనా వాహినియందు కవచబాణధనుర్ధారు లైననెందఱో రాజులు, మూడులక్షల రథికులు; మహాబలపరాక్రమసంపన్నులైన నూఱౌక్షోహిణుల సైనికులు, అసంఖ్యాకములైన నశ్వములు, గజములు కలవు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణసంవాదమున
కార్తవీర్యార్జును డశుభస్వప్నములనుదర్శించుట
యను ముప్పదినాల్గవ అధ్యాయము
సంపూర్ణము.

# ముప్పదియైదవ అధ్యాయము

## కార్తవీర్యునిపత్ని యగుమనోరమ దేహత్యాగముచేయుట : కార్తవీర్యుడు దుఃఖించుట; దుశ్శకునముల గనుట : పరశురామకార్తవీర్యులయుద్ధము.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారదమునీంద్రా ! మహారాణి యగుమనోరమాదేవి తనప్రాణేశ్వరుని ముఖారవిందమునుండి భవిష్యద్వాణి నాలకించి నాథుడు మరణించుట తథ్యమని, అనివార్యమని నిశ్చయించుకొనెను. అక్షణముననే యామె ప్రాణనాథుని నుండి యనుజ్ఞ బొంది భగవంతునిదివ్యచరణారవిందములయందు తన మనస్సు నిల్పెను. యోగముద్వారా షట్చక్రములను భేదించి వాయువును శిరస్సున నిలిపి చంచలమైనమనస్సును క్షణభంగుర మైనసాంసారిక విషయముల నుండిమరలించి, బ్రహ్మరంధ్రమం దున్నసహస్రదళకమలమందు లగ్న మొనరించి జ్ఞానముద్వారా నిష్కలపరబ్రహ్మమందు లయమొనరించెను. తదనంతరము నిర్మూలము పునర్జన్మ రహితము నగుద్వివిధకర్మములను బరిత్యజించి బ్రహ్మరంధ్రభేదనముద్వారా శరీరమును త్యజించెను. కాని యాసాధ్విప్రాణాధికప్రియు డైనతనభర్తను వీడలేదు.

ప్రాణప్రియ మరణించుట గాంచి కార్తవీర్యు డనేకవిధముల దుఃఖించు చుండగ నశరీరవాణి యిట్లుపల్కెను. "మహారాజా ! క్షుద్ర మైనశోకమును వీడి శాంతింపుము. నీవు దత్తాత్రేయుని శిష్యుడవు, జ్ఞానులందు శ్రేష్ఠుడవు. ఈచిత్రవిచిత్రసంసార మంతయు క్షణభంగుర మనిగ్రహింపుము. నీయర్ధాంగి యగుమనోరమ లక్ష్మీదేవి యంశవలన నుద్భవించినది. ఆమె మరల లక్ష్మీ నివాసమును జేరగలదు. నీవుకూడ క్షత్రియులకు బరమధర్మ మైనయుద్ధ మొనరించి వైకుంఠము చేరుము." ఆకాశవాణి యాదేశము నాలకించి నరేశ్వరుడు శోకమును బరిత్యజించి చందనదారువులతో జితిని బేర్పించి పుత్రునిచే భార్య కగ్నిసంస్కార మొనరింపజేసెను. పిమ్మట హర్షపూర్వక

ముగ నసంఖ్యధనకనకవస్తువాహనములను దానమొనరించెను. రాజ్యమును పుత్రున కప్పగించి ససైన్యముగ రణరంగమునకు బయలుదేరెను. మార్గమందు గార్తవీర్యున కమంగళకారకములైన ననేకదుశ్శకునములు సంభవించినవి. రాజునకు దిగంబరియై, శిరోజములను విరబోసికొని, నాసిక ఖండింపబడిననొకస్త్రీ రోదించుచు మార్గమధ్యమున నెదురయ్యెను, పిమ్మట భర్తృహీనయైనస్త్రీ నల్లనివస్త్రములను ధరించి యెదురువచ్చెను. రాజు ముఖదుష్టను, తార్పుడుకత్తెను, యోనిదుష్టను, రోగిణిని, పతిపుత్రవిహీనను, కులటను, కుమ్మరివానిని, నూనెవ్యాపారిని, వ్యాఘ్రమును, పాములవానిని, అత్యంతభయంకరవేషధారిని, మాంసమును విక్రయించువానిని, కన్యావిక్రేతను, చితియందు గాలుచున్న శవమును, ప్రజ్వలించి యారిపోయిన బూడిదరాసిని, సర్పదష్టుడైనమనుష్యుని, సర్పమును, విషమును, శ్రాద్ధముకొఱకు సిద్ధమొనరింపబడినపదార్థమును, పిండములను, దేవమూర్తులకర్పించిన ధనముతో జీవన మొనరించుబ్రాహ్మణుని, శూద్రశ్రాద్ధాన్నము భుజించువానిని, శవములను గాల్చువానిని, వట్టికుండను, నూనెను, లవణమును, ఎముకలను, దూదిని, కూర్మమును, మొఱుగుచున్నశునకమును, దక్షిణదిశయందు భయంకరముగ శబ్ద మొనరించుజంబుకమును, నఖములను, ఖండింపబడినశిరోజములను, విలపించుమనుష్యుని, అసత్యసాక్షిని, దొంగను, హంతకుని కులటయొక్క భర్తను పుత్రులను, దేవగురుబ్రాహ్మణధనముల నపహరించువారిని, దాన మొనరించి తిరిగి పరిగ్రహించువానిని, దారిదోపిడిగాండ్రను, దుష్టులను, మాతాపితలను బాధించువానిని, అసత్యవాదిని, కృతఘ్నుని, ఇతరుల జీవనమునపహరించుమనుష్యుని, విప్రద్రోహిని, మిత్రద్రోహిని, విశ్వాసఘాతకుని, దేవగురుబ్రాహ్మణులను నిందించువానిని, జీవహింసకుని, అంగహీనుని, నిర్దయుని, వ్రతోపవాసదీక్షారహితుని, నపుంసకుని, కుష్ఠరోగిని, త్రాగుబోతును, మదిరను, పిచ్చివానిని; దున్నపోతును, గార్దభమును, మూత్రమును కఫమును, పుట్టెను, పెనుగాలులను, రక్తవృష్టిని, తోడేలును, సూకరమును, గ్రద్దను, ఎలుగుబంటిని, ఎండినకాష్ఠమును, కాకిని, తంత్రమంత్రములచేజీవించువానిని, వైద్యుని, ఔషధమును, మరణించినవానిని, దుర్గంధయుక్తవాయువును, దారుణశబ్దములను మార్గమధ్యమున గార్తవీర్యార్జునుడు గాంచెను.

దుశ్శకునముల పరంపరను గాంచి రాజు మనస్సు దూషితమయ్యెను, ప్రాణము క్షుబ్ధమయ్యెను. అయినను నతడు మరలిపోక దృఢచిత్తుడై రణరంగమును జేరి యెదుట భృంగువంశరాకాసుధాకరుడైన బరశురాముని దర్శించి రథము డిగ్గి భక్తిపూర్వకముగ సాష్టాంగదండప్రణామము లర్పించెను. పరశురాముడు 'వైకుంఠము ప్రాప్తించుగాక' యనిసమ్రాట్టును దీవించెను. ఆయాశీర్వచనము రాజునకు మనోనుకూలముగనే యుండెను. సద్బ్రాహ్మణుల యాశీర్వచనము అనుల్లంఘనీయము గదా! తదనంతరము కార్తవీర్యుడు రథము నధిరోహించి శంఖనాద మొనరించి రణదుందుభులు మ్రోగుచుండ, ప్రచండరణమునకు సంసిద్ధుడయ్యెను. సమ్రాట్టునుగాంచి పరశురాము డిట్లు పల్కెను— "ధర్మిష్ఠా!. రాజేంద్రా! నీవు చంద్రవంశకులోత్పన్నుడవు, విష్ణ్వంశసంభూతుడైన దత్తాత్రేయుని శిష్యుడవు, బుద్ధిమంతుడవు, వేదవేదాంగ పారంగతుడవు, అయినను నీబుద్ధి వక్రించి లోభవశమున నిరపరాధి యైన నాజనకు నేలవధించితివి? నా తండ్రితో నామాతృదేవత సహగమన మొనరించినది. భూపాలా! నీకు వీరిర్వురిని జంపిన పాతకము గలిగినది. రాజా! సర్వజగములు తామరాకుపై నీటిబొట్టువలె మిథ్యలు, జీవి దేహమును ద్యజించినను దాను సంపాదించిన సుయశముకాని, అపశయముకాని నవశిష్టములై యుండును. సత్పురుషులకు దుష్కీర్తికంటే నధికవిడంబన మైనదేది యైన నుండగలదా? నీవాసించిన కామధేను వేమైనది? నీకు లభించెనా! నీ వొనరించినదుష్కృత్యమే యీదినమున నీకు మృత్యువై సాక్షాత్కరింప గలదు.

ధర్మాత్ముడైననాతండ్రి నీవు పరివారసహితముగ నాకలిగొనియుండుట గాంచి యాతిథ్య మొసంగెను. అయినను నీవు మంచిప్రతిఫలమునే యొసంగితివి. రాజా! ధర్మాత్ముడవని, మహాదాతవని, సర్వశ్రేష్ఠుడవని, బుద్ధిసంపన్నుడవని, పుణ్యశీలివని గణుతికెక్కినసీబుద్ధి యేలవక్రించినది? రాజా! జీవులకు దుర్వాక్యములు నిశితశాస్త్రములకంటె దుస్సహములు. అందువలననే సంకటసమయములయందు గూడ సత్పురుషుల ముఖమునుండి దుర్వచనములు బయల్వెడలవు. రాజేంద్రా! నేను నీపై దోషారోపణ మొనరించుటలేదు. జరిగిన విషయమును వివరించితిని. ఈ రణరంగమందు సూర్యవంశ, చంద్రవంశ, మనువంశజులగు రాజాధిరాజు లెందఱో సమావేశమైయున్నారు. వీరందఱి

నడుమ నీవు సత్యమును వచింపుము, నాకు ప్రత్యుత్తర మిమ్ము. సత్యాసత్య ములను నిష్పక్షపాతముగ వివరింపగల యెందఱో నరేశ్వరు లీప్రదేశమున నున్నారు. సమదృష్టియుక్తులైన సత్పురుషులు పక్షపాతమును వహింపరు గదా !”

పరశురాముని పలుకులు ములుకులై బాధింపగ గార్తవీర్యార్జును డిట్లు ప్రత్యుత్తర మొసఁగెను “రామా! నీవు శ్రీహరి యంశజుడవు, హరిభక్తుడవు, జితేంద్రియుడవు, ఆచార్యులకే ఆచార్యుడవు.

కర్మణా బ్రాహ్మణో జాతః కరోతి బ్రహ్మభావనమ్ ।
స్వధర్మనిరతః శుద్ధస్తస్మా ద్బ్రాహ్మణ ఉచ్యతే ॥

అన్తర్బహిశ్చ మననాత్కురుతే కర్మ నిత్యశః ।
మౌనీ శశ్వద్వదే త్కాలే యో హి స మునిరుచ్యతే ॥

స్వర్ణే లోష్టే గృహేఽరణ్యే పఙ్కే సుస్నిగ్ధచన్దనే ।
సమతా భావనా యస్య స యోగీ పరికీర్తితః ॥

సర్వజీవేషు యో విష్ణుం భావయేత్ సమతా ధియా ।
హరౌ కరోతి భక్తిం చ హరిభక్తః స చ స్మృతః ॥ 70-73

“సత్కర్మవశమున బ్రాహ్మణకులమం దుద్భవించి, బ్రహ్మచింతన మొన రించుచు తనధర్మమందు దత్పరుడై, శుద్ధాంతరంగుడై జీవించువానినే బ్రాహ్మణు డందురు. అంతరంగమందు మననముచేయుచు నిత్యము లోపల, బయట సత్కర్మము లొనరించుచు మౌనముగ నుండి సమయ మాసన్న మైనపుడే మాట్లాడుచు జీవించువానిని మౌనియందురు. సువర్ణమందుగాని, మట్టియందుగాని, గృహమునందుగాని, అరణ్యమునందుగాని, చందనమందు గాని, బురదయందుగాని సమభావ మున్నవానినే యోగియందురు. సమస్త ప్రాణులయందు సమబుద్ధికలిగి విష్ణువును భావించువానిని శ్రీహరిభక్తి యొన రించువానిని హరిభక్తు డందురు.”

బ్రాహ్మణులధనము తప మని మీ రెఱుగనిది కాదు. తపము కల్ప తరువుతో, కామధేనువుతో సమానము. అందువలననే సత్పురుషులు నిరం తరము తపమునందే యభిలాష కలిగియుందురు. వారే సత్త్వగుణసంపన్నులు.

రజోగుణయుక్తులైనపురుషులు కర్మములయందాసక్తులై రాజాసికకార్యము లొనరింతురు. రాగాంధులై రజోగుణయుక్తకార్యము లొనరింతురు. అందు వలననే అట్టివారిని రాజు లందురు. మునీశ్వరా! రాగమునకు వశుడనై కామధేనువు నర్థించితిని. ఇందు నాయపరాధ మేమి? మహాబలపరాక్రమసంపన్నులు, నాకింకరులు నగుననేకరాజులను మీపితృదేవులు సంహరించిరి. దేవా! మీరు పృథ్విని యిరువదియొక్క పర్యాయములు భూపాలశూన్యము గావించెద నని ప్రతిజ్ఞ గావించినారు. తత్క్షణమే మీప్రతిజ్ఞను పాలింపుడు. యుద్ధ మొనరించుట క్షత్రియులకు బరమధర్మము. యుద్ధమునందు మరణించుట వారికి నిందితవిషయముకాదు. కాని బ్రాహ్మణులు యుద్ధ మొనరించుట వేదసమ్మతము కాదు. వాణియే బలముగాగలవారు, తపమే ధనముగాగలవారు నగుబ్రాహ్మణులకు శాంతమే ప్రతియుగమందును స్వస్తికారకమైన కర్మము. శాంతిపరాయణులైనబ్రాహ్మణులు యుద్ధమునకు సంసిద్ధులగుట మే మింతవఱకును వినలేదు, కాంచలేదు.'' ఇట్లు రణరంగమధ్యమున కార్తవీర్యుడు పరశురామునకు బ్రత్యుత్తర మొసంగి మౌనము వహించెను.

ఆసమయమున మహాబలపరాక్రమవంతులైనపరశురామునిసోదరులు భయంకరము లగుశస్త్రాస్త్రములను ధరించి భృగురాము ననుజ్ఞ గైకొని యుద్ధమును బ్రారంభించిరి. కార్తవీర్యుని మిత్రుడైనమత్స్యనరేశ్వరుడు పరశురామునిసోదరులు యుద్ధోన్ముఖులగుట గాంచితానురణమునారంభించెను. మత్స్యదేశాధీశ్వరుడు బాణవర్షము గురిపించి వారిని నిలువరించెను. జమదగ్నినందనులాబాణసమూహములను ఛిన్నభిన్న మొనరించిరి. మునీశ్వరా నృపతి వందలకొలదిసూర్యులవలె బ్రకాశించుదివ్యాస్త్రమును బరశురాముని సేనపై బ్రయోగించెను, కాని యామహర్షులు రాజుప్రయోగించిన మాహేశ్వరాస్త్రమును మార్గమధ్యమందే ఖండించిరి. పిమ్మట మునులు దివ్యాస్త్రప్రయోగముల ద్వారమున మత్స్యదేశాధీశుని ధనువును, బాణములను, సారథిని, రథమును భేదించి వానిని విరథునిగజేసిరి. వారు రాజును సంహరింపగోరి శివునిత్రిశూలమును బ్రయోగింపబోగా ఆకాశవాణి వారి నిట్లుహెచ్చరించెను. “విప్రవరులారా! అమోఘమైనశివత్రిశూలమును మత్స్యరాజుపై బ్రయోగింపకుడు. ఎందువలెననగ, రాజు సర్వాంగములను రక్షింపగల దివ్యశివకవచమును ధరించియున్నాడు. ఆకవచమును బూర్వకాలమందు రాజునకు దుర్వాస

మహర్షి ప్రసాదించెను. మొదట రాజునుండి ప్రాణప్రద మైననాకవచము నర్థింపుడు". ఆపలుకులు నాలకించి పరశురాముడు సన్యాసరూపధారియై మత్స్యదేశాధీశ్వరుడు ధరించియున్న కవచము నర్థించెను. నృపాలుడు నిశ్శంకుడై తన్నురక్షించుచున్న 'బ్రహ్మాండవిజయ' మను నా శివకవచమును మాయావేషధారి యైనపరశురామునకు దాన మొనరించి ధన్యుడయ్యెను. తదనంతరము పరశురాముడు త్రిశూలమును బ్రయోగింపగా నాయస్త్రాఘాత మున చంద్రవంశకులోత్పన్నుడు, గుణవంతుడు, మహాబలసంపన్నుడు, శత చంద్రకాంతియుక్తముఖారవిందుడు నగుమత్స్యదేశాధీశ్వరుడు భౌతికకాయ మును త్యజించి కైలాసమున కరిగెను.

నా ర దు డు ప లి కె ను :

మహాభాగా ! మత్స్యరాజు ధరించినబ్రహ్మాండవిజయమనుశివకవచమును నా కుపదేశింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

బ్రహ్మాణ్డ విజయం నామ శివకవచమ్

శ్రీనారాయణ ఋషి ఉవాచ :

కవచం శృణు విప్రేన్ద్ర శంకరస్య మహాత్మనః ।
బ్రహ్మాణ్డవిజయం నామ సర్వావయవరక్షణమ్ ॥
పురా దుర్వాససా దత్తం మత్స్యరాజాయ ధీమతే ।
దత్త్వా షడక్షరం మన్త్రం సర్వపాపప్రణాశనమ్ ॥
స్థితే చ కవచే దేహే నాస్తి మృత్యుశ్చ జీవినామ్ ।
అస్త్రే శస్త్రే జలే వహ్నౌ సిద్ధిశ్చేన్నాస్తి సంశయః ॥
యద్ధృత్వా పఠనాత్సిద్ధో దుర్వాసా విశ్వపూజితః ।
జైగీషవ్యో మహాయోగీ పఠనాద్ధారణాద్యతః ॥
యద్ధృత్వా వామదేవశ్చ దేవలశ్చ్యవనః స్వయమ్ ।
అగస్త్యశ్చ పులస్త్యశ్చ బభూవ విశ్వపూజితః ॥
ఓం నమః శివాయేతి చ మస్తకం మే సదాఽవతు ।
ఓం నమః శివాయేతి చ స్వాహా ఫాలం సదాఽవతు ।
ఓం హ్రీం శ్రీం క్లీం శివాయేతి స్వాహా నేత్రే సదాఽవతు ॥

ఓం హ్రీం క్లీం హూం శివాయేతి నమో మే పాతు నాసికామ్ ।
ఓం నమః శివాయ శాన్తాయ స్వాహా కణ్ఠం సదాఽవతు ।
ఓం హ్రీం శ్రీం హూం సంహారకర్త్రే స్వాహా కర్ణౌ సదాఽవతు ॥

ఓం హ్రీం శ్రీం పంచవక్త్రాయ స్వాహా దన్తం సదాఽవతు ।
ఓం హ్రీం మహేశాయ స్వాహా చాధరం పాతు మే సదా ॥

ఓం హ్రీం శ్రీం క్లీం త్రినేత్రాయ స్వాహా కేశాన్ సదాఽవతు ।
ఓం హ్రీం ఐం మహాదేవాయ స్వాహా వక్షః సదాఽవతు ॥

ఓం హ్రీం శ్రీం క్లీం ఐం రుద్రాయ స్వాహా నాభిం సదాఽవతు ।
ఓం హ్రీం ఐం శ్రీం ఈశ్వరాయ స్వాహా పృష్ఠం సదాఽవతు ॥

ఓం హ్రీం క్లీం మృత్యుంజయాయ స్వాహా భ్రువౌ సదాఽవతు ।
ఓం హ్రీం శ్రీం క్లీం ఈశానాయ స్వాహా పార్శ్వం సదాఽవతు ॥

ఓం హ్రీం ఈశ్వరాయ స్వాహా ఉదరం పాతు మే సదా ।
ఓం శ్రీం క్లీం మృత్యుంజయాయ స్వాహా బాహూ సదాఽవతు ॥

ఓం హ్రీం శ్రీం క్లీం ఈశ్వరాయ స్వాహా పాతు కరౌ మమ ।
ఓం మహేశ్వరాయ రుద్రాయ నితమ్బం పాతు మే సదా ॥

ఓం హ్రీం శ్రీం భూతనాథాయ స్వాహా పాదౌ సదాఽవతు ।
ఓం సర్వేశ్వరాయ సర్వాయ స్వాహా సర్వం సదాఽవతు ॥

ప్రాచ్యాం మాం పాతు భూతేశ ఆగ్నేయ్యాం పాతు శంకరః ।
దక్షిణే పాతు మాం రుద్రో నైరృత్యాం స్థాణురేవ చ ॥

పశ్చిమే ఖణ్డపరశుర్వాయవ్యాం చన్ద్రశేఖరః ।
ఉత్తరే గిరీశః పాతు ఐశాన్యమీశ్వరః స్వయమ్ ॥

ఊర్ధ్వే మృడః సదా పాతు అధో మృత్యుంజయః స్వయమ్ ।
జలే స్థలే చాన్తరిక్షే స్వప్నే జాగరణే సదా ॥

పినాకీ పాతు మాం ప్రీత్యా భక్తం చ భక్తవత్సలః ॥

ఇతి తే కథితం వత్స కవచం పరమాద్భుతమ్ ।
దశలక్షజపేనైవ సిద్ధిర్భవతి నిశ్చితమ్ ॥

యది స్యాత్సిద్ధకవచో రుద్రతుల్యో భవేద్ధ్రువమ్ ।
తవ స్నేహాన్మయాఽఖ్యాతం ప్రవక్తవ్యం న కస్యచిత్ ॥

కవచం కాణ్వశాఖోక్తమతిగోప్యం సుదుర్లభమ్ ॥

అశ్వమేధసహస్రాణి రాజసూయశతాని చ।
సర్వాణి కవచస్యాస్య కలాం నార్హన్తి షోడశీమ్ ॥
కవచస్య ప్రసాదేన జీవన్ముక్తో భవేన్నరః।
సర్వజ్ఞః సర్వసిద్ధీశో మనోయాయి భవేద్ధ్రువమ్॥
ఇదం కవచమజ్ఞాత్వా భజేద్యః శంకరం ప్రభుమ్।
శతలక్షప్రజప్తోఽపి న మన్త్రః సిద్ధిదాయకః॥ 114-139

విప్రేంద్రా ! మహాత్మా ! సర్వాంగములను రక్షింపగల శంకరుని యొక్క బ్రహ్మాండవిజయమను కవచము నుపదేశించెద నవధరింపుము. పూర్వకాలమందు బుద్ధిమంతుడైన దుర్వాసమహర్షి సంపూర్ణ పాపములను సమూలముగ నాశ మొనరింపగల షడక్షరమహామంత్రమును మత్స్యరాజున కుపదేశించి యీయద్భుతకవచమును ప్రసాదించెను. ఈకవచమును సిద్ధింపచేసికొని శరీరమందుధరించినచో నస్త్రశస్త్రప్రహారములవలనగాని, జలమందుగాని, యగ్నియందుగాని ప్రాణులకుమృత్యువు సంభవింపదు, ఇందు లేశమాత్ర మైనను సంశయములేదు. ఈకవచమును బఠించి సిద్ధింపజేసికొని దుర్వాసమహర్షి లోకపూజితుడైనాడు. ఈకవచమును బఠించి, ధరించి జైగీషవ్యముని మహాయోగియైనాడు. ఈకవచనమును ధరించియే వామదేవుడు, దేవలుడు, స్వాయముగ చ్యవనుడు, అగస్త్యుడు, పులస్త్యుడు, విశ్వవంధితులైరి. 'ఓం నమః శివాయ' ఈమంత్ర మెల్లపుడు నామస్తకమును, ఓం నమః శివాయ స్వాహా నాలలాటమును, 'ఓం హ్రీం శ్రీం క్లీం శివాయ స్వాహా' ఇదినానేత్రములను, 'ఓం హ్రీం క్లీంహూం శివాయ నమః' ఇది నాసికను, 'ఓం నమః శివాయ శాన్తాయ స్వాహా' ఇది నాకంఠమును, 'ఓం హ్రీం శ్రీం హూం సంహారకర్త్రే స్వాహా' ఇది నాకర్ణములను, 'ఓం హ్రీం శ్రీం పంచవక్త్రాయ స్వాహా' ఇది నాదంతములను, 'ఓం హ్రీం మహేశాయ స్వాహా' ఇది నాయధరములను, 'ఓం హ్రీం శ్రీం క్లీం త్రినేత్రాయ స్వాహా' ఇది నాకేశములను, 'ఓం హ్రీం ఐం మహాదేవాయ స్వాహా' ఇది నావక్షస్థలమును, 'ఓం హ్రీం శ్రీం క్లీం ఐం రుద్రాయ స్వాహా' ఇదినా నాభిని, 'ఓం హ్రీం ఐం శ్రీం ఈశ్వరాయ స్వాహా' ఇదినాపృష్ఠభాగమును, 'ఓం హ్రీం క్లీం మృత్యుంజయాయ స్వాహా' ఇది నాభ్రుకుటులను, 'ఓం హ్రీం శ్రీం క్లీం ఈశానాయ స్వాహా' ఇదినాపార్శ్వభాగమును, 'ఓం హ్రీం ఈశ్వరాయ స్వాహా' ఇది

అశ్వమేధసహస్రాణి రాజసూయశతాని చ ।
సర్వాణి కవచస్యాస్య కలాం నార్హన్తి షోడశీమ్ ॥
కవచస్య ప్రసాదేన జీవన్ముక్తో భవేన్నరః ।
సర్వజ్ఞః సర్వసిద్ధీశో మనోయాయి భవేద్ధ్రువమ్ ॥
ఇదం కవచమజ్ఞాత్వా భజేద్యః శంకరం ప్రభుమ్ ।
శతలక్షప్రజప్తోఽపి న మన్త్రః సిద్ధిదాయకః ॥ 114-139

విప్రేంద్రా ! మహాత్మా ! సర్వాంగములను రక్షింపగల శంకరుని యొక్క బ్రహ్మాండవిజయమను కవచము నుపదేశించెద నవధరింపుము. పూర్వకాలమందు బుద్ధిమంతు డైనదుర్వాసమహర్షి సంపూర్ణ పాపములను సమూలముగ నాశ మొనరింపగల షడక్షరమహామంత్రమును మత్స్యరాజున కుపదేశించి యీయద్భుతకవచమును ప్రసాదించెను. ఈకవచమును సిద్ధింపచేసికొని శరీరమందుధరించినచో నస్త్రశస్త్రప్రహారములవలనగాని, జలమందుగాని, యగ్ని యందుగాని ప్రాణులకుమృత్యువు సంభవింపదు, ఇందు లేశమాత్ర మైనను సంశయము లేదు. ఈకవచమును బఠించి సిద్ధింపజేసికొని దుర్వాసమహర్షి లోకపూజితుడైనాడు. ఈకవచమును బఠించి, ధరించి జైగీషవ్యముని మహా యోగియైనాడు. ఈకవచనమును ధరించియే వామదేవుడు, దేవలుడు, స్వాయముగ చ్యవనుడు, అగస్త్యుడు, పులస్త్యుడు, విశ్వవంద్యితులైరి. 'ఓం నమః శివాయ' ఈమంత్ర మెల్లపుడు నామస్తకమును, ఓం నమః శివాయ స్వాహా నాలలాటమును, 'ఓం హ్రీం శ్రీం క్లీం శివాయ స్వాహా' ఇదినానేత్రములను, 'ఓం హ్రీం క్లీంహూం శివాయ నమః' ఇది నాసికను, 'ఓం నమః శివాయ శాన్తాయ స్వాహా' ఇది నాకంఠమును, 'ఓం హ్రీం శ్రీం హూం సంహారకర్త్రే స్వాహా' ఇది నాకర్ణములను, 'ఓం హ్రీం శ్రీం పంచవక్త్రాయ స్వాహా' ఇది నాదంతములను, 'ఓం హ్రీం మహేశాయ స్వాహా' ఇది నాయధరములను, 'ఓం హ్రీం శ్రీం క్లీం త్రినేత్రాయ స్వాహా' ఇది నాకేశములను, 'ఓం హ్రీం ఐం మహాదేవాయ స్వాహా' ఇది నావక్షస్థలమును, 'ఓం హ్రీం శ్రీం క్లీం ఐం రుద్రాయ స్వాహా' ఇదినా నాభిని, 'ఓం హ్రీం ఐం శ్రీం ఈశ్వరాయ స్వాహా' ఇదినాపృష్ఠభాగమును, 'ఓం హ్రీం క్లీం మృత్యుంజయాయ స్వాహా' ఇది నాభ్రుకుటులను, 'ఓం హ్రీం శ్రీం క్లీం ఈశానాయ స్వాహా' ఇదినాపార్శ్వభాగమును, 'ఓం హ్రీం ఈశ్వరాయ స్వాహా' ఇది

# ముప్పదియారవ అధ్యాయము

## కార్తవీర్యప్రేరితనరేశ్వరులు పరశురామునిచేసంహరింపబడుట : పరశురామసుచంద్రులయుద్ధము.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారదమునీంద్రా! ఘోరరణరంగమందు మత్స్యదేశాధీశ్వరుడు శివలోకమును బొందుటను కార్తవీర్యుడు గాంచి దుఃఖితుడై బృహద్బల, సోమదత్త, విదర్భాధీశ్వర, మిథిలేశ్వరులను, నిషధ, మగధ, కాన్యకుబ్జ, సౌరాష్ట్రనరేశ్వరులను; రాఢీయ, వారేన్ద్ర, వంగీయ, మహారాష్ట్ర గుర్జర, కలింగనరేశాద్యసంఖ్యాకనృపతులను బదిరెండక్షౌహిణులసేనతో బరశురాముని సహోదరులను సంహరింపవలసినదిగ బంపెను. కాని యఖండతేజస్వి యగుపరశురాముడాసైన్యము నంతటిని తృటిలో సంహరించెను. ఈదారుణదృశ్యమునుగాంచి యొకలక్షమందినృపతులను దోడ్కొని పదిరెండక్షౌహిణులసైన్యముతో సుచంద్రుడు రణరంగమందు పరశురాము నెదుర్కొనెను. పరశురాముడు సకలశస్త్రాస్త్రములతో ఘోరసంగ్రామ మొనరించినను సుచంద్రుడు పరాజితుడు కాలేదు. కపాలమాలాధారిణియు, వికటాననయు, భయంకరియు నగుభద్రకాళి వానిని సంరక్షించుచుండుటజూచి పరశురాముడు శస్త్రాస్త్రములను త్యజించి మహామాయను స్తుతింప నారంభించెను.

పరశురామ ఉవాచ :

నమః శంకరకాన్తాయై సారాయై తే నమో నమః ।
నమో దుర్గతినాశిన్యై మాయాయై తే నమో నమః ॥

నమో నమో జగద్ధాత్ర్యై జగత్కర్త్ర్యై నమో నమః ।
నమోఽస్తు తే జగన్మాత్రే కారణాయై నమో నమః ॥

ప్రసీద జగతాం మాతః సృష్టిసంహారకారిణి ।
త్వత్పాదే శరణం యామి ప్రతిజ్ఞాం సార్థికాం కురు ॥

త్వయి మే విముఖాయాం చ కో మాం రక్షితుమీశ్వరః।
త్వం ప్రసన్నా భవ శుభే మాం భక్తం భక్తవత్సలే ॥

యుష్మాభిః శివలోకే చ మహ్యాం దత్తో వరః పురా ।
తం వరం సఫలం కర్తుం త్వమర్హసి వరాననే ॥
జామదగ్న్యస్తవం శ్రుత్వా ప్రసన్నాభవదమ్బికా ।
మా భైరిత్యేవముక్త్వా తు తత్రైవాన్తరధీయత ॥
ఏతద్ భృగుకృతం స్తోత్రం భక్తియుక్తశ్చ యః పఠేత్ ।
మహాభయాత్ సముత్తీర్ణః స భవేదవలీలయా ॥
స పూజితశ్చ త్రైలోక్యే త్రైలోక్యవిజయీ భవేత్ ।
జ్ఞానిశ్రేష్ఠో భవేచ్చైవ వైరిపక్షవిమర్దకః ॥ 29-36

శంకరుని ప్రియపత్నివి, సారస్వరూపిణివి, దుర్గతినాశనివి, మాయారూపిణివి యగునీకు మాటిమాటికి నమస్కరించెదను. జగద్ధాత్రివి, జగత్కర్త్రివి, జగజ్జననివి, కారణరూపిణివి యగునీకు మాటిమాటికి అభివాదనములు. సృష్టిసంహారకారిణీ! జగన్మాతా! ప్రసన్నవు కమ్ము. నేను నీదివ్యచరణముల నాశ్రయించియున్నాను. నాప్రతిజ్ఞను సఫల మొనరింపుము. నీవే నాకు విముఖవైన నన్నెవరు రక్షింపగలరు? భక్తవత్సలా! నీభక్తుడనైననాపై ననుగ్రహింపుము. సుముఖీ ! మొదట శివలోకమందు నీవు నాకేవరమును బ్రసాదించితివో యా వరమును సఫలమొనరింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

పరశురామునిచే జేయబడినయీ స్తవము నాలకించి యంబిక ప్రసన్నయై అభయ మొసంగి యంతర్హితయయ్యెను. భక్తిపూర్వకముగ నీపరశురామకృతస్తోత్రమును బఠించునాతడు నిర్భయుడు కాగలడు. అతడు త్రిలోకపూజితుడు, త్రైలోక్యవిజయుడు, జ్ఞానులయందు శ్రేష్ఠుడు, శత్రువిమర్దనుడు కాగలడు.

ఆసమయమున బరశురామునకు బ్రహ్మసాక్షాత్కరించి యొకపరమరహస్యము నిట్లువెల్లడించెను. "మహాభాగా! రామా! నీవు నీప్రతిజ్ఞను సఫలీకృత మొనరించుకొనవలెనన్న మొదట సుచంద్రుని విజయమునకు హేతుభూతమైనపరమరహస్యమును నానుండిగ్రహింపుము. పూర్వకాలమందు దుర్వాసమహర్షి సుచంద్రునకు దశాక్షరీమహావిద్యను, పరమదుర్లభ భద్రకాళీ కవచమును నుపదేశించెను. ఆకవచము సర్వశత్రువినాశకము, అత్యంతపూజనీయము, ప్రశంసనీయము, త్రైలోకవిజయప్రాప్తికిగారణము. ఆకవచ మెవనిగళమునందుండునో వానిని జయించుట ఈభూతలముపైన నీకు సాధ్యము కాదు. అందు

వలన భార్గవరామా ! నీవు మాయావేషధారివై సుచంద్రు నాకవచము నర్థింపుము. సూర్యవంశమందు ప్రభవించిన నారాజాధిరాజు పరమధర్మాత్ముడు, మహాదాత. అర్థించినదెతడవుగ నానరేశ్వరుడు కవచమంత్రాదులనేకాక, ప్రాణమునైనను సమర్పింపగలడు''.

బ్రహ్మయాదేశానుసారముగ బరశురాముడు సన్యాసివేషధారియై సుచంద్రుని మంత్రసహితముగ నాపరమాద్భుతకవచము నర్థించెను. ఆక్షణమే యాదరపూర్వకముగ సుచంద్రుడు కవచసహితముగ దనసర్వమంత్రతంత్రవిద్యలను బరశురామునకు ధారపోసెను. అనంతరము భృగురాముడు పరమేశ్వర దత్తత్రిశూలమును బ్రయోగించి సుచంద్రసహితముగ సకలసైన్యమును సంహరించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణసంవాదమున
పరశురామునిచే సుచంద్రుడు నిహతుడగుట
యనుముప్పదియాఱవ అధ్యాయము
సంపూర్ణము.

— 0 —

## ముప్పదియేడవ అధ్యాయము

### దశాక్షరీవిద్య : భద్రకాళికాకవచ వర్ణనము

నారద ఉవాచ :

కవచం శ్రోతుమిచ్ఛామి తాం చ విద్యాం దశాక్షరీమ్ ।
నాథ త్వత్తో హి సర్వజ్ఞ భద్రకాల్యాశ్చ సామ్ప్రతమ్ ॥

నారాయణ ఉవాచ :

శృణు నారద వక్ష్యామి మహావిద్యాం దశాక్షరీమ్ ।
గోపనీయం చ కవచం త్రిషు లోకేషు దుర్లభమ్ ॥

ఓం హ్రీం శ్రీం క్లీం కాలికాయై స్వాహేతి చ దశాక్షరీమ్ ।
దుర్వాసా హి దదౌ రాజ్ఞే పుష్కరే సూర్యపర్వణి ॥

దశలక్షజపేనైవ మన్త్రసిద్ధిః కృతా పురా ।
పంచలక్షజపేనైవ పఠన్కవచముత్తమమ్ ॥

బభూవ సిద్ధకవచోఽప్యయోధ్యామాజగామ సః ।
కృత్స్నాం హి పృథివీం జిగ్యే కవచస్య ప్రసాదతః ॥

నారద ఉవాచ :

శ్రుతా దశాక్షరీ విద్యా త్రిషు లోకేషు దుర్లభా ।
అధునా శ్రోతుమిచ్ఛామి కవచం బ్రూహి మే ప్రభో ॥

నారాయణ ఉవాచ :

శృణు వక్ష్యామి విప్రేన్ద్ర కవచం పరమాద్భుతమ్ ।
నారాయణేన యద్దత్తం కృపయా శూలినే పురా ॥

త్రిపురస్య వధే ఘోరే శివస్య విజయాయ చ ।
తదేవ శూలినా దత్తం పురా దుర్వాససే మునే ॥

దుర్వాససా చ యద్దత్తం సుచన్ద్రాయ మహాత్మనే ।
అతిగుహ్యతరం తత్త్వం సర్వమన్త్రౌఘవిగ్రహమ్ ॥

ఓం హ్రీం శ్రీం క్లీం కాలికాయై స్వాహా మే పాతు మస్తకమ్।
క్లీం కపాలం సదా పాతు హ్రీం హ్రీం హ్రీమితి లోచనే ॥

ఓం హ్రీం త్రిలోచనే స్వాహా నాసికాం మే సదాఽవతు ।
క్లీం కాలికే రక్ష రక్ష స్వాహా దన్తాన్ సదాఽవతు ॥

హ్రీం భద్రకాలికే స్వాహా పాతు మేఽధరయుగ్మకమ్ ।
ఓం హ్రీం హ్రీం క్లీం కాలికాయై స్వాహా కణ్ఠం సదాఽవతు॥

ఓం హ్రీం కాలికాయై స్వాహా కర్ణయుగ్మం సదాఽవతు ।
ఓం క్రీం క్రీం క్లీం కాల్యై స్వాహా స్కన్ధం పాతు సదా మమ॥

ఓం క్రీం భద్రకాల్యై స్వాహా మమ వక్షః సదాఽవతు ।
ఓం క్రీం కాలికాయై స్వాహా మమ నాభిం సదాఽవతు॥

ఓం హ్రీం కాలికాయై స్వాహా మమ పృష్ఠం సదాఽవతు ।
రక్తబీజవినాశిన్యై స్వాహా హస్తౌ సదాఽవతు ॥

ఓం హ్రీం క్లీం ముణ్డమాలిన్యై స్వాహా పాదౌ సదాఽవతు।
ఓం హ్రీం చాముణ్డాయై స్వాహా సర్వాఙ్గం మే సదాఽవతు॥

ప్రాచ్యాం పాతు మహాకాలీ ఆగ్నేయ్యాం రక్తదన్తికా।
దక్షిణే పాతు చాముణ్డా నైరృత్యాం పాతు కాలికా॥

శ్యామా చ వారుణే పాతు వాయవ్యాం పాతు చణ్డికా।
ఉత్తరే వికటాస్యా చ ఐశాన్యాం సాట్టహాసినీ॥

ఊర్ధ్వం పాతు లోలజిహ్వా మాయాద్యా పాత్వధః సదా।
జలే స్థలే చాన్తరిక్షే పాతు విశ్వప్రసూః సదా॥

ఇతి తే కథితం వత్స సర్వమన్త్రౌఘవిగ్రహమ్।
సర్వేషాం కవచానాం చ సారభూతం పరాత్పరమ్॥

సప్తద్వీపేశ్వరో రాజా సుచన్ద్రోఽస్య ప్రసాదతః।
కవచస్య ప్రసాదేన మాన్ధాతా పృథివీపతిః॥

ప్రచేతా లోమశశ్చైవ యతః సిద్ధో బభూవ హ।
యతో హి యోగినాం శ్రేష్ఠః సౌభరిః పిప్పలాయనః॥

యది స్యాత్ సిద్ధకవచః సర్వసిద్ధీశ్వరో భవేత్।
మహాదానాని సర్వాణి తపాంసి చ వ్రతాని చ।
నిశ్చితం కవచస్యాస్య కలాం నార్హన్తి షోడశీమ్॥

ఇదం కవచమజ్ఞాత్వా భజేత్కాలీం జగత్ప్రసూమ్।
శతలక్ష ప్రజప్తోఽపి న మన్త్రః సిద్ధిదాయకః॥ 1—24

**నారదుడు పలికెను:**

సర్వజ్ఞా! నాథా! నేను నీముఖారవిందమునుండి భద్రకాళీకవచమును, దశాక్షరీవిద్యను శ్రవణ మొనరింపవలె నని కోరుచున్నాను.

**శ్రీ నారాయణఋషి పలికెను:**

నారదా! నేను దశాక్షరీమహావిద్యను, త్రిలోకములందును దుర్లభమైన, గోపనీయమైన కవచమును వర్ణించెదను సావధానచిత్తుడవై యవధరింపుము. 'ఓం హ్రీం శ్రీం క్లీం కాళికాయై స్వాహా' ఈమహామంత్రమే దశాక్షరీ విద్య. ఈమహావిద్యను పుష్కరతీర్థమందు సూర్యగ్రహణసమయమున

దుర్వాసమహర్షి సుచంద్రున కుపదేశించెను. ఆరాజు పదిలక్షలపర్యాయములు జపించి మన్త్రసిద్ధిపొందెను. ఉత్తమకాళీకాకవచము నైదులక్షల పర్యాయములు జపించి రాజు సిద్ధకవచుడై యయోధ్యకు వెడలి, మన్త్రకవచ కృపవలన సకలపృథ్విని జయించెను.

నారదుడు పలికెను :

ప్రభూ ! త్రిలోకములయందు దుర్లభ మైనదశాక్షరీవిద్యను నీ యనుగ్రహమువలన దెలిసికొనగల్గితిని. నాకు బరమాద్భుతకాళీకవచమును బ్రసాదింపవలసినదిగా బ్రార్థించుచున్నాను.

శ్రీ నారాయణఋషి పలికెను :

విప్రేంద్రా ! పూర్వకాలమందు త్రిపురాసురసంగ్రామసమయమున శివునకు విజయప్రాప్తికొఱకు శ్రీమన్నారాయణుడు కృపతో నీపరమాద్భుత కవచమును బ్రసాదించెను. ఆకవచమునే వర్ణించెద నవధరింపుము. మునీశ్వరా ! ఈకవచ మత్యంతగోపనీయము, తత్త్వస్వరూపము, సంపూర్ణమంత్ర సముదాయములు మూర్తీభవించిన స్వరూపము. ఈకవచమునే పూర్వకాలమందు శూలపాణియగుశంకరుడు దుర్వాసున కుపదేశించెను. దుర్వాస మహర్షి మహామనస్వి యైనసుచంద్రున కుపదేశించెను.

'ఓం హ్రీం శ్రీం క్లీం కాలికాయై స్వాహా' నామస్తకమును, 'క్లీం' నాకపాలమును, 'హ్రీంహ్రీంహ్రీం' నానేత్రములను, 'ఓం హ్రీం త్రిలోచనే స్వాహా' నానాసికను, క్లీం కాళికే రక్ష రక్ష స్వాహా' నాదంతములను, 'హ్రీం భద్రకాళికే స్వాహా' నా రెండుఅధరములను, ఓం హ్రీం హ్రీం క్లీం కాళికాయై స్వాహా' నాకంఠమును, 'ఓం హ్రీం కాళికాయై స్వాహా' నా రెండుకర్ణములను, 'ఓం క్లీం క్లీం క్లీం కాళ్యై స్వాహా' నాభుజములను, 'ఓం క్లీం కాళికాయై స్వాహా' నానాభిని, 'ఓం హ్రీం కాళికాయై స్వాహా' నాపృష్ఠభాగమును, 'రక్తబీజవినాశిన్యై స్వాహా' నాకరములను ఎల్లపుడు రక్షించుగాక. 'ఓంహ్రీం క్లీం ముణ్డమాలిన్యై స్వాహా' నాపాదములను, 'ఓం హ్రీం చాముణ్డాయై స్వాహా' నాసర్వాంగములను రక్షించుగాక. పూర్వదిశయందు మహాకాళి, అగ్నికోణమందు రక్తదంతిక, దక్షిణదిశ

యందుచాముణ్డ, నైరృత్యకోణమందు కాలిక, పశ్చిమదిశయందు శ్యామ, వాయవ్యకోణమందు చణ్డిక, ఉత్తరదిశయందు వికటాస్య, ఈశాన్యకోణ మందు అట్టహాసిని, ఊర్ధ్వభాగమందు లోలజిహ్వ, అథోభాగమందు ఆద్యా మాయ నన్ను రక్షించుగాక! జలమందు, స్థలమందు, అంతరిక్షమందు విశ్వ ప్రసువు నన్ను రక్షించుగాక!

వత్సా! ఈ కవచము సర్వమంత్రమూర్తిస్వరూపము, సర్వకవచసార భూతము, ఉత్కృష్టములకంటె నుత్కృష్టము. నే నీ కవచమును నీకుపదేశించి తిని. ఈ కవచధారణమువలననే సుచంద్రుడు సప్తద్వీపముల కధిపతియైనాడు. ఈ కవచప్రభావమువలననే మాంధాత సప్తద్వీపవతి యగునఖిలపృథ్వికి యధి పతియైనాడు. ఈ కవచబలమువలననే ప్రచేతసలోమశులు సిద్ధులైనారు. ఈ కవచప్రభావమువలననే సౌభరి పిప్పలాయనులు యోగులందు శ్రేష్ఠులైరి. ఈ కవచము సిద్ధించినవాడు సమస్తసిద్ధులకు స్వామికాగలడు. సర్వమహాదాన ఫలము, తపఃఫలము, వ్రతఫలము ఈ కవచసిద్ధిఫలములో బదునారవ యంశ కైనను సరిరావు; ఇది నిశ్చయము. ఈ కవచమును దెలిసికొనక జగజ్జనని యైన కాళిని భజించినచో, నెన్ని పర్యాయములు జపించినను మంత్రసిద్ధిని బొందలేరు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణసంవాద
మున భద్రకాళీకవచనిరూపణ మను
ముప్పదియేడవ అధ్యాయము
సంపూర్ణము.



# ముప్పదియొనిమిదవ అధ్యాయము

## పుష్కరాక్షపరశురాములయుద్ధము : విప్రవేషధారియై విష్ణువు పుత్రసహితు డగుపుష్కరాక్షునినుండి లక్ష్మీ కవచదుర్గాకవచముల నడుగుట.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదమహర్షీ! రణరంగమధ్యమున రాజాధిరాజులకు శిరోమణియైన సుచంద్రనృపాలుడు మరణింపగా వానికుమారు డగుపుష్కరాక్షుడు మహాబల పరాక్రమసంపన్నుడై మూడక్షౌహిణుల సైన్యముతో బరశురాము నెదిరించెను. అత్యంతతేజస్వి యైనపుష్కరాక్షుడు సూర్యవంశకులోద్భవుడు, శ్రీమహాలక్ష్మీసేవకుడు, ఐశ్వర్యసంపన్నుడు, ప్రచండసూర్యసమానప్రభావ శాలి. అతడు గళమునందు శ్రీమహాలక్ష్మీ దివ్యకవచమును ధరించియుండెను. ఆ కవచప్రభావమువలన నానృపాలు డజేయుడు. పుష్కరాక్షునిపై బరశు రాముని సోదరు లనేకశస్త్రాస్త్రముల బ్రయోగించిరి. కాని యా నరేశ్వరుడు లీలతో శస్త్రాస్త్రముల నన్నింటిని మార్గమధ్యముననే ఖండించివైచెను. రా జజేయు డనిగ్రహించి పరశురాముడు పాశుపతాస్త్రముదక్క అన్యాస్త్రముల నన్నింటిని బ్రయోగించెను. పుష్కరాక్షుడు తృటికాలములో నామహాస్త్ర సమూహము నుపసంహరింపజేసెను. సర్వాస్త్రములు వ్యర్థములుకాగా పరశు రాముడు పాశుపతాస్త్రము నభిమంత్రించుటకు సంసిద్ధుడయ్యెను. ఆ సమయ మున శ్రీమన్నారాయణుడు బ్రాహ్మణరూపవేషధారియై పరశురాము నెదుట సాక్షాత్కరించి యిట్లుపల్కెను. "వత్సా, భార్గవరామా! మానవుని సంహ రించుటకు పాశుపతమును సంధించుచున్నావా? ఈ మహాస్త్రము సకల విశ్వమును భస్మీపటలము చేయగలదు. శ్రీకృష్ణుని దక్క తదతిరిక్తమైన సర్వము నీయస్త్రము నాశనముచేయగలదు. పాశుపతాస్త్రమును నిలువరింప గలశక్తి యొక్కసుదర్శనచక్రముననే కలదు. పాశుపత సుదర్శనములు సకలాస్త్రములలోను బ్రధానములు. పుష్కరాక్షుని సంహరించు నుపాయము నే నుపదేశించెద నవధరింపుము. త్రిలోకములందు దుర్లభ మైనశ్రీమహాలక్ష్మీ

కవచమును పుష్కరాక్షుడు విధివిధానముగ గళమునందు ధరించియున్నాడు. పుష్కరాక్షుని కుమారుడు దుర్గతినాశని యగుదుర్గాదేవి పరమాద్భుత కవచమును దక్షిణభుజమందు ధరించియున్నాడు. ఈ కవచముల ప్రభావమువలన వా రిద్దరు విశ్వవిజయులు, నజేయులు నైయున్నారు. ఈ కవచములు వారి దేహములపై నుండగ నెంతటివా రైనను ఆనరేశ్వరులను జయింపలేరు. మునీశ్వరా ! నీప్రతిజ్ఞను సఫలమొనరించుటకొఱకు నేనే స్వయముగ నానరేశ్వరులనుండి కవచముల నర్థించెదను.” దివ్యబ్రాహ్మణుని వచనములను విని పరశురాముడు తా మెవ్వ రని ప్రశ్నింపగ నేను శ్రీమహావిష్ణువు ననిసమాధాన మిచ్చెను. పిమ్మట విష్ణువా నరేశ్వరులను సమీపించి కవచముల నర్థించెను. విష్ణుమాయామోహితు లైనవారు తాము ధరించిన దివ్యకవచములను బ్రాహ్మణరూపధారి యైనవిష్ణువునకు సమర్పించిరి. కవచములను గ్రహించి శ్రీమన్నారాయణు డంతర్హితుడయ్యెను.

నా ర దు డు ప లి కె ను :

మహామునీశ్వరా ! భూపాలు డైనపుష్కరాక్షునకు శ్రీమహాలక్ష్మీ కవచమును నెవరు ప్రసాదించిరి. పుష్కరాక్షునికుమారునకు దుర్గతినాశని యగుదుర్గాదేవిదుర్లభకవచము నెవ రుపదేశించిరి ? జగద్గురూ ! ఆకవచములను నా కుపదేశించి కవచఫలమును వర్ణింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదమహర్షీ ! పుష్కరాక్షునకు శ్రీమహాలక్ష్మీ కవచమును, దశాక్షర మహామంత్రమును సనత్కుమారుడు ప్రసాదించెను. ఆ మహర్షియే గోపనీయమగుస్తోత్రమును, దివ్యచరితమును, పూజావిధానమును, సామవేదోక్త ధ్యానమును నుపదేశించెను. దుర్గాదేవికవచము, గుహ్యస్తోత్రము, దశాక్షరమంత్రము దుర్వాసమహర్షి పుష్కరాక్షుని కుమారున కుపదేశించెను.

### శ్రీ మ హా ల క్ష్మ్యా మ న్త్రో ధ్యా న ం చ

మహాలక్ష్మ్యాశ్చ మన్త్రం చ శృణు తం కథయామి తే ।
ఓం శ్రీం కమలవాసిన్యై స్వాహేతి పరమాద్భుతమ్ ॥

ధ్యానమ్ చ సామవేదోక్తం శృణు పూజావిధిం మునే ।
దత్తం తస్మై కుమారేణ పుష్కరాక్షాయ ధీమతే ॥

సహస్రదలపద్మస్థాం పద్మనాభప్రియాం సతీమ్ ।
పద్మాలయాం పద్మవక్త్రాం పద్మపత్రాభలోచనామ్ ॥

పద్మపుష్పప్రియాం పద్మపుష్పతల్పవిశాయినీమ్ ।
పద్మినీం పద్మహస్తాం చ పద్మమాలావిభూషితామ్ ।

పద్మభూషణ భూషాఢ్యాం పద్మశోభావివర్ధినీమ్ ।
పద్మకాననం పశ్యన్తీం సస్మితాం తాం భజే ముదా ॥ 45-49

శ్రీమహాలక్ష్మిదివ్యమంత్రధ్యానములను నీ కుపదేశించెదను సావధాన చిత్తుడవై యవధరింపుము, 'ఓం శ్రీం కమలవాసిన్యై స్వాహా' ఇదియే పరమాద్భుత మైనశ్రీమహాలక్ష్మిమంత్రము. మునీశ్వరా ! సనత్కుమారుడు పుష్కరాక్షున కుదేశించినపూజావిధానమును, సామవేదోక్తధ్యానమునుగూర్చి చెప్పెదను అవధరింపుము. సహస్రదళకమలమే ఆసనముగా గలదియు, పద్మనాభునకు బ్రియపత్ని యైనదియు, కమలమే గృహముగా గలదియు, కమలము వంటి ముఖముగలదియు, కమలపత్రములవంటి విశాలనేత్రములు గలదియు, కమలపుష్పశయ్యపై శయనించునదియు, కమలముచే శోభిల్లుహస్తములు గల దియు, కమలపుష్పమాలను ధరించునదియు, కమలభూషణభూషిత యైనదియు, కమలములకే శోభను గలుగజేయునదియు, మందస్మితవదనయైనదియు, కమల వనమును వీక్షించునదియు నగునాపద్మినీదేవిని నే నానందపూర్వకముగ భజించెదను.

సాధకుడు చందనముతో నష్టదళకమలమును నిర్మించి యాకమలముపై శ్రీమహాలక్ష్మిని యావాహనచేసి కమలపుష్పములద్వారమున జననిని పూజింప వలెను. తదనంతరము గణసహితముగ మహాలక్ష్మి నారాధించి, షోడశోప చారముల నర్పింపవలెను. పిమ్మట స్తుతి యొనరించి సాష్టాంగదండప్రణా మము లర్పింపవలెను. మహర్షి ! సర్వసారస్వరూప మైనశ్రీమహాలక్ష్మికవచ మును వర్ణించెద నవధరింపుము.

శ్రీ నా రా య ణ ఋ షి ఉ వా చ :

సర్వసమ్పత్ప్రదస్యాస్య కవచస్య ప్రజాపతిః ।
ఋషిశ్ఛన్దశ్చ బృహతీ దేవీ పద్మాలయా స్వయమ్ ॥

ధర్మార్థకామమోక్షేషు వినియోగః ప్రకీర్తితః ।
పుణ్యబీజం చ మహతాం కవచం పరమాద్భుతమ్ ॥

ఓం హ్రీం కమలవాసిన్యై స్వాహా మే పాతు మస్తకమ్ ।
శ్రీం మే పాతు కపాలం చ లోచనే శ్రీం శ్రియై నమః ॥

ఓం శ్రీం శ్రియై స్వాహేతి చ కర్ణయుగ్మం సదాఽవతు ।
ఓం హ్రీం శ్రీం క్లీం మహాలక్ష్మ్యై స్వాహా మే పాతు నాసికామ్ ॥

ఓం శ్రీం పద్మాలయాయై చ స్వాహా దన్తం సదాఽవతు ।
ఓం శ్రీం కృష్ణప్రియాయై చ దన్తరన్ధ్రం సదాఽవతు ॥

ఓం శ్రీం నారాయణేశాయై మమ కణ్ఠం సదాఽవతు ।
ఓం శ్రీం కేశవకాన్తాయై మమ స్కన్ధం సదాఽవతు ॥

ఓం శ్రీం పద్మనివాసిన్యై స్వాహా నాభిం సదాఽవతు ।
ఓం హ్రీం శ్రీం సంసారమాత్రే మమ వక్షః సదాఽవతు॥

ఓం శ్రీం శ్రీం కృష్ణకాన్తాయై స్వాహా పృష్ఠం సదాఽవతు।
ఓం హ్రీం శ్రీం శ్రియై స్వాహా మమ హస్తౌ సదాఽవతు ॥

ఓం శ్రీం నివాసకాన్తాయై మమ పాదౌ సదాఽవతు ।
ఓం హ్రీం శ్రీం క్లీం శ్రియై స్వాహా సర్వాఙ్గం మే సదావఽతు

ప్రాచ్యాం పాతు మహాలక్ష్మీరాగ్నేయ్యాం కమలాలయా ।
పద్మా మాం దక్షిణే పాతు నైరృత్యాం శ్రీహరిప్రియా ॥

పద్మాలయా పశ్చిమే మాం వాయవ్యాం పాతు శ్రీః స్వయమ్।
ఉత్తరే కమలా పాతు ఐశాన్యాం సిన్ధుకన్యకా ॥

నారాయణేశీ పాతూర్ధ్వమధో విష్ణుప్రియాఽవతు ।
సతతం సర్వతః పాతు విష్ణుప్రాణాధికా మమ ॥

ఇతి తే కథితం వత్స సర్వమన్త్రౌఘవిగ్రహమ్ ।
సర్వైశ్వర్యప్రదం నామ కవచం పరమాద్భుతమ్ ॥

సువర్ణపర్వతం దత్త్వా మేరుతుల్యం ద్విజాతయే ।
యత్ఫలం లభతే ధర్మీ కవచేన తతోఽధికమ్ ॥

గురుమభ్యర్చ్య విధివత్కవచం ధారయేత్తు యః ।
కణ్ఠే వా దక్షిణే బాహౌ స శ్రీమాన్ ప్రతిజన్మని ॥

అస్తి లక్ష్మీర్గృహే తస్య నిశ్చలా శతపూరుషమ్ ।
దేవేన్ద్రైశ్చాసురేన్ద్రైశ్చ సోఽవధ్యం నిశ్చితం భవేత్ ॥
స సర్వపుణ్యవాన్ ధీమాన్ సర్వయజ్ఞేషు దీక్షితః ।
స స్నాతః సర్వతీర్థేషు యస్యేదం కవచం గలే ॥
యస్మై కస్మై న దాతవ్యం లోభమోహభయైరపి ।
గురుభక్తాయ శిష్యాయ శరణ్యాయ ప్రకాశయేత్ ॥
ఇదం కవచమజ్ఞాత్వా జపేల్లక్ష్మీం జగత్ప్రసూమ్ ।
కోటిసంఖ్యా ప్రజప్తోఽపి న మన్త్రః సిద్ధిదాయకః ॥ 64-82

విప్రవరా! పద్మనాభుడు తననాభికమలమున విరాజిల్లుచున్న బ్రహ్మ కుపదేశించిన పరమశుభకర మైనకవచము నుపదేశించెద నవధరింపుము. ఈ మహాద్భుతకవచమును బొంది కమలముపై నే యధిష్ఠించి బ్రహ్మ జగమును సృష్టించి మహాలక్ష్మీకృపవలన పరమైశ్వర్యవంతుడయ్యెను. పద్మాలయ యను గ్రహించిన వరప్రభావమువలననే బ్రహ్మ త్రిలోకముల కధీశ్వరుడయ్యెను. బ్రహ్మదేవుడు పాద్మకల్పమందు దనప్రియపుత్రు డైనసనత్కుమారున కీ కవచమునే యుపదేశించెను. నారదా! సనత్కుమారు డాకవచమును పుష్కరాక్షునకు బ్రసాదించెను. సర్వైశ్వర్యప్రదమగు నీశ్రీమహాలక్ష్మీకవచమును బఠించి, ధరించి బ్రహ్మ మహాత్ముడు, సమస్తసిద్ధులకు స్వామియు, బరమైశ్వర్యసంపన్నుడు, సమస్తసంపద్యుక్తుడు నయ్యెను.

సమస్తసంపదల నిచ్చు నీకవచమునకు బ్రజాపతి ఋషి. బృహతియే ఛందము, స్వయముగ పద్మాలయ దేవత. ధర్మార్థకామమోక్షములకొఱకే యీ కవచమును వినియోగింపవలెను. ఈ పరమాద్భుతకవచము మహాపురుషులకు బుణ్యకారణము. "ఓం హ్రీం కమలవాసిన్యై స్వాహా" నామస్తకమును, "శ్రీం" నాకపాలమును, "శ్రీం శ్రియై నమః" నానేత్రములను, "ఓం శ్రీం శ్రియై స్వాహా" నాకర్ణములను, "ఓం హ్రీం శ్రీం క్లీం మహాలక్ష్మ్యై స్వాహా" నానాసికను, "ఓం శ్రీం పద్మాలయాయై స్వాహా" నాదంతములను, "ఓం శ్రీం కృష్ణప్రియాయై స్వాహా" నాదంతఛిద్రములను, "ఓం శ్రీం నారాయణేశాయైస్వాహా" నాకంఠమును, "ఓం శ్రీం కేశవకాంతాయై స్వాహా" నా భుజములను, "ఓం శ్రీం పద్మనివాసిన్యై స్వాహా" నానాభిని, "ఓం హ్రీం శ్రీం సంసారమాత్రే స్వాహా" నావక్షస్థలమును, "ఓం శ్రీం

శ్రీం కృష్ణకాన్తాయై స్వాహా" నాపృష్ఠభాగమును, "ఓం హ్రీం శ్రీం శ్రియై స్వాహా" నాకరములను, "ఓం శ్రీం నివాసకాన్తాయైస్వాహా" నాపాదములను, "ఓం హ్రీం శ్రీం క్లీం శ్రియై స్వాహా" నానసర్వాంగముల నెల్లపుడు రక్షించుగాక! పూర్వదిశయందు మహాలక్ష్మి, అగ్నికోణమందు కమలాలయ, దక్షిణదిశయందు పద్మ, నైరృత్యకోణమందు శ్రీహరిప్రియ, పశ్చిమదిశయందు పద్మాలయ, వాయవ్యకోణమందు స్వయముగ శ్రీ, ఉత్తరదిశయందు కమల, ఈశానకోణమందు సిన్ధుకన్యక, ఊర్ధ్వభాగమందు నారాయణేశి, అధోభాగమందు విష్ణుప్రియ నన్నురక్షించుగాక! విష్ణుప్రాణాధిక అన్నివైపుల నన్ను రక్షించుగాక!

వత్సా! ఇట్లు నేను నీకు సర్వైశ్వర్యప్రద మనుపరమాద్భుతకవచమును వర్ణించితిని. ఈకవచము సమస్తమంత్రసముదాయములకు మూర్తిమత్స్వరూపము. ధర్మాత్ముడైనపురుషుడు సద్బ్రాహ్మణులకు మేరుసమానసువర్ణపర్వతమును దాన మొనరించిన నేఫలము గలుగునో అంతకంటె నధికఫల మీకవచమువలన గలుగును. విధిపూర్వకముగ గురువు నర్చించి, కవచోపదేశము పొంది, దానిని గళమునందుగాని దక్షిణభుజమునందుగాని ధరించు మానవు డనేకజన్మములందు శ్రీసంపన్నుడు కాగలడు. ఆభక్తునిగృహమందు శ్రీమహాలక్ష్మి నూఱుతరములవఱకు నిశ్చలరూపముగ నివసించును. అతడు దేవతలకుగాని, రాక్షసులకుగాని, మఱియెవ్వరికైనను నిశ్చయముగ నవధ్యుడు కాగలడు. ఎవనిగళమం దీకవచముండునో వానికి సర్వపుణ్యఫలములు, సర్వయజ్ఞదీక్షాగ్రహణఫలములు, సమస్తతీర్థస్నానఫలములు లభింపగలవు. లోభమోహభయములవలన నీయద్భుతకవచము నెవ్వరికిని యుపదేశింపరాదు. శరణాగతుడు, గురుభక్తుడు నగుశిష్యునకు మాత్రమే ఈకవచమును బ్రసాదించవలెను. ఈకవచజ్ఞానమును బొందక సాధకుడు జగజ్జనని యగులక్ష్మిని యారాధించి జపించినను మంత్రసిద్ధిని బొందలేడు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ సంవాదమున
సర్వైశ్వర్యప్రదమగు శ్రీమహాలక్ష్మీకవచవర్ణన
మను ముప్పదియెనిమిదవ అధ్యాయము
సంపూర్ణము.

## ముప్పదితొమ్మిదవ అధ్యాయము

### బ్రహ్మాండవిజయ మను శ్రీదుర్గాదేవికవచవర్ణనము

**నారదుడు పలికెను :**

ప్రభో ! నీ యనుగ్రహమువలన శ్రీమహాలక్ష్మీకవచమును శ్రవణమొనరించితిని. పద్మాక్షునకు ప్రాణతుల్యమైన, జీవనప్రదమైన, బలకారణమైన, కవచసారతత్త్వమైన, దుర్గతినాశని యగుదుర్గాదేవిదివ్యకవచమును నుపదేశింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

**శ్రీ నారాయణఋషి ఉవాచ :**

శృణు నారద వక్ష్యామి దుర్గాయాః కవచం శుభమ్ ।
శ్రీకృష్ణేనైవ యద్దత్తం గోలోకే బ్రహ్మణే పురా ॥

బ్రహ్మ త్రిపురసంగ్రామే శంకరాయ దదౌ పురా ।
జఘాన త్రిపురం రుద్రో యద్ధృత్వా భక్తిపూర్వకమ్ ॥

హరో దదౌ గౌతమాయ పద్మాక్షాయ చ గౌతమః ।
యతో బభూవ పద్మాక్షః సప్తద్వీపేశ్వరో జయీ ॥

యద్ధృత్వా పఠనాద్బ్రహ్మ జ్ఞానవాన్ శక్తిమాన్ భువి ।
శివో బభూవ సర్వజ్ఞో యోగినాం చ గురుర్యతః ॥
శివతుల్యో గౌతమశ్చ బభూవ మునిసత్తమః ॥

బ్రహ్మాణ్డవిజయస్యాస్య కవచస్య ప్రజాపతిః ।
ఋషిశ్ఛన్దశ్చ గాయత్రీ దేవీ దుర్గతినాశినీ ॥

బ్రహ్మాణ్డవిజయే చైవ వినియోగః ప్రకీర్తితః ।
పుణ్యతీర్థం చ మహతాం కవచం పరమాద్భుతమ్ ॥

ఓం హ్రీం దుర్గతినాశిన్యై స్వాహా మే పాతు మస్తకమ్ ।
ఓం హ్రీం మే పాతు కపాలం చ ఓం హ్రీం శ్రీమితి లోచనే ॥

పాతు మే కర్ణయుగ్మం చ ఓం దుర్గాయై నమః సదా ।
ఓం హ్రీం శ్రీమితి నాసాం మే సదా పాతు చ సర్వతః ॥

హ్రీం శ్రీం హ్రూమితి దన్తాని పాతు క్లీమోష్ఠయుగ్మకమ్ ।
క్రీం క్రీం క్రీం పాతు కణ్ఠం చ దుర్గే రక్షతు గణ్డకమ్ ॥

స్కన్ధం దుర్గవినాశిన్యై స్వాహా పాతు నిరన్తరమ్ ।
వక్షో విపద్వినాశిన్యై స్వాహా మే పాతు సర్వతః ॥

దుర్గే దుర్గే రక్షిణీతి స్వాహా నాభిం సదాఽవతు ।
దుర్గే దుర్గే రక్ష రక్ష పృష్ఠం మే పాతు సర్వతః ॥

ఓం హ్రీం దుర్గాయై స్వాహా చ హస్తౌ పాదౌ సదాఽవతు ।
ఓం హ్రీం దుర్గాయై స్వాహా చ సర్వాఙ్గం మే సదాఽవతు ॥

ప్రాచ్యాం పాతు మహామాయా ఆగ్నేయ్యాం పాతు కాలికా ।
దక్షిణే దక్షకన్యా చ నైరృత్యాం శివసున్దరీ ॥

పశ్చిమే పార్వతీ పాతు వారాహీ వారుణే సదా ।
కుబేరమాతా కౌబేర్యామైశాన్యామీశ్వరీ సదా ॥

ఊర్ధ్వే నారాయణీ పాతు అమ్బికాధః సదాఽవతు ।
జ్ఞానే జ్ఞానప్రదా పాతు స్వప్నే నిద్రా సదాఽవతు ॥

ఇతి తే కథితం వత్స సర్వమన్త్రౌఘవిగ్రహమ్ ।
బ్రహ్మాణ్డవిజయం నామ కవచం పరమాద్భుతమ్ ॥

సుస్నాతః సర్వతీర్థేషు సర్వయజ్ఞేషు యత్ఫలమ్ ।
సర్వవ్రతోపవాసే చ తత్ఫలం లభతే నరః ॥

గురుమభ్యర్చ్య విధివద్ వస్త్రాలంకారచన్దనైః ।
కణ్ఠే వా దక్షిణే బాహౌ కవచం ధారయేత్తు యః ॥

స చ త్రైలోక్యవిజయీ సర్వశత్రుప్రమర్దకః ।
ఇదం కవచమజ్ఞాత్వా భజేద్దుర్గతినాశనీమ్ ॥

శతలక్షప్రజప్తోఽపి న మన్త్రః సిద్ధిదాయకః ॥

కవచం కాణ్వశాఖోక్తముక్తం నారద సున్దరమ్ ।
యస్మై కస్మై న దాతవ్యం గోపనీయం సుదుర్లభమ్॥3-23

నారదా ! ప్రాచీనకాలమందు శ్రీకృష్ణపరమాత్మ గోలోకములో బ్రహ్మదేవునకు దుర్గాదేవికవచము నుపదేశించెను. ఆకవచమును వర్ణించెద నవధరింపుము. ప్రాచీనకాలమందు త్రిపురాసురసంగ్రామసమయమున బ్రహ్మ

దేవుడీకవచమును శంకరునకు ప్రసాదించెను. శంకరుడు భక్తిపూర్వకముగ నీకవచమును ధరించి త్రిపురాసురులను సంహరించెను. మహాదేవు డాకవచమునే గౌతమున కనుగ్రహించెను. గౌతముడు పద్మాక్షున కుపదేశించెను. దానిప్రభావమువలననె పద్మాక్షుడు సప్తద్వీపముల కధిపతియయ్యెను. ఆకవచమును బఠించి, ధరించి బ్రహ్మదేవుడు జ్ఞానవంతుడు, శక్తిసంపన్నుడు నయ్యెను. ఈకవచప్రభావమువలననే శివుడు సర్వజ్ఞుడై యోగులకే యాచార్యుడైనాడు. మునిశ్రేష్ఠుడైనగౌతమమహర్షి శివతుల్యుడనబడినాడు. ఈ బ్రహ్మాండవిజయ మనుకవచమునకు బ్రజాపతియే ఋషి, గాయత్రియే ఛందము, దుర్గతినాశని యగుదుర్గయే దేవి. బ్రహ్మాణ్డవిజయప్రాప్తికొఱ కీకవచము నుపయోగింపవలెను. ఈపరమాద్భుతకకవచము మహాపురుషులకు బుణ్యతీర్థము వంటిది.

'ఓం హ్రీం దుర్గతినాశిన్యై స్వాహా' నామస్తకమును, 'ఓం హ్రీం' నాకపాలమును, 'ఓం హ్రీం శ్రీం' నానేత్రములను, 'ఓం దుర్గాయై నమః' నాకర్ణములను, 'ఓం హ్రీం శ్రీం' నానాసికను, హ్రీం శ్రీం హూం' నాదంతములను, 'క్లీం'నాయధరములను, 'క్రీం క్రీం క్రీం' నాకణ్ఠమును. దుర్గ నాకపోలములను, 'దుర్గతినాశిన్యైస్వాహా' నిరంతరమునాభుజములను, విపద్వినాశిన్యై స్వాహా' అన్నివైపులనుండి నావక్షఃస్థలమును, 'దుర్గే దుర్గే రక్షణీతి స్వాహా'నానాభిని, 'దుర్గే దుర్గే రక్ష రక్ష' అన్నివైపులనుండి నాపృష్ఠభాగమును, 'ఓం హ్రీం దుర్గాయై స్వాహా' నాకరములను, పాదములను, 'ఓం హ్రీం దుర్గాయై స్వాహా' నాసర్వాంగములను రక్షించుగాక! పూర్వదిశయందు మహామాయ, అగ్నికోణమందు కాలిక, దక్షిణదిశయందు దక్షకన్య, నైరృత్యకోణమందు శివసుందరి, పశ్చిమదిశయందు పార్వతి, వాయవ్యకోణమందు వారాహి, ఉత్తరదిశయందు కుబేరమాత, ఈశానకోణమం దీశ్వరి, ఊర్ధ్వభాగమందు నారాయణి, అధోభాగమందు అంబిక, జాగ్రదాస్థపయందు జ్ఞానప్రదాయిని,నిద్రావస్థయందు నిద్రారూపిణి యెల్లపుడు నన్ను రక్షించుగాక!

వత్సా! ఇట్లు నేను నీకీబ్రహ్మాణ్డవిజయ మనుదుర్గాకవచము నుపదేశించితిని. ఈపరమాద్భుతకవచము సర్వమంత్రసముదాయములయొక్క-మూర్తీభవించినస్వరూపము. సమస్తతీర్థస్నానములవలన సమస్తయజ్ఞానుష్ఠానములవలన సర్వవ్రతోపవాసములవలన గలుగు ఫలము లన్నియు ఈకవచమును

ధరించినమానవునకు లభింపగలవు. విధిపూర్వకముగ వస్త్రాలంకారచందనములతో గురువును బూజించి, ఈకవచము నుపదేశము పొంది, దీనిని గళమునందుగాని, దక్షిణభుజమునందుగాని ధరించువాడు సర్వశత్రుమర్దనుడు, త్రిలోకవిజయుడు కాగలడు. ఈకవచమును గ్రహింపక దుర్గతినాశని యగుదుర్గనారాధించి కోట్లకొలదిగ జప మొనరంచినను మానవుడు మంత్రసిద్ధిని పొందలేడు. నారదా! ఈసుందరకవచము కాణ్వశాఖోక్తము, పరమగోపనీయము, అత్యంతదుర్లభము. ఈకవచమును యోగ్యుడైనవానికే యుపదేశింపవలెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణసంవాదమున
బ్రహ్మాండవిజయ మను శ్రీదుర్గాదేవికవచవర్ణన
మనుముప్పదితొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము.

— 0 —

# నలుబదియవ అధ్యాయము

## పరశురాముడు పాశుపతాస్త్రముచే గార్తవీర్యార్జునుని వధించి యిరువదియొక్కమారులు పృథ్విని క్షత్రియశూన్యము గావించుట.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

దేవర్షీ! శ్రీమహావిష్ణువు పరశురాముని విజయము నభిలషించి వృద్ధబ్రాహ్మణవేషధారియై రణరంగమందు ప్రచండభానునివలె స్వైరవిహారమొనరించుచున్నసహస్రాక్షాదులను సమీపించి సహస్రాక్షుని, వానికుమారుని శ్రీమహాలక్ష్మీదుర్గాకవచముల నర్థించి, వానిని గ్రహించి యంతర్హితుడయ్యెను. నరేశ్వరులు కవచహీను లగుట వీక్షించి భృగురాముడు సహస్రాక్షాగులపై

దివ్యాస్త్రప్రయోగ మారంభించెను. దివ్యకవచములను దాన మొనరించినను ఆ క్షత్రియోత్తములు బ్రహ్మాస్త్రప్రభావమువలన నొకసప్తాహకాలము పరశురాముని నిలువరించిరి. కాని దివ్యపాశుపతాస్త్రప్రహారమువలన నాజగద్విఖ్యాతనరేశ్వరులు వీరస్వర్గ మలంకరించిరి.

తనకు దక్షిణభుజసదృశు డైనసహస్రాక్షుడు మరణింపగనే స్వయముగ మహాబలి యగుకార్తవీర్యార్జునుడు రెండులక్షలయక్షౌహిణులసైన్యములతో యుద్ధరంగమున బరశురాముని దాకెను. రత్ననిర్మితగోపురములతో గూడియున్న స్వర్ణమయరథమునం దధిరూఢుడై యస్త్రశస్త్రసమన్వితుడై కార్తవీర్యుడు రణరంగమందు బరశురాముని నిలువరించెను. భృగువంశశిరోమణి మహావీరు డైనకార్తవీర్యుని సమరభూమియందు వీక్షించెను. అతడు రత్ననిర్మిత భూషణవిభూషితుడు, ఛత్రధారియు, చందనచర్చితుడు, మనోహరరూపలావణ్య సంపన్నుడు, మందస్మితవదనుడు నై అసంఖ్యాకనరేశ్వరులతో బరివేష్టితు డై యుండెను. కార్తవీర్యార్జునుడు పరశురామునిదర్శించి వినీతభావముతో రథము డిగ్గి సాష్టాంగదండప్రణామములర్పించెను. పరశురాముడు 'ససైన్యముగనీకు వీరస్వర్గము లభించుగాక' యనియాశీర్వదించెను. నారదా! తదనంతర మిరుపక్షములమధ్య ఘోరసంగ్రామ మారంభమయ్యెను. పరశురాముని శిష్యులు, మహావీరు లైనసోదరులు కార్తవీర్యుని శరపరంపరలకు దాళలేక పలాయనము చిత్తగించిరి. నరేశ్వరుని యసంఖ్యాకబాణసమూహములచే రణరంగ మాచ్ఛాదిత మైయున్నకారణమున శస్త్రధారులందు శ్రేష్ఠు డైనబరశురామునకు దనసైన్యముగాని, వైరిసైన్యముగాని కానరాలేదు. కేవలము ప్రచండసూర్యునివలె విక్రమించుచున్న కార్తవీర్యుడగుపించెను. అనంతర మామహావీరు లిర్వురు పరస్పరము దివ్యాస్త్రప్రయోగము లొనరించిరి. కార్తవీర్యుడు దత్తాత్రేయదత్తము, దివ్యాస్త్రశిరోమణియు నగు యమోఘత్రిశూలము నభిమంత్రించి పరశురామునిపై బ్రయోగించెను. వందల కొలదిప్రచండసూర్యులవలె ప్రకాశించునదియు, ప్రళయాగ్నిశిఖవలె బ్రజ్వరిల్లుచున్నదియు నగునాత్రిశూలాఘాతమువలన బరశురాముడు చేతనారహితుడై రణరంగమం దొరిగిపోయెను. తనశిష్యుడు చేతనారహితు డగుటగాంచి సదాశివుడు పరశురామునకు జైతన్యమును గలుగజేసెను. శివచైతన్యయుక్తుడై విజృంభించినపరశురాముని త్రిలోకములం దెవ్వరును నెదిరింపలేరు. అందు

వలన స్వయముగ దత్తాత్రేయుడే తనభక్తుని రక్షించుటకు యుద్ధరంగమున సాక్షాత్కరించెను. నరేశ్వరుని వధించుటకు పాశుపతాస్త్రమును ధరించి యున్న పరశురాముడు భక్తవత్సలుడైన దత్తాత్రేయుని ప్రభావమువలన స్తంభితుడయ్యెను. కింకర్తవ్యతావిమూఢుడై పరశురాముడు రణరంగ మధ్యమున ప్రకాశించుచున్న శ్రీకృష్ణపరమాత్మను కన్నుల కఱవుదీర దర్శించెను. ఆసచ్చిదానందవిగ్రహుని శరీరకాంతి నూతనజలధరసదృశము. ఆపరమాత్మ మురళీనాదవినోదియై, గోపగోపీజనపరివేష్టితుడై, దివ్యపార్షదసేవితుడై, మందస్మితవదనుడై, బ్రహ్మవిష్ణుమహేశ్వరాదిసకలదేవతాస్తుత్యుడై, సుదర్శనచక్రధారియై గోపవేషముతో గార్తవీర్యుని రక్షించుచు పరశురామునకు దివ్యదర్శన మొసంగెను. కార్తవీర్యునిసౌభాగ్యమును భృగురాముడు వేనోళ్ళపొగడెను. ఆసమయమున పరశురాముని యశరీరవాణి యిట్లాదేశించెను. "బ్రాహ్మణోత్తమా! దత్తాత్రేయదత్తమైన శ్రీకృష్ణ కవచము నుత్తమరత్నగుటికయం దుంచి కార్తవీర్యుడు దక్షిణభుజమందు ధరించియుండెను. స్వయముగ శంకరుడే భిక్షుకబ్రాహ్మణరూపమున శ్రీకృష్ణ కవచ మర్థించి గ్రహింపవలెను. తదనంతరమే నీ వాక్షత్రియోత్తముని వధింపగలవు." అయ్యశరీరవాణి నాలకించి భక్తవత్సలుడైనశివుడు బ్రాహ్మణరూపము ధరించి కార్తవీర్యునికవచ మర్థించెను. దాతలయందు శ్రేష్ఠుడైనయానరేశ్వరు డర్థింపగనే తనప్రాణసదృశమైనదివ్యకవచమును నిస్సంకోచముగ, భక్తిసమన్వితముగ మహాదేవున కర్పించి చరితార్థుడయ్యెను. ఆకవచమును హరుడు పరశురామునకు బ్రసాదించెను.

దత్తాత్రేయదత్తమైనశ్రీకృష్ణదివ్యకవచమును ధరించి పరశురాముడనంతకోటిసూర్యప్రభాభాసమానుడై యుండెను. ఆ సమయమున గార్తవీర్యుని యుద్ధముకొఱకై ప్రేరేపించుచు పరశురాము డిట్లుపల్కెను. "రాజేంద్రా! లెమ్ము, సాహసయుక్తుడవై యుద్ధ మొనరింపుము. మనుష్యుల జయాపజయములను కాలమే నిర్ణయింపగలదు. నీవు విధిపూర్వకముగ సకలశాస్త్రముల నధ్యయన మొనరించిన మహాపండితుడవు; అఖండదానసంపన్నుడవు, సమస్త ధరాతలమును ధర్మము తప్పక పాలించు నరేశ్వరుడవు, రణరంగమందు నన్నే మూర్ఛితునిగ నొనరించి యఖండయశస్సంపన్నుడవైతివి. రాజా! లీలాపూర్వకముగ రావణునే జయించిన మహావీరుడవు. దత్తాత్రేయప్రదత్తమైనదివ్య

త్రిశూలముచే నన్ను బరాజితునిగ నొనరించితివి. కాని అస్మద్గురువరేణ్యు డైన శంకర భగవానుని కృపవలన సకల విఘ్నములను నాశన మొనరించితిని"

పరశురాముని వచనములను విని పరమధర్మాత్ము డైన కార్తవీర్యుడు శిరము వంచి ప్రణామము లర్పించి యిట్లుపల్కెను. "ప్రభూ! నే నధ్యయన మొనరించిన విద్య యేపాటిది! నాదానధర్మము లేపాటివి! నాశాసనశక్తి యెంత? ఈ ధరణీతలముపై నాకంటె నున్నతోన్నతు లైనయసంఖ్యాక నరేశ్వరు లెందఱో యుద్భవించి గతించిరి. దేవా! ఈపాంచభౌతిక శరీరము నశ్వరము. నాబుద్ధి, తేజము, పరాక్రమము, యుద్ధనైపుణ్యము, ఐశ్వర్యము, జ్ఞానము, లౌకికగుణములు, ఆచారము, విద్య, ప్రతిష్ఠ, తపము మొదలగునవి యన్నియు నాహృదయేశ్వరి యైనమనోరమతోడనే నశించినవి. పతివ్రత యైన నా భార్య నన్ను వీడినపుడే నేను మృతుడనైతిని. సమయ మాసన్న మైన ఇంద్రుని నైనను మానవునిగ జేయగలదు. కాల మాసన్న మైనచో బ్రహ్మయైనను మరణింపకతప్పదు. వీరే కాదు, కాలప్రభావమువలన స్వయముగ బ్రకృతికూడ శ్రీకృష్ణునిదివ్యవిగ్రహమందు తిరోహితయగును. కాలము నతిక్రమించుట యెంతటివారి కైనను దుష్కరమే. కాలము పరాత్పరు డైన శ్రీకృష్ణుని స్వరూపమే. కాలమే స్వేచ్ఛానుసారముగ సృష్టికర్తకు స్రష్టయై సంహారకర్తకు సంహారకమై, పాలనకర్తకు పాలకమై వర్తించును. ఏమహాపురుషుడు స్థూలముకంటె స్థూలమో, సూక్ష్మముకంటె నతిసూక్ష్మమో, పరమాణువునకే యాదికారణమో, కాలమునకే కాలమో, అఖిలవిశ్వము లన్నియు నెవనిరోమకూపములందు భ్రమించుచున్నవో, క్షుద్రవిరాట్పురుషు డెవనినుండి యుద్భవించెనో, ఏమహాపురుషుడు సర్వమునకు నుత్కృష్ట కారణమో, ఆమహావిరాట్పురుషుడు పరబ్రహ్మమైనశ్రీకృష్ణుని షోడశాంశకు సమానము. స్వయముగ స్రష్ట యైనయాజగన్నాథుని నాభికమలమునుండి యుద్భవించి యత్నపూర్వకముగ లక్షలకోలదిదివ్యవర్షములు వెదకినను బ్రహ్మ కమలదండముయొక్కయంతమునే తెలిసికొనలేక స్వస్థలమం దుండి వాయుభక్షణచే నసంఖ్యదివ్యవర్షము లాయననుగూర్చి తప మొనరించెను. తదనంతరమే గోలోకమున పార్షదసహితముగ శ్రీకృష్ణపరమాత్మను బ్రహ్మ దర్శింపగలైను.

ఆసమయమున శ్రీకృష్ణపరమాత్మ గోపగోపీపరివేష్టితుడై, ద్విభుజధారియై, కరములందు మురళిని ధరించి, వక్షస్థలమున రాధాదేవిని నిలుపుకొని రత్నసింహాసనస్థుడైయుండెను. పరమాత్మను దర్శించి బ్రహ్మ యనేకప్రణామము లర్పించి యీశ్వరుని యిచ్ఛను గ్రహించి, పరంధాముని ఆజ్ఞను శిరోధార్యముగ నెంచి సృష్టిచేయ నారంభించెను. సృష్టిసంహారకారకుడైనరుద్రుడు సృష్టికర్తలలాటమునుండి యుద్భవించెను. శ్వేతద్వీపనివాసియైనక్షుద్రవిరాట్టగువిష్ణువు పాలనకర్త. సృష్టికి గారణభూతులైనబ్రహ్మవిష్ణురుద్రాదు లసంఖ్యాకవిశ్వములందు శ్రీకృష్ణునికళలనుండి యుద్భవించిరి. ప్రకృతియే సర్వమునకు, సర్వులకు జన్మను బ్రసాదించుజనని. శ్రీకృష్ణపరబ్రహ్మము ప్రకృతికంటె నతీతమైనది. మాయాపతి యగుపరమేశ్వరుడుగూడ నాప్రకృతిరూపిణియగుశక్తిలేనిదే సృష్టికార్యమం దసమర్థుడేయగును·మాయ యనునుపాధి లేనిచో సృష్టిసంభవింపదుగదా ! మహేశ్వరీమాయ నిత్యసత్యసనాతని. ఆమె సృష్టిసంహారపాలనాస్వరూపు డగుశ్రీకృష్ణునియం దంతర్హితయైయుండును. పరమాత్మ సృష్టికొఱకు సంకల్పింపగనే యామెబహిర్గతయై సకలచరాచరసృష్టికి నాధారశక్తికాగలదు. మట్టిలేనిదే కుమ్మరివాడు కుండలను నిర్మింపలేనట్లు, సువర్ణములేనిదే స్వర్ణకారుడు స్వర్ణాభూషణములను నిర్మించుటలో నసమర్థుడైనట్లు జగత్స్రష్ట యైనపరమాత్మ మాయలేనిదే సృష్టిచేయజాలడు. ఆశక్తి యీశ్వరేచ్ఛచే సృష్టికాలమందు రాధ, పద్మ, సావిత్రి, దుర్గ, సరస్వతి, యనునైదుదివ్యరూపములుగ బ్రాదుర్భవించును. పరమాత్మ యగుశ్రీకృష్ణునకు ప్రాణాధికయైనదియు, అత్యంతప్రియమైనదియు నగునామెనే రాధయనిరి. సర్వమంగళప్రదాత్రియు, పరమానందస్వరూపిణియు, సకలైశ్వర్యముల కధిష్ఠాత్రియు, శ్రీమన్నారాయణున కర్థాంగియు నగునామెనే శ్రీమహాలక్ష్మి యందురు. వేదములకు, సకలశాస్త్రములకు, అఖిలయోగములకు, పరమదుర్లభమైన పరమేశ్వరుని యాధ్యాత్మికవిద్యకు నధిష్ఠాత్రి యగునామెయే సావిత్రి యను నామమున గీర్తింపబడును. సర్వశక్తిస్వరూపిణి, సర్వజ్ఞానాత్మికయు, సర్వస్వరూపిణియు, బుద్ధికే యధిష్ఠాత్రియు, దుర్గతినాశనియు నగునామెనే భక్తులు దుర్గ యనికీర్తించిరి. వాణికధిష్ఠాత్రియు, శాస్త్రజ్ఞానములను బ్రసాదింపగలదియు, శ్రీకృష్ణపరమాత్మజిహ్వనుండి ప్రాదుర్భవించినదియు, సకలవిద్యాస్వరూపిణియు నగునామెనె జ్ఞానసంపన్నులు సరస్వతి యనికీర్తించిరి. ఆదికాలమందు స్వాయ

ముగ మూలప్రకృతి యగుపరమేశ్వరి యీరామెనురూపముల ప్రాదుర్భవించెను. సృష్టిక్రమమం దాశక్తి యాత్మమాయాద్వారమున ననేక కళాకళాంశల స్వరూపములతో నవతరించెను. సృష్టియందు మాయాద్వారమునస్త్రీలుప్రకృతియొక్క, పురుషులు పురుషునియొక్క యంశలచే జన్మించిరి. మాయాశక్తి లేనిదే సృష్టి సంభవింపదుగదా! ప్రత్యేకవిశ్వమందు సృష్టికర్త బ్రహ్మ, పాలనకర్త విష్ణువు, సంహారకర్త రుద్రుడు. పరశురామా! పుష్కరతీర్థమందు మాఘపూర్ణిమాదినమున దీక్షవహించిన నాకు దత్తాత్రేయ భగవానుడు మహర్షి సభామధ్యమున నీ దివ్యజ్ఞానము నుపదేశించెను" అనిపలికి కార్తవీర్యార్జునుడు మందస్మిత ముఖారవిందుడై భృగురామున కనేకనమస్కారము లర్పించి రథము నధిష్ఠించి యుద్ధమునకు సంసిద్ధుడయ్యెను.

కార్తవీర్యుడు వచించిన మహాజ్ఞానము నాలకించి పరశురాము డాశ్చర్యచకితుడై తనశత్రువును వేనోళ్ళ బ్రశంసించెను. కర్తవ్యపాలకుడై పరశురాముడు బ్రహ్మాస్త్రప్రయోగముద్వారమున కార్తవీర్యుని యఖండసేనావాహినిని త్రుటికాలములో బ్రళయాగ్నివలె దహించివైచెను. పిమ్మట లీలాపూర్వకముగ బరశురాముడు శ్రీకృష్ణపరమాత్మను, సదాశివుని యంతరంగమున స్మరించుచు పాశుపతదివ్యాస్త్రప్రయోగముద్వారమున వీరాధివీరుడైనకార్తవీర్యార్జునుని శిరమును ఖండించెను. శ్రీకృష్ణునిపరమభక్తుడు దత్తాత్రేయుని యనుంగు శిష్యుడైన కార్తవీర్యార్జునుడు శ్రీమన్నారాయణుని యవతారమైనపరశురామునిచేత రణరంగమధ్యమున వీరోచితమరణము నంది నశ్వరమైన పాంచభౌతికదేహమును వీడి సచ్చిదానందదేహధారియై దివ్యవిమానము నధిష్ఠించి శ్రీకృష్ణపార్షదులు తోడురాగా గోలోకపరంధామమును జేరెను. నారద మహర్షీ! మహాత్ముడైనకార్తవీర్యుని జీవితమే ధన్యము.

తదనంతరము పరశురాముడు శివకేశవులను స్మరించుచు భయంకరమగుపరశువును ధరించి ప్రళయకాలరుద్రుడై మదోన్మత్తులైన నరేశ్వరులను నిరువదియొక్కపర్యాయములు సంహరించి తనప్రతిజ్ఞను నెరవేర్చి నిజాశ్రమమునకు బయలుదేరెను. భీకరపరశువును ధరించి యిరువదియొక్క పర్యాయములు క్షత్రియులను సంహరించుట గాంచి మహేశ్వరుడే భృగురామునకు పరశురాము డనినామకరణ మొనరించెను. ఆ సమయమున సకలదేవతలు, మునులు, సిద్ధులు, గంధర్వులు, కిన్నరులు మొదలగువా రందఱు పరశు

రామునిపై గుసుమవృష్టిని గురిపించిరి. స్వర్గమందు దుందుభులు మ్రోగినవి, జగమంతయు హరినామసంకీర్తనముతో బ్రతిధ్వనించెను. ఇట్లు పరశురాముని యుజ్వలయశస్సు సర్వజగత్తులోను వ్యాపించి ప్రకాశించెను. అనంతరము బ్రహ్మ, భృగుమహర్షి, శుక్రాచార్యుడు, చ్యవనమహర్షి, వాల్మీకి మునిపుంగవుడు, అత్యంతప్రసన్ను డైనజమదగ్ని బ్రహ్మలోకమునుండి పరశురాము నెదుట సాక్షాత్కరించిరి. ఆమహాత్ములను గాంచి శరీరము పులకరింపగా పరశురాముడు ఆనందాశ్రుభరితనయనుడై వారికి సాష్టాంగదండప్రణామము లర్పించెను. వారందఱును దర్భలతో, పుష్పములతో బరశురామునకు మంగళాశాసన మొనరించి యాశీర్వదించిరి. జగద్గురు వైనబ్రహ్మ విశ్వవిజేత యైనపరశు రాముని తనయొడిలో గూర్చుండబెట్టుకొని హితకరములైన నీతివచనములతో నిట్లుపల్కెను.

బ్రహ్మ పలికెను :

రామా! సకలసంపదలను బ్రసాదింపగల సర్వోత్కృష్టమైన, సర్వ సమ్మతమైన, నీతియుక్తమైన కాణ్వాశాఖోక్తమైన జ్ఞానము నుపదేశించెదను, అవధరింపుము. సర్వపూజనీయులయందు దిష్టుడు, పూజ్యతముడు, ప్రధానుడు నగుఆయన జన్మను బ్రసాదించినకారణమున జనకుడనియు, పాలించుకారణమున పితయనియు జెప్పబడుచున్నాడు. కాని మునీశ్వరా! అన్నదాత యైనతండ్రి, జన్మదాత యైనతండ్రికంటె నున్నతుడు. ఎందువలెననగ, దండ్రివలన నుత్పన్న మైనశరీర మన్నము లేనిదే క్షీణించి నశించును. మాతృదేవత వా రిరువురికంటె నూఱురెట్లు పూజ్యురాలు, మాన్యురాలు, వందనీయురాలు. ఎందువలెననగ, తల్లి జీవుని గర్భమున ధరించి పాలించి పోషించును. వీరందఱికంటె నభీష్టదేవు డత్యంతోన్నతుడు. అభీష్టదైవముకంటె జ్ఞాన విద్యా మంత్రప్రదాతయైన సద్గురు డత్యంత మధికుడు. గురుపుత్రులు గురువువలెనే మాన్యులు. కాని గురుపత్ని వారందఱికంటె బూజ్యురాలు దైవము కోపించిన గురువు రక్షింప గలడు, కాని గురు వాగ్రహించినవాని నెవ్వరును రక్షింపలేరు. అందువలన గురువే బ్రహ్మ, గురువే విష్ణువు, గురువే మహేశ్వరుడు, గురువే పరబ్రహ్మము. గురువే బ్రాహ్మణునికంటె నధికప్రియుడు. గురువే జ్ఞానమును బ్రసాదించువాడు. ఆజ్ఞానము హరిభక్తిని యంకురింపజేయగలదు. హరిభక్తిని బ్రసాదించువారిని మించిన బంధువు లెవ్వరు నుండబోరు, అజ్ఞానాంధకారమును దొలగించి జ్ఞాన

జ్యోతియను చక్షువులను ప్రసాదించు సద్గురునికంటె జీవునకు బంధువు లెవ్వరు ? గురుదత్తమైనదివ్యమంత్రజపమువలన జ్ఞానము గలుగును; దానివలన సర్వజ్ఞత్వము, అనన్యభక్తి లభింపగలవు. అందువలన గురువుకంటె నధికుడు మఱియెవ్వడున్నాడు ? గురుప్రదత్తమైన విద్యాబలముచే మనుష్యుడు విజయుడై జగత్పూజ్యుడు కాగలడు. కుమారా ! శ్రీకృష్ణపరమాత్మ నీయభీష్టదైవము, స్వయముగ శంకరుడే నీ కాచార్యుడు. అందువలన నీవు అభీష్టదైవముకంటె పూజనీయుడైన గురువును శరణజొచ్చుము. ఏదైవానుగ్రహమువలన నీ విఱువది యొక్క పర్యాయములు పృథ్విని భూపాలరహిత మొనరించితివో, శ్రీహరి యనన్యభక్తినిబొందితివో, సర్వమంగళస్వరూపుడైనయాశివుని శరణు వేడుము. మంగళస్వరూపుడు, కళ్యాణస్వరూపుడు, పార్వతీదేవి కారాధ్యుడు, అఖండ శాంతిస్వరూపుడు, నీకు గురుదేవుడునగునామాహేశ్వరుని శరణమును బొందుము. నీయిష్టదైవము, గోలోకనాథుడైన శ్రీకృష్ణపరమాత్మయే తనయంశచే శివ రూపమును ధరించి నీ కాచార్యుడైనాడు, కావున నిస్సంకోచముగ శివుని శరణు వేడుము. వత్సా ! సమస్తప్రాణులకు శ్రీకృష్ణుడుడే యాత్మ, శివుడే జ్ఞానము, నేను (బ్రహ్మ) మనస్సు, శ్రీమహావిష్ణువుయొక్క సర్వశక్తులతో గూడిన ప్రకృతియేప్రాణము. జ్ఞానదాతయు, జ్ఞానస్వరూపుడు, జ్ఞానకారణుడు, మృత్యుంజయుడు, కాలమునకే కాలస్వరూపుడు నగునాగురువును శరణు బొందుము. బ్రహ్మజ్యోతిస్స్వరూపుడు, భక్తానుగ్రహవిగ్రహుడు, సర్వజ్ఞుడు, సనాతనుడు, సకలైశ్వర్యసంపన్నుడు నగునాగురుదేవుని శరణ బొందుము. ప్రకృతిస్వరూపిణి యైనపార్వతీదేవి లక్షలకొలదిదివ్యవర్షములు తప మాచరించి పరమేశ్వరుని ప్రియతమపతిగాబొందగల్గినది. అట్టిగురుదేవుని శరణుబొందుము."

నారదమహర్షీ ! ఇట్లు గురుమహాత్మ్యోపదేశ మొనరించి కమలోద్భవుడైనబ్రహ్మ మహర్షులతో బ్రహ్మలోకమునకు జేరెను. తదనంతరము పరశురాముడు సచ్చిదానందస్వరూపుడైనపరమేశ్వరుని దివ్యదర్శన మభిలషించి కైలాసగమనము కుద్యుక్తుడయ్యెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారాదనారాయణసంవాదమున
పరశురామునకు బ్రహ్మ కైలాసగమనము
నుపదేశించుట యనునలుబదియవ
అ ధ్యా య ము
స ం పూ ర్ణ ము

# నలుబదియొకటవ అధ్యాయము

## పరశురాముడు కైలాసమున కేగుట : అచట పార్షదసహితు డగుగణేశ్వరునకు బ్రణమిల్లి శివదర్శనమునకు బోవ నుద్యుక్తుడగుట: గణేశ్వరు డడ్డగించుట.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదమునీంద్రా ! శ్రీకృష్ణకవచధారియై శివానుగ్రహమువలన బరశురాము డిఱువదియొక్కపర్యాయములు పృథ్విని క్షత్రియశూన్య మొనరించి తనగురుదేవు డైనశివుని గురుపత్ని యైనపార్వతీదేవిని, గుణములలో శ్రీమన్నారాయణసమాను లైనకార్తికేయగణేశ్వరులను సందర్శించుటకు కైలాసమున కరిగెను. మనోవేగశాలి యైనభృగురాముడు సంకల్పించిన క్షణముననే కైలాసమును జేరెను.

ఆనగరము శుద్ధస్ఫటికసంకాశము లైనమణులచే గూర్చబడినమనోహరము లైనసువర్ణమణిసదృశభూములచేత విరాజిల్లురాజమార్గములు గలది; సిందూరారుణవర్ణములతో వేష్టిత మైనమణివేదికలచేత, ముత్యములచే సంయుక్తము లైనమణిమండపములచేత బరిపూర్ణమైనది; మణినిర్మితము లైన కవాటస్తంభసోపానములతో గూడిన కోట్లకొలదియక్షభవనములు గలది: దివ్యసువర్ణకలశములతోను, రజతనిర్మితము లైనశ్వేతచామరములతోను, రత్నాభరణములతోను విభూషితమైనది : ఉద్దీప్త లగుసుందరీమణులచేత, చిత్రవిచిత్రములైనబొమ్మలను బట్టుకొని నిరంతరము స్వేచ్ఛగ నవ్వుచు ఆడుచు నున్నబాలురతోను బాలికలతోను, ఆకాశగంగాతటము పైబుట్టిన పారిజాతవృక్షములతోను నిండియున్నట్టిది; సుగంధితములు వికసితములు నగు పుష్పములచే సంపన్నములగు కల్పవృక్షముల నాశ్రయించుకామధేనువులచే బురస్కృతమైనది, సిద్ధవిద్యానిపుణులు పుణ్యాత్ములు నగుసిద్ధులచే సేవింపబడునది; మూడులక్షలయోజనముల యెత్తు నూఱుయోజనముల విస్తారమును గలిగియున్న పెద్దపెద్దకొమ్మలతోను అసంఖ్యాములైన ఫలములతోను గూడి

నవియు, పరమమనోహరముగ ధ్వనించువివిధము లగుపక్షులతోఁగూడినవియు, శీతలసుగంధవాయువుచే గంపించుచున్నవియు, నాశము లేనివియు నగువటవృక్షములుగలది. వేలకొలదిపుష్పోద్యానములతోను,వందలకొలదిసరోవరములతోను, మరకతరత్ననిర్మితములైన సిద్ధేంద్రులభవనములతోను విరాజిల్లునది. ఆనగరమును జూచినంతనె పరశురామునిమనస్సు మిగుల ప్రసన్నమయ్యెను. ఎదుట ఆయనకు శోభాశాలియు రమణీయము నగుశంకరుని ఆశ్రమము గనబడెను. ఆయాశ్రమమును విశ్వకర్మ బహుమూల్యము లైనమణులతో నిర్మించెను. దానియందు రత్నములు పొదుగబడియుండెను. అది పదునైదుయోజనముల యెత్తుగను, నాలుగుయోజనముల విస్తృతముగను నుండెను. దానికి నలువైపుల మిగులసుందర మగుప్రాకారము నిర్మితమైయుండెను. ద్వారములపై నానావిధములుగ చిత్రములతోఁగూడియున్న రత్ననిర్మితము లైనగవాక్షములు గలవు. అది యుత్తమమణిమయవేదికలతోను, మణిస్తంభములతోను శోభిల్లుచుండెను.

నారాదా ! శివాశ్రమప్రధానద్వారమును వృషభేంద్రుడు, నందీశ్వరుడు, మహాకాలుడు, భయంకరుడగుపింగళాక్షుడు, విశాలాక్షుడు, బాణుడు, మహాబలవిరూపాక్షుడు, వికటాక్షుడు, భాస్కరాక్షుడు, రక్తాక్షుడు, వికటోదరుడు సంహారభైరవుడు, కాలభైరవుడు, రురుభైరవుడు, ఈశ్వరతేజసదృశు డైన మహాభైరవుడు, కృష్ణాంగభైరవుడు, అత్యంతపరాక్రమవంతు డైనక్రోధభైరవుడు, కపాలభైరవుడు, రుద్రభైరవుడు మొదలగుప్రమథగణములు రక్షించుచుండిరి. కైలాసదుర్గమందు బరశురాము డసంఖ్యాకరుద్రులను, సిద్ధులను, విద్యాధరులను, గుహ్యకులను, భూతప్రేతపిశాచగణములను, కూష్మాండ, బ్రహ్మరాక్షస, భేతాళదానవగణములను, జటాధారులైన యోగీంద్రులను, కిన్నరులను, కింపురుషులను గాంచెను. భృగురాముడు నందీశ్వరుని యనుజ్ఞగైకొని ప్రధానద్వారమున బ్రవేశించి వెడలుచుండెను. మార్గమధ్యమున ననేక దివ్యరత్ననిర్మితమందిరములను, సువర్ణకలశములతో శోభిల్లుగృహములను, అమూల్యరత్నసారములైన ద్వారములతోను, ముత్యములు పొదిగిన ద్వారబంధములతోనుగూడియున్న సువర్ణనిర్మితదివ్యగృహములను బరశురాముడు గాంచెను. ఆ దివ్యకైలాసనగరమధ్యమున బ్రకాశించుచున్న శివమందిరద్వారమును గార్తికేయుడు, గణేశ్వరుడు, విశాలకాయు డైన

వీరభద్రుడు సంరక్షించుచుండిరి. వారితో వార్తాలాప మొనరించి, పరశు ధారియు మహాబలపరాక్రమసంపన్నుడు, భృగువంశకులోద్భవుడు నగుబరశు రాముడు శివమందిరమును బ్రవేశింప యత్నింపగా గణేశ్వరు డడ్డగించి యిట్లు పలికెను. "సహోదరా! క్షణకాల మాగుము. ఈ సమయమున మహాదేవుడు జననియగుపార్వతీదేవితో నేకాంతమున నున్నాడు. సదాశివుని యనుజ్ఞ గైకొని క్షణములో దిరిగివచ్చి నిన్ను దోడ్కొనిపోయెదను. కావున కొంతకాల మిచటనే యాగుము." గణేశ్వరుని వచనములను విని సకలవక్తలయందు శ్రేష్ఠుడు మహాబలవంతుడు నగుపరశురాము డిట్లుపలుక నారంభించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ
సంవాదమున కైలాసవర్ణన మను
నలుబదియొకటవ అధ్యాయము
సంపూర్ణము.

♦ ♦ ♦

# నలుబదిరెండవ అధ్యాయము

## ఏకాంతముననున్న శివపార్వతుల దర్శించుటకు అనుమతి నీయ పరశురాముడు గణపతిని బ్రార్థించుట. పరశురామగణపతుల వివాదము.

పరశురాముడు పలికెను:

"విఘ్ననాయకా! భక్తిపూర్వకముగ నాదిదంపతులైనయుమామహేశ్వరులను క్షణకాలము దర్శించి వెడలిపోయెదను. కృపామయుడవై నన్నడ్డగింపకుము. సగుణుడు, నిర్గుణరూపుడు, భక్తానుగ్రహవిగ్రహుడు, సత్య

స్వరూపుడు, బ్రహ్మజ్యోతియు, సనాతనుడు, స్వేచ్ఛామయుడు, దీనబంధువు, మహాత్ముల కీశ్వరుడు, ఆత్మారాముడు, పూర్ణకాముడు, వ్యక్తావ్యక్త పరాత్పరుడు, ఈశానుడు, సకలమున కాదికారణుడు, అవినాశియు, అక్షరుడు, సమస్తమంగళములకు మంగళస్వరూపుడు సర్వమంగళములకు కారణుడు, సర్వమంగళప్రదాతయు, సమస్తైశ్వర్యదాతయు, పరమోత్కృష్టుడు, శీఘ్రముగ ప్రసన్నమగువాడు, ప్రసన్నముఖారవిందుడు, శరణాగతరక్షకుడు, భక్తాభయ ప్రదాతయు, భక్తవత్సలుడు, సమదర్శియు, నగు నాపరమేశ్వరునినుండి నేను నానావిధమంత్రవిద్యలను, పరమదుర్లభము లగుననేకశస్త్రాస్త్రములను, అక్షరమైన ఆధ్యాత్మికవిద్యను శిష్యుడనై గ్రహించితిని. జగదీశ్వరుడు, పరమగురువు నగు నాశంకరుని దర్శింపవలె ననియభిలషించుచున్నాను."

అపుడు గణాధిపతి మధురమైనవాక్కులతో నిట్లుపలికెను-"సోదరా! కొంతకాలము నిలచి నామాట వినుము. ఏకాంతమున స్త్రీతో గూడిన పురుషుని జూడరాదు. అట్లున్న పురుషుని జూచి రసభంగము చేసిన నరాధముడు కాలసూత్ర మనునరకమున బడును. అచట సూర్యచంద్రు లున్నంత కాల ముండును. అందును తండ్రినిగాని, గురువునుగాని, బ్రాహ్మణునిగాని సురతాసక్తునిగా వివేకి యగువాడు చూడరాదు. కామముతోగాని, కోపముతోగాని సురతసమయమున వారిమొగము చూచినచో నేడుజన్మములవఱకు స్త్రీసంబంధముండదు. పరస్త్రీజఘనమునుగాని, వక్షస్థలమునుగాని, ముఖమునుగాని కామముతోజూచినమూఢుడు అంధు డగుట నిశ్చయము."

గణేశునియావాక్కులను విని పరశురాముడు వికటముగ నవ్వి కోపముతో నిట్లుపలికెను-'ఆహా! అపూర్వము, నీతియుక్తము నగువచనమును వింటినిగదా! ఇట్టివాక్కును పరమేశ్వరునిముఖమునుండియు వినలేదు. నీవు చెప్పినది కాముకులకు, వికారముగలవారికి సంబంధించినది యనివేదమునందున్నట్లు వింటిని. నిర్వికారుడు శిశువు నగువానికి యెట్టిదోషము నుండదు. కావున నే నంతఃపురమున కేగెదను. నీ విచ్చట నుండుము. ఆసమయమునకు దగినట్లుగ నచ్చటిసన్నివేశమునుబట్టి నాపనిని నెఱవేర్చుకొందును. పార్వతీపరమేశ్వరులు నీకు మాత్రమే తల్లిదండ్రులని నిరూపింప వీలుకాదు, వారు జగత్తునకే పితరులు. పార్వతి స్త్రీయనియు, పరమేశ్వరుడు పురుషుడనియు నిరూపింపనివా రెవరు! శంకరుడు సర్వరూపుడు, పార్వతిసర్వస్వరూప.గుణాతీతు

డగునాయనకు క్రీడగాని, అది భంగమగుటకాని యుండునా ? క్రీడయు, లజ్జయు, భీతియు, భంగమును ప్రాకృతునికే కాని పరమేశ్వరున కుండవు స్తనంధయుడ నగునన్ను జూచినపితరులకు లజ్జ యేలకలుగును ? లజ్జారూపిణి యగునామెకు లజ్జయేమి ! లజ్జకు ప్రభు వగుఆయనకు లజ్జయెట్లుకలుగును ? లజ్జ లజ్జను బొందునా ? అగ్ని తాపమును బొందునా ! శీతము శైత్యము నందునా ? ఎండ తాపమును బొందునా? భీతి భీతినందునా ? మృత్యువునకు మృత్యువు భయపడునా ? జ్వరము జ్వరమును, వ్యాధి వ్యాధిని బొందునా ? సంహరించువానికి సంహారకుడుండునా ! కాలము కాలమువలన భయపడునా ! నీయుద్దేశ్యము ననుసరించి స్రష్టను స్రష్ట సృజించునా ! ఆకలి ఆకలిని, తృష్ణ తృష్ణను, నిద్ర నిద్రను, శోభ శోభను, శాంతి శాంతిని పుష్టి పుష్టిని, తృప్తి తృప్తిని, ఓర్పు ఓర్పును, పొందుట నీ యుద్దేశ్యము ననుసరించి సంభవించునా ! ఆత్మకన్న పరమాత్మ కలడా ? శక్తికి శక్తి భయపడునా ! కామక్రోధములు, లోభమోహములు తమ్ము తాము బాధించుకొనవు. దయను దయగాని, ఇచ్ఛను ఇచ్ఛకాని బంధింపవు. జ్ఞానబుద్ధుల కేమివికారము గలదు ? జరను జరబాధింపదు, చింతను చింత గ్రహింపదు, కన్ను కంటిని చూడలేదు, హర్షము ఆమోదమును బొందునా ! శోకము శోకమును బాధించునా ! ఆపదకు ఆపద, సంపదకు సంపద సంభవించునా ! మేధస్సునకు మేధాశక్తియు, స్మృతికి స్మరణము గలుగునా ! సూర్యుడు తనయెండచే తాను దహింపబడునా ! సోదరా ! నీవు విపరీతముగ ప్రవర్తించితివి. దీనిని గురువువలన నేను వినలేదు.'' అనిపలికి పరశురాముడు పరిహసించుచు అంతఃపురమును బ్రవేశింప సమకట్టెను.

ఆ పరశురామునిమాటలు విని క్రోధమును జయించినవాడు, శుద్ధసత్త్వస్వరూపు డగుగణేశ్వరుడు చిరునవ్వుతో నిట్లుపలికెను. "అజ్ఞానతిమిర మావరించినవాడు జ్ఞానినుండి జ్ఞానమును బొందును. మిక్కిలి భాగ్యవంతుడు తండ్రినుండిగాని సోదరునినుండిగాని దుర్లభ మగుజ్ఞానమును బొందగలడు. జ్ఞానులకును దుర్లభ మగుమహత్తరజ్ఞానమును నేను వినియుంటిని. మందబుద్ధి వగుసోదరా ! దానిని కొంచెము నివేదింతును, వినుము. నిర్గుణు డగుపరమాత్మ శక్తులతో గూడనివాడై నిర్లిప్తుడుగనుండును. ఆ నిర్గుణుడు సృష్టింపదలచినవాడై శక్తిచే నాశ్రితుడై సగుణ డగును. శ్రీకృష్ణ దేహముతప్ప తక్కిన భోగార్హము లగుశరీరములు ప్రాకృతములు. హస్త

పాదాదులు లేనిప్రకృతికి బరమందున్న నిర్గుణ మగుశుద్ధజ్యోతిస్స్వరూపు డగు ఆయనను వైష్ణవులు నమస్కరింతురు. తేజస్వి లేకయే యాజ్యోతి యెట్లుద్భవించెను? అభ్యంతరస్థ మగునాజ్యోతి నిత్యమైనది. శరీరము శ్యామసుందరము. రెండుభుజములుగలది, వేణువుహస్తమునగలది, చిరునవ్వుతోగూడినది, పచ్చని వస్త్రము ధరించినది, అనర్ఘము లగురత్నభూషణాలంకృతమైనది. ఇట్టిజ్యోతి ర్మూర్తిని ఆయన దయవలన హృదయాకాశమునందు జూచెదరు. అపుడు ఈశ్వరేచ్ఛచే వారందఱు దాస్యమునందు నియుక్తులగుదురు. యోగముగాని, తపస్సుగాని దాస్యముయొక్క పదునాఱవయంశతో సరిగావు.

సృష్టింపదలచిన కృష్ణుడు మొదట ప్రకృతిని సృజించెను. దాని యందు వీర్యమును నిక్షేపించెను. లక్షదివ్యవర్షములు గడచిన పిమ్మట ఆ గర్భమున నేర్పడినయండము గర్భమునుండి బహిర్గతమయ్యెను. అపుడు నిశ్వాస మేర్పడెను. దానినుండి వాయువు సంభవించెను. ఆనిశ్వాస ముతోగూడ ముఖబిందు వేర్పడెను. అనంతరము హరియెదుట జలరాశి యేర్పడెను. దానియం దాయండము దివ్యలక్షవర్షములుండెను. దాని నుండి విశ్వాధారు డగుమహావిరాట్పురుషు డుద్భవించెను. ఆయన శరీరమం దెన్నిరోమములు గలవో అన్నిబ్రహ్మాండము లేర్పడెను. ప్రతిబ్రహ్మాండము నందును బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, దేవతలు, మానవులు, నరులు, చరాచర మగుసృష్టియంతయు నుండును. సర్వజనులకు నామహావిరాట్పురుషు డాశ్రయు డగును. ఆయనకళవలన మహావిష్ణువు క్షుద్రవిరాట్టు అయ్యెను. ఆయన నాభి కమలమునుండి బ్రహ్మ, లలాటమునుండి రుద్రుడు ఉద్భవించిరి. శ్వేతద్వీప నివాసియు రక్షకుడు నగువిష్ణువు ఆయన యంశవలన కలిగెను. ఇట్లు ప్రతి బ్రహ్మాండమునందును బ్రహ్మవిష్ణుమహేశ్వరు లుందురు.

ఆవిష్ణువు స్వయముగను, తనయంశకళలతోను నానాస్వరూపములను ధరించును. అపుడు ఆయన సర్వశక్తులుగలవాడు, సగుణుడు నయ్యెను. స్వేచ్ఛాస్వరూపు డగుఆయన లజ్జాదులు లేనివా డెట్లగును? ఆత డెల్లపుడు సర్వభోగముల ననుభవింపదగినవాడు. సిగ్గునకు సిగ్గులే దనుటసర్వాంగీకృత మగువిషయము. లజ్జకలదేవియొక్క లజ్జ యేమైనది? సర్వశక్తులు గలదుర్గా దేవి పార్వతి. ఆమెకు లజ్జాదులు గలవనుటసర్వాంగీకృతము. అట్టిపార్వతితో

నీశ్వరుడు సురతోన్ముఖుడైయున్నాడు. కావున సోదరా! కొలదికాలము ప్రతీక్షింపుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణసంవాద
మున శ్రీగణేశపరశురామసంవాద మను
నలుబదిరెండవ అధ్యాయము
సంపూర్ణము.

— 0 —

## నలుబదిమూడవ అధ్యాయము

### పరశురాముడు మరల అంతఃపురమున బ్రవేశించుటకు యత్నింపగా గణేశ్వరు డాయనను స్తంభింపజేసి తనతుండముతో బంధించి సర్వలోకములందును ద్రిప్పుచు గోలోకమున ఆయనకు శ్రీకృష్ణ దర్శనము చేయించుట.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారదా! పరశురాముడు తనదృఢనిశ్చయమును వీడలేదు. ఆయన యెన్నియో యుక్తులద్వారమున అంతఃపురమున బ్రవేశించుట నిర్దోష మని గణేశ్వరునకు వివరించెను. గణపతి వినయపూర్వకముగ బరశురాముని నిలువ రించెను. ఆ యిర్వురు మహాపురుషుల నడుమ నుమామహేశ్వరుల సందర్శ నార్థమగు వాగ్యుద్ధము ప్రారంభమయ్యెను. పరశురాముడు కోపించి గణేశ్వ రునిపై బరశువును బ్రయోగించుటకు సంసిద్ధుడు కాగా కార్తికేయు డడ్డు పడెను. ఉరగమును గరుత్మంతుడు బంధించునట్లు గణపతి తనయప్రతిహతమైన తుండమును చాచి దానితో బరశురాముని బంధించి, తనయోగబలముతో

నా యవతారపురుషుని స్తంభింపజేసెను. శివపుత్రుడు పరశురాముని దోష్ఠాని
వానికి సప్తద్వీపములను, సప్తపర్వతములను, సప్తసాగరములను, భూర్లోకమును,
స్వర్లోకమును, జనలోకమును, తపోలోకమును, ధ్రువలోకమును, గౌరీ
లోకమును, శంభులోకమును జూపెను. అంతియేకాక బంధితుడై యున్న పరశు
రామునకు వైకుంఠమును, తదనంతరము దివ్యగోలోకధామమం దున్న
శ్రీకృష్ణుని దర్శనముగూడ గలుగజేసెను.

పరశురాముడు దర్శించుసమయమున నాసచ్చిదానందవిగ్రహు డగు
శ్రీకృష్ణపరమాత్మ చిన్మయరత్నాభరణ విభూషితుడై మణిమాణిక్యనిర్మిత
రత్నసింహాసనము నధిష్ఠించి యుండెను. జనని యగురాధ యాపరంధాముని
వక్షస్థలమందు కొలువుదీరియుండెను. ఆమె తేజము కోట్లకొలది సూర్యుల
ప్రకాశముకంటె నత్యంత మధికముగ నుండెను. అఖండ తేజోరాశి యైనరాధను
హృదయమున నిలుపుకొనియున్న పరమాత్మ ద్విభుజుడు, మురళీహస్తుడు,
మనోహరరూపలావణ్యుడు, మందస్మితవదనారవిందుడు, గోపగోపీపార్షదజన
పరివేష్టితుడు, కేవలము తనభక్తుల ననుగ్రహించుటకే దివ్యసుందరసచ్చిదా
నందరూపమును ధరించియున్నాడు. ఇట్లు పాపవినాశకుడు తనకిష్టదేవుడు
నగు శ్రీకృష్ణపరమాత్మను, శ్రీగణేశ్వరుని యనన్యకృపవలన భృగురాముడు
దర్శించి, తా నొనరించిన క్షత్రియసంహారపాతకమునుండి విముక్తుడై పరిశుద్ధు
డయ్యెను. నారదమహర్షీ! పాపాచరణమువలనసముపార్జితమైనయాతనాభోగము
సంపూర్ణముగ ననుభవింపనిదే నశింపదు. ఆప్రారబ్ధము ఎన్నిజన్మ లెత్తిన
ను జీవుని వీడదు. ఐనను, అదృష్టశాలి యైనపరశురాముడు పాపఫలమును
కించిన్మాత్రమే గణేశ్వరుని కృపవలన ననుభవించి శ్రీకృష్ణపరమాత్మను
దర్శించి పాపరహితుడై పవిత్రుడయ్యెను. భగవంతునిదివ్యదర్శనము సర్వ
పాపవినాశకము, అఖండపుణ్యప్రదాయకము, దివ్యగోలోకపరంధామగమన
మున కేకైకసాధనము. పరశురామునిభాగ్య మేమనిపొగడగలము? పాపరహితు
డైనపరశురాముడు అఖండతేజస్సంపన్నుడై గణేశ్వరుని బంధములనుండి
విముక్తుడై చైతన్యము పొందెను. ఆ సమయమున భృగురాముడు తనకు
పరమగురుడైనశంకరుడు ప్రసాదించిన శ్రీకృష్ణపరబ్రహ్మస్తోత్రకవచములను
బఠించి తనయమోఘమైనపరశువును గణేశ్వరునిపై బ్రయోగించెను. ఆహా!
మాయామోహితుడై భృగురాముడు గణపతి తన కొనరించినమేలును

మఱచెనుగదా! పరశురాము డభిమంత్రించి ప్రయోగించిన పరశువు గ్రీష్మకాల మధ్యాహ్నసూర్యునివలె మించిప్రకాశించుచున్నదై శివతేజసంపన్నమై గణేశ్వరుని కబళింప బయనించెను. తనపితృదేవుడు ప్రసాదించిన అయ్యమోఘాస్త్రమును గాంచి స్వయముగ గణపతి యాపరశువును తనదంతముల నడుమ బంధించెను. పరశురాము డభిమంత్రించినపాశుపతము వ్యర్థము కారాదని గణపతి పరశువును విడచిపెట్టెను. తత్క్షణమే యాయస్త్రము గణేశ్వరునియొక దంతమును ఖండించి మరలి పరశురాముని జేరెను.

ఈ భీషణదృశ్యమును గాంచి కార్తికేయుడు, వీరభద్రుడు సకలప్రమథ గణములు, దేవగణములు, భయభీతులై హాహాకారము లొనరించిరి. గణేశ్వరుని మహాదంతము ఖండింపబడి మేరుపర్వతమె పతనమైనట్లు భూమిపై బడగా నాపృథ్వి కంపించెను. ఆ సమయముననే యోగీశ్వరుడైనశివుని ధ్యానము భంగమయ్యెను. గిరిజాశంకరు లంతఃపురమును వీడి గణేశ్వరు నెదుట సాక్షాత్కరించిరి. జరిగినవిషయము గ్రహించి పార్వతీదేవి పరమేశ్వరునితో నిట్లుపల్కెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణసంవాదమున
గ ణే శ ద ం త భ ం గ కా ర ణ మ ను
నలుబదిమూడవ అధ్యాయము
స ం పూ ర్ణ ము.

—: o :—

# నలుబదినాలుగవ అధ్యాయము

## పార్వతి పరశురామునిపై గోపించుట : పరశురాముడు తనయిష్ట దైవమును ధ్యానించుట : భగవంతుడు వామనరూపమున నేగుదెంచి శ్రీగణేశ్వర స్తోత్రమును బ్రకటించుట.

పార్వతీదేవి పలికెను :

ప్రభూ ! జగత్తులో నేను నీ యర్ధాంగిననియు; నీ దాసిననియు సర్వులు నెఱుగుదురు. ఈ సంఘటనవలన నా జీవితమే వ్యర్థమయ్యెను. ఈశ్వరుని దృష్టిలో పిపీలకాదిబ్రహ్మపర్యంతము సర్వము సమానమే. దేవా ! ఈదోష మీదాసీపుత్రుడైన గణేశ్వరునిదా? లేక నీశిష్యుడైన పరశురామునిదా? దోష మెవ్వరిదో నీవే నిర్ణయింపవలెను, నీవు ధర్మవేత్తలలోను, జ్ఞానులలోను శ్రేష్ఠుడవు. వీరభద్రుడు, కార్తికేయుడు, ప్రమథగణము ఈ సంఘటనకు సాక్షులే. వీరిసాక్ష్యము నసత్య మనియెవ రనగలరు ? ధర్మనిర్ణయావసరమున సాక్ష్య మిచ్చుసత్పురుషులకు శత్రువులు మిత్రులు సమానులే. అనగా వారికి పక్షపాతభావ ముండదు. సభామధ్యమున కామక్రోధలోభములకు వశులై భయముచెంది యసత్యసాక్ష్యము పలికినవారు నరకమున బడి తమనూఱు తరములవారిని కుంభీపాకనరకమున బడద్రోయగలరు. నాథా ! నేనే న్యాయ నిర్ణయ మొనరింపగలసమర్థురాలను, ఐనను నీసమక్షమున నే నాజ్ఞాపించుట శ్రుతినిషిద్ధము. ప్రభూ ! సూర్యుని సమక్షమున మిణుగురుపురుగు లెక్కలోనికి రానట్లు, సభలో రా జుండగ భృత్యులకు న్యాయనిర్ణయాధికార ముండదు. మీవిరహమును భరింపలేక చిరకాలము మిమ్మారాధించి మీదివ్యచరణకమలము లందు స్థానమును బొందగల్గితిని. జగన్నాథా ! పుత్రప్రేమకు వశీభూతనై క్రోధశోకమోహములకారణమున నేమైనను ధర్మవిరుద్ధముగ బల్కితినేని నన్ను క్షమింపుము. నీ వాగ్రహించినచో నాకుబుత్రునివలన నేమి ప్రయో జనము ? ఎందువలెననగా, ఉత్తమకులోత్పన్న యైనపతివ్రతకు నూర్గురు పుత్రులకంటె భర్త అధికప్రియతముడు. దుష్టస్వభావము కల్గియుండునదియు,

జ్ఞానహీనమైనదియు, తలిదండ్రులొనరించిన దోషములవలన దూషితు రాలైనదియు నగుస్త్రీమాత్రమే భర్తను గౌరవింపదు.

కుత్సితం పతితం మూఢం దరిద్రం రోగిణం జడమ్।
కులజా విష్ణుతుల్యం చ కాన్తం పశ్యతి సంతతమ్ ॥

హుతాశనో వా సూర్యో వా సర్వతేజస్వినాం పరః ।
పతివ్రతా తేజసశ్చ కలాం నార్హన్తి షోడశీమ్ ॥

మహాదానాని పుణ్యాని వ్రతాన్యనశనాని చ ।
తపాంసి పతిసేవాయాః కలాం నార్హన్తి షోడశీమ్ ॥ 13-15

"భర్త నిందితుడైనను, పతితుడైనను, మూర్ఖుడైనను, దరిద్రుడైనను రోగియైనను, జడుడైనను, ఉత్తమకులోత్పన్నయైనస్త్రీ వానిని విష్ణుసమానుని గనే భావించును. సమస్తతేజస్వులయందు శ్రేష్ఠులైన అగ్నిసూర్యాదులు పతివ్రతయొక్క యఖండతేజస్సులో పదునారవయంశమైనను సరిరారు మహాదానములు, పుణ్యప్రదవ్రతోపవాసములు, తపస్సులు మొదలగునవి యన్నియు పతిసేవాపుణ్యమందు పదునారవయంశమైనను సరిరావు" ఉత్తమ కులోత్పన్నయైనస్త్రీకి పుత్రుడైనను, సహోదరుడైనను, తండ్రియైనను, స్వజను లైనను భర్తతో సమానులుకారు.

పిమ్మటపార్వతీదేవి భయరహితుడై శంకరుని చరణకమలములను సేవించుచున్న పరశురాముని గాంచి యిట్లుపల్కెను. "మహాభాగా! భార్గవరామా! నీవు బ్రహ్మవంశకులోద్భవుడవు, జమదగ్ని పుత్రుడవు, యోగులకే గురుడవు, మహాదేవునిశిష్యుడవు, సదసద్వివేకజ్ఞానసంపన్నుడవు. లక్ష్మీదేవియంశచే నుత్తమకులమునం దుద్భవించినరేణుక నీ మాతృదేవత, నీతాత విష్ణుభక్తుడు, మామ పరమవైష్ణవుడు. నీవు మనువంశమం దావిర్భవించినరేణుకునకు దౌహిత్రుడవు. సాధుస్వభావయుక్తుడైన మహావీరుడైన విష్ణుయశుడు నీమామ. నీ వెవరిదోషమువలన నింతటిఘోరకార్య మొనరించితివి? నీ విట్లొనరించుటకు గారణము నా కవగతముగాకున్నది. ఎవరిదోషములవలన మనుష్యుడు దూషితుడగునో అట్టి నీవారందఱు పరమపవిత్రులు. నీవు కరుణాసాగరుడైన గురువునుండి యమోఘ పరశువును గ్రహించి ప్రథమమున సకలక్షత్రియజాతిని సంహరించి యీసమయమున నాకుమారుని క్షతగాత్రునిగ నొనరించి చక్కనిగురుదక్షిణ నొసంగితివి; పరశు రామా! జితేంద్రియపురుషులలో శ్రేష్ఠుడైనగణేశ్వరుడు నీవంటివారి నెందఱ

జినో సంహరింపగలశక్తిసంపన్నుడు. పరమవైష్ణవుడ వనిభావించి నిన్ను దండించ లేదు. శ్రీకృష్ణునిపరిపూర్ణాంశతో నుద్భవించిన గణేశ్వరుడు తేజస్సున శ్రీకృష్ణు నితో సమానుడు. అందువలననే నాప్రియనందనున కగ్రపూజ లభించినది. అన్య దేవతలు శ్రీకృష్ణునికళలు మాత్రమే.” ఇట్లుపలికి పార్వతీదేవి కోపించి పరశురాముని సంహరించుట కుద్యుక్తురాలు కాగా పరశురాముడు మనము నందే గురువునకు ప్రణామము లర్పించి యిష్టదేవుడగు శ్రీకృష్ణుని స్మరించెను. ఆ సమయమున వారినడుమ ముకుందుడు వామనరూపమున సాక్షాత్కరించెను. ఆయన తేజ మనంతకోటిసూర్యుల ప్రకాశముతో సమానము, దంతములు ముత్య ములవలె స్వచ్ఛములు. శుక్లవస్త్రధారియై, శుక్లయజ్ఞోపవీతధారియై, లలాట మం దుజ్జ్వలతిలకమును ధరించి, దండఛత్రములతో నాబాలకుడు విరాజిల్లు చుండెను. గళమునందు తులసీదళమాలలు ధరించియున్న యాబాలకుని రూప మత్యంతమనోహరము. ఆ సుందరాకారుడు మందస్మితముఖారవిందుడై భుజములందు భుజకీర్తులను, కరములందు కంకణములను, గళమునందు కౌస్తుభ మణిమాలను, శిరమునందు సద్రత్నమకుటమును, పాదములయందు రత్న నిర్మితనూపురములను, కర్ణములయందు మకరకుండలములను ధరించి ప్రకాశించుచుండెను. ముకుందుని దర్శించి హరుడు భక్తిభావసమన్వితుడై, భృత్యసమేతుడై యనేకప్రణామము లర్పించెను. జగన్మాత యగుపార్వతి వినీతభావముతో శిరమువంచి నమస్కరించెను. కైలాసవాసులందఱు భృగు రామసహితముగ బాలజనార్దనునిదర్శించి ధన్యులైరి. తదనంతరము శంకరుడు భగవంతునకు షోడశోపచారముల నర్పించి భక్తిపూర్వకముగ నాపరిపూర్ణ తముని వేదోక్తవిధితో బూజించి తలవంచి కాణ్వశాఖోక్త మైనస్తోత్రము ద్వారమునస్తుతింపదొడంగెను. పులకితగాత్రుడై, ఆనందబాష్పపూర్ణనయనుడై హరుడు హరికి రత్నసింహాసన మర్పించి సత్కరించెను. తన యఖండతేజముతో సర్వజగముల నాచ్ఛాదితమొనరించిన ఆ వామనభగవానుని శంకరు డిట్లు స్తుతించెను. “దేవా! నీవాత్మారాముడవు. నిన్ను కుశలమడుగుట నిరర్థకము. ఎందువలెననగ, నీవు స్వయముగ సకలకుశలములకు నాధారము. నీవు శుభాశుభ ప్రదాతవు. శ్రీకృష్ణసేవాఫలస్వరూపముగ నీ వీదినమున నాకతిథి వైతివి. అందు వలన నాజన్మముసఫలమై జీవనము ధన్యమైనది. కృపాసాగరా! పరిపూర్ణా! శ్రీకృష్ణా! జీవుల నుద్ధరించుటకే నీవు పుణ్యభారతవర్ష మం దనేకయవతారము

లను ధరించినావు. అతిథిని సత్కరించి యాదరించువారికి సర్వదేవతారాధన ఫలము లభించును. ఎందువలెననగ, ఎవనికి నతిథి ప్రసన్నమగునో వానికి స్వయముగ శ్రీహరి ప్రసన్నమగును, సమస్త తీర్థస్నానఫలములు, సర్వదాన ఫలములు, అసంఖ్యాకవ్రతోపవాసఫలములు, సర్వయజ్ఞదీక్షాగ్రహణఫలములు సర్వతపఃఫలములు, నిత్యనైమిత్తికధర్మానుష్ఠానఫలము లన్నియు నతిథిసేవా ఫలమున పదునారవయంశకైనను సరిరావు. కోపించి యెవనిగృహమునుండి యతిథినిరాశాహృదయముతో వెడలిపోవునో యాగృహస్థు డొనరించిన పుణ్యములన్నియు నాక్షణమునందే నశింపగలవు.

**శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :**

నారదమహర్షీ ! శంకరునివచనములను విని జగత్పతి యగుశ్రీహరి సంతుష్టుడై మేఘగంభీరవాణితో నిట్లుపల్కెను.

**వి ష్ణు భ గ వా ను డు ప లి కె ను :**

శివా ! శ్రీకృష్ణభక్తుడైనపరశురాముని రక్షించుటకే శ్వేతద్వీపము నుండి కైలాసమున కరుదెంచితిని. కృష్ణభక్తుల కెప్పుడెక్కడను నమంగళ ములు సంభవింపరాదు. సద్గురువు కోపించినసమయమునగాక మిగిలినసమ యములందు నేను సుదర్శనచక్రధారినై శ్రీకృష్ణభక్తులను రక్షింతును. గురువుపాదారవిందముల నొనరించిన యపరాధము క్షంతవ్యముకాదు. గురు సేవావిహీనుడైనవానిని మించిన పాపాత్ముడు మఱియొక డుండబోడు. అహో! ఎవని కృపవలన మనుష్యుడు జన్మించి సర్వమును దర్శింపగలడో ఆ జనకు డందఱికంటెను మాననీయుడు, పూజనీయుడు నగును. అతడు జన్మమును ప్రసా ప్రసాదించిన గారణమున జనకు డని, రక్షించినకారణమున పిత యనికీర్తింప బడెను. ఆతండ్రికంటె కనిపెంచు మాతృదేవత నూఱురెట్లెక్కువగ వందనీయు రాలైయున్నది. ప్రసవించినకారణమున జనని వసుంధరతో సమానయగును. అన్నదాత మాతృదేవతకంటే నూఱురెట్లెక్కువగ వందనీయుడు, పూజ నీయుడు, మాన్యుడు. ఆహారము లభింపనిదే శరీరము నశించును, అందువలననే అన్నదాత విష్ణుసమానుడు. అభీష్టదేవు డన్నదాతకంటే నూఱురెట్లధికుడు. కాని యాధ్యాత్మికవిద్యను మంత్రమును నిచ్చినగురుదేవు డభీష్టదైవము కంటె నూఱురెట్లధికముగ ఆరాధ్యుడు. అజ్ఞానాంధకారముతో నాచ్ఛాదిత

పైయున్న సమస్తపదార్థములను జ్ఞానదీపకరూపనేత్రములద్వారా సందర్శింపజేయునాచార్యుని మించిన పరమబంధువు డెవ్వ డుండును? గురుప్రదత్తమైన మంత్రమువలన అకుంఠిత మగుతపమువలన నభీష్టసుఖములు, సర్వజ్ఞత్వము, సమస్తసిద్ధులు లభించును. అందువలన గురువునుమించిన బంధువు మఱియొకడుండడు. గురుప్రదత్తమైనవిద్యాద్వారమున మనుష్యు డంతట విజయసంపన్నుడు కాగలడు. అందువలననే జగమునందు సద్గురువును మించిన పూజ్యుడు, అధికప్రియబంధువు మఱియొకడు లేడు. విద్యామదమువలన, ధనమదాంధకారమువలన నాచార్యుని సేవించి గౌరవింపని మూర్ఖునకు బ్రహ్మహత్యాపాతకము సంభవించును. ఇం దేమాత్రమును సంశయము లేదు. గురువుని సామాన్యమానవునిగ భావించి అవహేళన మొనరించువాడు సకలతీర్థములయందు స్నానముచేసినను నపవిత్రుడై, ధర్మాచరణమునం దధికారమును గోల్పోవును.

మహేశ్వరా! కపటహృదయాంతరంగుడై తల్లిని, తండ్రిని, భార్యను, నాచార్యుని, గురుపత్నిని, సంతానమును బాలించి పోషింపనివాడు మహాపాపమునకు గురికాగలడు. గురువే బ్రహ్మ, గురువే విష్ణువు, గురువే మహేశ్వరుడు, గురువే పరబ్రహ్మము, గురువే సూర్యస్వరూపుడు, గురువే చంద్రుడు, ఇంద్రుడు, వాయువు, వరుణుడు, అగ్నిస్వరూపుడు. అంతియేకాదు ఆచార్యుడు సర్వరూపు డగుపరమాత్మతో సమానుడు.

నాస్తి వేదాత్పరం శాస్త్రం న హి కృష్ణాత్పరః సురః ।
నాస్తి గఙ్గాసమం తీర్థం న పుష్పం తులసీ పరమ్ ॥

నాస్తి క్షమావతీ భూమేః పుత్రాన్నాస్త్యపరః ప్రియః ।
న చ దైవాత్పరా శక్తిరైర్నైకాదశ్యాః పరం వ్రతః ॥

సాలగ్రామాత్పరో యన్త్రో న క్షేత్రం భారతాత్పరమ్ ।
పరం పుణ్యస్థలానాం చ పుణ్యం బృన్దావనం యథా ॥

మోక్షదానాం యథా కాశీ వైష్ణవానాం యథా శివః ।
న పార్వత్యాః పరా సాధ్వీ న గణేశాత్పరో వశీ ॥

న చ విద్యాసమో బన్ధుర్నాస్తి కశ్చిద్గురోః పరః ।
విద్యాదాతుః పుత్రదారౌ తత్సమౌ నాత్ర సంశయః ॥ 72-76

వేదములకంటె నుత్తమశాస్త్రముగాని, శ్రీకృష్ణునిమించిన దేవుఁడుగాని గంగతోసమాన మైనపవిత్రతీర్థముగాని, తులసికంటె నుత్తమ మైనపుష్పము గాని,పృథ్విని మించినక్షమాశీలిగాని,పుత్రులకంటె నధికప్రియులుగాని, దైవమును మించిన శక్తిగాని, ఏకాదశీవ్రతమునుమించిన నుత్తమవ్రతముగాని, సాలగ్రామ మును మించిన యంత్రముగాని, పవిత్రభారతవర్షమునుమించిన పుణ్యక్షేత్రము గాని, బృన్దావనమును మించిన పుణ్యస్థానముగాని, కాశీపట్టణమును మించిన మోక్షప్రదాయక మైననగరముగాని, వైష్ణవులలో శివునితో సమానులుగాని పార్వతికంటె నధికపతివ్రత యగుస్త్రీగాని, గణేశ్వరునికంటె నుత్తమ జితేంద్రియుఁడుగాని, విద్యకంటెమించిన బంధువుగాని, గురువుకంటె నధికమాన్యులు గాని యెవ్వరునులేరు. విద్యాప్రదాత పుత్రుఁడు, పత్ని, ఆచార్యునివలె వందనీయులే". పరశురాముఁడు పరమగురుని కుమారునకపచార మొనరించి నాఁడు. ఆయనను పాపవిముక్తుని గావించుటకొఱకే నే నీప్రదేశమున సాక్షాత్కరించితిని.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

దేవర్షీ ! విష్ణుభగవానుఁడు శివునితో ఇట్లు సంభాషించి దుర్గను సమాధానపఱచుచు సత్యస్వరూపము లైనమధురవాక్కులతో నిట్లుపల్కెను.

వి ష్ణు భ గ వా ను ఁ డు ప లి కె ను :

దేవీ ! శుభవాక్కులను సావధానముగ నాలకింపుము. గిరిరాజకుమారీ ! నీకు గణేశ్వరుఁడు కార్తికేయుఁడు నెట్లో భృగువంశకులోద్భవు డైనపరశు రాముఁడును నట్లే. సర్వజ్ఞురాలా ! ఆదిదంపతు లైనమీరిర్వురు మీ కుమారులతో సమముగ బరశురాముని యాదరించిరి. అందువలన మాతా ! నీవే విచారించి యుచిత మైనదానిని నిర్ణయింపుము. నీకుమారుల నడుమ నీ వివాదము దైవదోషఘటితము. దైవబలము నెదురించుటలో నెవరు సమర్థులు? దైవము మహాబలమైనదిగదా ! కుమారీ ! నీ కుమారునకుగల యేకదంతమనునామము వేదములందు విఖ్యాతము. వరాననా ! సర్వదేవతలు నీ కుమారునకు నమస్కరించెదరు. ఈశ్వరీ ! సామవేదప్రోక్త మైననీకుమారుని నామాష్టకస్తోత్రమును శ్రద్ధగ నవధరింపుము. మాతా ! గణేశ్వరుని యీ స్తోత్రము సర్వవిఘ్నవినాశకము.

గణేశమేకదన్తం చ హేరమ్బం విఘ్ననాయకమ్ ।
లమ్బోదరం శూర్పకర్ణం గజవక్త్రం గుహాగ్రజమ్॥

నామాష్టార్థం చ పుత్రస్య శృణు మాతర్హరప్రియే ।
స్తోత్రాణాం సారభూతం చ సర్వవిఘ్నహరం పరమ్ ॥

జ్ఞానార్థవాచకో గశ్చ ణశ్చ నిర్వాణవాచకః ।
తయోరీశం పరం బ్రహ్మ గణేశం ప్రణమామ్యహమ్ ॥

ఏకశబ్దః ప్రధానార్థో దన్తశ్చ బలవాచకః
బలం ప్రధానం సర్వస్మాదేకదన్తం నమామ్యహమ్ ॥

దీనార్థవాచకో హేశ్చ రమ్బః పాలకవాచకః ।
పరిపాలకం దీనానాం హేరమ్బం ప్రణమామ్యహమ్ ॥

విపత్తివాచకో విఘ్నో నాయకః ఖణ్డనార్థకః ।
విపత్ఖణ్డనకారకం నమామి విఘ్ననాయకమ్ ॥

విష్ణుదత్తైశ్చ నైవేద్యైర్యస్య లమ్బోదరం పురా ।
పిత్రా దత్తైశ్చ వివిధైర్వన్దే లమ్బోదరం చ తమ్ ॥

శూర్పాకారౌ చ యత్కర్ణౌ విఘ్నవారణకారణౌ ।
సమ్పదౌ జ్ఞానరూపౌ చ శూర్పకర్ణం నమామ్యహమ్ ॥

విష్ణుప్రసాదపుష్పం చ యన్మూర్ధ్ని మునిదత్తకమ్ ।
తద్గజేన్ద్రవక్త్రయుతం గజవక్త్రం నమామ్యహమ్ ॥

గుహస్యాగ్రే చ జాతోఽయమావిర్భూతో హరాలయే ।
వన్దే గుహాగ్రజం దేవం సర్వదేవాగ్రపూజితమ్ ॥

ఏతన్నామాష్టకం దుర్గే నామభిః సంయుతం పరమ్ ।
పుత్రస్య పశ్య వేదే చ తదా కోపం తథా కురు ॥

ఏతన్నామాష్టకం స్తోత్రం నానార్థసంయుతం శుభమ్ ।
త్రిసంధ్యం యః పఠేన్నిత్యం స సుఖీ సర్వతో జయీ ॥

తతో విఘ్నాః పలాయన్తే వైనతేయాద్యథోరగాః ।
గణేశ్వరప్రసాదేన మహాజ్ఞానీ భవేద్ధ్రువమ్ ॥

పుత్రార్థీ లభతే పుత్రం భార్యార్థీ విపులాం స్త్రియమ్ ।
మహాజడః కవీన్ద్రశ్చ విద్యావాంశ్చ భవేద్ధ్రువమ్ ॥ 85-98

మాతా! నీకుమారునకు గణేశ్వరుడనియు, ఏకదంతుడనియు, హేరంబుడనియు, విఘ్ననాయకుడనియు, లంబోదరుడనియు, శూర్పకర్ణుడనియు, గజవక్త్రుడనియు, గుహాగ్రజుడనియు నెనిమిది దివ్యనామములు గలవు. ఈ యెనిమిది దివ్యనామముల యర్థములను బ్రవచించెద నవధరింపుము. శివప్రియా! ఈ యుత్తమస్తోత్రము సర్వస్తోత్రసారభూతము, సర్వవిఘ్ననివారకము. "గ" జ్ఞానార్థవాచకము "ణ" నిర్వాణవాచకము. ఈ రెండింటికి (గ+ణ) నెవడీశ్వరుడై యున్నాడో ఆ పరబ్రహ్మమైన గణేశ్వరునకు నేను ప్రణామము లర్పించెదను. "ఏక" శబ్దము ప్రధానార్థకము. "దన్త" శబ్దము బలవాచకము. అందువలన నెవనిబల మన్నింటికంటె నుత్కృష్ట మైయున్నదో, ఆ యేకదంతునకు నేను నమస్కరించెదను. "హే" శబ్దము దీనార్థవాచకము. "రమ్బ" శబ్దము పాలకవాచకము, అందువలన దీనులను సదా పాలించు నా హేరమ్బునకు నేను శిరమువంచి నమస్కరించెదను. "విఘ్న" శబ్దము విపత్తివాచకము, "నాయక" శబ్దము ఖణ్డనార్థకము. విపత్తులను నాశముచేయు నా విఘ్నేశ్వరునకు నే నభివాదముల నర్పించెదను. పూర్వకాలమందు విష్ణుదేవునిచే సమర్పింపబడిన నైవేద్యములను, పితృదేవునిచే సమర్పింపబడిన యనేకవిధ మిష్టాన్నములను భుజించి యేదేవుని యుదరము లమ్బోదర మైనదో ఆ లమ్బోదరునకు నేను వందనముల నర్పించెదను. ఎవనికర్ణములు శూర్పాకారముగ నుండి విఘ్ననివారణకు హేతువులై యున్నవో, సర్వసంపత్ప్రదములు జ్ఞానస్వరూపములు నై యున్నవో ఆశూర్పకర్ణునకు నేను శిరమువంచి నమస్కరించెదను. ఎవని శిరముపై మునిచే బ్రసాదింపబడిన విష్ణుప్రసాదరూపమైన పుష్ప మున్నదో, ఏ దేవుడు గజేంద్రముఖయుక్తుడో, ఆ గజవక్త్రునకు నేను నమస్కరించెదను. ఎవరు గుహుని (స్కన్దుని)కంటె మొదట శివభవనమున నావిర్భవించి సమస్తదేవగణములద్వారా అగ్రపూజ నందెనో, ఆ గుహాగ్రజుడైన దేవునకు నేను వందనము లర్పించెదను. దుర్గా! నీకుమారుని దివ్యనామములతో సంయుక్త మైనయీయుత్తమనామాష్టకస్తోత్రము వేదోక్తమని గ్రహింపుము. పిమ్మట నీకుమారునితో సమానుడైనపరశురామునిపై కోపింపుము. ఈనానార్థసంయుక్తము, శుభప్రదమునగు శ్రీగణేశ్వరనామాష్టకస్తోత్రమును నిత్యము త్రిసంధ్యలయందు బఠించువారు సౌఖ్యవంతులై సర్వత్రవిజయులు కాగలరు. గరుత్మంతుని గాంచి సర్పములు పారిపోవునట్లే యీ దివ్య

స్తోత్రమును బఠించువారిని గాంచి సర్వవిఘ్నములు పారిపోగలవు. గణేశ్వరుని కృపవలన నాభక్తుడు నిశ్చయముగ మహాజ్ఞాని కాగలడు. పుత్రార్థికి పుత్రుడు, భార్యార్థికి శీలవతి యైనభార్య ఈ స్తోత్రపఠనమువలన లభింపగలరు. ఈ స్తోత్రము నేకాగ్రచిత్తముతో బఠించినవాడు మహామూర్ఖుడైనను నిశ్చయముగ విద్వాంసుడై శ్రేష్ఠకవి కాగలడు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణసంవాద
ములో శ్రీగణేశస్తోత్రకథన మను
నలుబదినాల్గవ అధ్యాయము
సంపూర్ణము.



## నలుబదియైదవ అధ్యాయము

### పరశురాముడు శ్రీదుర్గాదేవిని స్తుతించుట.

శ్రీ నారాయణ ఋషి పలికెను:

విష్ణుమూర్తి పార్వతీదేవి నిట్లుసమాధానపఱచి పరశురాము నుద్దేశించి పరమహితకరములైన, తత్త్వస్వరూపములైన, నీతిసారస్వరూపములైన, పరిణామమందు సుఖప్రదాయకము లైనవచనములను బల్కెను. "భృగురామా! మాయావశమున నీవు క్షుద్రమైనక్రోధమునకు వశుడవై గణేశ్వరుని దంతమును ఖండించి శ్రుతిమతానుసారముగ నపరాధివైతివి. నే నుపదేశించిన శ్రీగణపతిస్తవమును బఠించి గణేశ్వరు నారాధింపుము. తదనంతరము కాణ్వశాఖయందు వర్ణింపబడిన స్తోత్రముద్వారమున జగజ్జనని యగుదుర్గను స్తుతించి యామె యనుగ్రహమునకు పాత్రుడవగుము. ఈ జగదీశ్వరి శ్రీకృష్ణుని పరాశక్తి, సకలజీవులయందు బుద్ధిస్వరూపముగనున్నది. ఈ జగన్మాత యాగ్రహించినందువలన నీసద్బుద్ధి నశించెను. ఈమె సర్వశక్తిస్వరూపిణి. జగము

లన్నియు నాశక్తియోగమువలననే శక్తివంతములై భ్రమించును. ఇంతియే కాదు ప్రకృతికంటె బరుడు నిర్గుణుడునగు శ్రీకృష్ణపరబ్రహ్మముకూడ నీజనని వలన శక్తిశాలియయ్యెను. శక్తిలేనిదే బ్రహ్మకూడ సృష్టిరచనయం దసమర్థుడే. బ్రహ్మవిష్ణుమహేశ్వరులమైన మేమీపరాశక్తినుండే యుద్భవించితిమి. బీజము సనాతనపరబ్రహ్మము. క్షేత్ర మాద్యాప్రకృతిశక్తి. ద్విజశ్రేష్ఠా! ప్రాచీనకాల మం దసురులు విజృంభించి దేవతలను జయించి వారిని తమయధీనులుగ నొనరించిరి. దేవతలు ప్రార్థింపగ శ్రీకృష్ణపరమాత్మనుండి యుద్భవించిన ఆద్యాప్రకృతి సకలదేవతాతేజములను గ్రహించి శ్రీకృష్ణుని యాజ్ఞను శిరసా వహించి యసురతతిని వధించి దేవతలకు స్వారాజ్యమును బ్రసాదించెను. ప్రజాపతి యగుదక్షుడు శ్రీమన్నారాయణుని ఘోరతపముద్వారమున ఆరాధించి యఖండపుణ్యఫల స్వరూపముగ జగజ్జనని యగుశక్తిని బుత్రికగ బొందెను. ఆ యవతారమందు సతీదేవి శంకరుని యర్థాంగియయ్యెను. తదనంతరము దక్షునియజ్ఞశాలలో మదోన్మత్తులైన దక్షాదులు సదాశివుని నిందింపగా సతీదేవి శరీరమును త్యజించి యత్యంతము భాగ్యశాలి యైన హిమవంతుని గారాలపట్టిగ నావిర్భవించెను. ఆ యవతారమందు సర్వేశ్వరుడై నశివునికొఱకు కఖండతప మాచరించి యోగీశ్వరేశ్వరుడై నశంకరుని బ్రాణనాథునిగ బడసెను. జననియగుపార్వతీదేవి యేకాగ్రచిత్తముతో బవిత్రమగు పుణ్యకవ్రతముద్వారమున జగన్నాథుడై నశ్రీకృష్ణపరమాత్మను సేవించి యాపరంధాముని ప్రియపుత్రునిగ బడసెను. కుమారా! నీ వెవ్వరిని ధ్యానించుచున్నావో, ఆ శ్రీకృష్ణుడే తనసంపూర్ణాంశతో బార్వతీపుత్రుడై నశ్రీగణేశ్వరుడై యావిర్భవించెను. అందువలన సర్వమంగళస్వరూపిణియు, కళ్యాణప్రదాయినియు, శివపరాయణయు, మంగళకారణయు, సర్వమంగళములకు నధీశ్వరియు, శివప్రియయు యగుదుర్గకు నీవు వినీతభావుడవై హస్తములను ముకుళించి శిరము వంచి, పూర్వకాలమున త్రిపురాసురసంగ్రామమున బ్రహ్మప్రేరణచే హరుడు స్తుతించిన దుర్గాస్తోత్రముద్వారమున యామెను స్తుతించి యారాధించి పాపవిముక్తుడవు కమ్ము."

నారదమహర్షీ! ఇట్లు పరశురాము నాదేశించి విష్ణుభగవాను డంతర్ధాన మయ్యెను. ఆసమయమున బరశురాముడు శుద్ధమందాకినీజలములందు స్నానమొనరించి పవిత్రవస్త్రములను ధరించి ప్రథమమున గణేశ్వరున కనేకప్రణా

మము లర్పించి స్తుతించి యారాధించెను. తదనంతర మాచమన మొనరించి జనని యగుదుర్గకు శిరము వంచి నమస్కరించెను. ఆసమయమున భక్తి భావసమన్వితు డై నపరశురామునిశరీరము పులకింపగ ఆనందాశ్రుపూర్ణ నయనములతో జగన్మాత నిట్లుస్తుతింపదొడంగెను.

పరశురామ ఉవాచ :

శ్రీకృష్ణస్య చ గోలోకే పరిపూర్ణతమస్య చ ।
ఆవిర్భూతా విగ్రహతః పురా సృష్ట్యున్ముఖస్య చ ॥

సూర్యకోటిప్రభాయుక్తా వస్త్రాలంకారభూషితా ।
వహ్నిశుద్ధాంశుకాధానా సుస్మితా సుమనోహరా ॥

నవయౌవనసమ్పన్నా సిన్దూరబిన్దుశోభితా ।
లలితం కబరీభారం మాలతీమాల్యమణ్డితమ్ ॥

అహోఽనిర్వచనీయం త్వం చారుమూర్తిం చ బిభ్రతీ ।
మోక్షప్రదా ముముక్షూణాం మహావిష్ణోర్విధిః స్వయమ్ ॥

ముమోహ క్షణమాత్రేణ దృష్ట్వా త్వాం సర్వమోహినీమ్ ।
బాలైః సమ్భూయ సహసా సస్మితా ధావితా పురా ॥

సద్భిః ఖ్యాతా తేన రాధా మూలప్రకృతిరీశ్వరీ ।
కృష్ణస్త్వాం సహసాహూయ వీర్యాధానం చకార హ ॥

తతో డిమ్భం మహజ్జజ్ఞే తతో జాతో మహావిరాట్ ।
యస్యైవ లోమకూపేషు బ్రహ్మాణ్డాన్యఖిలాని చ

తచ్ఛృఙ్గారక్రమేణైవ త్వన్నిశ్వాసో బభూవ హ ।
స నిశ్వాసో మహావాయుః స విరాడ్విశ్వధారకః ॥

తవ ఘర్మజలేనైవ పుప్లువే విశ్వగోలకమ్ ।
స విరాడ్విశ్వనిలయో జలరాశిర్బభూవ హ ॥

తత స్త్వం పంచధాభూయ పంచమూర్తీశ్చ బిభ్రతీ ।
ప్రాణాధిష్ఠాతృమూర్తిర్యా కృష్ణస్య పరమాత్మనః ॥

కృష్ణప్రాణాధికాం రాధాం తాం వదన్తి పురావిదః ॥

వేదాధిష్ఠాతృమూర్తిర్యా వేదశాస్త్రప్రసూరపి ।
తాం సావిత్రీం శుద్ధరూపాం ప్రవదన్తి మనీషిణః ॥

ఐశ్వర్యాధిష్ఠాతృమూర్తిః శాన్తిశ్చ శాన్తరూపిణీ ।
లక్ష్మీం వదన్తి సంతస్తాం శుద్ధాం సత్త్వస్వరూపిణీమ్ ॥
రాగాధిష్ఠాతృదేవీ యా శుక్లమూర్తిః సతాం ప్రసూః ।
సరస్వతీం తాం శాస్త్రజ్ఞాం శాస్త్రజ్ఞాః ప్రవదన్త్యహో ॥
బుద్ధిర్విద్యా సర్వశక్తేర్యా మూర్తిరధిదేవతా ।
సర్వమఙ్గలమాఙ్గల్యా సర్వమఙ్గలరూపిణీ ॥
సర్వమఙ్గలబీజస్య శివస్య నిలయేఽధునా ॥
శివే శివాస్వరూపా త్వం లక్ష్మీర్నారాయణాన్తికే ।
సరస్వతీ చ సావిత్రీ వేదసూర్బ్రహ్మణః ప్రియా ॥
రాధా రాసేశ్వరస్యైవ పరిపూర్ణతమస్య చ ।
పరమానన్దరూపస్య పరమానన్దరూపిణీ ॥
తత్కలాంశాంకలయా దేవానామపి యోషితః ॥
త్వం విద్యా యోషితః సర్వాస్త్వం సర్వబీజరూపిణీ ।
ఛాయా సూర్యస్య చన్ద్రస్య రోహిణీ సర్వమోహినీ ॥
శచీ శక్రస్య కామస్య కామినీ రతిరీశ్వరీ ।
వరుణానీ జలేశస్య వాయోః స్త్రీ ప్రాణవల్లభా ॥
వహ్నేః ప్రియా హి స్వాహా చ కుబేరస్య చ సున్దరీ ।
యమస్య తు సుశీలా చ నైరృతస్య చ కైటభీ ॥
ఈశానస్య శశికలా శతరూపా మనోః ప్రియా ।
దేవహూతిః కర్దమస్య వశిష్ఠస్యాప్యరున్ధతీ ॥
లోపాముద్రాప్యగస్త్యస్య దేవమాతాదితిస్తథా ।
అహల్యా గౌతమస్యాపి సర్వాధారా వసున్ధరా ॥
గఙ్గా చ తులసీ చాపి పృథివ్యాం యాః సరిద్వరాః ।
ఏతాః సర్వాశ్చ యా హ్యన్యాః సర్వాస్త్వత్కలయామ్బికే ॥
గృహలక్ష్మీర్గృహే నృణాం రాజలక్ష్మీశ్చ రాజసు ।
తపస్వినాం తపస్యా త్వం గాయత్రీ బ్రాహ్మణస్య చ ॥
సతాం సత్త్వస్వరూపా త్వమసతాం కలహాఙ్కురా ।
జ్యోతిరూపా నిర్గుణస్య శక్తిస్త్వం సగుణస్య చ ॥

సూర్యే ప్రభాస్వరూపా త్వం దాహికా చ హుతాశనే ।
జలే శైత్యస్వరూపా చ శోభారూపా నిశాకరే ॥

త్వం భూమౌ గన్ధరూపా చ ఆకాశే శబ్దరూపిణీ ।
క్షుత్పిపాసాదయస్త్వం చ జీవినాం సర్వశక్తయః ॥

సర్వబీజస్వరూపా త్వం సంసారే సారరూపిణీ ।
స్మృతిర్మేధా చ బుద్ధిర్వా జ్ఞానశక్తిర్విపశ్చితామ్ ॥

కృష్ణేన విద్యా యా దత్తా సర్వజ్ఞానప్రసూః శుభా ।
శూలినే కృపయా సా త్వం యతో మృత్యుంజయః శివః ॥

సృష్టిపాలనసంహారశక్తయస్త్రివిధాశ్చ యాః ।
బ్రహ్మవిష్ణుమహేశానాం సా త్వమేవ నమోఽస్తు తే ॥

మధుకైటభభీత్యా చ త్రస్తో ధాతా ప్రకమ్పితః ।
స్తుత్వా ముమోచ యాం దేవీం తాం మూర్ధ్నా ప్రణమామ్యహమ్ ॥

మధుకైటభయోర్యుద్ధే త్రాతాసౌ విష్ణురీశ్వరీమ్ ।
బభూవ శక్తిమాన్ స్తుత్వా తాం దుర్గాం ప్రణమామ్యహమ్ ॥

త్రిపురస్య మహాయుద్ధే సరథే పతితే శివే ।
యాం తుష్టువుః సురాః సర్వే తాం దుర్గాం ప్రణమామ్యహమ్ ॥

విష్ణునా వృషరూపేణ స్వయం శమ్భుః సముత్థితః ।
జఘాన త్రిపురం స్తుత్వా తాం దుర్గాం ప్రణమామ్యహమ్ ॥

యదాజ్ఞయా వాతి వాతః సూర్యస్తపతి సన్తతమ్ ।
వర్షతీన్ద్రో దహత్యగ్నిస్తాం దుర్గాం ప్రణమామ్యహమ్ ॥

యదాజ్ఞయా హి కాలశ్చ శశ్వద్భ్రమతి వేగతః ।
మృత్యుశ్చరతి జన్త్వోఘే తాం దుర్గాం ప్రణమామ్యహమ్ ॥

స్రష్టా సృజతి సృష్టిం చ పాతా పాతి యదాజ్ఞయా ।
సంహర్తా సంహరేత్కాలే తాం దుర్గాం ప్రణమామ్యహమ్ ॥

జ్యోతిః స్వరూపో భగవాన్ శ్రీకృష్ణో నిర్గుణం స్వయమ్ ।
యయా వినా న శక్తశ్చ సృష్టిం కర్తుం నమామి తామ్ ॥

రక్ష రక్ష జగన్మాతరపరాధం క్షమస్వ మే ।
శిశూనామపరాధేన కుతో మాతా హి కుప్యతి ॥

ఇత్యుక్త్వా పరశురామశ్చ ప్రణమ్య తాం రురోద హ ।
తుష్టా దుర్గా ససమ్భ్రమేణ చాభయం చ వరం దదౌ ॥

అమరో భవ హే పుత్ర వత్స సుస్థిరతాం వ్రజ ।
శర్వప్రసాదా త్సర్వత్ర జయోఽస్తు తవ సంతతమ్ ॥

సర్వాన్తరాత్మా భగవాంస్తుష్టోఽస్తు సంతతం హరిః ।
భక్తిర్భవతు తే కృష్ణే శివదే చ శివే గురౌ ॥

ఇష్టదేవే గురౌ యస్య భక్తిర్భవతి శాశ్వతీ ।
తం హన్తుం న హి శక్తాశ్చ రుష్టాశ్చ సర్వదేవతాః ॥

శ్రీకృష్ణస్య చ భక్తస్త్వం శిష్యో హి శంకరస్య చ ।
గురుపత్నీం స్తౌషి యస్మా త్కస్త్వాం హన్తుమిహేశ్వరః

అహో న కృష్ణభక్తానామశుభం విద్యతే క్వచిత్ ।
అన్యదేవేషు యే భక్తా న భక్తా వా నిరఙ్కుశాః ॥

చన్ద్రమా బలవాంస్తుష్టో యేషాం భాగ్యవతాం భృగో ।
తేషాం తారాగణా రుష్టాః కిం కుర్వన్తి చ దుర్బలాః ॥

యస్య తుష్టః సభాయాం చేన్నరదేవో మహాన్ సుఖీ ।
తస్య కిం వా కరిష్యన్తి రుష్టా భృత్యాశ్చ దుర్బలాః ॥

ఇత్యుక్త్వా పార్వతీ తుష్టా దత్త్వా రామం శుభాశిషమ్ ।
జగామాన్తఃపురం తూర్ణం హరిశబ్దో బభూవ హ ॥

స్తోత్రం వై కాణ్వశాఖోక్తం పూజాకాలే చ యః పఠేత్ ।
యాత్రాకాలే చ ప్రాతర్వా వాంఛితార్థం లభేద్ధ్రువమ్ ॥

పుత్రార్థీ లభతే పుత్రం కన్యార్థీ కన్యకాం లభేత్ ॥

విద్యార్థీ లభతే విద్యాం ప్రజార్థీ చాప్నుయాత్ ప్రజామ్ ॥
భ్రష్టరాజ్యో లభేద్రాజ్యం నష్టవిత్తో ధనం లభేత్ ॥

యస్య రుష్టో గురుర్దేవో రాజా వా బాన్ధవోఽథవా ।
తస్య తుష్టశ్చ వరదః స్తోత్రరాజప్రసాదతః ॥

దస్యుగ్రస్తోఽహిగ్రస్తశ్చ శత్రుగ్రస్తో భయానకః ।
వ్యాధిగ్రస్తో భవేన్ముక్తః స్తోత్రస్మరణమాత్రతః ॥

రాజద్వారే శ్మశానే చ కారాగారే చ బన్ధనే ।
జలరాశౌ నిమగ్నశ్చ ముక్తస్తత్స్మృతిమాత్రతః ॥

స్వామిభేదే పుత్రభేదే మిత్రభేదే చ దారుణే ।
స్తోత్రస్మరణమాత్రేణ వాంఛితార్థం లభేద్ధ్రువమ్ ॥

కృత్వా హవిష్యం వర్షం చ స్తోత్రరాజం శృణోతి యా ।
భక్త్యా దుర్గాం చ సమ్పూజ్య మహావన్ధ్యా ప్రసూయతే ॥

లభతే సా దివ్యపుత్రం జ్ఞానినం చిరజీవినమ్ ।
అసౌభాగ్యా చ సౌభాగ్యం షణ్మాసశ్రవణాల్లభేత్ ॥

నవమాసం కాకవన్ధ్యా మృతవత్సా చ భక్తితః ।
స్తోత్రరాజం యా శృణోతి సా పుత్రం లభతే ధ్రువమ్॥

కన్యామాతా పుత్రహీనా పంచమాసం శృణోతి యా ।
ఘటే సమ్పూజ్య దుర్గాం చ సా పుత్రం లభతే ధ్రువమ్ ॥ 18-78

దుర్గాదేవీ! సృష్ట్యాదికాలమందు గోలోకదివ్యధామములో శ్రీకృష్ణ పరమాత్మ సృష్టిరచనకొఱకు సంకల్పింపగ నాసమయమున నీ వాపరమాత్మ నుండి ప్రాదుర్భవించితివి. జననీ! నీవు సూర్యకోటిప్రభాయుక్తవు, వస్త్రాలంకార భూషితవు, అగ్నిశుద్ధ పరిధానమును ధరించి నవతరుణవయస్కురాలవై లలాటమందు సిందూరతిలకమును ధరించి శోభిల్లుచున్నావు. మాలతీ మాలలతో నలంకృతమై నీవేణియలరారుచుండగ నీదివ్యరూపము పరమమనోహరముగ నున్నది. మందస్మితముఖారవింద వైననీమూర్తి యత్యంత సుందరము. ఆహా, ఆ దివ్యసౌందర్యమును వర్ణించుట యత్యంత కఠినము. దేవీ! నీవు ముముక్షువులకు మోక్షప్రదాయనివి. స్వయముగ శ్రీమహావిష్ణువు యొక్క విధివి. సౌందర్యవతీ! నీవు సర్వులకు మోహమును గలుగజేయు దానవు. నిన్ను దర్శింపగనే శ్రీకృష్ణపరమాత్మసహితము క్షణకాలము మోహపరవశుడయ్యెనట. ఆ సమయమున నీవు సంభావితవై, మందస్మిత వదనవై పరమాత్మ కందక పారిపోయితివట. ఈ కారణమువలనే సత్పురుషులు నిన్ను మూలప్రకృతిరీశ్వరి యగురాధ యనికీర్తించిరి. ఆ సమయమున శ్రీకృష్ణ పరమాత్మ నిన్ను ప్రసన్నురాలిగ నొనర్చుకొని తనదివ్యతేజమును నీయందు ప్రవేశింపజేసెను. పరబ్రహ్మతేజస్స్వరూపమైనమహాడిమ్భము నీసచ్చిదానంద విగ్రహమునుండి యావిర్భవించెను. ఎవనిరోమకూపములందు సమస్తబ్రహ్మాండములు నిండియున్నవో ఆ మహావిరాట్పురు డాడింభమునుండుద్భవించెను. తదనంతరము శ్రీకృష్ణరాధాదివ్యశృంగారక్రమమందు నీనిశ్వాసము బయల్వెడలెను. ఆ నిశ్వాసమే మహావాయురూపమున ప్రాదుర్భవించి విశ్వధారణ మొనరించుటచే విరాట్టని కీర్తింపబడెను. నీస్వేదము చేతనే విశ్వగోళము

ద్రవించెను. ఆ సమయమున నదియె విశ్వములకు నివాసస్థానమగు విరాట్
జలరాశి యయ్యెను. అపుడు నీవు స్వయముగ నైదుదివ్యరూపములను
ధరించితివి. ఆ దివ్యరూపములలో శ్రీకృష్ణపరమాత్మకు ప్రాణాధిష్ఠాత్రమూర్తి
యైనదేవిని భవిష్యద్వేత్తలైనమహాపురుషులు కృష్ణప్రాణాధికా! రాధా
యని కీర్తించిరి. వేదశాస్త్రములకు జననియు, వేదాధిష్ఠాత్రియు నగునాశుద్ధ
స్వరూపమును మనీషులు సావిత్రి యనునామముతో బిలచుచున్నారు.
శాంతియు, శాంతస్వరూపిణియు, సకలైశ్వర్యములకునధిష్ఠాత్రీయు నగునాశుద్ధ
సత్త్వస్వరూపిణిని భక్తజనులు లక్ష్మి యనుదివ్యనామమున నారాధింతురు.
ఆహా! రాగముల కధిష్ఠాత్రియు, సత్పురుషులను ప్రాదుర్భవింపజేయునదియు,
శుద్ధశుక్లవర్ణరూపిణియు నగునాశాస్త్రజ్ఞానమూర్తినే శాస్త్రజ్ఞులు సరస్వతి
యనికీర్తించిరి. బుద్ధికి, విద్యకు, సమస్తశక్తులకు నధిదేవతవు, మంగళములకే
మంగళస్థానమైనదానవు, సర్వమంగళములకు గారణమైనదానవు, సచ్చిదా
నందస్వరూపిణివి నగు నీ వీ సమయమున శివభవనములో విరాజిల్లుచున్నావు.

దేవీ! నీవు శివునకు పార్వతివి, నారాయణునకు శ్రీమహాలక్ష్మివి
బ్రహ్మకుప్రియమైనదానివి, వేదజననివి యగుసావిత్రివి, సరస్వతివి. పరిపూర్ణుడు,
పరమానందస్వరూపుడు నగునారాసేశ్వరు డైనశ్రీకృష్ణునకు నీవు పరమానంద
స్వరూపిణివైనరాధవు. దేవాంగనలందఱునీకలాకలాంశములనుండియే పాదుర్భ
వించిరి. నీవు సర్వకారణరూపిణివి. నారీమణులందఱు నీవిద్యాస్వరూపిణులే.
అమ్బికా! సూర్యునిపత్ని ఛాయ, చంద్రునిభార్య సర్వమోహిని యగురోహిణి,
ఇంద్రునియర్థాంగి శచి, కామదేవునకుహృదయేశ్వరి యైశ్వర్యసంపన్నయైన
రతి, వరుణపత్నియగువారుణి, వాయువునకు ప్రాణప్రియమైనస్త్రీ, అగ్నిప్రియ
యైనస్వాహా, సౌందర్యవతియైన కుబేరునిభార్య, యమునిపత్నియగుసుశీల,
నైరృతునిజాయ యగుకైటభి, ఈశానపత్ని యగుశశికల, మనుప్రియ యగు
శతరూప, కర్దమునియర్ధాంగి యగుదేవహూతి, వశిష్ఠపత్ని యగునరుంధతి,
దేవమాత యగునదితి, అగస్త్యమహర్షిభార్య యగులోపాముద్ర, గౌతమ
పత్ని యగునహల్య, సర్వులకు నాధారస్వరూపిణి యైనవసుంధర, గంగ, తులసి
జగత్తులోనిసర్వశ్రేష్ఠసరిత్తులు, మొదలగునవియు యింకను నన్యస్త్రీలందఱు
నీకళలనుండియే ప్రాదుర్భవించిరి.

మాతా ! నీవు మానవులగృహములందు గృహలక్ష్మివి, నరేశ్వరుల భవనములందు రాజ్యలక్ష్మివి, తాపసులయొక్క తపస్సువు, బ్రాహ్మణులకు గాయత్రివి. జననీ ! నీవు సత్పురుషులకు శుద్ధసత్త్వస్వరూపిణివి, దుష్టులలో కలహాంకురవు, నిర్గుణబ్రహ్మమునకు జ్యోతివి, సగుణపరంధామునకు శక్తివి, జగజ్జననీ ! నీవే సూర్యునియందుప్రభవు, అగ్నియందు దాహకశక్తివి, జలములందు శీతలత్వము, చంద్రునియందు శోభ, భూమియందు గంధము, ఆకాశమందు శబ్దము. నీవే క్షుత్పిపాసాదిస్వరూపిణివి, జీవులయందు సర్వశక్తిస్వరూపిణివి; జగములందు సర్వులకు నుత్పత్తికారణము నీవే, సారరూపము, స్మృతి, మేధ, బుద్ధి, విజ్ఞానులజ్ఞానశక్తివి నీవే. శ్రీకృష్ణపరమాత్మ శంకరునకు గృపతో బ్రసాదించినసర్వజ్ఞానప్రసవిని యైనఅధ్యాత్మికమహావిద్యవు నీవే. శక్తివిద్యాస్వరూపిణి వైననీప్రాపును బొంది శంకరుడు మృత్యుంజయుడయ్యెను. సృష్టిస్థితిలయముల జేయుబ్రహ్మవిష్ణుమహేశ్వరుల త్రివిధశక్తులయందు నీవే విద్యామానవైయున్నావు, అందువలన నీకు బ్రణామము లర్పించుచున్నాను. మధుకైటభుల భయమువలన కంపించి బ్రహ్మ యేదేవిని స్తుతించి భయముక్తుడయ్యెనో, మధుకైటభసంగ్రామసమయమందు జగద్రక్షకుడైన విష్ణుభగవానుడే పరమేశ్వరిని స్తుతించి శక్తివంతుడయ్యెనో, త్రిపురాసురమహాయుద్ధమందు శివుడు విరథుఁడు కాగా సకలదేవతలు రక్షింపవలసినదిగ నేదేవిని స్తుతించిరో, ఏదేవినిస్తుతించి శంకరుడు వృషరూపధారి యైనవిష్ణువుద్వారమున ఉద్ధరింపబడి త్రిపురాసురులను సంహరించెనో, ఏశక్తియాజ్ఞవలన నిరంతరము వాయువు వీచునో, సూర్యుడు తపింపజేయునో, ఇంద్రుడు వర్షములను వర్షించునో, అగ్ని జ్వలించునో, ఏయాద్యాశక్తి యాజ్ఞకు బద్ధమై కాలమెల్లప్పుడు వేగముగభ్రమించుచుండునో, మృత్యువు జీవసముదాయములందు చరించునో, అట్టిదుర్గకునమస్కరించెదను. ఏదేవియాదేశానుసారముగస్రష్టసృష్టిని రచించునో, పాలనకర్త రక్షించునో, సంహారకర్త సమయ మాసన్నమైనపుడు సంహరించునో, ఏశక్తిలేనిదే స్వయముఁగ శ్రీకృష్ణభగవానుడు సృష్టిరచనయందసమర్థుడై కేవలము జ్యోతిస్స్వరూపముతో నిర్గుణమై యుండునో ఆయాద్యాశక్తికి నేను నమస్కరించెదను. జగజ్జననీ ! నన్ను రక్షింపుము, రక్షింపుము, నాయపరాధములను క్షమింపుము. తల్లీ బిడ్డలపరాధము లొనరించిన జనని కోపించునా !

ఇట్లుస్తుతించినమస్కరించి పరశురాముడు రోదింపదొడంగెను. పరశురామునిస్తోత్రమునకు ప్రసన్నయై దుర్గ యభయ మొసంగుచు నిట్లుపల్కెను. "వత్సా! అమరుడవు కమ్ము. కుమారా! దుఃఖమును వీడి శాంతింపుము. శివునికృపవలన నీవు సర్వత్ర విజయుడవు కాగలవు. సర్వాంతరాత్మ యగు శ్రీహరి సదా నీయందు ప్రసన్నుడగుగాక, శ్రీకృష్ణపరమాత్మపైన, కళ్యాణదాతయైన శివగురువుపైన నీకుసుదృఢభక్తి కలుగుగాక. ఎందువలెననగ ఇష్టదైవమందు, గురువునందు శాశ్వతమైనసుదృఢభక్తి కలిగియున్నవారిపై దేవతలు కోపించినను వారిని సంహరింపలేరు. పరశురామా! నీవు శ్రీకృష్ణుని భక్తుడవు, మహాదేవుని ప్రియశిష్యుడవు. ఈ సమయమున గురుపత్నినైననన్ను స్తుతించితివి. అందువలన నెవరును నిన్ను సంహరింపలేరు. కృష్ణభక్తుల కెన్నడు నశుభము సంభవింపదు. అన్యదేవతారాధకులు భక్తులే కాదు, వారు నిరంకుశులు, నియమరహితులు. భార్గవా! ఏభాగ్యశాలికి బలవంతుడైన చంద్రుడు ప్రసన్నుడగునో దుర్బలములైనతారాగణములు కోపించినను నవి వాని నేమిచేయగలవు? సభామధ్యమున నాత్మబలసంపన్నుడైనన రేశ్వరు డెవనిపై సంతుష్టుడగునో వానిని దుర్బలులైనభృత్యులు కోపించినను ఏమి చేయగలరు? ఆ సమయమున శివలోకమంతయు హరినామసంకీర్తనముతో ప్రతిధ్వనించెను. పార్వతీదేవి హర్షితయై పరశురాముని యాశీర్వదించి యంతఃపురమునకు వెడలిపోయెను.

ఈ కాణ్వశాఖోక్తస్తోత్రమును పూజాసమయమందుగాని, ప్రాతఃకాలమందుగాని, యాత్రాసమయమందుగాని పఠించువాడవశ్యముగ దనయభీష్టమును బొందగలడు. ఈ స్తోత్రపారాయణమువలన పుత్రార్థికి బుత్రుడు, కన్యార్థికి కన్య, విద్యార్థికి విద్య, ప్రజార్థికి ప్రజ, రాజ్యభ్రష్టునకు రాజ్యము ధనహీనునకు ధనము లభించును. ఎవరిపై గురువు, దైవము, రాజు, బంధువులు కోపింతురో వారీస్తోత్రమును పఠించినచో గుపితులందఱు ప్రసన్నులై వరదాతలు కాగలరు. ఎవరినైన దొంగలు, దారిదోపిడిగాండ్రు బాధించినను, సర్పము కాటువేసినను, భయంకర శత్రువ్యూహమందు జిక్కినను, వ్యాధిగ్రస్తులైనను ఈ దివ్యస్తోత్రమును స్మరించినంతమాత్రమున వారాసంకటములనుండి విముక్తులు కాగలరు. రాజద్వారమందు, శ్మశానమందు, కారాగారమందు, అగాధజలరాసులందు కష్టములపాలైనవారీస్తోత్రప్రభావమువలన సంకట

విముక్తులు కాగలరు. స్వామిభేద, మిత్రభేద, పుత్రభేదసమయములం దీస్తోత్రమును స్మరించినంతమాత్రమున నిశ్చయముగ నభీష్టసిద్ధి కలుగును. ఒక్క సంవత్సరపర్యంతము భక్తిపూర్వకముగ దుర్గను బూజించి హవిష్యాన్నమును భుజించుచు నీస్తోత్రమును శ్రవణ మొనరించుస్త్రీ మహావంధ్యయైనను (గొడ్రాలు) సంతానవతి కాగలదు. ఆమెకు జ్ఞాని చిరంజీవి యైనపుత్రుడు లభింపగలడు. ఆఱుమాసము లీస్తోత్రశ్రవణ మొనరించిన దుర్భాగ్యవతి సౌభాగ్యవతి కాగలదు. కాకవంధ్య యైనను, మాతృవత్సల యైనను భక్తిపూర్వకముగ నవమాసములపర్యంత మీ స్తవమును శ్రవణ మొనరించినచో సంతానవతి కాగలదు. స్త్రీసంతాన మున్నను పుత్రసంతానములేనివా రీస్తోత్రమును నైదు మాసములపర్యంతము పఠించుచు కలశమందు దుర్గనావాహన మొనరించి భక్తిపూర్వకముగ పూజ లొనరించినచో పుత్రప్రాప్తి కల్గును.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారాదనారాయణసంవాదమున
బరశురాము డొనరించినశ్రీదుర్గాస్తోత్ర మను
నలుబదియైదవ అధ్యాయము
సంపూర్ణము



## నలుబదియాఱవ అధ్యాయము

### శ్రీగణేశతులసీసంవాదము : గణపతిఖండశ్రవణమాహాత్మ్యము.

శ్రీ నారాయణఋషి పలికెను;

నారదమహర్షీ! ఇట్లు పరశురాముడు సంతుష్టచిత్తుడై దుర్గను స్తుతించి, శ్రీహరి యుపదేశించిన దివ్యస్తోత్రముద్వారమున గణేశ్వరుని స్తుతించెను. తదనంతరము నానావిధము లగు నైవేద్యములతో ధూపదీపగంధములతో తులసీదళములు దక్క నన్యపుష్పములతో భక్తిభావసమన్వితుడై పరశురాముడు

శ్రీగణేశ్వరుని బూజించెను. తదుపరి గౌరీశంకరులకు సాష్టాంగదండప్రణామము లర్పించి వారియనుజ్ఞ గైకొని తనయాశ్రమమునకు బయలుదేరెను.

నా ర దు డు ప లి కె ను :

ప్రభూ! భృగురాముడు శ్రీగణేశ్వరునకు వివిధనైవేద్యము లర్పించి పుష్పములచే బూజించుసమయమున పవిత్రపూజాకుసుమములైన తులసీ దళముల నేలవిస్మరించెను?

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

దేవర్షీ! అత్యంతగుహ్యమైన యీ మనోహరసంఘటనము బ్రాహ్మ కల్పందు సంభవించెను. ఆ ప్రాచీనేతిహాసమును వచించెద నవధరింపుము. ఒక సమయమందు యౌవనసంపన్నమైనతులసీదేవి నారాయణపరాయణమై ఘోరతప మాచరించునిమిత్తము గంగాతటము జేరి, యచట శ్రీకృష్ణునిచరణార విందములను ధ్యానించుచున్న శ్రీగణేశ్వరుని దర్శించెను. గణపతి శ్రీకృష్ణాంశ సంభూతుడే. అందువలన శ్రీమన్నారాయణునకు గణేశ్వరునకు భేదము లేదు నవయౌవనసంపన్నుడైన శ్రీగణేశ్వరు డత్యంతసుందరాకారుడు, అగ్నిశుద్ధ పీతాంబరధారి. ఆ యేకదంతునిదివ్యాంగములు వెన్నెలవలె బ్రకాశించు చున్నవి. దివ్యరత్నమయాభరణవిభూషితుడై కందర్పకోటిసుందరాకారుడైన శ్రీగణేశ్వరుడు కామనారహితుడై, మందస్మితముఖారవిందముతో పరబ్రహ్మ ధ్యానమందు నిమగ్నుడై యుండెను. గణేశ్వరుడు జితేంద్రియులలో సర్వ శ్రేష్ఠుడు, యోగీంద్రులకే యాచార్యుడు, జన్మమృత్యుజరావ్యాధులను నాశన మొనరించు శ్రీకృష్ణదివ్యచరణారవిందముల నాశ్రయించినధన్యుడు. ఆ గణే శ్వరుని వీక్షింపగనే తులసిమనస్సాకర్షణకు లోనయ్యెను. పార్వతీనందనుడు గజముఖుడైనప్రసంగము తలచుకొని తులసి బరిహసింపదొడంగెను. ఆ సమ యమున ధ్యానము భంగము కాగా గణపతి యెట్టయెదుట నిలబడియున్న తులసీదేవిని గాంచి యిట్లుపల్కెను. "కుమారీ! నీ వెవ్వరు? ఏ ధన్యుని కుమార్తెవు? నీ వీప్రదేశమున కెందుల కేతెంచి నాధ్యానమును భంగ మొనరించితివి? తాపసులధ్యాననిష్ఠను భంగమొనరించుట పాపకారణము, అమంగళదాయకము. కల్యాణీ! శ్రీకృష్ణపరమాత్మ నీకు శుభము చేకూర్చు గాక! ఆ కృపానిధి విఘ్నములను నాశమొనరించుగాక! నా ధ్యానము భంగ

మొనరించిన కారణమున నీకు సంభవించినదోషములు నీ కమంగళదాయకములు కాకుండుగాక.

తులసీదేవి పలికెను :

"దేవా ! నేను ధర్మధ్వజుని కన్యను. శ్రీమన్నారాయణునే పతిగ బొంద వలె ననితపమాచరించుచున్నాను. ప్రభూ ! నీవు శ్రీకృష్ణపరమాత్మదివ్యా వతారమే. అందువలన నాహృదయేశ్వరు డవైనాతపములను సార్థకమొన రింపుము". తులసిపల్కినపలుకుల నాలకించి యగాధబుద్ధిసంపన్నుడైన శ్రీ గణే శ్వరుడు శ్రీహరిని స్మరించి వినుషీమణి యగుతులసితో నిట్లుపల్కెను.

శ్రీ గణేశ్వరుడు పలికెను :

జననీ ! వివాహము జీవులకు బంధకారణము, అందువలన నాకు వివాహేచ్ఛ లేదు. వివాహము భక్తులమార్గమున కవరోధము, జితేంద్రియులకు దుఃఖకారణము, హరిభక్తికి వ్యవధానము, తపమునకు నాశకారణము, మోక్షమున కవరోధము, భవబంధముల బంధించుపాశము, గర్భవాసమునకు కారణము, తత్త్వజ్ఞానచ్ఛేదకము, సంశయముల కుద్గమస్థానము, అందువలన నానుండి నీమనస్సును మరల్చి శ్రీమన్నారాయణునియందు లగ్న మొనర్చుము.

గణేశ్వరునివైరాగ్యయుక్తవచనముల నాలకించి సాధ్వి యగుతులసి కోపించి యిట్లుశాపమొసంగెను. "గణపతీ ! వివాహము వలదనివారించు నీకు నిశ్చయముగ వివాహము కాగలదు". తులసి యొసంగినశాపము నాలకించి శివతనయుడు సురశ్రేష్ఠుడు నగుగణేశ్వరు డిట్లుప్రతిశాప మొసంగెను. "దేవీ ! నిష్కారణముగ నన్ను శపించిననీవు నిస్సందేహముగ నసురుని యర్థాంగి వయ్యెదవు. తదనంతరము మహాపురుషునిశాపవశమున వృక్షరూపము ధరించె దవుగాక." పార్వతీనందనుని నిష్ఠురశాపము నాలకించి తులసీదేవి పశ్చాత్తప్త హృదయయై గణేశ్వరుని యనేకవిధముల స్తుతించెను. తులసిప్రార్థనలకు బ్రసన్నుడై గణపతి యిట్లనుగ్రహించెను.

శ్రీ గణేశ్వరుడు పలికెను :

మనోరమా! నీవు వృక్షరూపమైనను పరమపవిత్రురాలవయ్యెదవు. నీదళ

ములుసోలపుష్పములందు శ్రేష్ఠములు కాగలవు. కాలానుసారముగ నీవు దాన వునిపీడి నారాయణుని బొందెదవుగాక. మహాభాగా! సకలదేవతలు నిన్ను పూజింతురుగాక. శ్రీకృష్ణపరమాత్మ నీయందు విశేషప్రేమకల్గి వర్తించుగాక. నీ దళములతో నొనరించినపూజ మనుష్యులకు ముక్తిని ప్రసాదింపగలదు. కాని దేవీ! శ్రీమన్నారాయణార్పితదివ్యకుసుమమైననీవు నాకు సర్వదా త్యాజ్యమై యుండెదవు గాక.

తులసి నిట్లనుగ్రహించి శ్రీగణేశ్వరుడు బదరికాశ్రమమునకు వెడలిపోయి శ్రీకృష్ణధ్యానమందు సంలగ్నుడయ్యెను. తులసీదేవి పుష్కరక్షేత్రమున కేతెంచి నిరాహారయై దీర్ఘకాలము ఘోరతప మాచరించెను.

నారదమహర్షీ! తదనంతరము శ్రీతులసి శ్రీగణేశ్వరుని శాపవశమున చిరకాలము శంఖచూడునకు ప్రియపత్నియై యుండెను. అసురేశ్వరుడైన శంఖచూడుడు మహాదేవుని త్రిశూలముచే మరణించి గోలోకమునకు వెడలెను. అపుడు శ్రీనారాయణప్రియ యగుతులసి తనకళాంశచే వృక్షరూపమున ప్రాదుర్భవించెను. బ్రహ్మకులపావనా! ఈ దివ్యేతిహాసమును పూర్వకాలములో నేను నాపితృదేవులైనధర్మదేవునివలనశ్రవణ మొనరించితిని. ఈ యితిహాస మన్యపురాణములందు దుర్లభము, ఈ దివ్యచరితము సకలతత్త్వస్వరూపము, మోక్షప్రదాయకము.

ఈ పవిత్రమగుశ్రీగణపతిఖండమును భక్తిప్రపత్తులుగలిగి యేకాగ్రచిత్తముతో శ్రవణ మొనరించువానికి నిస్సంశయముగ ననేకరాజసూయయజ్ఞ ఫలములు సంప్రాప్తించును. పుత్రసంతానము లేనివారికి శ్రీగణేశ్వరుని యపార కృపవలన ధీరుడు, వీరుడు, ధనవంతుడు, యశోవంతుడు, విద్వాంసుడు, జితేంద్రియుడు, పరమపవిత్రుడు, దయాంతరంగుడు, తత్త్వజ్ఞానవిశారదుడు, శ్రీహరి భక్తుడు, చిరంజీవి యునగుసత్పుత్రుడు లభింపగలడు. మహావంధ్యయైనను షోడశోపచారములతో భక్తిపూర్వకముగ శ్రీగణేశ్వరు నారాధించుచు శ్రీగణపతి ఖండమును పఠించినను లేదా శ్రవణ మొనరించినను నిశ్చయముగ సత్పుత్రుని బడయగలదు. కామరహితులై, యమనియమములతో శ్రీగణపతిఖండమును పఠించిన లేదా శ్రవణ మొనరించిన దేహధారికి సర్వాభీష్టములు పరిపూర్ణములు గలవు, వారివిఘ్నము లన్నియు దొలగిపోగలవు.

విఘ్ననాశమునకై యీ గణపతిఖండము నేకాగ్రచిత్తులై శ్రవణము చేసినభక్తులు వాచకునకు సువర్ణయజ్ఞోపవీతమును, శ్వేతచ్ఛత్రమును, శ్వేతాశ్వమును, శ్వేతపుష్పమాలను, స్వస్తిమిష్టాన్నములను, తిలలడ్డులను, దేశకాలోద్భవము లైనపక్వఫలములను నొసంగి సత్కరింపవలెను.

శ్లో॥ నమోఽస్తు బ్రాహ్మణేభ్యశ్చ కృష్ణాయ పరమాత్మనే।
శివాయ బ్రహ్మణే నిత్యం గణేశాయ నమో నమః ॥
కాయేన మనసా వాచా పరంభక్త్యా దివానిశమ్।
భజ సత్యం పరంబ్రహ్మ రాధేశం త్రిగుణాత్పరమ్ ॥
నమో దేవ్యై సరస్వత్యై పురాణగురవే నమః।
సర్వవిఘ్నవినాశిన్యై దుర్గాదేవ్యై నమో నమః ॥

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
గణపతిఖండములోని నారదనారాయణ సంవాదమున
శ్రీగణపతిఖండశ్రవణమాహాత్మ్యవర్ణన మను
నలుబదియాఱవ అధ్యాయము
సంపూర్ణము.

♦ ♦ ♦

ఇది శ్రీకృష్ణపరమాత్మ చరణారవింద మిళిందాయమాన మానసత్వ
మహావైభవ సంపన్నులు, పారాశర్య గోత్రులు, వైశ్యశ్రేష్ఠులు,
గర్తపురీనివాసులు నైన శ్రీ మట్టుపల్లి వేంకటమహాలక్ష్మీ
జగన్నాథులకు దనూభవుడు భక్తజనదాసానుదాసుడు సుజన
విధేయుడు నగుశివసుబ్బరాయగుప్తచే బ్రణీతం బైన
శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందు
తృతీయభాగ మైన గణపతి ఖండము
సర్వము సంపూర్ణము.

—: o :—

